ఓం

# జీవన వేదము

## (సర్వోపనిషత్తుల సార సంగ్రహము)


ఏర్పు - కూర్పు :

సదానంద భారతి


పర్యవేక్షణ :

శ్రీశ్రీశ్రీ నిర్వికల్పానంద భారతీస్వాములవారు

ప్రణవాశ్రమము - గుడివాడ.




ప్రకాశకులు :

సుధా పబ్లికేషన్స్

11146 VANCE JACKSON

2505

SAN. ANTONIO TX. 78230(210) 696-8115

U. S. A.

జీవన వేదము

ఏర్పు-కూర్పు ;
సదానంద భారతి



ప్రకాశకులు :
SUDHA PUBLICATIONS
San Antonio, TX. U. S. A.

పుస్తకములు లభించుచోటు :-

1. బి. సుశీల
14–263 స్టేషన్ రోడ్, గుడివాడ.
PIN. 521301 ఫోన్ : 3304.

2, KAZA VANI
C/o Dr. R. Kaza, M.D., F.A.C.S.
ST. Louis, M. O. U. S. A.

5. V. SUDHA, B. Sc. B. L.
W/o Dr. V.M.L. PRASAD M.D., F.A.C.S.
Sn. Antonio TX. U .S. A.

ప్రథమ ముద్రణము - 1995

వెల : రు. 48 - 00

ముద్రాపకులు :
వంశీకృష్ణా ప్రింటర్స్,
ఫోన్ : Res. 482935
విజయా టాకీస్ వెనుక
విజయవాడ - 2.



# కృతజ్ఞతాభివందనములు

ఈ గ్రంథమును అచ్చువేయించి పాఠక లోకమునకు అందించిన దాతలు పుణ్యదంపతులు శ్రీమతి వేములపల్లి సుధ, బి యస్.సి., బి యల్ గారికి, మరియు వారి భర్తగారైన డాక్టరు వేములపల్లి మల్లేశ్వర లక్ష్మీప్రసాద్, యమ్.బి.బి.యస్., యం. డి., ఎఫ్.ఎ., సి.యస్., శాన్ యాంటోనియో, టెక్సాస్, యు. యస్. ఎ. గార్లకు, వారి ఈ ఔదార్యమే సాధనముగా అసత్తునుండి సత్తునకు, తమస్సు నుండి ప్రకాశమునకు మృతత్వమునుండి అమృతత్వమునకు చేర్చగలదని ఆశిస్తూ హృదయ పూర్వకముగా కృతజ్ఞతా భావముతో అభినందించుచున్నాను.

నన్ను ప్రేమించి, అభిమానించి వారి అపార కరుణాసాగరమున మునకలు వేయించిన నా పాలిటి ఆదిశంకరులు, ప్రణవాశ్రమాధిపతులు, పరమార్థ స్వరూపులు, నా గురుదేవులు శ్రీశ్రీశ్రీ నిర్వికల్పానంద భారతీస్వాములవారి ఋణభారమును ఈ గ్రంథ రచనద్వారా లేశమైనా తగ్గించుగలనేమోయని ఆశించుచూ కృతజ్ఞతా పూర్వక అభివాదములు సమర్పించుకొంటున్నాను. అల్లే ఈ అద్వైత తత్వము నందు నాకు ప్రవేశము కల్పించిన మహనీయులు శ్రీ త్రిపుర్నేని విష్ణుశంకరరావు గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ఈ గ్రంథమును తమ ముద్రణాలయమునందు ఇంత చక్కగా అచ్చు వేయించి యిచ్చిన శ్రీ వంశీకృష్ణా ప్రింటర్స్ అధిపతులు శ్రీ యన్. రాధాకృష్ణ మూర్తిగారికి మరియు వారి సిబ్బందికి గూడ ఆయమృతము లభించవలయునవి అభిలషించుచున్నాను.



గుడివాడ
15-5-95

ఇట్లు కృతజ్ఞతలతో
సదానంద భారతి

ఓం

# గ్రంథప్రవేశము

"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే.
పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే"

ఈశావాస్య.

అనగా ఆ పరబ్రహ్మము పూర్ణమైనది. మరియు ఈ కార్యబ్రహ్మము గూడ అనగా దృశ్యమానమగుచున్న ప్రపంచము గూడ పూర్ణమైనదే. ఏలయన? పూర్ణమైన దాని నుండి పూర్ణమైనదే కల్పించబడుతుంది. మరియు ప్రళయకాలమందు ఈ పూర్ణమైన కార్య బ్రహ్మమును తనయందు లీనము గావించుకొని ఆ పూర్ణుడైన పరబ్రహ్మమే సర్వము తానై వెలుగుతూ వుంటాడు.

కావున ఆ పూర్ణుడైన పరబ్రహ్మమే సత్యము, జగత్తంతయు ఆయన యందు కల్పితము. జగత్తుతో తదాకారమైయున్న జీవుడుగూడ బ్రహ్మమే. బ్రహ్మము కంటె భిన్నుడు కాడు. జీవుడు తానుగా బ్రహ్మమే; అయితే జీవత్వము మాత్రము కల్పితము. సర్పము యొక్క యదార్థస్వరూపము రజ్జువే అయినట్లుగా "జీవుడు" అని చెప్పబడు వానియొక్క వాస్తవ స్వరూపము బ్రహ్మమే. కావున జీవుడు తాను బ్రహ్మమేగాని తద్భిన్నుడు కానేరడు. ఆ విధముగా పరమాణువు వరకును గల ఈ ప్రపంచమంతయు బ్రహ్మమే. "సర్వం ఖల్విదంబ్రహ్మ తజ్జలానితిశాంతముపాసీత" అను శ్రుతి ననుసరించి ఆ బ్రహ్మము నుండియే కలిగి, దానియందే నిలిచి, తిరిగి దానియందే లీనమగుటచే ఈ సర్వ ప్రపంచమును ఆ బ్రహ్మమే. అనాదియగు అజ్ఞానముగూడ అధిష్ఠానమగు ఆబ్రహ్మమునందే కల్పితముగాని దానికంటె అనగా ఆ బ్రహ్మము కంటె భిన్నముకాదు. కావున బ్రహ్మము అద్వితీయము. "తత్వమసి" "అయమాత్మాబ్రహ్మ" "ఇదం సర్వం యదయ మాత్మా" "ఆత్మై వేదం సర్వం" "బ్రహ్మైవేదం సర్వం" "ఏకమేవా ద్వితీయం" ఇత్యాది శ్రుతి వాక్యముల ననుసరించి తన కంటె వేరుగా మరొకటి లేనిది, "నేనే బ్రహ్మను" అని శ్రుతుల వలనను, గురూపదేశాదుల వలనను, మరియు సతత నిది ధ్యాసనములతోకూడిన స్వానుభవము వలనను, బాగుగా తెలుసుకొనిన, విద్వాంసుడైన ముముక్షువు, వాసనా సహితముగ అహంకారమును విడిచి, స్వస్వరూప సాక్షాత్కారమును పొందును. అప్పుడు తనకంటె బాహ్యమున తోచు ప్రపంచమంతయు అనాత్మ పదార్థమేయని గుర్తించినవాడై, దానిని పూర్తిగా లేనిదిగా తలంచి, శాంతుడై, ఆ పరమార్థ రూపముననే స్థిరముగ వుండును. ఇట్టి స్థితియే మోక్షము.

అట్టి "నేను" రూపమున వున్న పరమార్థమును, స్వస్వరూపమును, గుర్తించి జన్మమరణ రాహిత్యమును బొంది శాశ్వతానందమును, అనుభవించుటకు ఉపనిష ద్గ్రంథములు మిక్కిలి సహాయకారులుగా వున్నవి.

మనమందరము "నేను, నేను" అని దేనిని అంటున్నామో ఆ "నేనును" చూచినవారుగాని, దానియొక్క స్వరూప స్వభావాలను గుర్తించిన వారుగాని ఎవ్వరూ లేరు. అట్లేలయనగ? ఆ 'నేను' ఎలా వుంటుందో ఎవరైనా చెప్పగా కూడా మనము వినలేదు. ఎచ్చటనూ చదువనుగూడా లేదు. అయితే ఉపనిషద్ గ్రంథములయందు ఆత్మ తత్వమును గురించి పరోక్షంగా విపులంగా చర్చించబడింది. ఆ "ఆత్మయే నేను" అని మన అందరిచేత సంబోధించబడుతూ వుందని మన అనుభవం ద్వారా తెలుస్తూవుంది. అందుచేత ఈ నేను సర్వ వ్యాపకమైన పరమ తత్వంగా గోచర మగు చున్నది. ఈ నేను సర్వమానవులయందు అనగా భూత, వర్తమాన కాలముల యందు వుండివున్నవారి అందరియందు వ్యాపించియే యున్నది. అందుచేతనే అందరూ గూడ తమను తాము "నేను,నేను" అనే చెప్పుకొంటున్నారు. ఈ విధ ముగా ఈ "నేను" సర్వ వ్యాపకము అయినది గావున అది ఒక స్థూల పదార్థము కాదని తెలియుచున్నది. ఎందుచేతననగా స్థూలమైన పదార్థము దేశమునకు, కాలము నకు కట్టుబడి వుంటుందేగాని సర్వవ్యాపకము, సర్వకాలికము అయివుండ జాలదు. కావున ఈ నేను సూక్ష్మమైనది, సర్వవ్యాపకమైనది అని సిద్ధాంతమగుచున్నది.

ఆ విధంగా ఈ 'నేను' సత్యమైనది, నిత్యమైనది అగు చున్నది. ఏది సత్యమైనదో, మరియు నిత్యమైనదో అది అజము. అమృతము, నిర్గుణము, నిరాకారము, మరియు నిర్వికారియు అగుచున్నది. అదియే బ్రహ్మమని శ్రుతులు ఘోషించుచున్నవి. "తత్వమసి" అనగా "ఆ బ్రహ్మవు నీవే అయి వున్నావు" అని ఛాందోగ్యోపనిషత్తు తొమ్మిది మారులుగా ఘోషించి యున్నది.

ఆ బ్రహ్మతత్వమును అనగా ఆ నీ నిజమగు స్వరూపమును తెలియజేయు టకు ఎన్నో గ్రంథములు వ్రాయబడి యున్నవి. వ్రాయబడుచూ వున్నవి గూడాను. అయినా అవి చాలవని మన అందరి అనుభవమూ చెబుతూనే వున్నది.

విషయాన్ననుసరించి, చెప్పేవిధానాన్నిబట్టి గ్రంథభేదము కలుగుతూ వుం టుంది. అందుచే క్రొత్త క్రొత్త గ్రంథములు వ్రాయబడుతూనే వుంటాయి అనేది గూడా అనుభవగతమైన సత్యమే- ఎవరు చెప్పినా, ఏ విధంగా చెప్పినా "సత్యం మారదు" అనేది పరమసత్యం. కావున అందరు చెప్పేదొక్కటే సత్యం. అయితే విశి ష్టత చెప్పడంలో వుందనేది కాదనరాని సత్యం, అట్టి సత్యమే ఈ గ్రంథమునందు

చెప్పబడియున్నది. ఈ గ్రంథంలో ప్రతిపాదించబడిన విషయమంతా మన పూర్వీకులైన ఋషులచే చెప్పబడిందే. అయితే ఏర్పు, కూర్పువల్ల కలిగిన మార్పువలన ఆ సత్యం యింకా సుబోధకం కావడానికి అవకాశాన్ని కల్పించింది. వివిధ శాస్త్ర గ్రంథాలలో విభిన్నవిషయములు, ముఖ్యంగా ఆనందోపలబ్ధికి సాధనములగు విషయములు విభిన్నపదజాలముతో భిన్నభిన్నములుగా చెప్పబడియున్నవి. వాటినన్నింటిని ఒక బోధనా క్రమంలో ఏర్చికూర్చి నందువలన ఈ గ్రంథమునందు ఆ తత్వబోధ కరతలామలకం అగుచున్నది. ఇదియే "జీవనవేదము" అనబడు ఈ గ్రంథము యొక్క విశిష్టత. ధీమంతులగు పాఠకులు మరియు సాధకులు ఈ సత్యమును గ్రహించగలరు. విషయసేకరణ అనగా ఏర్పు—కూర్పు కష్టసాధ్యమే అయినా పండితులగువారు అనగా విషయమును చక్కగా అవగాహన చేసుకొన్నవారికి ఆ కార్యము సులభమే అవుతుంది అనుటగూడ అందరి అనుభవమే. అందుచేతనే మోక్ష ప్రాప్తికి అవసరమైన జ్ఞానరాశి అంతయు ఒక క్రమపద్ధతిలో యీ గ్రంథమునందు కూర్చబడినది.

ఆ విధంగా కూర్చబడిన తత్వజ్ఞానముగల "జీవనవేదము" అను గ్రంథమును నేను ఆమూలాగ్రముగ చూడడమైనది. నా శిష్యులగు శ్రీసదానందభారతిగారు ఎంతోకాలముగా శ్రమించి, మాండూక్య, ఈశావాస్య, కఠ, తైత్తరీయ ఛాందోగ్య, శ్వేతాశ్వతర, ఐతరేయ, ప్రశ్న, ముండక, బృహదారణ్యకాదులైన ఉపనిషత్తులు, మరియు అద్వైతతత్వ ప్రతిపాదితములగు వివేకచూడామణి, మహావాక్యదర్పణము, ఉపదేశసహస్రి, పంచదశి, భగవద్గీత, బ్రహ్మసూత్రములు మొదలగు ఉత్తమోత్తమ గ్రంథములను చక్కగా గురుసాన్నిధ్యమున చదివి వాఖ్యానించిన విద్వాంసులు. ఆ అద్వైతతత్వ ప్రతిపాదక గ్రంథముల సారమునే ఈ గ్రంథమునందలి వివిధ వ్యాసములలో వివిధ శీర్షికలతో సుబోధకమగునట్లుగా సాధనాక్రమముగా కూర్చియున్నారు. ఆ తత్వబోధక గ్రంథములందున్న అద్వైతతత్వమును ఒకటికి పదిమార్లుగా పరిశీలించి అర్థము చేసుకొని జిజ్ఞాసువులగు సాధకులకు బోధపడునట్లుగా చెప్పియున్నారు. ఇంతియేగాక ఈ గ్రంథకర్తయైన శ్రీ సదానందభారతిగారు మంచి భాషాపండితులు. తెలుగు

హిందీ, సంస్కృత భాషలయందు ప్రవీణులు. పూర్వాశ్రమమునందు వీరు డాక్టరు బండ్లమూడి ఆంజనేయులు ఎం.ఎ; పి.హెచ్.డి,గా లోకప్రసిద్ధులు. హిందీ భాష యందు లోకప్రసిద్ధమైన శ్రీమద్రామాయణ గ్రంథకర్తయగు మహాకవి, పరమ రామ భక్తుడు అగు తులసీదాసుగారి రచనలనన్నింటిని శోధించి వారి వ్యక్తిత్వమును లోకమునకు చాటుతూ "తులసీకావ్యక్తిత్వ" అను పరిశోధనా వ్యాసమును సమర్పించి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు వారినుండి "డాక్టరాఫ్ ఫిలాసఫీ" డిగ్రీనిపొందిన విద్వాంసులు. ఆ పరిశోధనా వ్యాసముపై యూనివర్శిటీ గ్రాంట్సుకమీషనువారి "అవార్డు"ను కూడ పొందియున్నారు. అంతేగాక మానసిక తత్వప్రతిపాదితమైన "కలాకార్కావ్యక్తిత్వ" అను గ్రంథమును హిందీ పాఠకలోకమునకు అందించి యున్నారు. మరియు తేటతెలుగునందు ఆటవెలదులతో కూర్చిన "రామరాయ శత కము"ను వెలయించియున్నారు. అందుచే విషయ ప్రతిపాదనయందు వీరుచాల నేర్ప రులు. అందులకు వేరొకకారణము; వీరు నలుబది వత్సరములు కాలేజీ లెక్చరర్గా ఉద్యోగముచేసి పదవీవిరమణచేసిన మంచి అధ్యాపకులుగూడాను. కావున ఈ ఒక్క గ్రంథమును ఆదినుండి అంతము వరకు చక్కగా చదివి అర్థముచేసుకొన్న సాధకు నకు తప్పక ఆత్మసాక్షాత్కారము కలిగి బ్రహ్మానందము లభించుననుటలో ఎట్టి సంశయములేదు.

స్వస్వరూప సాక్షాత్కారసిద్ధిరస్తు

గుడివాడ
14-5-1994

శ్రీశ్రీశ్రీ నిర్వికల్పానంద భారతీస్వాములవారు
ప్రణవాశ్రమము

# గ్రంథ సోపానములు

# ఆత్మానాత్మ వివేకము

ఈ ప్రపంచంలో ఏ ఒక్కడూ గూడ సుఖంగా బ్రతికినవాడులేడు. కారణం ఈ దేహము నిత్యమైనదికాదు. నిరాపదమైనది కూడాకాదు. "పచ్చి చర్మపుతిత్తి పసలేదు దేహంబు లోపలనంతట రోయరోత, నరములు శల్యముల్ నవరంధ్రములు రక్తమాంసంబు కండలు మైలతిత్తి, బలుపైన ఎండవానల కోర్వదింతైన తాళలేదా కలి దాహములకు, సకల రోగములకు సంస్థానమైయుండు, నిలువదస్థిరమైన నీటి బుగ్గ. బొందిలో నుండి ప్రాణముల్ పోయినంత. కాటికేగాని కొఱగాదు గవ్వకైన" అన్నాడు ఓ మహాకవి. అయినా కూడ ఈ దేహము చాలా పెద్ద ఉపకారి. ఏలయన 'శరీర మాద్యంఖలు మోక్షసాధనం." అన్నారు పెద్దలు. ఈ దేహము అనగా ఈ నరదేహము ప్రాణులకు సులభముగా లభించునదికాదు. "జంతూనాం నరజన్మ దుర్లభం" అని అంటున్నది శ్రుతి. కావున ఈ నరదేహము మానవులకు సుఖదుఃఖ ములకు అతీతమైన శాశ్వత ఆనందాన్ని సంపాదించి పెట్టగలందులకు ముఖ్య సాధ నము. దీని ద్వారానే మానవుడు ఆత్మానాత్మ వివేకమును సంపాదించి, తద్వారా శాశ్వతమైన, సర్వానందకరమైన, మోక్షస్థితిని పొందగలడు. "నయోగేన, నసాంఖ్యేన కర్మణా నోనవిద్యయా, బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్షస్సిద్ధ్యతి నాన్యథా" అనగా ఆమోక్షము యోగశాస్త్రాభ్యాసముచేగాని, సాంఖ్యశాస్త్రాభ్యాసముచేగాని, యజ్ఞాది కర్మలచేగాని, సగుణోపాసనారూపమగు విద్యచేగాని, అనగా పూజలు, భజనలు, నామ సంకీర్తనలు, ఉపవాసములు, వ్రతములు మొదలగు వాటిద్వారాగాని, లభించదు. ఆ మోక్షము బ్రహ్మాత్మైకత్వ జ్ఞానముచేత మాత్రమే సిద్ధించును. ఈ ఈ యోగ సాంఖ్యాది శాస్త్రజన్య భేద జ్ఞానము ఎవ్వనికిని అభయస్థితిని కలిగింప జాలదు. ఏలయన కృతకమగు కర్మలచే అకృత మగు, అమృత మగు మోక్షము కలుగనేరదు. "అమృతస్యనాశాస్తివి త్తేన్య" అనగా ధనసాధ్యమగు కర్మచే అమృతత్వమును ఆశించుటకువీలులేదు అని శ్రుతులు చెప్పుచున్నవి. అనిత్యములగు కర్మలు నిత్యమగు మోక్షమును కల్పింప జాలవు. "ననపునరావర్తతే" అనుశ్రుతి మోక్షము నిత్యమని బోధించుచున్నది". బ్రహ్మభావమును పొందిన పురు

షుడు మరల సంసారమును పొందడు "అని చెప్పుచున్నది. ఈ విధముగా పునరావృత్తి రాహిత్యమునకు అనగా పునర్జన్మలేకుండ వుండుటకు కారణము ముక్తత్వమే. బ్రహ్మస్వరూపమున వుండుటయే ముక్తత్వము. "యోవై భూమాతదమృతయ్" అనగా సర్వవ్యాపక మగు ఏ పరమాత్మకలదో అది నాశరహితము. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" బ్రహ్మము సత్యరూపము, జ్ఞానరూపము మరియు ఆనందము అనగా సర్వ వ్యాపకము అయివున్నది. "నిత్యో అనిత్యానామ్" అనిత్యములగు, అనగా కల్పితములగు పదార్థముల మధ్య దాగియున్నది నిత్యపదార్థమగు పరమాత్మయే. ఈ విధముగా శ్రుతిశతములచే బ్రహ్మనిత్యమని చెప్పబడుటచే తత్వరూపమగు మోక్షముగూడ నిత్యమూ, సత్యమూ అయినదే. ఇట్టి మోక్షము ఆత్మైకత్వ జ్ఞానము కలిగి, అజ్ఞానము నశించిన వెంటనే కలుగునుగాని మరియొక విధముగాకాదు "అజ్ఞాన సర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధంవినా. కిమువేదైశ్చ, శాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః" అనగా అజ్ఞానమనెడు సర్పముచే కరవబడిన వానికి బ్రహ్మజ్ఞానమనెడు ఔషధము తప్ప వేదశాస్త్రాదులచే ప్రయోజనమేమియు కలుగజాలదు. మంత్రములచే గాని ఔషధములచేగాని ఎట్టి ప్రయోజనము కలుగనేరదు. వాటిలో యే ఒక్కటియు అజ్ఞాన సర్పము వేసిన కాటుచే కలిగిన మోహమును తొలగింపజాలదు. శరీరము మొదలగు అనాత్మ పదార్థములతో ఏర్పడిన తాదాత్మ్యాభిమానము స్వరూప అజ్ఞానమే మూలముగా గలది; పూర్వపూర్వాధ్యాసముల వలన కలిగిన సంస్కారము హేతువుగా గలది. అనాదియగు అజ్ఞానము యొక్క కార్యమగుట వలన ఈ అభిమానము ఎప్పుడు కలిగినదో చెప్పశక్యము కానిది. కావున ఈ బంధము వివేకముచే కలుగు స్వస్వరూపానుభవముచే తప్ప మరి దేనిచేతను తొలగింప శక్యము కానిది.

"నాస్త్రైర్న శస్త్రైర వివేక వహ్నినా చేత్యం నశక్యో నచకర్మ కోటిభిః

వివేక విజ్ఞాన మహాసినా వినాధాతుః ప్రసాదేన శితేన మంజునా" అనగా ఈ బంధము వివేకముతోకూడిన అనగా ఆత్మానాత్మ వివేకముతో కూడిన విజ్ఞానమనెడు మహా ఖడ్గముచేతప్ప ఇతర అస్త్రములచేత ఛేదింప శక్యము కానిది. ఆయుధములచేతగాని, అగ్నిచేతగాని, కోటి కర్మలచేతగాని తొలగింప సాధ్యము

కానిది. ఆత్మానాత్మ వివేచనము వలన కలిగిన ఏ వివేకము కలదో అదియే గొప్ప ఖడ్గము. ఆ ఖడ్గము చేతనే ఈ సంసార బంధము అనెడు మహా సర్పమును తొలగింప శక్యమగును. వేదోక్తములగు యజ్ఞయాగాది కోటికర్మలచేత గూడ నశింప జేయ శక్యముకానిది ఈ బంధము. ఇది అజ్ఞాన మూలకముగాన జ్ఞానముచేతనే తొలగింప శక్యమైనది. అట్టి జ్ఞానము కలుగుటకు అనగా ఆత్మస్వరూపమును గుర్తించుటకు ముందుగా అనాత్మ పదార్థములను గుర్తించి తొలగించవలసియున్నది. "కోశైరన్నమయాద్యైః" పంచభిరాత్మాన సంవృతోభాతి నిజశక్తి సముత్పన్నైః శైవలపటవైరివాంబు వాపీస్థమ్" అనగా తనయొక్క శక్తిచే కల్పితములయిన అన్నమయము మొదలైన పంచకోశములచే కప్పబడినదైన ఆత్మ తనయొక్క శక్తివలన పుట్టిన నాచు మొదలగు ఆవరణ పదార్థములచే కప్పబడియున్న దిగుడు బావిలోని జలమువలె భాసించుటలేదు. ఆత్మ ఉదకమువలె నిర్మలమైనది. అట్టి నిర్మలమైన ఆత్మోదకము ఏల స్ఫుటముగ ప్రకాశించుట వేదన తనయందే కల్పితమైన అవిద్యచే పుట్టిన ఆవరణ రూపములగు ఐదు కోశములు అనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాది కోశములచే కత్తికి ఒరవలె కప్పబడినదైన ఆత్మ స్పష్టముగ భాసించుటలేదు. ఏవిధముగా దిగుడుభావి యందలి జలము దానినుండియే పుట్టిన నాచుచే కప్పబడినదై స్పష్టముగ దృశ్యము కాదో అట్లే ఆ ఆత్మకూడ అజ్ఞానమనెడు మాయచే కప్పబడినదై స్పష్టముగ భాసించుటలేదు. కాని ప్రయత్నముచే ఆ నాచును తొలగింపగా ఎట్లు నిర్మలమగు జలము దృష్టి గోచరమై తృష్ణా సంతాపమును చల్లార్చి ఆ జలపానము చేసిన పురుషునకు దర్శనపాన స్నానాదులచే మిక్కిలి శాంతమును, ఆనందమును కలిగించునో, అట్లే పంచకోశములయొక్క ఆవరణమును వివేకముచే తొలగించగా నిత్యానందకరమైన స్వయంజ్యోతి రూపమగు నిత్యశుద్ధమైన ఆత్మయొక్క దర్శనము కలుగును. అందుచేత మోక్షేచ్ఛగల పురుషునకు ఆత్మానాత్మ వివేకము చేయవలసియున్నది. "ఆత్మానాత్మ వివేకఃకర్తవ్యో బంధముక్తయే విదుషా, తేనైవానన్దీ భవతి స్వంవిజ్ఞాయ సచ్చిదానన్దమ్" అనగా బుద్ధిమంతులైన వారిచే బంధమునుండి విడువడి శాంతిలాభమును పొందుటకై ఆత్మానాత్మ వివేకము చేయవలసియున్నది. అట్టి ఆత్మానాత్మ వివేకముచేతనే స్వస్వరూపమును సత్తుగాను, జ్ఞానరూపముగాను

ఆనంద రూపముగాను గుర్తించి సాంసారిక బంధములనుండి విడువబడినవాడై ఆనందమును పొందును. మానవులందరికి సహజముగా అధ్యాసతో కూడియున్న జ్ఞానమేగాని శుద్ధజ్ఞానము వుండదు. అందుచేత శాస్త్రజన్య జ్ఞానమును సంపాదించి తద్వారా అధ్యాసనివృత్తి కొఱకు ఆత్మానాత్మల వివేకము మరియు ఆత్మ స్వరూప జ్ఞానమును అనగా వాస్తవమైన జ్ఞానమును ప్రయత్న పూర్వకముగా సంపాదింపవలయును. అట్టి సర్వ వ్యాపకమైన జ్ఞానముద్వారా మాత్రమే విద్వాంసు డగు పురుషుడు స్వరూపమును కాలత్రయాబాధ్యమగు బ్రహ్మముగాను, జ్ఞాన రూపముగాను, ఆనంద రూపముగాను సాక్షాత్కరించుకొని నిత్యము, సత్యము, నిరతిశయమును అగు ఆనందమును పొందును. అదియే మోక్షము.

దృశ్యములనుండి సంగరహితమును, క్రియాశూన్యమును, అగు ప్రత్యగాత్మను అనగా తనయొక్క నిజస్వరూపమును వేరుగాజేసి, సర్వమును దానియందే వివేకముతో విలీనము గావించి దాని రూపముతో నిలచియుండుటయే ఆత్మానాత్మ వివేకము. "ఏషసర్వేషు భూతేషు గూఢో ఆత్మాన ప్రకాశతే, దృశ్యతే త్వగ్రయా బుద్ధ్యా, సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అనగా సకల భూతములయందును గూఢముగా వ్యాపించియున్న ఆత్మ అజ్ఞానులకు ప్రకాశింపదు. కాని శాస్త్రాధ్యయనము గురూపదేశబలంతో మనన నిదిధ్యాసము చేసిన పండితులచే అనగా సూక్ష్మదృష్టి గలవారిచే, సూక్ష్మమును, ఏకాగ్రమును అగు బుద్ధిగలవారికి ఆత్మదర్శనము అనగా ఆత్మానుభూతి తప్పక కలిగి తీరును అని పై శ్రుతి చెప్పుచున్నది. కావున అట్టి బుద్ధిచే దృశ్య పదార్థములకు అతీతముగా వుండునది, అసత్తు జడమును అగు అహంకారాదులకంటె విలక్షణముగావున్న ఆ సత్య స్వరూపుడైన బ్రహ్మముయొక్క, ఆత్మయొక్క ప్రకాశము పొందబడును. ఆ విధముగా అద్వితీయమును, సంగరహితమును, అపరిచ్ఛిన్నమును, కర్మ క్రియారహితమును అగు ఆత్మను దృశ్యము నుండి వేరుచేసి, వివేకబలంతో, దానియందే ఆ దృశ్య పదార్థము నంతటిని విలీనము గావించి, ఆ విధముగా ఆ ఆత్మ అనగా ప్రత్యగాత్మకంటె భిన్నముగ ఏదియును లేదు అని నిశ్చయించి, సర్వాధిష్ఠాన భూతమగు ప్రత్యగాత్మ రూపమున ఎవ్వడు నిలచియుండునో అతడే సకలవిధ బంధములనుండి ముక్తుడు. ఈ విధముగా ఆత్మానాత్మ వివేకముచే ఆత్మపై భ్రాంతిచే ఆరోపింపబడుచున్న అనాత్మ పదార్థ

ముల నన్నింటిని అసంకీర్ణమగు జ్ఞానబలంతో బాధించి బ్రహ్మరూపమును పొంద వలసి యున్నది. అట్లు బ్రహ్మమును పొందిన మహాత్ముడు "అస్మాల్లోకాత్ప్రేత్య ఏతమన్న మయ మాత్మాన ముపసంక్రామతి" అన్నట్లు ఈ లోకమునుండి విడువ బడి అన్నమయాత్మను అనగా ఈ స్థూల దేహమును అధిగమించి బ్రహ్మరూపమును పొందును. ఆ సర్వాంతరమగు ఆత్మరూపుడై సదానంద భరితుడగుచు వున్న ఆత్మను పొందుటకు జీవునకు తనకున్న జ్ఞానముతో అనాత్మ పదార్థములను సవివ రముగ గుర్తించుట చాల కష్టసాధ్యమైన పని. అందులకు శాస్త్రాధ్యయనము, గురూపదేశము చాల ఆవశ్యకము. అప్పుడే అట్లు పొందిన వివేకముతోనే, అనాత్మ పదార్థములను గుర్తించి త్యజించగల సమర్థుడగును.

"దేహేంద్రియ ప్రాణమనో ఽ హమాదయః సర్వేవికారా విషయాః సుఖా దయః వ్యోమాది భూతాన్యఖిలంచ విశ్వమవ్యక్త పర్యన్తమిదం హ్యాత్మనా" అనగా దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, అహంకారము మొదలగు సమస్తమైన వికారములు- అనాత్మ పదార్థములన్నియు వికారములేగాని, స్వాభావిక ములు గావు. విషయములు, సుఖాదులు, ఆకాశము, వాయువు, అగ్ని మొదలగు భూతములు, అనగా అవ్యక్తము వరకును ఈ దృశ్యప్రపంచ మంతయు అనాత్మ పదార్థమే. అంతిమ కార్యమగు దేహము మొదలు ఆదిమ సర్వోపాదాన కారణమగు అవ్యక్తము వరకునుగల వున్నవన్ని పదార్థములు అనాత్మ పదార్థములే అని చెప్ప బడినవి. "మాయా మాయా కార్యం, సర్వం మహాదాది దేహపర్యన్తమ్, అసది దమనాత్మ తత్వం విద్ధిత్వం మరుమరచికా కల్పమ్" అనగా మాయయు, మహత్తు మొదలుకొని దేహము వరకునుగల సమస్తమైన మాయా కార్యమంతయు అనాత్మ పదార్థమే, అసత్తే, కల్పితమైన ఎండమావుల వంటిదే. ముందుగా మహత్తు దానియందు కల్పించబడిన పంచసూక్ష్మ భూతములు, తరువాత పంచీకృత స్థూలభూతములు, తరువాత బ్రహ్మాండము, అందలి పదునాల్గు లోకములు, వాటియందలి స్థూలదేహాదులు, మరియు ఈ దేహపర్యంతము అగు సమస్తమైన మాయయు, ఆమాయయొక్క కార్యము, అయిన ఆత్మకు భిన్నముగ తోచు పదార్థమంతయు అసద్రూపమగు ఆత్మకంటె వేఱుగా తోచుచున్న, సమ

స్తము కనబడి నశించు స్వభావము మరియు స్వరూపము కలదగుటచే ఎండ మావులతో సమానమైన దానినిగా, మిథ్యాభూతమైన దానినిగా, అనాత్మ పదార్థముగా తెలుసుకొనవలయును. ఆత్మజ్ఞానము కలుగుటకు పూర్వము మాయయు మరియు దానియొక్క కార్యము సత్యముగా తోచుచుండును. కాని ఆత్మ సాక్షాత్కారము అనగా బ్రహ్మసాక్షాత్కారము కలుగగనే మెలకువ వచ్చిన పిమ్మట స్వప్నము వలె అది అంతయు సమూలముగ తొలగిపోవును. ఈ విధముగా మాయ, మాయా కార్యములు దృష్టనష్ట స్వరూపములు కలవగుటచే ఎండమావులవలె కేవలము భ్రాంతిజెందియున్న వానికి తోచునవేగాని సత్యములుగా వుండునవి కానేరవు.

శబ్ద, స్పర్శ, రూప,రస, గంధములనెడు అయిదున్నూ అనాత్మ విషయములే ఇవి జీవునకు అధికముగా బంధహేతువులు అగుచున్నవి. "యయేషుమూఢా విషయేషు బద్ధా, రాగోరు పాశేన సుదుర్దమేన, ఆయన్తినిర్యాన్త్యధ ఊర్ధ్వముచ్చైః స్వకర్మదూతేన జవేననీతాః" అనగా ఏ మూఢులు తొలగింపరాని రాగమనెడు గొప్ప పాశముచే విషయములయందు బంధింప బడినారో వారు తమయొక్క కర్మయనెడు దూతచేత వేగముగా నడిపింపబడినవారై క్రిందికి వచ్చుచున్నారు. చాలా పైకి వెళ్ళుచున్నారు. అట్లేలయన? వివేకరహితులు ఈ శబ్దాది పంచవిషయముల యందు రాగమనెడు గొప్ప పాశముచే స్తంభమునకు త్రాళ్ళతో కట్టివేయబడు పశువువలె కట్టివేయబడు చున్నారు. అనగా అజ్ఞానముచే కలిగిన విషయాభిలాష కలవారై, ఆ విషయములను వదలజాలక వాటి యందే సుఖాభిలాష కలవారై మోక్ష మార్గమును పొందజాలని వారు అగుచున్నారు. శబ్దాదికము సుఖము కలిగించు నను ఆశతో పుణ్య పాప కార్యములు ఆచరించుచు వాటి ఫలితములగు స్వర్గ నరకములను పొందు చున్నారు.

ఆ విధముగా జన్మమరణములను పొందుచున్నారు. శబ్దాదులలో ఒక్క దానిని సేవించువారికే మృత్యుహేతువగు బంధము కలుగుచున్నది. మరియింక అయిదింటిని క్రమముగ సేవించువారి గతి చెప్పశక్యమగునా? అందుచే శబ్దాదుల సేవనము బంధమునే కలిగించునని చెప్పినట్లయినది. "శబ్దాదిభిః పంచభిరేవ పంచ పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః, కురంగ, మాతంగ, పతంగ మీనభృంగానరః

పంచభిరన్వితః కిమ్'' అనగా లేడి, ఏనుగు, మిడుత, చేప, తుమ్మెద అనెడు ఐదు జంతువులు వరుసగ శబ్దము. స్పర్శము, రూపము, రసము, గంధము అనెడు ఐదు విషయములందు ఆసక్తిగలవిగా అయి తుదకు మరణమును పొందుచున్నవి. అట్లే శబ్దాది విషయముల ఐదింటిని సేవించుటకై విహితకర్మలను ఆచరింపక పాపకర్మలు కూడ చేయునరుడు జన్మమరణ బంధములయందు చిక్కి చెప్పరాని దుఃఖములను అనుభవించుచున్నాడు. అందుచే "విషయాశా మహా పాశాద్యో విముక్తః సదుస్త్యజాత్, సఏవకల్పతే ముక్త్యైనాన్యః షట్శాస్త్ర వేద్యపి'' అనగా ఎవరు త్యజించుటకు చాలా కష్టమైన విషయాశయనెడు మహాపాశమునుండి ముక్తులైనారో వారలు మాత్రమే మోక్షమును పొందుటకు సమర్థులగుచున్నారు. అట్లు ముక్తులు కానివారు సర్వశాస్త్రములు తెలిసిన పండితులైననూ నిత్యమగు మోక్షమును పొందజాలరు. అనగా పూర్తిగా విషయములనుండి వైరాగ్యమును కలిగినవారు శమాది గుణగణ మండితులై సద్గురువును సమీపించి వారినుండి ఆత్మతత్వమును గురించి విపులముగా తెలుసుకొని సంసారమునుండి ముక్తులగుదురు. అట్లుగాక విషయములను గూర్చి ఆలోచించువానికి వాటియందు ఆసక్తి ఏర్పడును. ఆ ఆసక్తివలన కామముకలుగును. కామమువలన క్రోధము జనించును. క్రోధము వలన మోహము, ఆమోహమువలన స్మృతిభ్రంశము, దానిచే చివరకు బుద్ధినాశము కలుగును. బుద్ధినాశము కలుగగా ఆత్మానాత్మవివేకము నశించి తుదకు అతడే నశించును. అని శ్రీమద్భగవద్గీత యందు స్పష్టముగా చెప్పబడియున్నది- 'ధ్యాయతో విషయాన్ పుంసః, సంగస్తేషూపజాయతే, సంగాత్ సంజాయతే కామః, కామాత్క్రోధోభిజాయతే క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః, స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి'' భ.గీ. 2-62-63. కామమే క్రోధరూపమున పరిణమించునుగాన వివేకవంతుడగు పురుషుడు సద్గురువులను ఆశ్రయించి ఆత్మానాత్మ పదార్థముల వివేకమును పొంది, విషయములందు ఆసక్తుడుగాక వాటిని వదిలి మోక్షమార్గమున పయనించవలయును. తీవ్రమైన మోక్షేచ్ఛగల పురుషునకు "మోక్షస్య కాంక్షాయదివైతవాస్తితత్యజాతిదూరాద్విషయాన్, విషంయథా, పీయూషవత్తోషదయా క్షమార్జవ ప్రశాన్తిహాన్తిర్భజనిత్య మాదరాత్'' అనగా మోక్షముయొక్క కోరికయున్నచో

విషయములను విషముతో సమానముగా దుఃఖవర్ధకములని తలంచి చాల దూరముగ విడిచిపెట్టవలయును. అట్లు విడిచిన పురుషుడు సంతోషము, దయ, ఓర్పు, ఋజుత్వము, శాంతి, ఇంద్రియ నిగ్రహము మొదలుగాగల సద్గుణములను కలిగినవాడై అమృతమును సేవించిన వానివలె ఆనందముగా వుండును, ఈ విధముగా విషయ వైరాగ్యము మోక్షప్రాప్తికి ముఖ్యసాధనముగా చెప్పబడినది.

పై విధముగా విషయములందు విడరాని ఆసక్తి కలుగుటకు మూలకారణము ఈ స్థూలశరీరమునుబట్టి ఏర్పడుచున్నదిగాన దానిని అనాత్మపదార్థముగ ముందుగా గుర్తించి దానిపై అభిమానమును విడిచినచో విషయముల యందలి వైరాగ్యము సులభముగా దృఢమగును. "అనుక్షణం యత్పరిహృత్యమనాద్యవిద్యాకృత బంధమోక్షణమ్. దేహః పరార్థోయ ముముష్యపోషణేయస్సజ్జతే సస్వమనేన హన్తి" అనగా ఈస్థూల శరీరమునందు అభిమానమును త్యజింపవలయును. ఏలయన, ఈస్థూల శరీరము అనాదియగు అవిద్యచే జీవునకు ఏర్పడిన సంబంధమైయున్నది. అందుచే వివేకవంతుడగు పురుషుడు ప్రతిక్షణమునందును దీనియందలి అభిమానమును వదిలి వుండవలయును. అట్లుగాక ఏ పురుషుడు దీని పోషణాదులయందు ఆసక్తి కలిగియుండునో అతడు ఈస్థూల శరీరపోషణద్వారా తనను హింసించుకొన్నవాడు అగుచున్నాడు. తన స్వస్వరూప సాక్షాత్కారముచే ముక్తుడు కావలసియున్న పురుషుడు అట్టి మోక్షమునకు ప్రతిబంధకమగు స్థూలదేహాభిమానముచే దానియొక్క జన్మమరణాది ధర్మములు స్వస్వరూపమునకే అనగా తన నిజస్వరూపమైన ఆత్మకే వున్నవని భావించి ఎల్లప్పుడునూ దుఃఖమునే అనుభవించుచున్నాడని తాత్పర్యము. ఈ విధముగా ఏ పురుషుడు ఈస్థూలదేహమునే తానని తలంచుచూ దానిపోషణయందే ఆసక్తికలవాడై తన నిజస్వరూపమగు ఆత్మను మరిచివుండునో అతడు ఈ సంసారసాగరమునబడి మునుగుచూ తేలుచూ అనగా జన్మ మరణాదులను పొందుచూ దుఃఖమునే పొందుచుండును. "శరీరపోషణార్థినన్ య ఆత్మానం దిదృక్షతే, గ్రాహందారుధియా ధృత్వానదీం తర్తుం ఇచ్ఛతి" అనగా ఏపురుషుడు శరీరపోషణమును మాత్రముకోరుచూ తన స్వస్వరూపమైన ఆత్మను సాక్షాత్కరించుకొనవలయునని కోరుకొనుచుండునో అతడు కర్రయనెడు బుద్ధితో నీటియందు తేలియాడుచున్న మొసలిని ఆధారముగాజేసుకొని నదిని దాటుటకై ప్రయత్నించు

చున్నాడు. తాత్పర్యమేమన శరీరపోషణమును మాత్రమే కోరుచుండెడి స్వభావము కల పురుషుడు అనగా ఎల్లప్పుడును "మరువము మొల్కపుష్పసుకుమారము నాతనువంచు భ్రాంతిమై" మురియుచునుండు పురుషుడు అట్టి శరీరపోషణయందే తన శక్తియుక్తులను వ్యర్థముచేయుచూ వుండి స్వస్వరూపమును సాక్షాత్కరించుకొని శాశ్వతమైన ఆనందమును పొందదలంచునో ఆతడు కర్రయను భ్రాంతిజెందినవాడై మొసలిని ఆధారముగా జేసుకొని నదిని దాటగోరువానివలె తెలివిహీనునిగా తలంచ బడుచున్నాడు. ఏలయన నదిని దాటగోరువాడు మొసలిని ఆధారముగా జేసుకొని ఆ నదిని దాటజాలడు. ఆ మొసలి అతనిని నదీ మధ్యమున పట్టి తినివేయును. కావున వివేకవంతుడు మోక్షమును నిజముగా పొందగోరుచున్నచో అనాత్మ పదార్థమగు స్థూలదేహమునందలి అజ్ఞానముచే కలిగియున్న అభిమానమును విడిచిపెట్టవల యును అని శ్రుతులు చెప్పుచున్నవి. "మోహఏవమహామృత్యుర్ముముక్షోర్వపురా దిషు, మోహోవినిర్జితో యేన సముక్తిపదమర్హతి" అనగా మోక్షపదమును పొంద గోరుపురుషునకు స్థూలదేహాదులయందు కలిగియుండు మోహమే మహామృత్యువు. ఏపురుషుడు ఆ అజ్ఞాన జనితమైన మోహమును విడిచియుండునో ఆతడే మోక్ష మును పొందుటకు అర్హుడైయున్నాడు. స్థూలదేహాదులయందు అనగా శరీర భార్యా పుత్రాదులయందు కలిగియున్న అహంకార మమకారాదులే ముముక్షువునకు బంధ హేతువులు. మరణించినవాడు ఏ విధముగ ఏ పనిని చేయజాలడో అట్లే స్థూలదేహా దులయందు భార్యా, పుత్ర, గృహ, సంపదలయందు అహంకార మమకారములు గల వాడై శాశ్వతానందదాయకమైన మోక్షమును పొందజాలడు. ఎవనిచే శరీరాది అనాత్మ పదార్థములయందు అహంకారాది రూపమగు మోహము మరియు అజ్ఞానము విడువ బడినవో అతడే ముక్తిపదమునకు తగినవాడు. అతడే మోక్షమును పొందును.

ఈ స్థూల దేహము మిక్కిలి అశుద్ధములగు అనగా అనిత్యములగు పదార్థ ములతో కూడి యుండుటచే అభిమానించ తగినదికాదు. ఈ స్థూలదేహము మలము వలె అసహ్యించుకొన తగినది. "త్వక్ మాంసరుధిరస్నాయు మేదో మజ్జాస్థి సంకు లమ్, పూర్ణం మూత్ర పురీషాభ్యాం స్థూలం నింద్యమిదంవపుః" అనగా చర్మము,

మాంసము, రక్తము, నాడులు. క్రొవ్వు, మజ్జ, ఎముకలు, మొదలగు అనాత్మ పదార్థ ములతో నిండియున్నదియు. మూత్రము, మలముతో కూడి యున్నదియు అగు ఈ స్థూల శరీరము నింద్యమైనది. అనగా అభిమానించ తగనిది. ఏలయన ఆత్మయొక్క భోగమునకు కల్పించ బడుచున్న-స్థానమైన-ఈ స్థూల శరీరము పూర్వ కర్మ ఫల ముగా పంచీకృతములగు స్థూలభూతముల ద్వారా ఏర్పడినది. ఆ స్థూల శరీరము కేవలము జాగ్రదయందు మాత్రమే పురుషునకు భోగహేతువు అగుచున్నది. ఆకా శాది సూక్ష్మభూతములు పరస్పరాంశములతో కలసి స్థూల శరీరములను కల్పించు చున్నవి. వారి వారి పూర్వకర్మల ననుసరించి ఆయా స్థూల శరీరములు కలుగుచుం డును. ఈ స్థూల శరీరము పురుషునిచేత కేవలము జాగ్రదవస్థయందు మాత్రమే. 'నేను, నాది' అని అభిమానింప బడుచున్నది. అదెట్లన?, ఈ స్థూలదేహము యొక్క అసాధారణమైన అవస్థ అనగా అది పురుషునకు భోగహేతువు అగు సమ యము జాగ్రద కాలము. అనగా పురుషుడు మెలకువతో వున్నప్పుడు మాత్రమే ఈ స్థూల దేహము అనుభవమునకు వచ్చుచున్నది. ఇంద్రియముల ద్వారా బాహ్య విషయములను గ్రహించెడు అవస్థ జాగ్రదవస్థ. స్వప్నావస్థయందుగాని, సుషుప్తి యందుగాని ఈ స్థూల దేహము పురుషునకు అనుభవ యోగ్యముగా వుండుటలేదు. శ్రోత్రాది ఇంద్రియములచే గ్రహింపబడు శబ్దాది విషయములు స్థూల విషయములు. స్వప్నమునందు ఇంద్రియముల వ్యాపారములేక పోవుటచే ఆ అవస్థయందు వాసనా రూపమున వున్న శబ్దాదులను ఇంద్రియములు గ్రహించుట అనునది వుండుటలేదు. ఇంద్రియముల సహాయము లేకుండ కేవలము మనస్సు చేతనే స్వప్నావస్థలోని విష యములు గ్రహింపబడుచున్నవి. ఈ విధముగా జీవుడు అనగా స్థూల శరీరమునందు వ్యాపించియున్న పురుషుడు తాను ఈ స్థూల శరీరమునందు తాదాత్మ్యబుద్ధితో బాహ్య ములగు ఇంద్రియములచే నానావిధరూపములుగాతోచు స్థూల పదార్థములను సేవించు చున్నాడు. ఆ కారణమువలన జాగ్రదవస్థయందు ఈ స్థూల శరీరమునకు ప్రాధా న్యము కల్పించబడుచున్నది. అనగా మనస్సుద్వారా స్థూల శరీరమునందు ప్రతి ఫలించిన స్వరూపముతో, స్థూల శరీరముపై అధ్యస్తమగు ఆత్మభావముతో స్థూల విషయములను అనుభవించుచున్నాడు. కాని స్వప్నమునందు మనస్సునకు స్థూల దేహముతో ఎటువంటి సంబంధము వుండదు. అందుచే దానియందు స్వరూప ప్రతి

బింబము ప్రతి ఫలించుట అనునది గూడ వుండదుగాన అప్పుడు స్థూల శరీరము భోగహేతువు అగుటలేదు. స్వప్నావస్థయందు భోగహేతువు అగుచున్నది— కాల్పనికము, వాసనామయమును అగు మరియొక సూక్ష్మశరీరమే. అందుచే జీవులు ప్రసిద్ధ మగు తమ తమ స్థూల దేహములకంటే భిన్నములైన పక్షులు, దేవతలు మొదలగు దేహాదులతో గూడ స్వప్నమునందు భోగములను అనుభవించుచుందురు. ఇది అందరి అనుభవమునందును వున్నవిషయమే. అందుచేత ఈ స్థూల దేహమునకు జాగ్రదవస్థయందు మాత్రమే వునికి, అనగా ప్రాధాన్యము. స్వప్న, సుషుప్తి అవస్థలయందు ఈ స్థూలదేహము విషయమున అభిమానమే వుండదు. ఆరెండు అవస్థలయందును అనగా స్వప్న, సుషుప్తులయందు భాసింపక కేవలము జాగ్రదవస్థయందు మాత్రమే భాసించుచున్న ఈ స్థూలదేహము సత్యము, నిత్యము, నిరవయమును అగు ఆత్మకాజాలదు. ఈ విధముగా ఈ స్థూలదేహము అనాత్మ పదార్థమేనని సులభముగా గ్రహింపవచ్చును. అందువలననే "సర్వోపిబాహ్యః సంసారః పురుషస్య యదాశ్రయః, విద్ధి దేహమిదం స్థూలం గృహావద్ గృహమేదినః" అని చెప్పబడినది అనగా, పురుషుని యొక్క బాహ్యమైన సమస్తమైన సంసారము దేనిని ఆశ్రయించుకొని యున్నదో అట్టి ఈ స్థూల దేహమును గృహస్థునికి నివాస యోగ్యమగు గృహము ఎట్లో అట్లేయని తెలిసికొనవలయును. ఇందుచే తెలియుచున్నదేమన బాహ్యము ఆంతరము అని సంసారము రెండు విధములుగా వున్నది. సుఖము, దుఃఖము, కర్తృత్వము, భోక్తృత్వము మొదలగున వన్నియు ఆంతర సంసారమునకు సంబంధిచినవి. జన్మము, వార్ధక్యము, మరణము, స్థూలత్వము, బాల్యము మొదలగునవి బాహ్య సంసారమునకు సంబంధించినవి. వాస్తవమున సంసార రహితుడగు జీవునకు దీని విషయమున తాదాత్మ్యాధ్యాసము అనగా ఈ దేహమే నేను అనుభ్రాంతి, అజ్ఞానముతో కూడిన అభిమానము కలుగుచున్నదో అట్టి ఈ స్థూలశరీరము గృహస్థునకు వాసయోగ్యమగు గృహము ఏ విధముగా సంసారమును పొందుటకు ఉపయోగ పడుచున్నదో అట్లే ఈ స్థూలదేహము జీవునకు బాహ్య సంసారమును కల్పించుకొనుటకు సాధనముగా ఉపయోగ పడుచున్నది. అందుచేతనే ఈ స్థూల శరీరమే తాను అని భ్రాంతిజెందుచున్నవారు మాత్రమే. దాని ధర్మములగు జరా మరణాదిక

ములను తనకే సంబంధించినవిగా భావించిలేని దుఃఖములను అనుభవించుచున్నారు. అట్టి భ్రాంతి జన్యమగు తాదాత్మ్యము లేనిచో జీవునకు దుఃఖమేలేదు. ఇట్టి స్థూలదేహా భిమానములేని సుషుప్తి అవస్థయందు జరా రోగాదుల వలన కలుగు దుఃఖము తోచుటలేదు కదా! అందుచే యథార్థముగ తనకు సంబంధించని ఈ స్థూలదేహము నందు "నేను, నాది" యను అహంభావము కేవలము అజ్ఞాన జన్యమే అగు చున్నది.

ఈ విధముగా వివేకముతో విచారించిచూడగా జన్మము, జర, మరణము, స్థూలత్వము మొదలగు అనేకములైన ధర్మములు, బాల్యము, యౌవ్వనము వృద్ధా ప్యము మొదలగు అవస్థలు, వర్ణాశ్రమాదినియమములు, అనేక విధములగు వ్యాధులు, పూజ, అవమానము, సమ్మానము మొదలగు విషయములన్నియు స్థూల శరీరము నకు మాత్రమే సంబంధించినవి అగుచున్నవి. జాత కర్మాది సంస్కారములు గూడ స్థూల శరీరమునకే చేయబడుచున్నవి. ఆయా ఆశ్రమములకు సంబంధించిన చిహ్నములు-వేషములు గూడ స్థూల శరీరమునకు సంబంధించినవే. అందుచే వర్ణా శ్రమాది నియమములన్నియు స్థూల శరీరమునకేగాని జీవునకు సంబంధించినవి కానే రవు.

దశేంద్రియములుగూడ అనాత్మ పదార్థములే. ఏలయన ఈ ఇంద్రియము లన్నియు అంతఃకరణములేనిదే ఏ విధములైన కార్యములు చేయజాలకున్నవి. చెవి, చర్మము, కన్ను, ముక్కు, నాలుక విషయములను గ్రహించు సాధనములు అగుట వలన జ్ఞానేంద్రియములుగా చెప్పబడుచున్నవి. నోరు, హస్తములు, పాద ములు, గుదస్థానము, ఉపస్థము మొదలగునవి ఆయా కర్మలు చేయుట యందు సాధనములుగ వుంటున్నందున కర్మేంద్రియములుగా చెప్పబడుచున్నవి. కాని ఈ ఇంద్రియములన్నియు తమంతాటతాముగా ఎట్టి కార్యములు చేయజాలవు. వీటి యందు అంతఃకరణము అనగా మనస్సు చేరియున్నప్పుడే, అనగా మనస్సు యొక్క ప్రేరణ చేతనే కార్యములు చేయుటయందు సమర్థములు అగుచున్నవి. అందువలన ఈ దశేంద్రియములకు స్వంతకార్యసామర్థ్యము లేనందు వలన ఇవి అన్నియు అనాత్మ పదార్థములే అగుచున్నవి. కారణము ఆత్మ నిత్య చైతన్య పదార్థము అయి వున్నది.

పై విధముగా దశేంద్రియములను ప్రేరేపించి సర్వవిధములగు బాహ్య సంసారమును కల్పించు అంతఃకరణము గూడ సత్యము నిత్యము అయిన ఆత్మ పదార్థము కాజాలదని శ్రుతులు చెప్పుచున్నవి. ఏలయన-అంతఃకరణము తన యొక్క వేఱువేఱు వృత్తులచేత మనస్సుగాను, బుద్ధిగాను, చిత్తముగాను, అహంకారముగాను గుర్తింపబడు చున్నది. సంకల్ప వికల్పాదులగు కార్యములు చేయు చుండుటచే మనస్సుగాను, పదార్థనిర్ణయము చేయుచుండుటచే బుద్ధిగాను,ఈ శరీరాదుల యందు అభిమానము కలిగియుండుట ద్వారా అహంకారముగాను, విషయములను మరల మరల స్మరించుటయను కార్యము ద్వారా చిత్తముగాను చెప్పబడుచున్నది.

పంచప్రాణములు కూడ అనాత్మ విషయములే, ఏలయన - ఈ ప్రాణములు శరీరములను పోషించుటయందే సాధనములు అగుచున్నవి. అంతియేగాని వీటికి తనను గురించిన జ్ఞానమే లేదు. ఈ ప్రాణము గూడ తాను చేయు కార్య భిన్నత్వము చేత అనగా వికార భేదముచేత ప్రాణమనియు, అపానమనియు, వ్యానమనియు అపానమనియు, మరియు సమానమనియు అయిదు విధములుగా అగుచున్నది. ముఖనాసికలనుండి ప్రవేశనిర్గమనములు చేయుచుండునది ప్రాణము. మలాదులను బహిర్గతము చేయుప్రాణమే అపానము. తినిత్రాగిన అన్నరసాదులను నాడులయందు వ్యాపింపజేయు ప్రాణమునకే వ్యానమని పేరు. వమనకార్యములను చేయించు ప్రాణమునకే ఉదానమనిపేరు. భుజించిన అన్నరసాదులను అరగించుటకై జఠరాగ్నినిప్రేరేపించు ప్రాణమునకే సమానమనిపేరు. ఈ విధముగా ప్రాణము శరీరమునందు ఐదు విధములగు కార్యములచే ఆ శరీరమును రక్షించు చున్నది. అందుచే ఈ ప్రాణముగూడ అనాత్మ పదార్ధముగానే చెప్పబడుచున్నది.

వాగాది కర్మేంద్రియ పంచకము అనగా నోరు, చేతులు, పాదములు, గుదస్థానము, ఉపస్థము శ్రవణాది జ్ఞానేంద్రియ పంచకము అనగా చెవి, చర్మము, కన్ను, ముక్కు నాలుక, ప్రాణాది పంచకము అనగా ప్రాణము, అపానము వ్యానము, ఉదానము, సమానము, ఆకాశాది సూక్ష్మభూత పంచకము అనగా గాలి,

నీరు. భూమి, అగ్ని, ఆకాశము, బుధ్యాది అంతఃకరణ చతుష్టయము. అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అధ్యాసము, కామకర్మిణి, ఇచ్ఛ, ధర్మాధర్మనామకమగు కర్మయు, ఈ విధముగా కలిగియున్న అష్ట సముదాయ రూపములగు పదార్థములతో కూడియున్న దానిని సూక్ష్మ శరీరమని పండితులు చెప్పుచున్నారు. ఈ సూక్ష్మ శరీరము గూడ అనేక పదార్థముల యొక్క సంఘాత మగుటచేతను, గృహమువలె ఇతరుల ఉపయోగార్థమై ఏర్పడినదగుటచేతను అనాత్మ పదార్థమనియే అనగా ఆత్మభిన్నమనియే నిర్ణయించబడుచున్నది. అట్లెలయన ఈ సూక్ష్మ శరీరము పంచీకృతములు కాని సూక్ష్మభూతములనుండి ఏర్పడియున్నది. అందువలననే దీనికి సూక్ష్మశరీరమని పేరు. బాహ్యేంద్రియముల అంతరింద్రియముల తోడను కూడినదై యున్నందున ఈ సూక్ష్మశరీరమునకే లింగశరీరమని కూడ పేరు. ఆత్మయొక్క ప్రతిబింబమును గ్రహించి, ఆత్మజ్ఞాపకము అగు అనగా ఆత్మయొక్క ఉనికిని సూచించెడి మనస్సు ఈ సూక్ష్మ శరీరముతోడనే సంబంధించి యున్నది. ఈ కారణము చేతనే సూక్ష్మ శరీరమే లింగశరీరమని చెప్పబడుచున్నది. ఈ విధమగు లింగత్వము, ఆత్మ సూచకత్వము స్థూలకారణ శరీరములకు సంభవింపదు. ఆత్మ ఎటువంటి ధర్మములు లేనిది. స్థూల శరీరము జాగ్రదవస్థయందు మాత్రమే గోచరించి స్వప్న, సుషుప్తుల యందు గోచరించుటలేదు. అంతియేగాక దానికి జన్మమరణములు వుండును. అందుచే మోక్షము కలుగువరకు స్థిరముగ నుండు సూక్ష్మ శరీరమువలె స్థూల శరీరము వుండదు. అందుచే తెలియబడునదేమన- పూర్వ పూర్వ సంస్కారములు, భవిష్యత్తునందు కలుగబోవు అనుభవములచే ఏర్పడు సంస్కారములకును ఆశ్రయభూతమై మోక్షము కలుగు వరకును స్థిరముగ వుండునది ఈ సూక్ష్మశరీరమే. భోగహేతువుగూడ ఈ లింగశరీరమే. అందువలన ఈ లింగశరీరమే ఉపాధిగా అగుచున్నది. సుషుప్తియందు వాసనా సహిత మగు ఈ లింగశరీరము ప్రాణములయందు విలీనమగుటచేత కర్మఫలములగు సుఖ దుఃఖముల అనుభవముకూడ వుండుటలేదు. జాగ్రద స్వప్నావస్థలయందు ఈ లింగశరీరము వుండుసుగాన సుఖదుఃఖానుభవము కూడ కలుగుచున్నది. ఈ లింగ శరీరము ఆత్మకు అనాదియగు ఉపాధి. ఇది సూక్ష్మభూతములవలన జనించిన

దైనందున మహా ప్రలయాదులలో కూడ సూక్ష్మరూపమున అనగా అభివ్యక్తము కాని రూపమున స్థిరముగ వుండును. తిరిగి సృష్టికాలమందు ఉపాధి కలిగి అభివ్యక్తమగుచుండును, యీ విధముగా విదేహ కైవల్యము కలుగువరకు ఇది నిలిచి యుండునుగాన ఇది స్థూలశరీరమువలె క్రొత్తదిగాక అనాది అనబడుచున్నది.

పురుషునకు స్వప్నావస్థయందు ఈ సూక్ష్మ శరీరముయొక్క అనుభవము బాగుగా కలుగుచున్నది. అదెట్లన—జాగ్రదవస్థయందు స్థూల శరీరమునకు మాత్రము విశేష ప్రవృత్తి యుండుట వలనను, సుషుప్తియందు ఈ సూక్ష్మ శరీరము లీనమగుచుండుట వలనను, సూక్ష్మ శరీరమునకు స్వప్నావస్థయందే ప్రాధాన్యము లభించుచున్నది. ఈ అవస్థయందు స్థూల దేహాభిమానము వుండదుగాన సూక్ష్మ శరీరము ఒక్కటి మాత్రమే అభిమాన పాత్రముగా వుండును. అనగా ఆత్మ అనగా పురుషుడు స్వప్నావస్థయందు స్థూల దేహాభిమానమును విడిచి సూక్ష్మ శరీరమును మాత్రమే "నేను" అని అభిమానించుచు ప్రకాశించుచుండును. స్వప్నావస్థయందు అంతఃకరణము ఇతర కారకములు లేనిదై అనగా స్థూలదేహము, ఇంద్రియములు మొదలగు కార్యములన్నింటిని విడచినదై తాను మాత్రమే జాగ్రదవస్థయందు కలిగిన బహువిధ సంస్కారములచే కర్తృత్వము, క్రియాత్వము, కరణత్వము, అధికరణత్వము మొదలగువానిని అనగా సకలక్రియాకారక భావమును పొంది ప్రకాశించుచుండును. అందుచే జడమగు అంతఃకరణమునకు ఇంత శక్తి ఎట్లు కలుగుచున్నదను సంశయముకలుగవచ్చును. అందులకు సమాధానముగా "యత్ర స్వయంజ్యోతిః" అనగా "నతత్ర సూర్యోభాతి నచంద్ర తారకం. నేమావిద్యుతోభాన్తికుత్ఽయమగ్నిః, తమేవ భాన్తిమనుభాతి, సర్వం తస్య భాసా సర్వం మిదం విభాతి, యదాదిత్య గతం తేజో జగద్భాసయతేఽఖిలమ్, యచ్చన్ద్రమసియచ్చాగ్నౌతత్తేజో విద్ధిమాతుకమ్" అనగా ఆ ఆత్మ తేజస్సు ఎదుట సూర్యుడు భాసించడు. చంద్రనక్షత్రములుభాసించవు. మెఱుపులుభాసించవు.అగ్నికూడ భాసించదు భాసించుచున్న ఆ ఆత్మనేఅనుసరించి సర్వముభాసించుచున్నది. దాని కాంతిచే ఇది అంతయుభాసించుచున్నది. ఇతర ప్రకాశ్యముకానిదియు, స్వయంజ్యోతిరూపమును అగు పరమాత్మకు సంబంధించిన చైతన్యప్రకాశము యొక్క సంబంధముచే అనగా ఆ

ఆత్మజ్యోతి తనయందు ప్రతిబింబించుటచే జాగ్రదవస్థలో ఏర్పడిన వాసనలతో కూడిన అంతఃకరణమునకు ఈ శక్తి అనగా సర్వమును భాసింపజేయుశక్తి కలుగు చున్నది. స్వప్నావస్థలోని వ్యవహారమంతయు జాగ్రత్కాలమునందువలెనే జరుగు చుండును. కాని బాహ్యములగు జ్యోతిస్సులు అనగా సూర్యచంద్రాదులు గాని, స్థూల శరీరము గాని అప్పుడు ఉండవు. బాహ్యేంద్రియములన్నియు వ్యాపారముడిగి యుం డును. జాగ్రద్ వాసనలతో కూడియున్న ఒక్క మనస్సు మాత్రమే తనయందు ఆత్మజ్యోతిస్సు ప్రతిబింబించుటచే సర్వాకారమై భాసించుచు వ్యవహరించుచుండును. అందుచేతనే "అత్రాయం పురుషః స్వయం జ్యోతిః" అని చెప్పబడినది. అనగా ఆ అవస్థ యందు పురుషుడు అనగా ఆత్మస్వరూపము స్వయం జ్యోతి స్వరూపముగా భాసించుచుండును. స్వప్నమునందు మనస్సు అనగా అంతఃకరణముగూడ జాగ్రద్ సంస్కారయుక్తమైయున్నను జడ పదార్థమే. స్వయంప్రకాశ్యముకాదు. జడ మగు నది అన్యముచే ప్రకాశింపబడును గాని స్వయముగ ప్రకాశింపజాలదు. అందుచే చైతన్య జ్యోతిః స్వరూపమగు పరమార్థము దానియందు ప్రతిబింబించుటచేతనే స్వప్నావస్థయందు ఆ అంతఃకరణము సర్వమును ప్రకాశింపజేయు సామర్థ్యము కలదిగా అగుచున్నది. అందువలననే కంటి చూపులేని గ్రుడ్డివారు గూడ స్వప్నము నందు సర్వపదార్థములను చూడగలుగుచున్నారు. అందుచేత ఆత్మశక్తిచేతనే మనస్సు నేత్రరూపమున గూడ పరిణమించుచున్నదని చెప్పబడుచున్నది. ఈ విధ ముగా నేత్రములుగాని, ఆదిత్యాది జ్యోతిస్సులుగాని లేని సమయమున గూడ సకల పదార్థములను ప్రకాశింపజేయగల శక్తి అంతఃకరణమునకు కలుగుచున్నది.

ఈ విధముగా అంతఃకరణమే చక్షురాది ఇంద్రియముల యందును అనగా మనస్సు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ, ప్రాణాదులయందును, స్థూలశరీరమునందును తనయందు చిత్ప్రతిబింబించగా ఏర్పడిన తేజస్సుతోకూడినదై అజ్ఞానజనితమగు తాదాత్మ్యాభిమానముతో అహంకార రూపమున వుండును. అనగా ఆత్మానాత్మ వివేక శూన్యమైన అంతఃకరణము ముందుగా ఆత్మబింబమును గ్రహించి తద్వారాచేతనమై చక్షురాది ఇంద్రియములు మొదలు స్థూలదేహము వరకును వున్న వాటినన్నింటిని తనవలెనే చైతన్యవంతము గావించి అదంతయు "నేనే" అని అభిమానము కలిగి యుండును. అదియే జీవుడు. అందుచే ఆ అంతఃకరణమునకు ప్రతిబింబరూపమున

వశమైయున్న ఆత్మకూడ తన స్వరూపమును మరచి అంతఃకరణ ధర్మములనన్నిం టిని తనవిగా భావించు చుండును. సుషుప్తియందు ఆత్మ అంతఃకరణము నందు ప్రతి బింబించుటలేదు. అందుచే ఈ అంతఃకరణ ధర్మములు అచ్చట ఆత్మకు వుం డుటలేదు. స్వప్నమునందు ఆత్మ అంతఃకరణమునందు ప్రతిబింబించుచున్నను ఆయవస్థలో బాహ్యేంద్రియములన్నియు లీనములైయుండుటచే అంతఃకరణము తన యందు ప్రతిబింబించిన ఆత్మ తేజస్సుతో బాహ్యేంద్రియములయందు వుండుట లేదు. అందుచేతనే జాగ్రతనందువలె స్వప్నమునందు అంధత్వాది వ్యవహారము వుండుటలేదు. ఈ విధముగా ఆత్మయొక్క బాహ్యసంసారమంతయు అంతఃకరణ మూలకమేయని తెలియబడుచున్నది. అట్లే ఆంతరములగు కర్తృత్వ సుఖదుఃఖాది కముగూడ ఆ అంతఃకరణమునకు సంబంధించినదే అగుచున్నది. అహంకారః సవిజ్ఞేయః కర్తాభోక్తాభిమాన్యయమ్, సత్వాది గుణయోగేనాఽవస్థాత్రితయమశ్నుతే'' అనగా ఆ అంతఃకరణమే అహంకారమనియు, కర్తయనియు, భోక్తయనియు, తెలియబడుచున్నది. అనగా కర్తృత్వ భోక్తృత్వాభిమానము కలదిగా అగుచున్నది. ఆ విధముగా ప్రకృతి సంబంధములైన సత్వ రజస్తమోగుణములతో కూడి అవ స్థాత్రయమును అనగా జాగ్రద్ స్వప్న, సుషుప్తియను అవస్థలను పొందుచున్నది. కర్తృత్వ భోక్తృత్వాదులవలె సుఖదుఃఖములు గూడ అంతఃకరణ ధర్మములే గాని ఆత్మ ధర్మములుగావు. ఆత్మ అసంగుడు అగుటచే శరీరముచేగాని, వాక్కుచే గాని, మనస్సుచేగాని, మరియే యితరములగు ఉపాధులచేగాని చేయబడు సద సత్కర్మలచే ఏ మాత్రము లిప్తుడుకాడు. అనగా ఆయనకు ఈ కర్మాదులతో ఎటు వంటి సంబంధము వుండదు. "విషయాణామాను కూల్యే సుఖీదుఖీ విపర్యయే సుఖందుఃఖంచ తద్ధర్మః సదానన్దస్స నాత్మనః'' అనగా సుఖదుఃఖములు రెండును అంతఃకరణముయొక్క ఇచ్ఛను అనుసరించి వుండుటవలన అవి "ఆనందోబ్రహ్మ'' "విజ్ఞానమానందంబ్రహ్మ'' మొదలగు శ్రుతులచే చెప్పబడిన, ఎల్లప్పుడును ఆనంద స్వరూపుడగు ఆత్మయొక్క ధర్మముకాదు. బాగుగా పరిశీలించి చూచిన ఇదియథార్థమే. ఒక సమయమున సుఖముకలిగించిన శబ్దమే మరియొక సమయమున

దుఃఖజనకమగుట, లోకప్రసిద్ధము. అందులకు కారణము మనోభేదముతప్ప మరి యొకటి ఏదియుకానరాదు. కావున సుఖదుఃఖములు రెండును మనోధర్మములే.

పురుషునకు అజ్ఞానము కలిగించి తద్వారా సంసారమును కలిగించునవి రాగద్వేషాదులే. అజ్ఞానముయొక్క మొదటి వికారమైన అహంకారము, అట్టి జ్ఞానప్రతి బంధకములగు రాగద్వేషాదులకు మూలాకారణము అగుచున్నది. సకల బంధములకు హేతువు అగుటచే అహంకారముతో ఎంతకాలము పురుషునకు సంబంధము వుండునో అంతవరకును బంధములను తొలగించు నిరతిశయసుఖస్వరూపమగు ముక్తి కలుగనేరదు. అహంకారము తొలగిన ముక్తికలుగును. "అహంకారగ్రహాన్ముక్తః స్వరూపముపపద్యతే, చంద్రవద్విమలం పూర్ణః సదానన్దః స్వయంప్రభః" అనగా స్వస్వరూపమును కప్పివేసెడి అహంకారమనెడు రాహువు నుండి ముక్తుడైనవాడు చంద్రునివలె స్వస్వరూప సాక్షాత్కారమును పొందును. అనగా జీవభావమును వదలి తనను ప్రత్యగాత్మగా తెలుసుకొనును యధార్థమున స్వస్వరూపము విమలము, అపరిచ్ఛిన్నము, నిత్యసుఖరూపము, చిద్రూపమగుటచే స్వయం ప్రకాశము" ముక్తియనగా స్వస్వరూపప్రాప్తియేగాన అహంకారము తొలగిన తోడనే సహజమైన ముక్తి సిద్ధించును. విచారించిచూచిన అహంకారము కల్పితమైన అనాత్మ పదార్థమే. బ్రహ్మపదార్థము సత్వరజస్తమోగుణరూపమైన అహంకారము చేత కప్పబడియున్నది. అందుచే ఆ బ్రహ్మముయొక్క అనగా స్వస్వరూపముయొక్క సాక్షాత్కారము కలుగుటలేదు. శాస్త్ర జ్ఞానము, గురూపదేశము, నిదిధ్యాసములచే సత్వరజస్తమో రూపమగు ఆ అజ్ఞాన జనిత అహంకారమును తొలగించినచో పురుషునకు స్వస్వరూప సాక్షాత్కారము కలుగును. ఈ విధముగా అహంకారమును సమ్యగ్వివేకము వలన కలిగిన విజ్ఞానముచే నశింపజేసి స్వస్వరూపమును పొందవలయును. అనాత్మరూపమగు ఆ అహంకారమును వాసనారూపమునగూడ మిగుల నీయరాదు. అదెట్లన- "అహమో అత్యన్తనివృత్త్యా తత్కృతనానా వికల్ప సంహృత్యా ప్రత్యక్తత్వ వివేకాదయ మహమస్మీతి విన్దతే తత్వమ్" అనగా మరల జనించని విధముగ ఎప్పుడు అహంకారము సమూలముగ నశించునో అప్పుడు దాని వలన కలిగిన కార్యముగూడ తొలగిపోవును. అనగా ప్రధమ వికా

రమై అహంకారము వలన జనించిన నానావిధములగు కులగోత్రనామ రూప ఆశ్రమాదులకు సంబంధించినవియు, వివిధ కల్పనా రూపములును అగు అభిమానము యొక్క నాశముచే సర్వవిధములైన భ్రాంతులు తొలగి పోవును. అనాత్మపదార్థముల నుండి వివేక బలంతో వేరుచేయబడిన ఆత్మయొక్క యథార్థరూపమును గుర్తించి నందువలన ఆ "ఆత్మయే నేను" అని తత్వమును పొంద వచ్చును.

అన్నింటికంటెను ఆంతరముగవున్నట్టియు, జ్ఞానమేరూపముగా గలవాడును, ఆనందమూర్తియు అగు నీకు దేనియందు "నేను" అనెడుతాదాత్మ్యాధ్యాసముచే జననము, మరణము, వార్ధక్యము దుఃఖములు అనునవి అధికముగా గల ఈ సంసారము కలుగుచున్నదో, కలిగినట్లుగా తోచుచున్నదో, అట్టి ఈ సూక్ష్మభూతములవలన జనించినదియు, ఆత్మయొక్క ప్రతి బింబమును ముందుగా గ్రహించునదియు, తన యొక్క సహజమగుస్థితిని అనగా చిదానందరూపత్వమును ప్రత్యక్షముకాకుండ అడ్డుపడుచున్న అనగా ప్రత్యగ్రూపమగు ఆత్మను పరాగ్రూపమైన దానివలె చేసి స్వ స్వరూపమును గుర్తించనివ్వకుండా చేయుచున్న అనాత్మపదార్థమగు అహంకారము నందు "నేను" అనెడు బుద్ధిని శీఘ్రముగవిడువవలయును. ఇదియే పరమోపదేశము. ఈ విధముగా స్వరూపానందానుభవమునకు ప్రతి బంధకముగా నున్న ఆత్మశత్రువు వంటిదైన ఈ అహంకారము సంసారములేని వారికి గూడ సంసారమును కల్పించుచున్నదగుటవలన పంచకోశ వివేముచే కలిగిన విజ్ఞాన బలముతో నశింపజేయవలయును, అప్పుడే ఆస్వస్వరూపానందరూపమైన బ్రహ్మానందము కలుగును. ఈ విధముగా అనాత్మపదార్థమగు అహంకారము తొలగిపోయిన పిమ్మట అనగా అనాత్మపదార్థమగు అహంకారాదుల యందలి "నేను" అనుభ్రాంతి నశించిన పిమ్మట అహంకారాదులనుండి మనస్సును వెనుకకు మరల్చి నిత్య స్వప్రకాశానందరూపమగు బ్రహ్మానందమును పొందగోరినవాడై బాహ్యావిషయాభిలాషను విడిచి ఆత్మానందానుభవముతో పూర్ణ స్వరూపముతో బ్రహ్మరూపుడై నిలిచియుండును.

## ఆత్మ స్వరూపము :—

తెలియబడునదంతయు అనాత్మపదార్థమే. సర్వమును ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడే ఆత్మపదార్థము. తెలియబడువానికంతటికి అతడే సాక్షిగా వుండును. సుషుప్తి యందు "సర్వాభావము తప్పనాకేమియు కనబడుటలేదు" అను అనుభవము సర్వానుభవమైయున్నది. ఆ సర్వాభావమును తెలుసుకొనువాడే ఆత్మ. ఆ సర్వాభావమును సుషుప్తియందు తెలుసుకొన్నవాడవు నీవేగాన ఆ సర్వభావమునకు నీవే

సాక్షివి, కావున అసర్వాభావమునకు సాక్షియైన నీవే ఆ ఆత్మవు అని భావము. అట్లేల యన స్వకీయానుభవముగోచరముకాని విషయమున ఏ పురుషునకును సాక్షిత్వము కుదరదు, కర్తృత్వము లేకుండ కేవలము తెలుసుకొనువాడు మాత్రమే సాక్షియని ప్రమాణసిద్ధము. "అసౌ స్వసాక్షికోఽ భావోయతః స్వేనామ భూయతే అతఃపరం స్వయం సాక్షాత్ప్రత్యగాత్మా" అనగా సుషుప్తియందు అహంమాదిసర్వ వికారముల అభావము తనయందే అనుభవించబడుచున్నందున ఆ అభావానుభూతికి తానేసాక్షి. ఐదుకోశములను నిషేధించిన పిమ్మటగూడ శేషించిన తనచే "సర్వాభావము తప్ప మరేమియు కనబడుటలేదు." అను అనుభవమే ఇందులకు ప్రమాణము, అనగా సర్వాభావమును చూచువాడు అనగా తెలిసికొనువాడు నిర్వికారుడై నిశ్చలుడైయు న్నాడు. కావున అభావము దర్శన విషయమనియు అనగా దృశ్యముగా వున్నద నియు ఆ అభావమును తెలిసికొను నీవుద్రష్టవుగా అగుచున్నావు. అందువలన"యద్సా క్షాదపరోక్షాద్బ్రహ్మ" అను శ్రుతిననుసరించి నిత్యాపరోక్షమైన ఆ బ్రహ్మవునీవే.

సర్వాంతరముగ అనగా అన్నింటికంటెలోపలనున్నదిగ ఎల్లప్పుడును"నేను" "నేను" అని ఒకే విధముగా ప్రత్యగ్రూపముగా లోపల స్వయముగా ప్రకాశించుచూ అహంకారము మొదలు దేహాంతములగు కోశములను అనేక విధములగు ఆకార ములను అనగా జన్మ–స్థితి-పరిణామ-వృద్ధి క్షయ-నాశములగు అనేక వికారములను పొందుచుండెడు. అంతః కరణ మనబడుచున్న అహంకారము గూడ దేహాద్యాకార మున పరిణమించుచున్నదిగాన అది నానాకారమని చెప్పబడుచున్నది. ఈ దృశ్య పదార్థములను విషయములుగా చేసుకొనుచూ సకలప్రాణులకు స్వభావ సిద్ధమగు జాగ్రద్ స్వప్నసుషుప్తువులనబడు మూడు అవస్థలయందును స్పష్టముగా ఏ ఆత్మ అన్యాపేక్షరహితమై అనగా స్వప్రకాశరూపమై భాసించుచున్నాడో స్వయం ప్రకాశ మగు నిత్యానంద, రూపముతో అంతఃకరణమునందు స్ఫురించుచున్నదో అట్టి దీనిని వివేకరహితులకు దూరముగనున్నను వివేకవంతులకు ప్రత్యగ్రూపమున వున్న ఆత్మనుగా తెలియవలెను. స్వస్వరూపమును అనగా ఆత్మపదార్థము ఇంత ప్రత్య క్షముగా తెలియబడుచున్నను అజ్ఞానియగు పురుషుడు ఘటములోనున్న వుదకము నందు ప్రతిబింబించి స్పష్టముగా కనబడుచున్న సూర్యబింబమును అనగా సూర్యుని యొక్క ప్రతిబింబమును చూచి దానినే సూర్యునిగా తలంచునో సూర్యుడు లేడు, ఇది ఆ సూర్యుని ప్రతిబింబము మాత్రమే అని అతనికి తెలియదోఅట్లే అంతఃకణము నందు భాసించుచున్న చిత్ప్రతిబింబమును అవివేకముచే "నేనే" అని అభిమానించు చున్నాడు, భ్రాంతిజెందుచున్నాడు అనగా విపరీతజ్ఞానము కలవాడుగా అగుచు న్నాడు.

యథార్థముగా వివేకముగల బుద్ధిచే అనగా ఆత్మానాత్మ వివేకముగల బుద్ధిచే విచారించి చూచిన "ఘటంజలం తద్గత మర్క–బింబం విహాయసర్వం, దివి వీక్ష్యత అర్కః, తటస్థిత స్త్రితయావ భాసకః స్వయంప్రకాశో విదుషోయధాతథా" అనగా ఘటమునందున్న జలమును, ఘటములోని జలమునందు తోచుచున్న సూర్యబింబ మును, వీటినన్నింటిని విడిచి ఉదాసీనుడును, అనగా ఈ మూడింటికంటె వేరుగ నున్నవాడును, ఆ మూడింటికి కారణము అగువాడును, అనగా ఘటము, అందలి జలము, ఆ జలమునందలి సూర్యబింబము అను మూడింటిని ప్రకాశింపజేయువాడును. తనకంటె వేరైన దేనిచేతను భాసింపబడక తానుగానే భాసించువాడును, అగు సూర్యుడు ఏ విధముగా అంతరిక్షమునందు బుద్ధిమంతుడగు పురుషునిచే చూడబడు చున్నాడో అట్లే– "దేహంధియం చిత్ప్రతి బింబమేతం విసృజ్య బుద్దేనిహితం గుహాయమ్, ద్రష్టారమాత్మాన మఖండబోధం, సర్వప్రకాశం సదసద్విలక్షణం" నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ మ_స్తర్బహిః శూన్య మనన్యమాత్మనః విజ్ఞాయ సమ్యగ్నిజరూపమేతత్ పుమాన్వి పాప్మావిరజా విమృత్యుః॥ అనగా దేహమును, బుద్ధిని, గుహతో సమానమైన బుద్ధియందు వుంచబడిన ఈ చిత్తుయొక్క ప్రతిబింబ మును విడిచి, ద్రష్టయు, అపరిచ్ఛిన్న జ్ఞానస్వరూపమును, అన్నింటిని ప్రకాశింప జేయునదియు, సదసద్విలక్షణమును, అనగా సత్తుకంటెను అసత్తుకంటెను వేరుగా వున్నదనియు, నిత్యమైనదనియు, సర్వవ్యాప్తమును,అన్నింటియందునువున్నదియు, బాగుగా సూక్ష్మమైనదియు, లోపల బైట అను భేదములేనిదియు, బ్రహ్మకంటె భిన్నము కానిదియు అగు ఈ స్వస్వరూపమును గుర్తించి ఏ పురుషుడు జన్మ, మర ణాది బంధములనుండి తొలగి అమృతుడై యుండునో ఆతడే "విశోక ఆనన్దఘనో విపశ్చ త్స్వయంకుతశ్చన్న బిభేతి కశ్చిత్, నానో2స్తిపన్థా భవబన్ధము_క్తేర్వినా స్వతత్వావగమంముముక్షు॥ అనగా దుఃఖములేనిది. అందుచేతనే ఆనందమే మూర్తిగా గలది అనగా దుఃఖమిశ్రమము కాని ఆనంద స్వరూపము. సర్వాత్మభూత మగు బ్రహ్మమును, తెలిసికొనిన వాడగుటచే సర్వజ్ఞుము, తాను ఎవరి వలనను భయమును పొందడు. అట్లేలయన రెండవవారు ఎవరును లేకపోవుటచే భయప్రసక్తి లేదు. ఈ కారణమువలన నిత్యము, నిరతిశయము, నిరామయము, స్వయంప్రకాశ మును అగు సుఖరూపమైన మోక్షమును పొందవలయునని ధృఢమైన కోరిక గల వానికి తనయొక్క యథార్థ స్వరూపమును తెలుసుకొనుట తప్ప సంసారబంధ విము క్తికి మరియొక మార్గము ఏదియునులేదు. "బ్రహ్మ భిన్నత్వ విజ్ఞానం భవ బంధస్య కారణమ్, యేనాద్వితీయ మానన్దం బ్రహ్మ సమ్పద్యతే బుధః" అనగా "అహంబ్రహ్మాస్మి" నేనే బ్రహ్మమును అను అపరోక్ష జ్ఞానము సంసార విము క్తికి ఏకమాత్ర కారణము అగుచున్నది. ఏ విజ్ఞానముచే పురుషుడు–జ్ఞాని–భేద

రహితమును, ఆనందరూపమును అగు బ్రహ్మను పొందునో లేక ఆ బ్రహ్మగానే అగునో, అట్లేలయన–"బ్రహ్మవిదాప్నోతిపరమ్"

అనగా బ్రహ్మవేత్త బ్రహ్మమును పొందును. "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అనగా బ్రహ్మవేత్త బ్రహ్మమే యగును. అను శ్రుతివాక్యములను అనుసరించి "అసతోమా సద్గమయ, మృత్యోర్మా అమృతంగమయ" అనగా నన్ను అసత్తు నుండి సత్తునకు చేర్చుము. అసత్తు అనగా మృత్యువు. సత్ అనగా అమృతము, అనగా మోక్షము. కావున నన్ను మృత్యువునుండి అమృతమునకు చేర్చుము. నన్ను మరణ రహితుని చేయుము. అని శ్రుతి ననుసరించి బ్రహ్మభావమును కలిగియుం డుటయే మోక్షము. ఈ విధముగా బ్రహ్మభావముతోనున్న వానికి మరల సంసా రము కలుగదు. బ్రహ్మగా అయిన పురుషుడు, అనగా జ్ఞాని మరల సంసారము కొఱకు తిరిగిరాడు అని శ్రుతి చెప్పుచున్నది. ఆ కారణమువలన బ్రహ్మాత్మైక్య జ్ఞానమే మోక్షమును కలిగించును. కావున దానినే తెలియవలెను. ప్రపంచము వుండియు లేనిదే అనగా మిధ్యాభూతము. బ్రహ్మము నిష్ప్రపంచము. అనగా బ్రహ్మమునకు ప్రపంచములేదు. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ విశుద్ధం, పరం, స్వతః సిద్ధం, నిత్యానందైకరసం ప్రత్యగ్ భిన్నం నిరన్తరం జయతి, అనగా కాలత్రయమునందును నశించనిదియు, జ్ఞానమే స్వరూపముగా గలదియు, అనగా స్వయంప్రకాశమును, అంతటను వ్యాపించియున్నది అగుటచే దేశతః పరిచ్ఛేదము లేనిదియు, నిత్యమగుటచే కాలతః పరిచ్ఛేదము లేనిదియు. అద్వితీయమగుటచే వస్తుతః పరిచ్ఛేదము లేనిదియు, స్వాభావికములుగాని, ఆగంతు కములుగాని, అగు సకలవిధ మాలిన్యములు లేనిదియు, మాయాతీతమును, స్వతః సిద్ధమును అనగా ఉనికి విషయమునగాని, ప్రకాశించు విషయమునగాని మరియొక దానిపై ఆధారపడనిదియు, దుఃఖ స్పర్శలేని నిత్యానంద స్వరూపమును, జీవునికంటె వేరుకానిదియు, ఎటువంటి భేదములు లేనిదియు, అనగా అఖండ స్వరూపము గల దియును అగు బ్రహ్మము సర్వోత్కర్షతో వెలుంగుచున్నది. అదియే నీవు.

ఏపరమాత్మ స్వరూపమును సాక్షాత్కరింప జేసుకొని జ్ఞానియగు పురుషుడు అహంకారాది అనాత్మబంధములనుండి విడువబడినవాడై అనగా అనాత్మలగు దేహా దులతో తాదాత్మ్యాధ్యాసమును విడిచినవాడై సర్వోపాధి వినిర్ముక్తుడగుటచే, కేవల సాక్షిరూపత్వమును, భేదరహితమగు సచ్చిదానంద స్వరూపమును, పరమాత్మను గురించిన సత్యమును తెలిసికొనునో అతడే ముక్తుడగును. ఆత్మ స్వరూపము-పరా పేక్షలేనివాడై, అహం అను వృత్తికి ఆశ్రయభూతుడును. అనగా "అహం" అను ఆకారముగల మనోవృత్తిచే తాదాత్మ్యమును పొందుటచే అహం వృత్తికి ఆశ్రయ

భూతుడును, అనగా "నేను, నేను" అను స్వస్వరూపమును గుర్తించినవాడు, జాగ్రత్ స్వప్నసుషుప్తులనెడు అవస్థాత్రయమునకు సాక్షిద్రష్టయై, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములకంటె వేఱుగ నున్నవాడును, ఎల్లప్పుడును ఒకడువున్నాడు అనగా అతని వునికికి ఎప్పుడును లోపములేదు. అనగా ఇప్పుడు వున్నాడు. అప్పుడులేడు అనుభేదములేక, ఇక్కడ వున్నాడు, అక్కడలేడు అనుమాటలేక, సర్వకాలములందును, సర్వావస్థలయందును, సర్వదేశములందును, ఏప్పుడూ ఎటువంటి మార్పులూలేక స్వప్రకాశుడై యున్నాడో అతడే ఆత్మ. ఈ ఆత్మకాలత్రయాబాధ్య సద్రూపమని చెప్పబడినది.

"యోవిజానాతి సకలం జాగ్రత్ స్వప్నసుషుప్తిషు, బుద్ధి తద్వృత్తి సద్భావ మభావ మహమిత్యయమ్" అనగా ఎవడు "నేను నేను" అని జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలయందు బుద్ధియొక్కయు దానికి సంబంధించిన వృత్తులయొక్కయు ఉనికిని, సుషుప్తి అనంతరముకలుగు "నాకేమియు తెలియలేదు" అను శ్రుతిననుస రించి సుషుప్తి అవస్థయందు బుద్ధియొక్కయు దాని వృత్తులయొక్కయు అభావ మును. "నేను దీనిని తెలుసుకొనుచున్నాను" "దీనిని తెలిసికొంటిని, దీనిని తెలిసి కొనగలను" అను అనుభవమువలన సకలములగు జాగ్రదవస్థలోని పదార్థములను, స్వప్నగత పదార్థములను, సుషుప్తియందలి అజ్ఞానమును తెలిసికొనుచున్నాడో అతడే ఆత్మ.

అన్నింటిని చూచునది అగుటచేతను. అనగా అన్నింటిని తానే తెలుసుకొను నది అగుటచేతను, దానిని చూచువాడు అనగా తెలుసుకొనునది మరియొకటి లేక పోవుటచేతను, ఆత్మ జ్ఞానమే స్వరూపముగా గలదియని తెలియబడుచున్నది."యః పశ్యతి స్వయంసర్వం, యఃనపశ్యతికించన. యశ్చేతయతి బుద్ధ్యాది నతత్ యంచేత యత్యయమ్" అనగా ఈ ఆత్మకంటె భిన్నమగు చూచునది మరియొకటి యేదియులేదు. "నాన్యతో అస్తిద్రష్టా" అనుశ్రుతి ననుసరించి ఏది సర్వమును చూచుచున్నదో, దీనిని మరెవ్వరునూ చూడజాలరో" నతత్ర చక్షుర్గచ్ఛతి, నవా గ్గచ్ఛతినోమనః "అనగా అచటకునేత్రము వాక్కు, మనస్సు వెళ్ళజాలవు. "నచ క్షుషాగ్రహ్యతే, నాపివాచ, నాన్యైర్దేవైః" అనగా నేత్రముచేతగాని, వాక్కుచేతగాని, ఇతరములగు ఇంద్రియములచేతగాని గ్రహింపబడడు."నైవవాచా నమనసాప్రాప్తుం శక్యోనచక్షుషా" వాక్కుచేగాని, మనస్సుచేగాని, నేత్రముచేగాని దానిని పొందుటకు శక్యముగాదు. అని శ్రుతిచెప్పుచున్నది. ఏదిబుద్ధ్యాది జడపదార్థమును తన ప్రతి బింబముచే చేతనముకలదానినిగా చేయుచున్నదో, ఆబుద్ధ్యాదికము స్వతః చేతన స్వభావమగు దేనిని చేతనవంతము చేయజాలదో, అనగా జడ వస్తువు తన కార్యము చేయవలెనన్నచో దానికి చేతనాపేక్ష యుండును. కాని స్వతఃచేతనమైన

దానికి పరాపేక్షయుండదు. కావున అట్టి పరాపేక్షలేక, స్వతఃచైతన్యవంతమై ఇతరములగు నన్నింటిని చైతన్య వంతము చేయుచున్నది ఆత్మపదార్థమేయని గ్రహించవలెను. ఆ విధముగా సర్వమునకును ఉపాదాన కారణమగు అనగా సర్వమును ప్రకాశింపజేయుచున్నదో, అనగా సర్వాంతరమగు దేనిచే ఈ జగత్తు అంతయు ప్రకాశింపబడుచున్నదో, ఏ వస్తువుగూడఏపదార్థమును వ్యాపింపజాలదో, అదియే ఆత్మ. ఈ ఆత్మ ఈభూమికంటెను, అంతరిక్షముకంటెను అన్నిలోకములుకంటెను. పెద్దది అని గూడ శ్రుతులుచెప్పుచున్నవి. అందువలననేమహాకవిపోతనగారుగూడ "ఇందుగలడంతు లేడనుసందేహమువలదు బ్రహ్మసర్వోపగతంబు." అనిచెప్పియున్నారు. "అభారూపం తమేవభా న్తమనుభాతిసర్వం" అనగా అప్రకాశరూపమైన, జడమైన సర్వము ప్రకాశించుచున్న ఈ ఆత్మను అనుసరించియే ప్రకాశించుచున్నది. అట్టి శ్రుతి ననుసరించి ఇది అంతయు చిద్రూపమై ప్రకాశించుచున్న దేనిని అనుసరించి భాసించుచున్నదో అదియే ఆత్మయని గుర్తించవలెను. ఏ పరమ చైతన్యము యొక్క ప్రకాశము ప్రతిబింబించుటచే సర్వము చైతన్యవంతమై ప్రకాశించుచున్నదో ఆ పరమ చైతన్యమే ఆత్మ. "యస్సన్నిధి మాత్రేణ దేహేంద్రియమనోధియః విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ" అనగా దేనియొక్క సామీప్యము చేతనే దేహము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగు సర్వజడ పదార్థములు చైతన్యవంతములై తమ తమ విషయములయందు ప్రవర్తించుచున్నవో ఆ చైతన్య మూర్తియైన పరమార్థమేఆత్మ. అట్లే - "అహంకారాది దేహా న్తా విషయాశ్చ సుఖాదయః, వేద్యన్తే ఘటవద్యేన నిత్యబోధ స్వరూపిణా" అనగా నిత్యజ్ఞాన స్వరూపియగు పరమార్థ తత్వముచే అహంకారము మొదలు దేహము వరకును గల పంచకోశములును, శబ్దాదివిషయములును సుఖాదులును, దృశ్యములై తెలియబడుచున్నవో ఆ జ్ఞానస్వరూపమగు పరమార్థమే ఆత్మ. ఈ పరమాత్మనిత్యుడు. జన్మించువాడుకాదు, మరణించువాడు కాదు వృద్ధినిపొందడు. అట్లే క్షీణించడు. అనగా వృద్ధి క్షయములు లేనివాడు. అనగా ఎట్టి వికారములు లేనివాడు. ఈ ప్రపంచము ఎన్నిసార్లు నశించినను, కుంభము నశించినను, నశించని ఆకాశమువలె, ఆత్మ నశించువాడుకాదు. ఈ విధముగా ఆత్మ యందు స్వతఃగాని, పరతఃగాని వికారములేదు. ప్రకృతి వికృతులకంటె భిన్నుడు. శుద్ధ జ్ఞాన స్వరూపుడు. తనమాయచే సమస్త ప్రపంచమును తోపింపజేయుచున్న వాడు, ధర్మరహితుడు పరమాత్మ. జాగ్రదాది మూడు అవస్థలయందును బుద్ధికి సాక్షిగావుండి "నేను,నేను" అని అన్నిప్రాణుల యందును ప్రకాశించుచున్నవాడే ఆత్మ.

# జ్ఞానోపలబ్ధికి సాధనములు

తత్వజ్ఞానము అనగా నిత్యానిత్యవస్తువివేకము సామాన్యముగా కలుగునది కాదు. ఎన్నియో జన్మల సంస్కారబలముచే మాత్రమే అట్టి జ్ఞానము కలుగును. అట్టి సంస్కారమును సంపాదించుటయే పురుషార్థము. కావున వివేకవంతుడగు ప్రతి పురుషుడు అట్టి పురుషార్థమును కలిగియుండుటకుగాను ముఖ్యసాధనము అగు తత్వ జ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నించవలయును. అట్టి తత్వజ్ఞానము; "పఠన్తుశాస్త్రాణి, యజన్తుదేవాన్, కుర్వన్తుకర్మాణి, భజన్తుదేవతాః, ఆత్మైక్య బోధేనవినా విముక్తిః నసిధ్యతి బ్రహ్మశతాంతరేఽపి" అనగా ఎన్నిశాస్త్రములు పఠించినను, ఎన్నియజ్ఞములచే ఇంద్రాదిదేవతలను సేవించినను, ఎన్నికర్మలుచేసి నను, ఎంతమంది దేవతలను ఎన్నివిధములుగా భజించినను, ఉపాసించినను, వారికి నానావిధములగు పూజలు సల్పినను, ఆత్మైక్యజ్ఞానము లేకుండగ ఎవ్వరికిని, ఎన్ని జన్మములు పొందినను మోక్షము కలుగనేరదు. ఏలయన—ధనబలముచే చేయబడు యజ్ఞాదులవలన మోక్షము లభించబోదు. అట్లే కర్మలుగూడ మోక్షహేతువులు కానేరవు. కారణమేమన అజ్ఞానముచేత అనగా తనయొక్క స్వస్వరూపమును గుర్తించి తదనుగుణముగా వ్యవహరింపక అధ్యాసచే, అనాత్మలగు దేహాదులయందు ఆత్మభావము కలిగియుండుటచే, సుఖదుఃఖములు, జన్మమరణాదులు కలుగుచున్నవి. ఆత్మజ్ఞానము కలిగినప్పుడు మాత్రమే జీవుడు అనగా ఆత్మచైతన్యముతో చైతన్య వంతమైన అంతఃకరణము-ఈ అనిత్యములు, మరియు దుఃఖహేతువులును అగు దేహాదులయందు ఆత్మభావమునువిడిచి తనయొక్క స్వస్వరూపమును అనగా ఆత్మ భావమును పొందినప్పుడే అతనికి మోక్షముకలుగును. ఈ కారణమువలన మోక్షార్థి యగు విద్వాంసుడు-"అతోవిముక్త్యై ప్రయతేతవిద్వాన్ సంన్యస్త బాహ్యార్థసుఖ స్పృహాఃస్య, సన్తం మహాన్తం సముపేత్యదేశికం తేనోపదిష్టార్థ సమాహితాత్మా" అనగా అనిత్యములగు బాహ్యార్థవిషయములవలన కలుగు సుఖదుఃఖములయందు ఆశను విడనాడి సత్యరూపుడును అనగా పరమార్థమును స్పష్టముగా తెలిసికొనినట్టి

వంటి మహాపురుషుడగు గురువును సమీపించి, వారిని తగురీతిని సేవించి, వారిచే ఉపదేశింపబడిన ఆత్మ స్వరూపవిషయమునందు నిలిచిన బుద్ధికలవాడై శాశ్వతమగు మోక్షసుఖమును పొందుటకై ప్రయత్నింపవలయును. ఏలయన-"జన్తూనాం నరజన్మ దుర్లభం" అనగా శరీరధారులయందు మానవశరీరము సామాన్యముగ లభించునది కాదు. ఎన్నోజన్మములయందు చేసిన పుణ్యముల ఫలముగ ఈ మానవదేహము లభించునని శ్రుతులు చెప్పుచున్నవి. ఒకవ్యక్తి శుభాశుభములగు కర్మలను ఆచరించి నందువలన ఆ కర్మల ఫలితముగ ఒకవిశిష్టమైన శరీరము లభించును. "శుభైరా ప్నోతి దేవత్వం నిషిద్ధైర్నారకీం తనుమ్ ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతే వశః" అనగా జీవుడు శుభకర్మలు చేసినవాడగుటచే దేవతల దేహమును, అశుభకర్మలు చేసినందున జంతు శరీరమును, పుణ్యపాపకర్మలు రెండూ సమముగా చేసిన మనుష్య శరీరమును పొందును. దీనిని తప్పించుకొనజాలడు. అని పైశ్లోకము వలన తెలియుచున్నది. కావున మనుష్యజన్మ అందులో పురుషజన్మాధిక్యము ఎన్నో జన్మములలో చేసినటువంటి పుణ్యకర్మల ఫలముగా చెప్పబడుచున్నది. అందుచే ఈ పురుషదేహమును పొందిన మానవుడు స్వలాభప్రాప్తివిషయమున ఎంతో మెల కువతో అనగా అప్రమత్తుడుగా వుండవలయును. అనగా ఈ పురుషదేహమును పొంది తన జీవితమును సార్థకముచేసుకొనవలయును. అనగా శాశ్వత ఆనంద దాయకమగు ఆత్మైక్య జ్ఞానమును సంపాదించుకొని జన్మమరణరాహిత్యమును పొందవలయును. అదియే పురుషార్థము. ఈ కారణమువలననే "అమృతత్వస్య నాశాస్తివిత్తేన" అని శ్రుతిచెప్పుచున్నది. అనగా ధనసాధ్యమగు కర్మలు సాక్షా న్మోక్షసాధనములు కాజాలవని చెప్పుచున్నది. అందుచే విద్వాంసుడగు పురుషుడు పురుషార్థమును అనగా పురుషజన్మ ఫలములను అనగా సదానంద దాయకమైన మోక్షమును పొందుటకొఱకై ప్రయత్నించవలయును.

మోక్షప్రాప్తివలన లాభమేమియను శంకసామాన్యులకు కలుగుట సహజము. అందుచేతనే విద్వాంసుడగు పురుషుడు మాత్రమే ఈ మోక్షమును పొందుటకు ప్రయత్నించవలయును, ప్రయత్నించగలడు అని శ్రీమద్భగవద్గీత చెప్పుచున్నది: "యేహి సంస్పర్శజా భోగాదుఃఖయోనయ ఏవతే, ఆ ద్యన్తవన్తః కౌన్తేయ నతేషు

తమతే బుధః" అనగా ఇంద్రియ విషయ సంయోగము వలన కలిగిన భోగములు అనగా సుఖములు దుఃఖములకే కారణములగును ఏలయన ఈ భోగములకు ఆది అంతములున్నవి. అనగా విషయముల సంబంధముచే కలుగు సుఖాదికము స్థిరముగ వుండునది కాదు. విషయములు క్షణికములు గాన వాటివలన లభించు సుఖదుఃఖములుగూడ క్షణికములే అగుచున్నవి. అందుచేత విద్వాంసుడగు పురుషుడు అట్టి ఆది అంతములు కలిగినటువంటి క్షణికమైన సుఖములను పొందుటకు ప్రయత్నింపక శాశ్వతమైన ఆనందమును మాత్రమే పొందుటకు ప్రయత్నించును అని చెప్పబడినది. అట్టి స్థితియందు విద్వాంసుడగు పురుషుడు ఎట్టి ప్రయత్నము చేయవలసి యుండును? అను ప్రశ్న కలుగుచున్నది. అందుకే పై శ్లోకమునందు "సంన్యస్త బాహ్యార్థ సుఖ స్పృహాఃసన్" అని చెప్పబడినది అనగా బాహ్యములగు పదార్థముల వలన ప్రాప్తించు సుఖమునందు ఆసక్తి లేనివాడుగా వుండవలెను. అట్లు చెప్పుటచే ఐహిక ఆముష్మిక ఫలభోగ విరాగము అనగా ఈ లోకమునందును, స్వర్గాదులగు పరలోకమునందును లభించునటువంటి కర్మఫలములగు అనగా విషయ సుఖములను అనుభవించు కోరికలను విడనాడవలయును. అనగా అట్టి విషయ సుఖములయందు వైరాగ్యభావము కలిగి యుండవలయును. మరి అట్టి వైరాగ్యభావము ఎట్లు ఉదయించును? అన్నచో-"ఆచార్యవాన్ పురుషోవేద ఆచార్యద్ధైవ విద్యావిదితా సాధిష్టంప్రాపత్" అనగా ఆచార్యుడు గల పురుషుడే అనగా సత్‌గురువును కలిగియున్న పురుషుడే ఆ వైరాగ్య భావమును ఎట్లు పొందవలయునో తెలిసికొనును అని శ్రుతిచే చెప్పబడినది. అతీంద్రియమగు అనగా ఇంద్రియములద్వారా పొందుటకు సాధ్యము కానటువంటి ఆత్మైకత్వజ్ఞానమును పొందవలెనన్నచో గురువుగారి సహాయము లేకుండ సాధ్యముకాదు. అందుచే అట్టి వైరాగ్యమును, తద్వారా ఆత్మైకత్వ జ్ఞానమును పొందవలెనన్నచో ఒక మహాపురుషుని ఆశ్రయింపవలయును. అట్టి మహాపురుషుడు ఎట్లుండును? అన్నచో- "అస్తిబ్రహ్మేతిచేద్వేద సన్తమేవంతతోవిదుః" అనగా బ్రహ్మ వున్నది అని ఎవ్వడు బాగుగా తెలుసుకొని వున్నాడో అతడే ఆ మహా పురుషుడు. అంతేకాదు ఆ బ్రహ్మము ఏ రూపమున వున్నదో, తానుగా తెలుసుకొని ముముక్షువులకు బోధించు

వాడు మహాపురుషుడు. ఆయన ఏమి చెప్పుననన్నచో "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" అనగా ఇది అంతయు ప్రారంభమున సద్రూపముననే వుండెను. అనగా బ్రహ్మరూపముననే వుండెను. "యోవై భూమా తదమృతమ్ అతోఽన్యదార్తమ్" అనగా ఏది అతి విస్తృతమైనదో, దేనికంటె పెద్దది అనగా వ్యాపకమైనది మరియొకటి లేదో, సంకోచ రహితమైనదో, నాశరహితమైనదో, అట్లే "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" బ్రహ్మ సత్యరూపమైనది. జ్ఞానరూపమైనది. అనంతమైనది అనగా ఆది అంతములు లేనిది. అను మొదలగు శ్రుతి, సత్యాది వచనములద్వారా ప్రతిపాదితమగు, కాలత్రయా బాధితమైన అనగా ఏ బ్రహ్మము భూతకాలమునందును, వర్తమాన కాలమునందును, భవిష్యత్తునందునుగూడ విడువక యుండునో, దానిని ఎరింగినవాడై "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అన్నట్లుగా ఆ మహాపురుషుడు బ్రహ్మముగానే యుండును. కావున ఆ మహాపురుషుడు అనగా ఆ బ్రహ్మజ్ఞాని అనాత్మలగు అసత్తుల విషయమున పూర్తిగా అభిమానము తొలగి పోయిన దగుచుండగా బ్రహ్మ యందు ఏకాగ్ర స్థితి కలిగి బ్రహ్మ గానే వుండును. అటువంటి అనగా ఆ విధముగా బ్రహ్మ నిష్ట కలిగి బ్రహ్మరూపముననేయున్న గురువు వద్దకు ఆత్మ జ్ఞానోపలబ్ధిని పొందుటకై సాధకుడు వెళ్ళవలయును. అప్పుడు ఆ బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడైన గురువు యొక్క అమృత వాక్కుల ద్వారా ఆత్మ తత్వమును అనగా బ్రహ్మ తత్వమును తెలియవలయును. ఆత్మ జీవుని కంటె భిన్నముగ లేదనియు, ఆత్మ పదార్థము ఎచ్చటను వేఱుగలేదు. అన్ని ప్రాణులయందును జీవరూపమున నిండి వున్నదనియు, ఆ బ్రహ్మతత్వము అతి సూక్ష్మమైనదనియు, అతి సూక్ష్మము అగుటచే ఊహింప శక్యముకాని దనియు, అయినను సాధకుడు నిర్మలమగు బుద్ధిద్వారా ఆ బ్రహ్మతత్వమును పొందగలడనియు, తన ఉపదేశము ద్వారా ఆ బ్రహ్మ నిష్టుడగు గురువు సాధకుని సర్వవిధ సంశయములను తొలగించి శుద్ధ ఆత్మ జ్ఞానమును కలిగించును. అట్టి గురువు సద్రూప బ్రహ్మాభిన్నుడగుటంజేసి ఆయనకు సత్యము చెప్పబడినది. అందుచేత ఆయనకు మహత్వము కూడ చెప్పబడినది. మహత్వ మనగా పంచకోశముల వివేకము కలిగి యుండుటచే అపరిచ్ఛిన్నముగ అన్నమయాది కోశములకు, పరిమితుడు కాకుండ

సదాబ్రహ్మ భావమునందు నిమగ్నుడై యుండు వాడు కావలయును. అట్టి మహనీయు డగు గురువు వద్దకు వెళ్ళగోరు ముముక్షువు అనగా పరమార్థమైన మోక్షమును పొందగోరువానికి ఎటువంటి లక్షణములు వుండవలయునో చెప్పబడినది.

అట్టి మోక్షార్థియైన సాధకునకు నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము శమదమాది సాధన సంపత్తి, ముముక్షుత్వము అను నాలుగు ముఖ్య సాధనములు అనగా సాధన చతుష్టయము వుండవలయునని శాస్త్రము చెప్పుచున్నది. "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మన, మైక్షదావృత్త చక్షురమృతత్వ మిచ్ఛన్" అనగా నూటికి కోటికి ఒక ధైర్యశాలి వుంటాడు. ఆతడే తన దృష్టిని లోపలికి గూడ మళ్ళించి చూడగలడు. అలాంటివాడే సాధకుడు. ఇట్టి సాధకుల కొఱకు కఠోపనిషత్తు అంత రంగ బహిరంగములని ఈ సాధనములను రెండు విధములుగా చెప్పుచున్నది. బహి రంగ సాధనమంటే మనస్సును, బుద్ధి తనవశమునందుంచుకొని, ఇంద్రియములను గూడ మనస్సు యొక్క అధీనమునందుంచి అనగా వాటిని విషయముల మీదికి పోని వ్వకుండా నిలిపి వుంచి, మనస్సును ఆ పరమార్థమునందే లగ్నం చేసి నిరంతరం బ్రహ్మనిష్ట కలిగి వుండటమే. అలా వున్నప్పుడు అట్టి సాధకునకు ఆనందమే లభి స్తుంది. కారణమేమన "ఇంద్రియేభ్యః పరేహ్యర్థాః అర్థేభ్యశ్చపరంమనః, మన సస్తు పరాబుద్ధి ర్బుధేరాత్మామహాన్, పరః మహతః పరమవ్యక్త—మవ్యక్తాత్ పురుషః పరః పురుషాన్న పరంకించిత్ సాకాష్ఠాసా పరాగతిః" అనగా బాహ్యమైన విషయ ములకంటె ఇంద్రియములు, ఇంద్రియములకంటె మనస్సు మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె మహత్తు, మహత్తుకంటె అవ్యక్తమైన మాయాశక్తి, దానికంటె పురుష తత్వము గొప్పవి. అనగా శక్తి సంపన్నములైనవి. ఆపురుష తత్వకంటె మించిన పదార్థము మరొకటిలేదని చెప్పుచున్నది కఠోపనిషత్తు. ఎందువల్లనంటే ఆ పురుష తత్వం అన్నిటికంటె సూక్ష్మమైనది, స్వప్రకాశరూపమైనది. సచేతనమైనది ఈ విధ ముగా ఎఱింగితదను కూలముగా వ్యవహరించడమే బహిరంగ సాధన.

ఇకపోతే అంతరంగసాధనమంటే పంచేంద్రియాలను మనస్సుందే నిలిపివుంచి ఆ మనస్సును నిశ్చయాత్మకమైన బుద్ధిగా పరిణమింపజేసి, ఆ బుద్ధిని మహత్తనే సమి ష్టి బుద్ధిని ఆ సమిష్టి బుద్ధినిగూడమరల వృత్తి రహితమైన కేవలచైతన్య రూపముగా

భావనచేయ్యాలి. ఇదియే అంతరంగ సాధన. ఈ సాధనవల్ల లభించే ఫలమేమిటంటే సాధకుడైనవాడు అతి స్థూలమైన విషయములయందు మొదట క్రమంగా తనస్వరూప మును వెదుకుతూ ముందుకు సాగాలి. అలా ముందుకు పోయిన సాధకునకు ఈ సర్వ వ్యవహారములకు సాక్షిగా శుద్ధమైన చైతన్యము ఒక్కటే వున్నదని అనుభవానికి వస్తుంది. అదియే సర్వాంతరమైన శుద్ధ చైతన్యతత్వం. అదియే స్వ స్వరూపం. అది యే బ్రహ్మ. అలా స్వరూప సాక్షాత్కారము కలిగినప్పుడు వ్యక్తమైన ఈ ప్రపంచ ము మరియు దానికి మూలమైన అవ్యక్తమూ గూడ అంతా ఆ బ్రహ్మమునకు అభి న్నంగా కనుపిస్తుంది. ఆ విధంగా స్వ స్వరూపము శరీరము లోపలేగాకుండా బయ ట గూడ వ్యాపించి యున్నట్లుగా సాధకుని అనుభవానికి వస్తుంది. అప్పుడు ఆత్మ పరమాత్మల భేదం తొలగిపోయి అంతా ఒక్కటేనన్న భావం అనగా "అహం బ్రహ్మాస్మి" అన్నభావం స్థిరపడుతుంది.

ఇలా తెలుసుకోవడాన్ని "సమ్యగ్ జ్ఞానం" అంటున్నవి ఉపనిషత్తులు. ఇట్టి సమ్యగ్ జ్ఞానం యొక్క బలంతో యోగారూఢత్వాన్ని పొంది, తద్వారా సంసార సాగర మందు మునిగియున్న ఆత్మను అనగా మనస్సును తన మనస్సు చేతనే ఉద్ధరించ వలయును. "ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసారవారిథే. యోగారూఢిత్వ మాసాద్య సమ్యగ్ దర్శననిష్టయా" ఈ విధముగా శాస్త్ర పఠనము ద్వారాను, గురూ పదేశం ద్వారాను, మరియు నిరంతర మనన నిదిధ్యాసనముల ద్వారాను, సంపా దించిన సమ్యగ్ జ్ఞానమే మోక్షప్రాప్తికి ముఖ్య సాధనము.

అయితే సమ్యగ్ జ్ఞానము పరమ వైరాగ్యము ద్వారానే లభించుతుంది. ఈ పరమ వైరాగ్యభావమునే యోగారూఢత్వము అని అంటారు. అందుచేత "యదా హినేంద్రియార్థేషునకర్మస్వనుసజ్జతే సర్వసంకల్ప సన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే" అనగా ఎప్పుడు ఏ సాధకుడు సర్వసంకల్పములను విడనాడి, ఆ ఇంద్రియార్థముల యందును, కర్మలయందును, ఆసక్తుడు కాకుండా నిలిచియుండునో అప్పుడు అతడు యోగారూఢత్వమును పొందెనని చెప్పవచ్చును అని గీత యందు చెప్పబడియున్నది. అందుచేత సంసారమను సముద్రమునందు పడి మునకలు వేయుచున్న సాధకుడు తనను ఉద్ధరించుకోవలయునన్నచో పరమ వైరాగ్య సహితమగు సమ్యగ్ దర్శన

నిష్టయే ఏక మాత్ర సాధనము. అజ్ఞాన రూపమును, అజ్ఞాన విలాసరూపమును అగు ఈ సంసారమును సమ్యగ్ జ్ఞానము లేకున్నచో దాట శక్యము కాదు. కావున ఇది అనగా ఈ సంసారము ఒక సముద్రముగా చెప్పబడుచున్నది. అనాత్మలగు ఈ దేహాదులను ఆత్మయని భావించుచున్నంత కాలము ఈ దేహాదులు జన్మించుచున్నప్పుడుగాని, మరణించుచున్నప్పుడు గాని దానికి సంబంధించిన ధర్మము ఆత్మయందు కానవచ్చుట లేదు . అను జ్ఞానము కలుగనేరదు గదా! అట్లే ప్రాణము ఆకలి దప్పులచే బాధపడుచున్నప్పుడు గాని, అంతఃకరణము అనగా మనస్సు సుఖ దుఃఖాదికముచే పీడింపబడుచున్నప్పుగాని, ఆ ధర్మములు ఆత్మకు సంబంధించినవి కావను జ్ఞానము కలుగదు. ఈ విధముగా అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము, అనునవి అవిచ్ఛిన్నముగా మనస్సునందు నిండి యుండుటచే క్లేశాది పంచకము ఆ సంసారసాగరము నందలి తరంగములుగా చెప్పబడుచున్నవి. అట్లు లేని దానిని వున్నట్లుగా భావించుట భ్రమయనబడును. అట్టి భ్రమయే సుడిగుండము. వాస్తవమున ఆత్మనిస్సంగమైనది. సచ్చిదానందరూపమైనది. అట్టి ఆత్మ అనాది అగు అవిద్యాప్రభావముచే "నేను అజ్ఞుడను", కర్తను, భోక్తను, మనుష్యుడను, ఇత్యాది విధమున అనాత్మలగుస్థూల సూక్ష్మ,కారణ,శరీరములందు ఆత్మబుద్ధితో ప్రవర్తించుచు, తన యథార్థ స్వరూపమును తెలుసుకొనక, నానా విధములగు సుఖ దుఃఖములను అనుభవించుచున్నట్లుగా భావించుటయే సంసారసాగర నిమగ్నత్వముగా చెప్పబడినవి. అట్లుగాక సుషుప్తి అవస్థ యందు బాహ్య ప్రపంచానుభవము వుండదు. అందుచేత వివేక రహితమగు, మనో రూపమగు ఉపాధియే ఈ సంసారమునకు మూల కారణమని చెప్పబడుచున్నది. "మనయేవమనుష్యాణాం, కారణం బంధమోక్షయోః బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్" అనగా మనుష్యుల-జీవుల-బంధమోక్షములకు మనస్సే కారణము, ఏలయన ఆ మనస్సు విషయాసక్తమైనచో, అనగా ఇంద్రియముల ద్వారా బయటకు వెళ్ళి విషయములందు వ్యాపించుచో బంధమునకు కారణము అగుచున్నది. అట్లుగాక అనగా ఇంద్రియముల మార్గమున బయటకు పోక తనకు మూల కారణమగు ఆత్మతత్వమునందే నిలిచియున్నచో మోక్షమునకు కారణముగా చెప్పబడుచున్నది. అందుచే ఆత్మ సంసార వారిధియందు

మగ్న మగుటయనగా వివేక శూన్యమైన మనస్సు అనాత్మ పదార్థములగు శరీరాదుల యందు అజ్ఞానముతో కూడిన అభిమానమును కలిగి వుండుటయే. అటువంటి మనస్సు ఎప్పుడు శ్రవణ మననాది శాస్త్రీయ సంస్కారములచే సంస్కరింపబడునో అనగా తనయందు వ్యాపించి తన వునికికి కారణమగు ఆత్మ తత్వమును గుర్తించునో అప్పుడు అది భ్రమశూన్యమగును. కావున వివేక శూన్యమగు మనస్సును శాస్త్రవివేకముగల మనస్సు యొక్క సహాయమున ఆ అనాత్మ పదార్థములనుండి వేఱుచేసి దానికి తనయొక్క యధార్థస్వరూప జ్ఞానము కలిగించుట ద్వారా ఉద్ధరించవలెను. అట్లేలయన మనస్సు బహిర్ముఖముగ వుండి విషయములందు వ్యాపించు చుండుటయను స్వభావముగలది. వివేకముతో విచారించి చూచిన ఆత్మ సంగవిహీనమైనదే కాని విషయాసక్తమగుచున్న మనస్సునందు వ్యాపించియున్నందున ఆ ఆత్మయే విషయాసక్తమగుచున్నట్లుగా తోచుచుండును. ఆత్మకు ఉపాధియగు ఆ మనస్సే వివేకబలంతో అంతర్ముఖమై అనాత్మ పదార్థములగు దేహాదుల సంబంధమును వదలి తన స్వరూపమగు ఆత్మ యందే స్థిరముగ నిలచియున్నప్పుడు ఆత్మ ఉద్ధరించబడినట్లుగా భావింపవలయును.

అందుచేత సన్యాస స్వీకారానంతరము సమ్యగ్ దర్శన నిష్ఠాప్రాప్తికి సాధనములగు శ్రవణ మనన నిదిధ్యాసములను ఆచరింపవలయును. "సంన్యస్య సర్వ కర్మాణి భవబంధవిముక్తయే, యత్యతాం పండితైర్ధీరైరాత్మాభ్యాస ఉపస్థితైః" అనగా సమస్త కర్మలను సంన్యసించి, మనస్సును బాహ్యేంద్రియములతో కూడి బయటకు విషయములమీదికి వెళ్ళనివ్వకుండా నిలుపుజేసి, దానిని పరమార్థమునకు సంబంధించిన విషయములందే లగ్నముచేసి పండితులైనవారు సంసారబంధములనుండి విడువడి మోక్షము కొఱకు ప్రయత్నించ వలయును. అట్లేలయన-సమ్యగ్ దర్శనముచేతనే అనగా సత్యపదార్థమును గుర్తించి, అసత్యము, అనిత్యము అగు పదార్థముల నుండి దృష్టిని మరల్చినప్పుడే సాంసారిక బంధములనుండి విముక్తి కలుగును. ఏ మహనీయుడు ఆ విధముగా అనాత్మ పదార్థములనుండి మనస్సును వెనుకకు మరల్చి తన స్వరూపమునందు లయము చేయునో అతడే ముక్తుడగును. అట్లుల చేయవలయునన్న-"పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూః తస్మాత్ పరాంపశ్యతి నాంతరాత్మన్, కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్, ఆవృత్తచక్షురమృతత్వ

మిచ్ఛన్" అనగా ఆ సృష్టికర్త ఇంద్రియములను ఎల్లప్పుడు బహిర్ముఖములుగానే వుండునట్లు చేసియున్నాడు. అనగా వెలుపలి విషయములందు మాత్రమే వ్యాపించి యుండుట ఇంద్రియములయొక్క స్వభావము. అందుచే ఆ ఇంద్రియములే సాధనములుగాగల మానవుడు బాహ్య ప్రపంచమును మాత్రమే చూడగలడు. తెలుసుకొనగలడు గాని, తనయందే ఆంతరముగా వ్యాపించియున్న అంతరాత్మను చూడజాలకున్నాడు. కోటికి నూటికి ఎవ్వడో ఒక మహా పురుషుడు తన దృష్టిని పూర్వపుణ్యబలముచే అంతర్ముఖముగా చేసుకొని తన స్వస్వరూపమును, ఆ సర్వాత్మను చూడ పొంద సమర్థుడగుచున్నాడు. అని శ్రుతివాక్యము. అట్టి మహాత్ముడు అనగా తన మనస్సును, బుద్ధిని, తద్వారా ఇంద్రియములను గూడ వివేక బలంతో వశమునందు వుంచుకొని అంతర్ముఖుడై తన స్వరూపమును పొంది అద్వితీయుడై శాంతుడగుచున్నాడు. అనగా సంసారబంధములనుండి ముక్తుడగుచున్నాడు. అటువంటి ధీరుడు మాత్రమే "తచ్చింతనం, తత్కథనమన్యోన్యం తత్ప్రతిబోధనం, ఏతదేక పరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" అనగా ఆత్మను గురించి ఆలోచించుట. దానిని గురించియే మాట్లాడుచుండుట, పరస్పరము ఆ ఆత్మతత్వమును గురించియే బోధించుకొనుట అను కార్యములందు నిమగ్నమై మనస్సును ఎల్లప్పుడు బ్రహ్మభావముతో నింపియుంచువాడే పండితుడు. అట్లు చేయుటయే బ్రహ్మాభ్యాసము అనగా ప్రపంచమును విడిచి బ్రహ్మమును పొందుటకు ఉపాయము. ఆ విధముగా శాస్త్రాదులయందు చెప్పబడిన పరమార్థసంబంధమైన రహస్యములను గురించి ఆలోచించుట, మాటలాడుట, ఒకరికొకరు బోధించుకొనుట, ఆ విధముగా జ్ఞానమార్గసంబంధములైన వ్యాపారమునందే మనస్సును లగ్నముచేసి యుంచుట ఇవియే జ్ఞానోపలబ్ధికి ఉపాయములు. ఇతర విషయములను అనగా అనిత్య పదార్థములగు ప్రాపంచిక విషయములందు మనస్సును చొరనీయక సర్వకాల సర్వావస్థలయందును బ్రహ్మ పదార్థమునకు సంబంధించిన విషయ వివేకము నందే నిదిధ్యాసమును అనుష్ఠించుచు ప్రయత్నించుటయే జ్ఞానోపలబ్ధికి మంచి ఉపాయము. బ్రహ్మభావనయందు మనస్సును నిలిపి ఆ మనస్సుకు మధ్య మధ్య ఇతర ప్రాపంచిక విషయములు కలుగ

కుండ అవిచ్ఛిన్నముగ నిలిచి ఉండుటయే నిదిధ్యాసనము. ఆ విధముగా సర్వసంక ల్పములను సన్యసించుటయే ఆ మహాత్మునకు జ్ఞానోపలబ్ధికి ముఖ్య సాధనమగు వైరాగ్యమను యోగారూఢత్వము అనగా మనస్సును బ్రహ్మభావమునందు లగ్నము చేసి యుంచుట కుదురును. తద్వారా మోక్షప్రాప్తికి మార్గము లభించును.

కావున మోక్షావస్థను పొందగోరువారు మున్ముందుగా ప్రాపంచిక విషయము లను వదలిసన్యాసము అను వ్రతమును స్వీకరించవలయును. అనగా సర్వవిధ కర్మ లను పరిత్యజించవలయును. స్నానముగాని, మంత్రము, జపముగాని, దేవపూజగాని రామ కృష్ణాది నామసంకీర్తనలుగాని, తీర్థయాత్రలుగాని, యజ్ఞయాగాదులుగాని మరి యే విధమగు కర్మలుగాని అట్టి కర్మత్యాగముచేసిన సన్యాసికి అక్కరలేదు. ఇట్టి కర్మలన్నియు వానికి బంధములను కల్పించునేగాని మోక్షమును కలిగించి జ్ఞానోపలబ్ధికి సహాయకారులుకాజాలవు. "నస్నానమంత్రార్చన కీర్తినాదివా నతీర్థ సేవాదిచ కర్మభిక్షోః యుక్తం యతోఽనాత్మమతి ప్రవర్తకం హ్యనాత్మ శాస్త్రైరిత మప్యశేషమ్" అనగా భేదబుద్ధి కలిగి అజ్ఞానులై యున్నవారలను క్రమక్రమముగా ఉద్ధంచుటకై ముందుగా భేదములను అంగీకరించి అధికారాను సారముగ ఉన్నత స్థితినిపొందు ఉపాయములను బోధించు అనాత్మక విషయక శాస్త్రములయందు మాత్రమే ఇట్టి కర్మలు ప్రకటింపబడియున్నవి. కావున వీనిని ఆదరింపవలయుననిన సాధ్యసాధనఫలభేధములను అవశ్యముగ అంగీకరింపవలసి యుండును. "నేను కృషిని ఆచరించుచున్నాను. దీనిని సాధించుటకు ఆవశ్యకములగు సాధనములన్నియు నాయొద్దసిద్ధముగనున్నవి. దీనివలన బహుధాన్యములు ఫలించును." అను మొదలగు భేదవ్యవహారములు అందరకు తెలిసిన విషయములే. ఈవిధముగా భేదమును అంగీ కరించి కర్మలు చేయుచుండుటవలన క్రమక్రమముగా అభేదబుద్ధియే అభివృద్ధినొంది స్థిరపడునుగాని మోక్షప్రాప్తికి అవసరమగు అభేదబుద్ధి కలుగనేరదు. కావున ముముక్షువునకు కర్మలుప్రత్యక్షవిరోధులు. కర్మలు ఒక్కటియేగాదుభేదమును అంగీ కరించి చెప్పబడిన అన్ని విషయములును ఇట్టివే. అనగా అభేదజ్ఞానమును సంపా దింపదలచిన వారికి విరుద్ధములే. సహాయకారులు కానేరవు."న కర్మణా, న ప్రజయా ధనేన త్యాగేనైకేఅమృతత్వమానశుః" అనగా కర్మలు, సంతానము, ధనము అనునవి

మోక్షమును కలిగించజాలవు సన్యాసమొక్కటియే సర్వకర్మ పరిత్యాగమే జ్ఞానోపలబ్ధికి సాధనము.

మరియు "సంన్యస్య శ్రవణంకుర్యాత్" అనుమొదలగు స్మృతులును "కర్మలను విడిచిన నేగాని వేదాంతవాక్యములను వినుటకుగూడ అధికారము కలుగదు" అని చెప్పుచున్నవి. కావున త్రికరణ శుద్ధిగా ముక్తినిగోరి దానికై ప్రయత్నించుముముక్షువు అవశ్యముగ సంన్యాసమును స్వీకరింపవలయును. స్నానాది కర్మలతో ఆతనికి ప్రయోజనము ఏమియులేదు. కావున వానిని ఆచరింప నక్కఱలేదు. "అయమేవ యతేర్ధర్మః కర్తవ్యో మోక్షకాంక్షిణః నైవస్నానం నాపి జాపోన పూజాపినకీర్తనమ్" "సర్వ కర్మాణి సంన్యస్య" అను మొదలగు వాక్యములచే వేదముపై సిద్ధాంతమునే దృఢముచేయుచున్నది. కావున ఈ విషయమున కొంచెమైనను సంశయింప పనిలేదు మరియు జీవబ్రహ్మలకుగల సహజాభేదమును ఎఱుంగుటయే ఫలమని శ్రుతులు ఘోషించుచున్నవి.

"తదభావే యతేరస్య నిష్ఫలం శుకజల్పవత్, దశధా, శతధా వాపిశ్రుత్వా మత్వాపివాయతేః, సంసార ధ్వంసకం జ్ఞానం సంపాద్యమతియత్నతః" అనగా ఆజీవబ్రహ్మ ఐక్యజ్ఞానము లేకుండిన ముముక్షువు చేయు సర్వ ప్రయత్నములును నిరర్థకమే. చిలక మాటలాడుమాట అభిప్రాయ శూన్యములగుటచే నిరర్థకములైనట్లు, అట్టి ముముక్షువు చేయు శ్రవణాదులును అభిప్రాయ శూన్యములే అగును. అనగా అర్థగ్రహణములేనివి అగుటచే అనగా వాని యర్థమును గ్రహింపకపోవుటచేత నిరర్థకములే. కావున మోక్షచ్ఛకలిగి, దానికై ప్రయత్నించు పురుషుడు అర్థమును ఎఱుంగునంత వరకు పదిమారులైనను, నూఱుమారులైనను మరియు ఎన్నిమాఱులైనను వేదాంత శ్రవణమును ఆచరింపవలసినదియే. మనస్సున శ్రవణ జన్యజ్ఞానము—జీవబ్రహ్మైక్యజ్ఞానము నిస్సంశయముగ దృఢమగునంత వరకు ఎన్నిమారులైనను మననము ఆచరింపవలసినదియే. ఇట్లు చేసి మహాప్రయత్నముతో ఆ జీవబ్రహ్మైక్యజ్ఞానమును సంపాదింపవలయును. అప్పుడు సంసార భ్రాంతి తొలగును. ముక్తి లభించును. అందుచేత మోక్షేచ్ఛగల సంన్యాసి ఆలస్యము చేయక బ్రహ్మనిష్ఠుడు అగు గురువును ఆశ్రయించి జీవబ్రహ్మైక్య జ్ఞానము దృఢమగునంత వరకు

నూఱుమార్లైనను, వేయిమాఱులైనను వేదాంత వాక్యశ్రవణమును ఆచరింప వలసినదే.

కావున కర్మలు పరమ పురుషార్థమగు మోక్షమును ఈయజాలవు. ఇవి చిత్త శుద్ధిని కలిగించుటద్వారా జ్ఞానోపలబ్ధికి బహిరంగ సాధనములుగానే వుండును. "చిత్తస్యశుద్ధయే కర్మ, నతు వస్తూపలబ్ధయే, వస్తుసిద్ధిర్విచారేణ నకించిత్ కర్మ కోటిభిః" అనగా కర్మలు చిత్తము యొక్క శుద్ధికొఱకు మాత్రమే ఉపయోగించును గాని వస్తు జ్ఞానము కొఱకు ఉపయోగించవు. వస్తు జ్ఞానము అనగా జీవబ్రహ్మ తత్త్వజ్ఞానము విచారణ చేయుట చేతనే కలుగును. కోటి కర్మలు చేసినను ఏమి ప్రయోజనములేదు. అనగా జీవబ్రహ్మైక్యత్వ జ్ఞాన రూపమగు మోక్షము కలుగదు. "సమ్యగ్విచారతః సిద్ధారజ్జుతత్త్వావధారణా,భ్రాంత్యోదిత మహాసర్పభయదుఃఖవినాశినీ" అనగా చీకటిలో నేలపైబడియున్న త్రాడునుచూచి సర్పమని భ్రాంతి జెందిన పురుషుడు భయమును చెందినవాడై, దీపమును తెచ్చిన తరువాత, ఆ దీపపు వెలుగులో బాగుగా పరిశీలించి చూడగా అది పాము కాదనియు, అచ్చటపడియున్నది త్రాడనియు తెలిసిన వెంటనే ఎట్లు భ్రాంతి రహితుడై భయరహితుడగునో అట్లే భ్రాంతిచే కలిగిన సంసార దుఃఖమును, అనగా జన్మ మరణముల వలన కలుగు దుఃఖము స్వస్వరూప సాక్షాత్కారము అనగా తత్త్వబోధ, అనగా బ్రహ్మస్వరూపము యొక్క యథార్థ జ్ఞానము తత్త్వపరిశీలనము అనెడు సమ్యగ్విచారముచే తొలగిపోవును. అట్టి ఆత్మ సాక్షాత్కారమును కలిగించు సమ్యగ్విచారము అనగా సత్యము, నిత్యము, నిరవ యవమును అగు యథార్థతత్త్వమును తెలియజేయు యథార్థ స్వరూప జ్ఞానము హితు లైన వారల వుపదేశము వలననే లభించును. "అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితోక్తితః,నస్నానేన,నదానేన ప్రాణాయామశతేనవా"అనగా అజ్ఞాన దోషముచేత, సత్యమును గుర్తించలేక భ్రాంతి జెందిన పురుషుడు భయకంపాది దుఃఖములకు లోనగును. అట్టి అవసరమున హితులయొక్క ఉపదేశమనెడి ఆధారము లేకున్నచో అతడు తనంతట తానుగా సత్యస్వరూపమును గూర్చి ఆలోచించజాలడు. ఏలయన భయకంపాదులవలన, మతిభ్రమణము గూడ కలుగును. అందువలన సమ్యగ్వి చారమునకు హేతువైనవారి హితవాక్కులు అవుసరమని చెప్పబడినది. హితు

అనగా సత్యమును చెప్పువాడు. హితుడైన వాని సత్యవాక్యమును విని విచారించి చూచిన భ్రాంతి వలన కలిగిన భయదుఃఖాదులు తొలగిపోవును. అట్లు హితుల యొక్క ఆప్తజ్ఞాన వాక్యమును పొందక స్నానము, దానము, ప్రాణాయామము మొదలగు కర్మలు ఎన్ని చేసినను అజ్ఞానజనిత భ్రాంతి వలన కలిగిన భయ దుఃఖాదులు తొలగనేరవు. సత్యపదార్థ జ్ఞానము కలుగనంతవరకు భ్రాంతి జన్యము లైన ఆ భయదుఃఖాదులు తొలగనేరవు. వస్తువుయొక్క యథార్థ స్వరూపమును నిర్ణ యించుటకు అనుకూలమగు మానస వ్యాపారమే సమ్యగ్విచారము. భ్రాంతి కలిగి నప్పుడెల్ల దానిని తొలగించి వస్తువు యొక్క యథార్థ స్వరూపమును తెలుపగలిగినది హితులయొక్క అనగా శాస్త్ర గురూపదేశముల ద్వారా వినబడిన సత్యజ్ఞానమును కలిగించు వాక్యములే—వాక్యముచే చేసిన విచారమే. కావున శ్రుతిచేతను, ఆచార్యోప దేశమును అనుసరించి ఆత్మవిచారముచేసి దానియొక్క యథార్థ స్వరూపమును సాక్షాత్కరింప జేసుకొని, అనాత్మాధ్యా సరూపమగు—భ్రాంతి జన్యమైన—సంసారము నుండి తనను తాను విడిపించుకొనవలయును.

సంసారదుఃఖము నుండి విడువడుటయనెడు మహాకార్యము అసమర్థుడగు పురుషుని వలన జరుగనేరదు. కర్మలు చేయగలసామర్థ్యము వున్నవాడే ఆయా కర్మల ఫలములను అనుభవింపజాలును. అసమర్థుడు కఠోరమైన కర్మలు చేయను జాలడు, వాటి వలన లభించు భోగ్యములను అనుభవించనూ జాలడు. అందుచేత మోక్షేచ్ఛగల పురుషుడు సంసార దుఃఖము నుండి విడువడుటకు అవుసరమైన సామ ర్థ్యమును సంపాదింపవలయును. "అధికారిణమాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః, ఉపాయా దేశకాలాద్యాః సన్త్యస్యాం సహకారిణః" అనగా ఫలముయొక్కసిద్ధి ముఖ్యముగ అధికారిని అపేక్షించును. ఈ ఫల సిద్ధియందు దేశకాలాదులు మరియు ఇతర ఉపా యములు సహకారులుగా మాత్రమే వుండును. అధికారియనగా వివేక వైరాగ్యములు దృఢముగా కలిగియున్నవాడు. అట్టివాడు మాత్రమే బ్రహ్మ స్వరూపమున నిలిచి యుండుట యనెడు మోక్షమును పొందుటకు సాధనమగు సమ్యగ్దర్శన నిష్ఠకొఱకు అవుసరమగు సాధనమును ఉపదేశించు గురువును ఆశ్రయించి ఆయన ఉపదేశించిన మార్గమున నడచుటకు ప్రయత్నించును. అట్టి సమ్యగ్దర్శన నిష్ఠ శమ, దమ, ఉప

రతి, తితిక్ష, శ్రద్ధలు లేకుండ లభించదు. మోక్షేచ్ఛలేనిచో మోక్షసంపాదనకు అవసరమగు ప్రయత్నముకుదరదు. కావున "అతోవిముక్త్యై ప్రయతేతవిద్వాన్, సంన్యస్త బాహ్యార్థ సుఖస్పృహఃసన్ అని చెప్పబడినది అనగా బ్రహ్మ జిజ్ఞాసకు సాధారణ హేతువులగు వివేక, వైరాగ్య, శమాది షట్కముముక్షుత్వములు చెప్పబడినవి. "తరతి శోకమాత్మవిత్" ఆత్మజ్ఞానము కలిగినవాడు మాత్రమే శోకసాగరమును దాటును. అందుచేత "సాధనాన్యత్రచత్వారికథితాని మనీషిభిఃయేషు సత్స్వేవ సన్నిష్ఠాయదభావేనసిద్యతి" అనగా జ్ఞానోపలబ్ధికి నాలుగు సాధనములు ఆ విషయము తెలిసిన పండితులచే చెప్పబడినవి. ఆ నాలుగు సాధనములయొక్క శక్తి సామర్థ్యములను చక్కగా ఎఱింగి ఏ పురుషుడు వాటిద్వారా సత్యస్వరూపమగు బ్రహ్మయందు తన మనస్సును లగ్నముచేసి నిలిచియుండునో అతడు మోక్షమను ఆనందమును పొందును.

ఈ చరాచర ప్రపంచమంతయు వివిధములగు ప్రాకృతిక పదార్థముల సమ్మేళనముచేత ఏర్పడిన కార్యరూపమే. ఉదాహరణమునకు ఘటము, పటము, మొదలగునవి కార్యములు. మట్టి,దారము ఆ కార్యములకు కారణములు. కార్యమున్నచోట ఏది వుండదో అది ఆ కార్యమునకు కారణము కాజాలదు. అదెట్లన ఘటము వున్నచోట దారములేదు. అట్లే పటము వున్నచోట మట్టిలేదు. అందుచే పటమునకు మట్టి, ఘటమునకు దారము కారణములుకాజాలవు. కావున మట్టివున్నప్పుడే ఘటము వుండును. మట్టి లేనిచో ఘటము వుండదు. అట్లేబంగారమున్నచో ఆభరణములు వుండును. బంగారములేనిచో ఆభరణములు వుండవు. ఈ విధముగా కారణము వున్నప్పుడే కార్యముండును. కారణములేక కార్యము వుండదు. అందుచే మట్టి ఘటమను కార్యమునకు కారణమని నిర్ణయింపబడుచున్నది. ఈ ఉదాహరణమునుసరించి సత్యరూపమగు బ్రహ్మయందు తద్రూపము చెందియుండుటకు కారణమగు బ్రహ్మ జిజ్ఞాసగూడ వివేకాది కారణచతుష్టయ మున్నప్పుడే సంభవమగును. లేనిచో అట్టి బ్రహ్మజిజ్ఞాస కుదరదు. బాదరాయణులవంటి బ్రహ్మ విద్వరులు సాధన చతుష్టయ సంపన్నులకే బ్రహ్మవిద్యను పొందు అధికారముండునని తమ భాష్యగ్రంథమునందు స్పష్టముగా తెలిపియున్నారు

అదే "నిత్యానిత్య వస్తువివేకః పరిగణ్యతే, ఇహాముత్ర ఫలభోగవిరాగస్తద నంతరమ్, శమాది షట్కసంపత్తిః ముముక్షుత్వమితి స్ఫుటమ్" అనగా జ్ఞానమార్గమున పయనించి బ్రహ్మసాక్షాత్కారమును కోరు ముముక్షువునకు నిత్యానిత్య వస్తువులయొక్క వివేకముకావలయును. అట్టి వివేకము కలిగిన తర్వాత ఇహలోకమునందును, పరలోకమునందును కలుగు కర్మ ఫలముల అనుభవమునందు వైరాగ్య భావము వుండవలయును. అటుపైన శమము, దమము, ఉపరతి. తితిక్ష, సమాధానము, శ్రద్ధ మొదలగు లక్షణములు కలిగియుండవలెను. ఇవియే జ్ఞానోపలబ్ధికి ముఖ్య సాధనములుగా చెప్పబడినవి.

అన్నిటికంటెను సాధకునకు ముఖ్యసాధనము మోక్షేచ్ఛ. జ్ఞానసంపాదనము లేక జ్ఞానోదయము నిత్యానిత్య వస్తువివేకముతో ఆరంభమగుచున్నది. అట్లేల యన "ఇది నిత్యమైనది. ఇది నిత్యమైనవస్తువుకాదు." అని తెలిసిన కదా అనిత్య వస్తువుయందు అనిష్టము అనగా వైరాగ్య భావము కలుగుట. నిత్యానిత్య వస్తువివేకము లేకున్నచో వైరాగ్యము దుర్లభముగాన వివేకము వైరాగ్యమునకు ముఖ్య హేతువు అగుచున్నది. "బ్రహ్మసత్యమైనది. జగత్తు అసత్యమైనది" అను నిశ్చయమే నిత్యానిత్యవస్తువివేకముగా చెప్పబడినది. "బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవం రూపోవినిశ్చయః. సోఽయం నిత్యానిత్యవస్తువివేకః సముదాహృతః" జనులు సాధారణముగా అజ్ఞానముచే అనిత్యములగు పదార్థములను ఆశ్రయించి నిత్యములగు సుఖములను కోరుచుందురు. "అందుచే బ్రహ్మనిత్యము, జగత్తు అసత్యము" అని చెప్పిననువారికి జ్ఞానోపలబ్ధికి అవుసరమగు దృఢమగు వైరాగ్యము కలుగదు. అట్లుగాక "జగత్తు అసత్యము" అని చెప్పినచో అసత్య వస్తువును ఎవ్వరూ కోరుకొనరు. రాజ్యముకావలయును. అని కోరుకొనువారు స్వప్నరాజ్యమును కోరుకొనరు. ఏలయన ఆ స్వప్నరాజ్యము మెలకువరాగానే జాగ్రదయందు మాయమగుచున్నది. అట్లే దృఢమగు వైరాగ్యము కలుగవలెనన్నచో "బ్రహ్మనిత్యము, జగత్తు అనిత్యము" అని చెప్పుటకంటె "బ్రహ్మ సత్యము జగత్తు అసత్యము" అని చెప్పబడుచున్నది. పైగా ఈ వాక్యము విశేషముగా నిశ్చయము. అనగా ఈ నిశ్చయము

మారనిది. అప్రామాణ్య జ్ఞానముచే బాధింపబడదు అని చెప్పినట్లైనది. కావున వివేకమే ఐహిక, ఆముష్మిక ఫలభోగవిరాగమును కలిగింప సామర్థ్యము కలిగియున్నది. వివేకమును అనుసరించియే వైరాగ్యము కలుగుచున్నది. "తద్వైరాగ్యం జుగుప్సాయా దర్శన శ్రవణాదిభిః దేహాదిబ్రహ్మపర్యన్తే హ్యనిత్యే భోగ్యవస్తుని" అనగా దర్శనము, శ్రవణము మొదలగు వాటిచే దేహము మొదలు బ్రహ్మవరకును గల అనిత్యములగు భోగ్య వస్తువులయందు ఏ అసహ్యాభావము కలుగునో అదియే వైరాగ్యము. ఈ జగత్తునందలి దేహాది భోగ్యవస్తువులను చూచుట చేతను, పరలోకమునందలి అనిత్యములైన దివ్యదేహము మొదలగు భోగ్యవస్తువులను గురించి వినుటచేతను, చూచిన వాటికిని, విన్నవాటికిని సజాతీయములగు వాటిని అనుమాన ప్రమాణముద్వారా తెలుసుకొనుటచేతను, ప్రత్యక్షముగ అనుభవింపబడుచున్న శరీరము మొదలు, అనిత్యములును, అసత్యములును అగు సకల భోగ్యవస్తువుల విషయమునను. ఈ పదార్థములన్నియూ క్షణభంగురములు వీటిద్వారా సత్యము, నిత్యము అగు ఆనందము కలుగజాలదు. "కావున వీటితో నాకు సంబంధము కలుగకుండుగాక" అను ఏ అసహ్య భావము మనస్సునందు స్థిరపడుచున్నదో అదియే వైరాగ్యము. ఇట్టి వైరాగ్యము ముందుగా అనిత్యములగు దేహాదులయందు కలుగవలయును. "స్వదేహాశుచి గంధేన నవిరజ్యేతయః పుమాన్ వైరాగ్య కారణం తస్యకి మన్యదు పదిశ్యతామ్" అనగా తన దేహము యందలి దుర్గంధమును తెలుసుకొనియు ఏ పురుషుడు ఆ దేహమునందు తనకు గల అభిమానమును త్యజించి వైరాగ్యభావము చెందడో అట్టివాడే అజ్ఞాని. "శుద్ధ మిచ్ఛంత్యశుద్ధస్య నిత్య దుఃఖాత్మనః సుఖమ్, అనిత్యస్యైవ నిత్యత్వమహో అజ్ఞజనాజ్ఞతా" అనగా ఈ శరీరము పంచభూతములచే కల్పింపబడినది. ఆ భూతములు అవిద్యచే కల్పింపబడినవి. కావున అసత్యములైనవి. అపరిశుద్ధములైనవి. దుఃఖరూపములైనవి. పరబ్రహ్మ సాన్నిధ్యము వలన మాత్రమే ఈ భూతములు మరియు వాటిచే కల్పింపబడిన ప్రపంచము వున్నది అని వ్యవహరింపబడుచూ, సత్యరూపముగాను" ఇది నాకు ఆనందమును కలిగించుచున్నది." అని వ్యవహరింపబడుచూ ఆనంద రూపముగాను తోచుచున్నది. భూత జన్యము

అగు ఈ శరీరము గూడ ఇట్టిదే. ఈ సత్యమును ఎఱుంగ లేక అజ్ఞానులు "దేహమే నేను" అని తలంచుచు ఆత్మస్వరూపములును నిర్మలమును అగు నిత్య సుఖములను దేహము నందే ఆరోపించుచున్నారు. అట్లే "మలమాంసమయం దేహం స్వం మత్వా ఽ శుచి మన్యతు, శుద్ధింకుర్వంతి తోయాద్యైర్వరహో అజ్ఞజనాజ్ఞతా" అనగా ఈ లోకులు నిర్మలుడగు ఆత్మను ఎఱుంగ లేక మల మాంస రూపంబును, అపరిశుద్ధమును అగు ఈ దేహమునే ఆత్మగా భావించుచున్నారు. అప్పటికైనను శుద్ధమగు పదార్థమే శుద్ధమైయుండును గాని అపరిశుద్ధమగు దానికి ఎప్పటికైనను శుద్ధికలుగ నేర్చునా?

ద్వయోరన్నస్య కార్యత్వేఽహంతాంవపుషి కుర్వతే. నమవే బుద్ధిపైచిత్ర్య మహో అజ్ఞజనాజ్ఞతా" అనగా ఈ స్థూలదేహము ఎట్లు అన్నము యొక్క పరిణామముగా జనించెనో అదే విధముగా మలముకూడ ఆహార పరిణామము వలన ఏర్పడినదే. ఈ విధముగా కారణమును బట్టిచూచిన రెండునూ సమానములే యగుచున్నవి. అయినను లోకులు దేహమునందు మాత్రము ఆత్మాభిమానమును వుంచుచున్నారు. కాని దానితో సమానమైన మలమునందు గూడ అట్టి అభిమానమును వుంచుటలేదు. ఇది ఎంత విచిత్రము! మలమువలె ఈ దేహముకూడ అభిమానింప తగినది కాదని వారికి యేల తెలియుటలేదో ఆశ్చర్యముగ నున్నది. వారి బుద్ధి విచార శూన్యమై ఇంత విచిత్రముగ ప్రవర్తించుచున్నది. "అసత్కల్పం, మృషాప్రాయం, స్వప్నతుల్యం, భ్రమయోదితం, జగత్సర్వమితి జ్ఞేయం పండితైస్తత్వదర్శిభిః" అనగా పై విధముగా జనులు విచార శూన్యులు గాక ప్రయత్న పూర్వకముగా ఆత్మనాత్మ విచారమునా వింపవలయును. ఈ ప్రపంచము యొక్క యదార్థ రూపమును గ్రహించ వలయును. యథార్థమున ఈ ప్రపంచమునందు నామ రూపములకంటె వేరగు ఇతరమగు పదార్థ మేదియులేదు. కావున విచారించి చూచిన ఈ ప్రపంచము సత్యమైనది, నిత్యమైనది కానేరదు. ఉన్నట్లుగా తోచుటయేగాని దీనియందు వాస్తవమగు పదార్థము ఏదియును లేదు. కావున ఈ ప్రపంచము కలవంటిది. ఆత్మయొక్క యథార్థరూపమును తెలుసు

కొనక పోవుటచే ఈ ప్రపంచము వున్నదానివలె తోచుచున్నదిగాని మరేమియులేదు. ఇదియే సత్యము.

ఈ ప్రపంచమునందలి విషయములను పరిశీలించి చూచిన అవి అన్నియూ ఆద్యంతములు గలవిగా తెలియవచ్చును. "విరజ్య విషయవ్రాతాత్ దోష దృష్ట్యా ముహుర్ముహుః, స్వలక్ష్యేనియతావస్థా మనసః శమ ఉచ్యతే" అనగా సర్వవిధ విషయములకు ఆది అంతములు వున్నవి. పైగా వాటిని సంపాదించుటకు ఎంతో శ్రమ, ధనము వ్యయమగును. ఆయినను చివరకు అవి విరసములు అనగా లేనివి అగును. విషయములందు ఇటువంటి దోషములు ఉన్నవని గ్రహించిన పురుషునకు వాటియందు గల వ్యామోహము నశించి తప్పక వైరాగ్యము కలుగును. అందుచే విషయ దోష దర్శనము వైరాగ్య హేతువు అగుచున్నది. అట్టి వైరాగ్యము కలుగ గనే మనస్సు ఆ విషయముల నుండి వెనుకకు మరలి యథార్ధ విషయమైన తన స్వరూపమునందు స్థిరముగ, నిశ్చలముగ, నిర్వికారముగ నిలిచియుండును. ఇట్టి మనోనిశ్చలత్వమును 'శమము' అని అందురు. ఈ శమము దృఢమగు వివేకముతో కూడిన వైరాగ్య భావము స్థిరపడినప్పుడే కలుగును. ఈ శమమునే మనశ్శాంతి అని అందురు. ఈ విధముగా మనోశాంతి లభించిన వానికి సత్యము, నిత్యము, మరియు ఆనందమయమును అగు బ్రహ్మజ్ఞానము కలుగుటకు అవకాశము ఏర్పడును.

మనస్సు విషయ విచారము చేయు సామర్ధ్యము కలిగియున్నది. "విషయేభ్యః పరావర్త్యస్థాపనం స్వస్వగోలకే, ఉభయేషామిన్ద్రియాణాంసదమః పరికీర్తితః" అనగా మనస్సు ఎప్పుడు ఉభయ విధములగు అనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను భోగ్యవిషయముల నుండి వెనుకకు మరల్చి వాటిని వాటి వాటి స్థానములందు స్థిర ముగ వుంచునో అట్టి స్థితిని "దమము" అని చెప్పబడినది. యథార్ధమున విచారించి చూచిన బాహ్యేంద్రియములగు చెవి, చర్మము, నేత్రము, నాలుక నాశిక మొదలగు జ్ఞానేంద్రియములకును వాక్కు, హస్తములు, పాదములు, పాయువు, ఉపస్థము మొదలగు కర్మేంద్రియములకును, స్వయముగ విషయ విచారముచేయు సామర్ధ్యము లేదు. ఇట్టి సామర్ధ్యము ఒక మనస్సునకు మాత్రమే వుండియున్నది. అందుచే ఆ మనస్సు ఎప్పుడు ఆ బాహ్యేంద్రియ, కర్మేంద్రియముల నన్నింటిని, శబ్ద, స్పర్శ,

రూప, రస, గంధములనెడు విషయముల మీదికి పోనివ్వక. వాటిని వెనుకకు మరల్చి వాటి వాటి మూలస్థానములయందు నిలిపి వుంచును. ఆ విధముగా ఇంద్రియ వ్యాపారములను జరుగ నివ్వక నిలిపి వుంచుటను "దమము" అని పెద్దలు చెప్పు చున్నారు. వివేకముతో కూడిన ఈ మనస్సు ఇంద్రియములనెడు అశ్వములను తగు విధముగా అదుపునందుంచి, వాటిని తనకు నచ్చిన మార్గమున నడుపు శక్తిని కలిగి యున్నది. అందుచేత కఠోపనిషత్తునందు "ఆత్మానం రథినంవిద్ధి, శరీరం రథమేవతు, బుద్ధింతు సారధింవిద్ధి, మనఃప్రగ్రహమేవచ, ఇంద్రియాణి హాయన్వాహు విషయాం స్తేషు గోచరాన్" అనగా ఆత్మ రథస్వామి యనియు, శరీరము రథమనియు, బుద్ధి సారధనియు, మనస్సు కళ్ళెమనియు, ఇంద్రియములను గుర్రములగను విష యములు మార్గములుగను వర్ణింపబడి యున్నది. ఈ విధముగా వివేకముగల మనస్సుచే చేయబడు బాహ్యేంద్రియ, కర్మేంద్రియ నిగ్రహమును "దమము" అని విద్వాంసులు చెప్పుచున్నారు. ఇట్టి దమము ఏర్పడగానే మనస్సునందు బాహ్య విష యములకు సంబంధించిన వృత్తులు కలుగనేరవు. ఇట్టి స్థితినే "ఉపరతి" అని చెప్పు దురు. "బాహ్యానా లంబనం వృత్తే రేషోపరతి రుత్తమా" అనగా మనోవృత్తి బాహ్య విషయములపై ప్రసరింపక పోవుటను "ఉపరతి" యని తెలియనగును. అనగా ఏ విధముగా చెరువునందు నిండియున్న నీరు ఆ చెరువు గట్టునందున్న తూములద్వారా బయటకు వెళ్ళి క్షేత్రములయందు వ్యాపించి తదాకారమును చెందునో అట్లే లోపలవున్న మనస్సు నేత్రములు, చెవులు మొదలగు గోళములద్వారా బయ టకు వెడలి శబ్దాది విషయాకారమున పరిణమించును. అట్టి పరిణామమునకే వృత్తి అనగా అంతఃకరణ వృత్తి అని పేరు. బాహ్యేంద్రియములను నిగ్రహింపగనే లోపలనున్న మనస్సు బయటకు వచ్చుటకుగాని, బాహ్యమునన్న విషయాకారమున పరిణమించుటకుగాని అవకాశము వుండదు. ఈ విధముగా మనస్సు విషయాకార పరిణామము చెందక నిలిచియుండుటనే "ఉపరతి"గా గుర్తించుచున్నారు.

ఎప్పుడైతే పైవిధముగా చిత్తమునకు అనగా మనస్సునకు బాహ్య విషయ ముల యొక్క సంబంధము లేకుండునో అప్పుడు ఆ మనస్సునకు శీతోష్ణాది ద్వంద ముల జ్ఞానముగూడ కలుగనేరదు. ఒకవేళ కర్మవశమున లేక కాలదోషముచే

అట్టి జ్ఞానము కలిగినను వాటిని లెక్కచేయక, మనస్సును స్థిరముగ వుంచు శక్తినే "తితిక్ష" అనుచున్నారు. "సహనంసర్వదుఃఖానాం అప్రతీకార పూర్వకం, చింతావిలాప రహితం సాతితిక్షానిగద్యతే" అనగా ప్రతిక్రియ ఏమియు చేయకుండ గను, చింతించుటగాని, విలపించుటగాని, ఏమియు చేయక సహనమైన అనగా శారీరిక, మానసిక దుఃఖములను లెక్కచేయక నిర్వికారముగ వుండుటయే "తితిక్ష" అని శ్రుతులు చెప్పుచున్నవి. వాతావరణము వేడిగా వున్నప్పుడు శీతలోపచారములు చల్లగా వున్నప్పుడు చలిమంటలు వేయుట, ఉన్నిబట్టలు ధరించుట మొదలగు వ్యవహారములు లోకప్రసిద్ధములు. అట్టి అవకాశము లేనప్పుడు మనస్సునందు దైన్యము ఆవహించును. అట్టి దైన్యము అనగా చింత బ్రహ్మజ్ఞాన సంపాదనమునకు అనగా జ్ఞానోపలబ్ధికి సహకారికాక బాధను కలుగజేయును. కావున అట్టి ప్రతీకార చర్యలతో కూడిన ప్రయత్నముగాని, అట్టి అవకాశము లేదను చింతగాని, మనస్సునందు కలుగకుండుటయే "తితిక్ష".

జ్ఞానోపలబ్ధికి అన్నిటికంటె ముఖ్యమగు సాధనము శ్రద్ధ. అనగా శ్రద్ధాభావము. "శాస్త్రస్య, గురువాక్యస్య, సత్యబుద్ధ్యావధారణా, సాశ్రద్ధా కథితా సద్భిః యయా వస్తూప లభ్యతే" అనగా శాస్త్రము మరియు గురువు చెప్పెడి వాక్యములందు విశ్వాసము కలిగియుండుటయే శ్రద్ధయనబడును. ఏలయన శాస్త్రము మరియు బ్రహ్మనిష్ఠుడగు గురువు మాత్రమే వస్తువుయొక్క యదార్థ రూపమును తెలియజేయ గలరు. మరొకరెవ్వరూగూడ శుద్ధసత్యమును తెలియజేయజాలరు. లోకమునందు ఏ పురుషుడును తనంతట తానుగా వస్తువుయొక్క యదార్థ రూపమును తెలుసుకొనజాలడు. అందునగూడ బ్రహ్మజ్ఞానము దుర్లభమైన విషయము. అందుచే ఆ జ్ఞానమును ఆప్తులైనవారు, అతీంద్రియమగు శాస్త్రము మరియు విద్వరిష్టుడగు గురువు మాత్రమే బోధింపగలడు. అట్టి బ్రహ్మజ్ఞానమును కలిగించు వాక్యములందు సత్యము అనెడు బుద్ధి కలిగియుండుటయే "శ్రద్ధ" అని చెప్పబడుచున్నది. అట్టి శ్రద్ధాభావము కలిగియున్న సాధకుడు మాత్రమే సత్యము, నిత్యము అగు మోక్షమును ప్రసాదించగల జ్ఞానమును పొందగలుగును. "శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం" అను వాక్యములుగూడ "తత్వమసి" అను వాక్యముద్వారా "నీవు సంసారియగు

జీవుడవుకావు. నిత్యము, శుద్ధము, బుద్ధము అనగా జ్ఞానమే స్వరూపముగా గల పరబ్రహ్మవు. ఇతరమైన దంతయు అజ్ఞానముచే అనగా భ్రాంతిచే తోచు అనిత్య, అసత్య కల్పిత పదార్థము మాత్రమే."

ఈ విధముగా శాస్త్రము మరియు గురువుల వాక్యమునందు శ్రద్ధాభావముకలిగి వారిద్వారా లభించిన వాక్యములయొక్క అర్థమును మరల మరల అనుభవమునకు తెచ్చుకొనుటకు ప్రయత్నించు సాధకునకు మాత్రమే సమాధానము కుదిరి మనస్సు శాంతించును. సమ్యగ్ స్థాపనంబుద్ధేః శుద్ధేబ్రహ్మణి సర్వదా. తత్సమాధానమిత్యుక్తం నతు చిత్తస్యలాలనమ్" అనగా పరిశుద్ధమగు బ్రహ్మయందు ఏ సాధకుడు నిర్వికల్పకమగు బుద్ధిని కలిగియుండునో అనగా తన బుద్ధిని ఇంద్రియములద్వారా వెలుపలనున్న విషయములయందు వ్యాపింపనీయక శాంతచిత్తుడై స్వస్వరూపమగు బ్రహ్మమునందే నిలిపివుంచునో అట్టి స్థితిని సమాధానమందురు. సమాధానమునకు మరియు శమము అనుదానికి ఎక్కువ భేదమేమియులేదు. రెండు శబ్దములు మనస్సు యొక్క అనగా బుద్ధియొక్క స్థిరత్వమును మాత్రమే తెలుపుచున్నవి. "మాటిమాటికిని విషయములయందు దోషములను చూచుచు వాటినుండి విరక్తమై మనస్సు తన లక్ష్యమగు స్వస్వరూపమునందు నిలిచియుండుట" అనునదియే శమము. శ్రీమద్ భగవద్గీతయందు గూడ ఈ విషయమే చెప్పబడియున్నది. "యతోయతోనిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్, తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశంనయేత్" అనగా చపలస్వభావము గలదియు అనగా ఒకే విషయమునందు స్థిరముగ నిలిచి వుండనిది యగు మనస్సు, ఎచ్చటెచ్చట ఏయేవిషయములయందు సంచరించుచుండునో అచ్చటచ్చటనుండి ఆ మనస్సును తొలగించి ఆత్మభావమునందే లీనమొనర్పవలయును. అనగా ఎల్లప్పుడూ ఆత్మయందే నిలిపి వుంచవలయును. అయితే చంచలమైన స్వభావముగల మనస్సు తనకు రుచికరమైన విషయములనుండి ఊరకమరలిరాదు. ఎప్పుడైతే వివేకముచే కలిగిన జ్ఞానబలముతో ఆయా విషయములయందు నశ్వరత్వాది దోషములను విచారించి చూపినచో వెంటనే మనస్సునకు ఆయా విషయములయందు విరక్తిభావము జనించును. అసహ్యభావముకూడ కలుగును. అప్పుడు ఆ మనస్సు ఆ విషయములనుండి వెనుకకు మరలును. కావున వివేకవైరాగ్యాదుల సహాయముచే

మనస్సునకు విషయములయందలి దోషములను బాగుగా నచ్చజెప్పి దానిని ఆత్మ యందు స్థాపించవలయును. అప్పుడు అంతఃకరణము సంకల్ప వికల్పముల నుండి ముక్తినిబొంది సర్వోపాధివినిర్ముక్తమగు నిర్గుణబ్రహ్మమునందు నిలిచియుండును. ఇదియే సమాధానము.

ఈ విధముగ శుభాశుభ విషయములయందు లగ్నమై సుఖదుఃఖములను అనుభవించుచున్న మనస్సును వివేక వైరాగ్యాదులచే కూడిన ప్రయత్నముచే, నిత్యానందదాయకము, ఆనందమే స్వరూపముగాగల బ్రహ్మమునందు నిలుపవలయును. "శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తివాసనాసరితః పౌరుషేణ, ప్రయత్నేన యోజనయా శుభేపథి" ఆ విధముగా అశుభమార్గములనుండి మరల్చబడిన సాధకుని మనస్సు శుభమార్గమున పయనించుటకు ప్రయత్నించును. అందుచే దానిని శిశువుని వలె బలాత్కారముగ అశుభ మార్గములనుండి మరల్చి శుభమార్గమున పయనింప జేయవలయును.(ఈ విషయమున విశదమగు వివరణ కొఱకు "సౌందరనందము" అను కావ్యమును చదువవగును)" అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరం, జన్తోశ్చిత్తం తుశిశువత్ తస్మాత్తచ్చాలయేద్బలాత్" ఆశ్లే యోగవాశిష్ఠమునందు గూడ "సమతాసాన్త్వనేనాశునద్రాగితి శనైః శనైః, పౌరుషేణ, ప్రయత్నేన లాలయే చిత్తబాలకమ్" అని చెప్పబడినది. అనగా చిత్తమనెడు బాలుని, సమత యనెడు బూరడింపువాక్యములతో మెల్లమెల్లగ పురుష ప్రయత్నముతో లాలింప వలెను అని లాలకమును శమాది సాధనముగ చెప్పబడినది. శమాదుల సంపాదనా కాలమందు చేయబడిన ప్రయత్నముల చేతనే మనస్సునందలి బాహ్యావాసనలన్నియు క్షీణించును. అప్పుడు మనస్సు విషయవాసనాశూన్యమై నిర్గుణ బ్రహ్మమునందు నిశ్చలముగా నిలిచియుండును.

ఇట్టి సాధన సామగ్రియున్న వానికి మాత్రమే ముముక్షుత్వము లభించును గాని ఊరక ఎటువంటి ప్రయత్నము చేయని వానిలకిభించనేరదు. "అహంకారాది దేహాన్తాన్,బంధానజ్ఞాన కల్పితాన్, స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా" అనగా ఎవ్వడైతే స్వస్వరూప సాక్షాత్కారమును కోరుతూ అంతఃకరణము మొదలు దేహము వరకునుగల

అజ్ఞానముచే కల్పితములైన బంధములను, అనగా వాటిపట్ల తనకున్న భ్రమ జనితమైన తాదాత్మ్యభావమును విడచుటకు ప్రయత్నించునో అతడే "ముముక్షువు" అనబడుచున్నాడు. "అంతఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి, అహమిత్యభిమానేన తిష్టత్యాభాసతేజసా, అహంకారః సవిజ్ఞేయః" అనగా ఈ చక్షురాదింద్రియము లందును, శరీరము నందును "అహం" "నేను" అను అభిమానముతో అంతః కరణము తనయందు వ్యాపించి యున్న చైతన్యముతో ప్రవర్తించుచుండును. అట్లు ప్రవర్తించు అంతఃకరణమే అహంకారము లేదా ఆనందమయకోశము అను పేరుగల భోక్తయగు జీవుడు అహంకారమనబడును. "సుప్తిగతైః సుఖలేశైరభి మనుతే సుఖీభవామీతి. ఆనంతకోశానామాసో అహంకారః కథంభవేదాత్మా" అనగా ఆనందమయకోశమను పేరుగల ఏ అహంకారము సుషుప్తియందు కలుగు సుఖ లేశములచే "నేను సుఖము కలవాడను" అనిభావించుచుండునో అది ఆత్మకాజాలదు. "ఆత్మనిరూపణము" అను గ్రంథమునందు గూడ ఆనందమయకోశమే అహంకార మని చెప్పబడినది. అదికూడ అజ్ఞాన కల్పితమేయనియు, మనోరూపమగు ఉపా ధినిబట్టి, గౌణమగు వికారమనియు, చెప్ప వచ్చును. కావున జ్ఞానోపలబ్ధికొఱకు ఆత్మగా భావింపబడుచున్న ఆనందమయ కోశము మొదలు విజ్ఞానమయ, మనో మయ, ప్రాణమయ, అన్నమయకోశము వరకునుగల బంధము అన్నింటిని స్వస్వ రూప జ్ఞానముచే విడచుటకు, వాటియందు మరల ఎన్నడును అహంబుద్ధి కలుగ కుండు విధమున బాధించుటయు చేయవలసియున్నది. స్వస్వరూప జ్ఞానము కలుగ గనే "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేనకం తంపశ్యేత్"అను శ్రుతిననుసరించి స్వభిన్నమగు ఏ వస్తువును భాసింపదుగానకోశ పంచాత్మకమగు బంధము పూర్తిగా నశించును అని చెప్పుచున్నది.

ఈ మోక్షేచ్ఛ గూడ అధికారి సంబంధముచే మంద, మధ్య ప్రవృద్ధ "మను మూడు తరగతులుగా విభజింపబడినది. మంద ముముక్ష—మోక్షము నిత్య సుఖ రూపమే అయినను, సాంసారిక వాసనలచే వాసితమగు అంతఃకరణము గలవారికి మోక్షేచ్ఛ కలుగుటయే దుర్లభము. బంధ మోక్షములకు సంబంధించిన శాస్త్ర, గురూప దేశ వాక్యములు విను కాలమంతు మోక్షేచ్ఛ కించిత్తుకలిగినను అది ఘనన్సు అనగా

బుద్ధియందు పూర్వ వాసనా బలము వలన నిలువ జాలదు. ఇదియే మంద ముముక్షు· మధ్య మోక్షేచ్ఛ—శాస్త్ర, గురు వచనములు శ్రవణము చేసిన తరువాత కలిగిన వివేక బలంతో ఏ పురుషుడుసాంసారిక విషయములందు గలదోషములను పరిశీలించిన వాడై, వాటివిషయమున వైరాగ్యభావము కలిగినవాడై శాస్త్రమునందు చెప్పబడినట్లుగా సర్వ కర్మసన్యాసము చేసి పూర్ణజ్ఞానోపలబ్ధికై వెళ్ళుట జరుగునో అప్పుడు అంతకు పూర్వము ఉదయించిన మంద ముముక్ష మధ్య ముముక్షగా భావింప బడును.

ప్రవృద్ధ ముముక్ష—వైరాగ్యము తీవ్రము అయిన కొలది మనస్సు సర్వ విషయములను త్యజించి శాంతమై సమాధానమును పొందుచుండును. ఆ విధముగా గురువుయొక్క ఆశీర్వాద బలంతో ఆ పురుషుడు నిత్య సుఖరూపమగు మోక్షమును పొందుటకై తహతహ లాడుచుండును. మోక్షమును పొందుటలో కొంచెము కూడా ఆలస్యము సహింపజాలకుండును. ఈ విధముగా తీవ్ర రూపముదాల్చిన మోక్షేచ్ఛ ప్రవృద్ధ మోక్షేచ్ఛ అనబడుచున్నది. అట్టి ప్రవృద్ధమైన మోక్షేచ్ఛగల పురుషుతే పూర్ణాధికారియై ముక్తావస్థను పొందును. ఈ విధముగా ముముక్ష మోక్షేచ్ఛారూపమే అయిననూ అది ఎప్పుడు ప్రవృద్ధ మగునో అప్పుడే ఫలమును ఇచ్చును గాన దాని ప్రవృద్ధికొఱకై విషయ వైరాగ్యమును, శమాదిష్కటమును, గురు ప్రసాదమును, సంపాదించుటకై ముముక్షువు అయిన పురుషుడు ప్రయత్నించుచుండవలయును.

తీవ్రమైన వైరాగ్యము, తీవ్రమైన మోక్షేచ్ఛ ఇవి రెండు సంపూర్ణ జ్ఞానోపలబ్ధికి ముఖ్యసాధనములు. ॥ వైరాగ్యంచ ముముక్షుత్వం తీవ్రం యస్యతువిద్యతే, తస్మిన్నే వార్థవ స్తః స్యుఃఫలవ న్తః శమాదయః॥ అనగా ఎవనికి తీవ్రమైన వైరాగ్యము మోక్షేచ్ఛయు వుండునో వానియందే శమాది శబ్దములు ఫలవంతము లగును. మనస్సును అన్నివైపుల నుండి మరల్చి ఇచ్ఛిత విషయమునందు అనగా స్వస్వరూపమునందు అనగా అఖండాకార వృత్తిలో బ్రహ్మతత్వమునందు లగ్నము చేసి వుంచుటయే యథార్థమైన ముముక్షుత్వమునకు ఫలము. అదియే మోక్షము కావున ఆత్మసాక్షాత్కారమునకు సాక్షాత్సాధనముమనస్సును బ్రహ్మభావమునందు నిలపివుంచు టయును భక్తియే. "మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ. స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అనగా మోక్షమునకు కారణమగు సాధనములలో

భక్తియే గొప్ప సాధనము. స్వస్వరూపము యొక్క నిరంతరధ్యానమే భక్తియని చెప్పబడుచున్నది. స్వస్వరూపాను సంధానమనగా నిధిధ్యాసనము. ఇదియే స్వరూప సాక్షాత్కారమునకు ప్రత్యక్ష సాధనము. "నీ స్వరూపము బ్రహ్మమే,నీవు బ్రహ్మమే. ఆ బ్రహ్మము కంటె నీవు వేరుకాదు,"తత్త్వమసి" అని శ్రుతి వాక్యము. ఆ వాక్యము నుండి. ఆచార్యోపదేశముచేతను విని ఆ విషయమునందు మనస్సును లగ్నముచేసి వుంచుకొనవలయును. విజాతీయ ప్రత్యయములచేత బాధింపబడని, అనగా ఇతర విధములగు, వస్తు సంబంధములైన ఆలోచనలచే అడ్డుకొనబడని సజాతీయ ప్రత్యయ ప్రవాహము అనగా నిరంతరం స్వస్వరూప సాక్షాత్కారము అవిచ్ఛిన్నముగ కలిగి యుండుటయే భక్తి అని చెప్పబడుచున్నది. ఇదియే స్వరూప సాక్షాత్కారమునకు అసాధారణకరణము. శమాదులు మొదట విచారమును కలిగించి తద్వారా నిదిధ్యాసనమును, తద్వారా జ్ఞానోపలబ్ధిని కలిగించును. ఈ విధముగా నిదిధ్యాసనమే జ్ఞానోపలబ్ధికి సాక్షాత్సాధనమగుచున్నది. కావున మోక్షమునకు కారణమగు జ్ఞానోపలబ్ధికి ఏ సాధన సముదాయము అవసరమో ఆ సాధనములలో భక్తియే సాక్షాత్సాధనము గాన శ్రేష్ఠమైనదని చెప్పబడినది. వివేకము మొదలు నిదిధ్యాసము వరకును గల సాధనములే జ్ఞానోపలబ్ధికి ముఖ్యసాధనములు.

స్వప్రయత్న ప్రాధాన్యము-సాధకుడైనవాడు ఎల్లప్పుడును అనగా మూడవ స్థలయందును భవబంధ విముక్తికై ప్రయత్నించుచునే యుండవలయును. ఆ విముక్తి వారి వారి ప్రయత్నముచేత మాత్రమే సాధ్యమగును. "ఋణవిమోచన కర్తారః పితుస్సన్తిసుతాదయః, బంధమోచన కర్తాతు స్వస్మాదన్యోనవిద్యతే." అనగా తండ్రి చేసిన ఋణములను తీర్చు పుత్రులు మొదలగువారు వుండవచ్చును, కాని అజ్ఞానము చేత జన్మజన్మలుగా కలిగిన భవబంధముల నుండి విడిపించువాడు తనకంటె ఇతరుడైనవాడెవ్వడును ఉండడు. అజ్ఞానయన అహంకారము మొదలు దేహము వరకును గల అనాత్మ బంధము నుండి విడిపించువాడు మాత్రము తనకంటె భిన్నుడెవ్వడును ఉండజాలడు. అనాత్మయగు అంతఃకరణాది విషయమున తనకుగల అధ్యాసమును తొలగించగలిగిన వాడు తానే కాని మరియొకరు వుండజాలరని భావము. తనకు ఒక

వస్తువునకు సంబంధించిన భ్రమ కలిగినప్పుడు ఆ భ్రమ తొలగవలెనన్నచో ఆ వస్తువును గూర్చిన యథార్థజ్ఞానము కావలసియుండును. ఉదాహరణమునకు కను చీకటిలో పడియున్న రజ్జువును చూచి సర్పము అని భ్రాంతి జెంది భయముచే బాధ పడుచున్న వానిని దీపపు వెలుగులో ఆరజ్జువుయొక్క యథార్థ జ్ఞానము కలిగించుట ద్వారానే ఆ భయము నుండి విముక్తుని చేయగలరు గాని మరియొక విధముగా సంభవముకాదు. అట్లే తనచే అనుభవింపబడుచున్న బంధమును తానే తొలగించుకొనవలయునుగాని మరియొక రెవ్వరును తొలగింపజాలరు. అట్లే "క్షుధాదికృత దుఃఖంతు వినాస్వేన నకేనచిత్" అనగా ఆకలి మొదలగువాటిచేత కలుగు దుఃఖము తాను ప్రయత్నించి అన్నపానాదులు స్వీకరించినగాని తొలగజాలదు. అట్లేలయన - ఆకలి మొదలగు వాటిచే కలుగు దుఃఖమును తాను తప్ప ఇతరులెవ్వరును తొలగింపజాలరు. పుత్రాదు లెవ్వరైన అన్నపానాదులు స్వీకరించినను తండ్రి యొక్క ఆకలి దప్పులు తొలగనేరవు. అట్లే "పథ్యమౌషధసేవా చక్రియతే యేనరోగిణా ఆరోగ్య సిద్ధి ర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా" అనగా పథ్యమును, అనగా ఔషధ సేవనమును, యే రోగి చేయునో అతనికి మాత్రమే ఆరోగ్యసిద్ధి కనబడుచున్నది. ఆ పథ్యము, ఆ ఔషధసేవనము ఎవ్వరో మరి యొకరు చేసినందువలన తనకు రోగము శాంతించి ఆరోగ్యము కలుగజాలదు. అందుచే దృఢతరమగు సాధన చతుష్టయ సంపత్తియు, వేదాంత శ్రవణమును జ్ఞానోపలబ్ధికి ముఖ్యకారణములగుచున్నవి.

"వస్తు స్వరూపం స్ఫుటబోధచక్షుషా స్వేనైవవేద్యం నతు పండితేన" అనగా ఆత్మరూపమగు వస్తువుయొక్క యథార్థ స్వరూప స్వభావములను నిర్మలమగు జ్ఞానమనెడు నేత్రముతో తన చేతనే చూడబడవలసియున్నది. తనకంటె భిన్నుడైన ఏ పండితుని చేతనుకాదు. అట్లే "అవిద్యా కామ కర్మాది పాశబంధవిమోచితుంకః శక్నుయా ద్వినాత్మానం కల్పకోటి శతైరపి" అనగా స్వస్వరూపము తెలియకపోవుటచే బాహ్యవస్తువులపై కామము ఏర్పడుచున్నది. దానివలన ప్రవృత్తి ఏర్పడుచున్నది. దానిచే బంధము అనగా రాగము ద్వేషము మొదలగునవి కలుగుచున్నవి. దానివలన సుఖ దుఃఖములు, జన్మ-మరణములు కలుగుచున్నవి. వీటి నుండి విడిపించుటకు తాను తప్ప అనగా తాను వివేకబలంతో ప్రయత్నించి తప్ప

ఇతరులు ఎవ్వరును సమర్థులు కానేరరు. అజ్ఞానమువలననే ద్వైతభావము కలుగుచున్నది. దానివలన కామము ఏర్పడుచున్నది కామమువలన కర్మ [illegible] చున్నవి. ఆ కర్మలు ఫలములను కలిగించుచున్నవి. ఆ ఫలములు ప్రారబ్ధమును కలుగజేయుచున్నవి. ఆ ప్రారబ్ధమువలన ఎడతెగని జన్మమరణములు కలుగుచున్నవి. ఆత్మజ్ఞానము పొందిన వానికి కామములన్నియు ఇచ్చటనే తొలగిపోవుచున్నవి. "కృతాత్మన స్త్వహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః, యద్యద్ధి కురుతే జనః తత్తత్కామస్య చేష్టితమ్"అనగా ప్రాణి ఎటువంటి కర్మలు చేసినను అది అంతయు కామ చేష్టయే అని స్మృతి వాక్యము. కావున అజ్ఞానము, ఆశ, ధర్మాధర్మములు, అనెడు పాశములచే ఏర్పడు బంధమును అనాత్మాధ్యాసము, జ్ఞానోపలబ్ధి కలుగకుండగ అనగా ఆత్మసాక్షాత్కారము కలుగకుండగ విడచుటకు తాను తప్ప మరెవ్వరు సమర్థులు కానేరరు. స్వస్వరూపమును తానే సాక్షత్కరించుకొనవలసి యుండుటచే ఆ సాక్షాత్కారము సమ్యగ్ జ్ఞానములేకుండగ కలుగదు. "నయోగేన, న సాంఖ్యేన, కర్మణానో న విద్యయా, బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్షస్సిధ్యతి నాన్యథా" అనగా యోగశాస్త్రముచేగాని, సాంఖ్యశాస్త్రముచేగాని, యజ్ఞాది కర్మలచేగాని సగుణోపాసనా రూపమగు విద్యచేగాని మోక్షము సిద్ధించదు. బ్రహ్మాత్మైకత్వజ్ఞానముచేతనే మోక్షము సిద్ధించును. అట్టి జ్ఞానమే సమ్యగ్ జ్ఞానము.

"వేదం అంటే ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని సాధించడానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పే గ్రంథం" — తైత్తరీయం.

# స్వస్వరూప సాక్షాత్కారము

మనయొక్క నిజమైన స్వరూపము ఏ విధముగా వున్నదో మనకు తెలియదు. సామాన్యముగా ఏ ఒక్కరూ గూడ తన యధార్థమైన స్వరూపాన్ని గుర్తించేటందుకు ప్రయత్నించుట లేదు గూడాను. లోకులు నిర్మలమగు తన స్వరూపమును ఎఱుంగలేక మలమాంస రూపంబును, అపరిశుద్ధమును అగు ఈ దేహామునే తమ స్వరూపముగా భావించుచున్నారు. అటుపైన నీరు మొదలగువానిచే ఈ దేహామును శుద్ధిగ చేయ ప్రయత్నించుచున్నారు. ఎప్పటికైనను శుద్ధమగు పదార్థమే శుద్ధమైయుండును గాని అపరిశుద్ధమగు దానికి ఎప్పటికైనను శుద్ధికలుగనేర్చునా? ఈ స్థూల దేహము ఎట్లు ఆహార పరిణామమువలన ఏర్పడినదో అట్లే మలము గూడ ఆహార పరిణామమువలననే ఏర్పడుచున్నది. ఈ విధముగా కారణమునుబట్టి చూచిన రెండున్నూ సమానములే అగుచున్నవి. అయినను లోకులు మాత్రము దేహాము నందు మాత్రము ఆత్మాభిమానమును చూపుచున్నారు. కాని దానితో సమానమగు మలమునందు గూడ అట్టి అభిమానమును వుంచుటలేదు. లోకుల వ్యవహారము ఎంత విచిత్రమైనది. వారి బుద్ధి విచార శూన్యమై ఎంత విచిత్రముగ ప్రవర్తించుచున్నది? లోకులు ఇట్లు విచార శూన్యులుగాక జ్ఞానవంతులగు వారు ప్రయత్నపూర్వకముగా స్వస్వరూపమును తెలుసుకొనుటకై ప్రయత్నించవలయును. స్వస్వరూప సాక్షాత్కారము సామాన్యముగ కలుగునది కాదు. అనేకకోట్ల జన్మలనుండియు పుణ్య కర్మలను ఆచరించుచు రాగ రాగ ఒక జన్మమున చిత్తము పరిశుద్ధమగును. అట్లు పరిశుద్ధమైన మనస్సునకు వివేకము కలిగి తన స్వరూపమెట్టిదో తెలుసు కొనవలయుననెడి సద్బుద్ధి కలుగును. అట్లు సద్బుద్ధి కలిగిన మహాత్ములే తన స్వరూప సాక్షాత్కారమునకై ప్రయత్నింతురు. అలా ప్రయత్నించకపోవడానికి అజ్ఞానమే; కారణము మరేమియుకాదు. ఏలనన తనకు అనగా తన కన్నులకు కానుపించు ఈ స్థూల శరీరమే తాననివారి యందరి అభిప్రాయము. అలా అయినప్పటికీగూడా "ఇది నాచేయి, నా కాలు, నా తల, నా వీపు, నా ముఖము, నా చెవులు, నా కన్నులు" అని అంటోకగా వీటినన్నింటిని

తాను చూస్తూ వున్నట్లుగాను, తాను మాత్రము పీటికన్నింటికిని వేఱుగా వున్నట్లు గాను, అనగా వీటినన్నింటిని చూస్తూవున్న సాక్షిగాను, తాను అనుభవము కలిగియే యున్నాడు. ఈ అనుభవమునుబట్టి చూచిన, ఈ స్థూల శరీరము తాను కాదనియు, తాను దానియందు వేఱుగా వున్నాడనియు, అట్లు తాను తెలుసుకొంటూ వున్నాడనియు తెలియుచున్నది. ఇంకకొంచము విచారించి చూచిన జాగ్రదవస్థయందు అనగా మెల కువగా వున్నప్పుడు మాత్రము తాను ఈ స్థూల శరీరమునందు వున్నట్లుగా అను భవము కలిగియున్నాడనియు, స్వప్నకాలమునందు తనకు, ఈ స్థూల శరీరమునకు ఎటువంటి సంబంధము కలిగియుండుటలేదనియు, అనగా తన ఈ స్థూల శరీరము మంచముపై పడియుండగానే తాను మాత్రము దానిని విడిచి ఎచ్చటెచ్చటనో తనకు నచ్చిన తానుమెచ్చిన దేశవిదేశములయందు తిరుగాడుచు, తాను మెచ్చిన విషయము లను పొందుచూ, ఈ స్థూల శరీరముతో ఎటువంటి సంబంధమూ లేని కర్తృత్వ భోక్తృత్వాదులను కలిగి వుంటున్నాడనియు తానుఅనుభవించుచున్నాడు. దీనినేమనము స్వప్నావస్థ అని చెప్పుచున్నాము. ఇంతేగాక సుషుప్తియందు అనగా గాఢమైన నిద్రా సమయమందు జాగ్రత, స్వప్నావస్థల యందలి సర్వవిధములగు కర్తృత్వ, భోక్తృత్వములను మరచి, ఎటువంటి కార్యకలాపములులేక, ఏమియు తెలియని వానివలె, ఏమియు చేయక, ఎటువంటి శరీరము లేనివానివలె, ఒక్క మాటలో చెప్ప వలెనన్న మరణించిన వానివలె, తన స్థూల శరీరముతో ఎటువంటి సంబంధమును ఎఱుగక సుఖముగ వుంటున్నాను అను అనుభవము కలవాడుగా ఉంటున్నాడు.

ఈ మూడు విధములగు అనుభవములను విచారించి చూచిన తనకు నిత్యమూ మూడు అవస్థలు కలుగుచున్నవనియు, ఒకటి తన స్థూల శరీరముతోను, మరియు ఆశరీరమునకు సంబంధించిన బాహ్యేంద్రియములు అనగావాక్, పాణి. పాద, పాయు, ఉపస్థములు, అనబడు కర్మేంద్రియములతోను కూడి బాహ్యమైన ఈ జగత్తును తాను అనుభవించుచున్నాననియు, అటు తరువాత తాను తన ఈ స్థూల శరీరమును విడిచి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను పేర్లుగల అంతఃకరణము, మరియు ఆ అంతకరణముతో కూడియున్న సూక్ష్మ శరీరమును ఆశ్రయించి, మనోకల్పితమైన సూక్ష్మ ప్రపంచము, అనగా స్వప్న ప్రపంచము, అనగా ఆంతరిక ప్రపంచమును

అనుభవించుచున్నాననియు, గాఢనిద్రతోకూడిన సుషుప్తియందు ఆజాగ్రత్ప్రపంచము ఆ స్వప్న ప్రపంచమూ రెండూ లేక, తానెక్కడ, ఎటువంటి ద్వైతమూ లేక, ఎటువంటి విషయములులేక సుఖముగా, ఆనందముగా, ఎటువంటి దుఃఖములులేక వుంటున్నాననియు తలంచుచూ అట్టి అనుభవమును కలిగివుంటున్నాడు.

ఆ అనుభవములను ఆధారముగాజేసుకొని విచారించుచున్న ప్రతి పురుషునకును (ఇచ్చట ఆడమగ భేదములేదు) మూడు విధములగు అవస్థలు అనగా జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు కలుగుచున్నవనియు, ఆయా అవస్థలయందు అవస్థానుకూలములగు, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు కలిగి అనగా మూడు వేఋవేఋ ఉపాధులయందు, వేఋ వేఋ రూపములతో తానే వుంటున్నానను అనుభవము దృఢమగుచున్నది. ఇందుచే మరియొక అనుభవము గూడ కలుగుచున్నది. అది ఏదన తనయందు ఈ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను వెలిగించి, అనగా వాటిని చైతన్యవంతము చేసి సర్వమును అనుభవింపజాలు ఒకానొక సర్వశక్తివంతమైన, చైతన్య వంతమైన, స్వయంజ్యోతిర్మయమైన, తత్వము కలదని అనుభవమునకు వచ్చుచున్నది. ఆ తత్వమునే, శాస్త్రజ్ఞులు మూడు అవస్థలను కల్పించి, మూడు విధములుగా చూపుచున్నారు.

1. జాగ్రదవస్థ – వైశ్వానరుడు—

జాగ్రదవస్థయందు — జాగ్రదవస్థయనగా మనస్సు ఇంద్రియములతో కూడి విషయములను కల్పించి, కర్తృత్వ భోక్తృత్వములు కలిగియుండు అవస్థ – స్థూల – బాహ్య – జగత్తును సృష్టించి అనుభవించు పరమార్థ ప్రతి బింబమైన తత్వమును విశ్వుడు, లేక వైశ్వానరుడు అని జ్ఞానులు తెలుసుకొనుచున్నారు.

"జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః సప్తాంగః ఏకోనవింశతి ముఖః
స్థూలభుక్ వైశ్వానరః ప్రథమపాదః" మాం. ఉ. 3వ మంత్రము. అనగా జాగరిత స్థానమందుండువాడును, బాహ్యప్రజ్ఞగలవాడు, అనగా బాహ్యేంద్రియములద్వారా బాహ్యప్రపంచమును అనుభవించువాడును, ఏడు అవయవములు గలవాడును, ఏడు అంగములు అనగా ద్యులోకమే శిరస్సుగాగలవాడు, ఆదిత్యుడే కన్నులుగా గలవాడు. వాయువే ప్రాణములుగా గలవాడు, ఆకాశమే శరీరముగా గలవాడు, సముద్రములే మూత్రముగా గలవాడు, పృథివియే పాదములుగా గలవాడు, అగ్నియే

నోరుగా గలవాడు, మరియు పంథొమ్మిది ముఖములు గలవాడును, పందొమ్మిది ముఖములు లేక నోళ్ళు అనగా ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు, పంచప్రాణములు, అంతఃకరణములు నాలుగు అనగా మనస్సు, చిత్తము, బుద్ధి అహంకారము, అటుపైన స్థూలభోగము కలవాడు. అనగా స్థూల విషయములను అనుభవించువాడు ఈ వైశ్వానరుడు. వైశ్వానరుడు అనగా విశ్వమంతటను వ్యాపించి యున్నవాడు; విశ్వమును తన మహిమచే వెలిగించువాడు అనగా కలిగించువాడు విశ్వనరుడు.

ఈ విధముగా విశ్వమంతటను వ్యాపించి బాహ్య ప్రపంచమును అనుభవించు వాడు వైశ్వానరుడు. జాగ్రద వస్థయందుండువాడు. అనగా జాగ్రత్తు అను స్థానమందుండువాడు, జాగ్రత్తు అంటే మెలకువ, అనగా ఇంద్రియాదుల ద్వారా విషయములను తెలుసుకొను అవస్థ, స్థితికి మెలకువ అని పేరు. జీవునకు మెలకువ, కల, నిద్ర అనే మూడు వేరు వేరు అనుభవములు కలుగుచున్నవి. జాగ్రదవస్థలో స్థూల శరీరమంతటను వ్యాపించి వుండు ఆత్మచైతన్యము బహిప్రజ్ఞ కలది. ఆ ప్రజ్ఞారూపునే మనము వైశ్వానరుడు అని పిలుచు చున్నాము. ఆ బహిప్రజ్ఞగల వైశ్వానరుడు బాహ్య ప్రపంచమును తెలుసుకొనుచున్నాడు. అనగా స్థూల విషయములను గ్రహించి, లేక కల్పించి వాటిని అనుభవించు వాడు. ఈ జాగ్రదవస్థయందు ఆ ఆత్మ చైతన్యమునకు బాహ్య విషయములను పొందుటకు పందొమ్మిది ద్వారములు, నోళ్ళు, మార్గములు, అనగా ఇంద్రియములు, సాధనములు వుంటున్నవి. చెవ్వు మొదలగు జ్ఞానేంద్రియములు ఐదు. వాక్కు మొదలగు కర్మేంద్రియములు ఐదు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు అనబడు ప్రాణములు ఐదు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, మొదలగు అంతఃకరణములునాలుగు, ఇలా మొత్తము పందొమ్మిది సాధనముల ద్వారా ఈ వైశ్వానరుడు అనబడు ఆత్మ చైతన్యము, స్థూల శరీరమును ఉపాధిగా చేసుకొని బాహ్యమగు ప్రపంచ విషయములను అనుభవించు చున్నాడు.

ఈ విధముగా ఈ వైశ్వానరుడు బాహ్య జ్ఞానముకలవానివలె తెలియబడు చున్నాడు. అనగా బాహ్యవిషయములను బాగుగా తెలుసుకొని వాటిని అనుభవించు చున్నవానివలె వుంటున్నాడు. యథార్థముగ విచారించి చూచిన, బాహ్యప్రపంచము,

అందలివిషయములు అన్నియు అజ్ఞాన కల్పితములు. అందుచే ఈ అజ్ఞాన కల్పిత విషయములను, అనగా ఈ అజ్ఞాన కల్పిత బాహ్య ప్రపంచమును అనుభవించు వైశ్వానరుడు మాత్రము, శుద్ధమైన, నిత్యమైన, సత్యమైన ఆత్మపదార్థము ఎట్లు కాగలడు? కావున వైశ్వానరుడు ఆత్మ యందు అజ్ఞానముచే కల్పించబడినవాడే. అనగా వైశ్వానరుడు అను పేరున స్థూలశరీరమునకు సంబంధించిన జాగరిత స్థానము నందుండి బాహ్య ప్రపంచమును ప్రకాశింపజేయు ఆత్మ ప్రతిబింబమే ఈతడు. ఈతనికి ద్యులోకాదులతో కూడియున్న ప్రపంచము ఉపాధిగా వున్నది. మనకు మెలకువలో కనుపించు ప్రపంచమంతటిని ప్రకాశింపజేయు ఆత్మరూప చైతన్యమే వైశ్వానరుడు. ఇచ్చట మనము గ్రహించవలసియున్న సత్యమేదనగా— మన శరీరమునకు, మన మనస్సునకు, లేక కన్నులు మొదలగు జ్ఞానేంద్రియములకు ఈ బాహ్య ప్రపంచమును తమంతటతాముగా గ్రహించగల శక్తిజ్ఞానము, లేదు. అందుచే ఆ ఆత్మచైతన్యమే ఈ బాహ్యేంద్రియములద్వారా దృశ్యమయ ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నది. ఇట్లు ప్రకాశింపజేయు ఆత్మచైతన్యమే వైశ్వానరుడు. ఈ వైశ్వానరునికి ఈ బాహ్యవిషయ ప్రపంచ మంతయు, ఉపాధిగా అగుచున్నది. అనగా ఈ బాహ్య విషయప్రపంచ మంతటను, ఆ ఆత్మ చైతన్యరూపుడగు విశ్వుడు వ్యాపించి యున్నాడు ఈ ఆత్మ చైతన్యరూపుడగు వైశ్వానరునకు - విశ్వనరునకు — అనగా జాగ్రదవస్థయందున్న మనకు తోచుచున్న స్థూల శరీరము, మరియు దానియందే ఇంద్రియములే మనకు స్వరూపము అనగా ఉపాధిగా అగుచున్నది. ఈ శరీరేంద్రియములకు మించిన జ్ఞానము మనకు వుండదు. అందుచే మనము కార్యకరణ సంఘాతమగు ఈ స్థూల శరీరమునకు కట్టుబడి ఆ సర్వవ్యాపకుడగు పరబ్రహ్మముతో ఎటువంటి సంబంధము లేనివారివలె పరిచ్ఛిన్నులముగా అనగా జీవులముగా భ్రాంతిజెందిన వారమై వుండిపోవుచున్నాము. అందువలన ఈ జాగ్రదవస్థయందు వైశ్వానరుడు తన ఇంద్రియములకు గోచరమగుచున్న ఈ దృశ్య ప్రపంచమును మాత్రమే నిత్యమని దృఢమైన నమ్మకముతో వుండిపోవు చున్నాడు. ఈదృశ్యప్రపంచ మంతయు ఆతడు ఈ జాగ్రదవస్థయందు వున్నప్పుడు మాత్రమే వున్నట్లుగా తోస్తుంది. అందుచే ఈదృశ్య ప్రపంచమే ఆతని ఉపాధి లేక స్వరూపము. ఈ విధముగా ఆధ్యాత్మిక,

అనగాదశేంద్రియసులు, మరియు అంతఃకరణ చతుష్టయమునకు, సంబంధించిన ఆంతరిక ప్రపంచము. ఆధిభౌతిక అనగా వెలుపల గోచరించు దృశ్యప్రపంచ మంతయు, ఆధిదైవిక-అనగా పైనవున్న ద్యులోకముమొదలగు దైవిక ప్రపంచము. ఈప్రపంచమే ఈ వైశ్వానరునకు తోచు ప్రపంచము. అందుచే ఈతనికి ఇదియే ఉపాధి. ఈ ఉపాధియందు చైతన్యస్వరూపుడైయుండి ఆ సర్వమును అనగా బాహ్యమున దృశ్యమానమగుచున్న ప్రపంచమునంతటిని తెలుసుకొనుచున్న వైశ్వానరుడు ఆత్మ స్వరూపుడగు బ్రహ్మమే. ఆతనికి ఎటువంటి వికారములులేవు. ప్రతిక్షణము నానా రూపములుగా తోచుచున్న బాహ్యప్రపంచమును సృష్టించి తెలుసుకొనుచున్న జ్ఞానరూపుడే ఆతడు. అయినను ఉపాధి తాదాత్మ్యముచేతస్థూల శరీరము, మరియుదానికి సంబంధించిన ఇంద్రియముల సహాయముతో విషయము లను సృష్టించి, వాటిని సంగ్రహించి, అనుభవించుచూ కర్తగాను, భోక్తగాను, విషయములయందు రాగద్వేషములు కలవానిగాను తోచుచున్నాడు. ఈ విధముగా జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయప్రంచమునంతటిని తనకు సంబంధించినదిగా తలంచి భ్రాంతిపొందుచున్నాడు. అంతేగాని ఈ బాహ్య ప్రపంచము నంతటిని తానే వెలి గించుచున్నాననియు, తన చేతనే అదియంతయు సృష్టించబడి చేతనత్వము కల దానిగా తోచుచున్నదనియు తెలియని జీవునిగా వుండిపోవుచున్నాడు.

ఈకారణముగ ప్రపంచము మరియు ఆ ప్రపంచమునందు తనవలెనే శరీరేం ద్రియాల సంఘాతమునకు కట్టుబడియున్న అనేకజీవులను చూస్తూ వాటినన్నింటిని గూడ తనవలె వేరు వేరు జీవులుగా తలంచుచున్నాడు. అంతేగాని ఆ సర్వజీవుల యందును వ్యాపించియున్న ఒకే ఆత్మతత్త్వము తనలోవ్యాపించియున్న సర్వాత్మ తత్త్వమేనని తెలియక జీవుని రూపమున ఈ వైశ్వానరుడు మిగిలిపోవుచున్నాడు. కొంచము విచారించి చూచిన ఈ వైశ్వానరుడే ఆ పరమాత్మ. ఈతని వునికియందే ఈ సర్వప్రపంచము రూపమును ధరించుచున్నది. అట్లుధరించి నానావిధములైన వ్యాపారములు చేయుచున్నట్లుగా తోచుచున్నది. ప్రపంచమంతయు అట్లు తోచు చున్నను తానుమాత్రము అనగా ఈ పరమాత్మ అనగా వైశ్వానరుడు అనగా ఈ జాగృత ప్రపంచమనే ఉపాధియందు వ్యాపించివున్న పరమాత్మ ఎటువంటివికార

మును చెందక ఆకల్పిత ప్రపంచమునంతటిని తెలుసుకొనుచున్నాడు అయితే భ్రాంతి చేత ఆకల్పిత ప్రపంచమునంతటిని సత్యముగా భావించి దానియందు తాదాత్మ్యమును చెంది దాని నంతటిని తనకుతోచిన విధముగా అనుభవించుచున్నాడు. అందుచేతనే ఈ వైశ్వానరుని స్థూలభోగముగలవానిని, "స్థూలభుక్"గా తెలుసుకొనుచున్నాము. ఈ విధముగ పరమాత్మస్వరూపుడైన ఈ వైశ్వానరుడు ఈ సమస్త బాహ్య అనగా మనకు జాగృతకాలమందు తోచుదృశ్యప్రపంచమునంతటినీ తన చైతన్యముచే చైతన్యవంతముచేసి దానికి కర్తవలె భోక్తవలె తోచుచున్నాడు.

స్వప్నావస్థ ;—

"స్వప్నస్థానోంతఃప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః,
ప్రవిక్తభుక్, తైజసోద్వితీయః పాదః" మాం. ఉ. 4వ మంత్రం

స్వప్నస్థానమందు, అనగా స్వప్నావస్థయందు చరించువాడు. అంతఃప్రజ్ఞుడు, అనగా లోపలిభాగమునందు ప్రజ్ఞగలవాడు. జాగ్రత్ పురుషుడు అనగా జాగ్రదవస్థయందు అనగా బాహ్య ప్రపంచమునందు సంచరించు ఆత్మచైతన్య రూపుడైన వైశ్వానరునివలె ఈతడు బాహ్యప్రపంచమునందు సంచరింపడు. ఆంతరిక ప్రపంచమునందు అనగా కేవలము మనస్సుచే కల్పించబడు ప్రపంచమునందు అనగా స్వప్న ప్రపంచమునందు సంచరించువాడుగాన అంతఃప్రజ్ఞుడు. ఈతడుగూడ బాహ్య ప్రపంచమునందు సంచరించు వైశ్వానరునివలె సప్తాంగుడు. అనగా జాగ్రత్ పురుషునివలె ఈ స్వప్నపురుషునికిగూడ ఏడు అంగములు –(1) ద్యులోకమనే శిరస్సు, 2) సూర్యుడు అనబడే నేత్రములు, 3) వాయువు రూపమగు ప్రాణము, 4) ఆకాశ రూపమగు దేహమధ్యభాగము, 5) జలరూపమునవున్న మూత్రస్థానము, 6) పృధివి రూపమునగల పాదములు, 7) ఆహావనీయ రూపమైన అగ్ని, ఈవిధముగ ఏడు అంగములు కలిగి మూర్తరూపమైయున్నాడు. అటుపైన పందొమ్మిది ముఖములు లేక ద్వారములు, నోళ్ళు కలవాడు అనగా ఐదు బాహ్యేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు ప్రాణములు మనోబుద్ధి చిత్తహంకారములు నాలుగు మొత్తము పందొమ్మిది ముఖములు అనగా నోళ్ళు గలవాడు. ఈతడే "ఏకోనవింశతి ముఖః" అనగా ఒక్కటి తక్కువగా ఇరువది ముఖములు గలవాడు. అటుపైన

"ప్రవి క్తభుక్" అనగా సూక్ష్మమైన వాసనలను మాత్రము భోగించువాడు. లేక బాహ్యవిషయముల నుండి విభజ్యమానములైన వాసనాల్పఖండములను. అనగా బాహ్యవాసనలవల్ల కలిగిన సూక్ష్మవాసనలను, సేవించువాడు, ఈతడే తైజసుడు. ఏల యన బాహ్యములైన సూర్యచంద్ర అగ్న్యాదుల అపేక్షలేకయే తన స్వరూపగతమైన తేజస్సుతో స్వప్నగత ప్రపంచమును సృష్టించి-వెలిగించి-భోగించువాడు గనుక తైజసుడు ప్రత్యగాత్మయే అనగా సర్వాంతర్యామియగు పరబ్రహ్మమే. స్వప్నావస్థ యందు సూక్ష్మశరీరముతో తాదాత్మ్యనుపొంది, ఆ స్వప్నజగత్తును సృష్టించి, కల్పించి, దానిని భోగించుచున్నాడు. ఈతడు అనగా ఈ తైజసుడు కేవలము స్వప్నావస్థయందే వునికి గలవాడగుటచే "స్వప్నస్థానీయుడు" అనబడుచున్నాడు.

స్వప్నము చాలా విచిత్రమైనది. అంతేగాదు చాలా రహస్యపూర్ణమైనది గూడ. దీనిని యధార్ధరూపంలో తెలుసుకోవడం చాలా కష్టసాధ్యమైన పని. దీనిని చక్కగా తెలుసుకొంటే మానవ జీవిత రహస్యం అంతా విశదంగా బోధపడుతుంది. జాగ్రత్కాలమునందు ప్రజ్ఞ అనగా బ్రహ్మచైతన్యము ముందుగా మనస్సునందు, అంతఃకరణము నందు ప్రతిబింబించి దానిని చైతన్యవంతము చేస్తుంది. ఆ విధముగా ముందుగా చైతన్యవంతమైన మనస్సు తన పూర్వ పూర్వ సంస్కార వాసనాబలంతో, తాను కల్పించుకొన్న కోర్కెలకు అనుగుణముగా అనేక భ్రాంతి జన్యములైన విషయములను (ఇంద్రియముల సహాయము లేకుండ) ప్రకాశింపజేస్తుంది. అద్వైత సిద్ధాంతమునందలి అతి ముఖ్యమైన "వివర్త" వాదము ననుసరించి మనస్సుచే కల్పించబడు విషయములన్నియు యధార్ధములు అనగా స్వయం ప్రకాశకములు గలవికావు. అవన్నియు భ్రాంతిచే రజ్జువునందు కల్పించబడు సర్పము వంటివి. అట్లు కల్పించబడిన భ్రాంతి జన్యవిషయములందు ఆ మనస్సు కర్తృత్వ, భోక్తృత్వ వ్యవహారమంతయు జరుపుతూ వుంటుంది. అందుచే ఆ మనస్సు సంస్కరింపబడి అనగా ఒక విశిష్టమైన సంస్కార స్వభావములు కలదిగా అగుచున్నది. ఆ విధముగా సంస్కారయుక్తమైన మనస్సు చిత్రించబడిన అనగా అనేక విధములగు రంగులతో, బొమ్మలతో నిండియున్న వస్త్రమువలె తయారగుచున్నది. యధార్ధ దృష్టితో పరిశీలించి చూచిన ఆ వస్త్రము పైచిత్రించబడిన చిత్రములు అనగా

వృక్షములు, లతలు, బొమ్మలు మొదలగునవన్నియు, సత్య వస్తువులు కానప్పటికీ చిత్రములతో కూడియున్న వస్త్రమే కన్పించుచున్నట్లు, యథార్థమున బాహ్యవస్తు సముదాయమేదియు లేకున్నను, ఆ స్వప్నగత ప్రజ్ఞ బాహ్యసాధనములైన అనగా సర్వమును కల్పించు బాహ్యేంద్రియములు ఆ స్వప్న కాలమందు మనస్సునకు సహాయకులుగా లేకున్నను, అనగా అవన్నియు నిద్రావశమున శాంతములై తమ తమ ధర్మములను వదలియుండగా, తనకు కారణమైన అవిద్యా కామ కర్మలచే ప్రేరేపింపబడినదై జాగ్రద వస్థయందలి విషయముల వంటి విషయములను భాసింపజేస్తూ వుంటుంది. అనగా ఒక కాల్పనికజగత్తును సృష్టిస్తుంది. ఇదియే స్వప్నగత ప్రజ్ఞ యొక్క కార్యరూపము.

జాగ్రదవస్థయందు పరమార్థ చైతన్యముతో చైతన్యవంతమైన మనో బుద్ధ్యాదులు ఏ విధముగా సర్వేంద్రియముల సహాయముతో ఈ బాహ్య ప్రపంచమును సృష్టించి అనుభవించు చున్నవో, అట్లే ఈ స్వప్నావస్థయందలి ప్రజ్ఞ ఆ జాగృత కాలమునందలి అనుభవముల సహాయముతో సర్వేంద్రియములను తన యందు లీనము గావించుకొన్న మనస్సు ఆ బాహ్య ప్రపంచమును బోలు ఆంతరిక ప్రపంచమును సృష్టించి అనుభవించుచున్నది. జాగ్రదవస్థయందు సర్వేంద్రియములతో కూడియున్న మనస్సు బహిర్ముఖమై బాహ్య ప్రపంచమును కల్పించి అనుభవించు చుండును. కాని స్వప్నావస్థయందు ఆ సర్వేంద్రియములను తన యందు లీనముగావించుకొన్న మనస్సు లోలోపలనే ఒకానొక ఆంతరిక ప్రపంచమును బాహ్యప్రపంచమునకంటె పూర్ణమైన దానిని సృష్టించుకొని, దానిని అనుభవించుచున్నది. ఈ విధముగా ఆంతరిక ప్రపంచమును సృష్టించు ప్రజ్ఞయే "అంతఃప్రజ్ఞుడు" అని చెప్పబడుచున్నాడు.

యథార్థముగా స్వప్నావస్థయందు మనస్సునకు బాహ్య సంచారములేదు. అందుచే అప్పుడు బాహ్య విషయములు గూడాలేవు. బాహ్య ప్రపంచమును ప్రకాశింపజేసి, వస్తుజాలము నంతటిని భాసింపజేయు సూర్యచంద్రులు నక్షత్రాదులుగాని, అగ్నిగాని అచ్చటలేకున్నను స్వప్నకాలమందలి ప్రజ్ఞ తన స్వప్రకాశముచే, అదెట్లన బ్రహ్మపదార్థము స్వయంజ్యోతిస్సుగదా, సూర్యచంద్రాదులను గూడ ప్రకాశింపజేయునది ఆ స్వయంజ్యోతియేగదా! ఆ జ్యోతిస్సుతో కూడియున్న ఈ

అంతఃప్రజ్ఞ తేజోరూపుడై జాగ్రత్కాలిక వాసనలనన్నింటిని తనే వెగిలించి అనగా ఆ జాగ్రత్కాలిక సంస్కారబలంతో ఒక సూక్ష్మజగత్తును, మనోజగత్తును కల్పించి దానికి కర్తగా భోక్తగా వ్యవహరించు ఆ ప్రజ్ఞకు తైజసత్వము కలిగి "తైజసుడు" అనబడుచున్నాడు.

విశ్వుడు అనగా జాగ్రత్స్థానీముడు, ఈతనికి స్థూలవిషయములతో సంయోగము వుండుట వలన అనగా బహిష్ప్రజ్ఞత్వము అనగా బాహ్యమున అనగా స్థూల దేహమునకు వెలుపల విషయభోగములు కలుగుచున్నందున ఆతనికి "బహిష్ప్రజ్ఞుడు" అనిపేరు. కాని ఇచ్చటనో అనగా స్వప్నమునందు, స్వప్నస్థానీయుడైన తైజసునికి విశ్వునివలె బహిష్ప్రజ్ఞత్వముగాక అంతఃప్రజ్ఞత్వమే వుండుట వలన ఈతడు కేవలము వాసనా మాత్రములైన సూక్ష్మ విషయములే భోగ్యమునకు లభించుచున్నందువలన అనగా స్థూల విషయముల భోగములుగాక జాగ్రత్కాలము నందు సంపాదించిన బాహ్య విషయముల వాసనలనే అనగా స్మృతులనే, అనగా జ్ఞాపక రూపములనే భోగించు వాడగుటచే ఈతడు "ప్రవివిక్తభుక్" అనబడుచున్నాడు. విచారించి చూచిన విషయములయొక్క, సూక్ష్మాంశమైన వాసనా భోగమే భావ మాత్రముగ ఈతనికి భోగ్యమగుచున్నది. ప్రవివిక్తమనగా వస్తువు నుండి వేఱుచేయబడిన, దానియొక్క వాసన, స్మృతి, అని అర్థము. సూక్ష్మము అని తాత్పర్యము. అటుపైన సప్తాంగములు, పందిమ్మిది ముఖములు, విశ్వునికివలె ఈ తైజసునికి సమానమే.

3) సుషుప్తి అవస్థ :—

"యత్రసుప్తోన కంచనకామం కామయతే,
న కంచన స్వప్నం పశ్యతి, తత్‌సుషుప్తం"
సుషుప్తస్థాన ఏకీభూతః, ప్రజ్ఞానఘనః ఏవ,
ఆనందమయో హ్యానందభుక్, చేతో
ముఖః ప్రాజ్ఞః తృతీయపాదః" మాం. ఉ. 5వ మంత్రము

ఎచ్చట ప్రజ్ఞ అనగా ఉపాధియందున్న జీవుడు, సుప్తుడై అనగా గాఢ నిద్రయందు మగ్నమైనవాడై, ఎటువంటి కోరికలులేక, ఎటువంటి స్వప్నములు

గాంచక, ఏమియు ఎఱుంగనివానివలె వుండునో అట్టి అవస్థ సుషుప్తి అవస్థ అన బడుచున్నది. ఈ సుషుప్తి అవస్థయందువున్న బ్రహ్మచైతన్యమును, ప్రజ్ఞను, తెలివిని, "ఏకీభూతుడు" అనుచున్నారు. ఏలయన-ఈతడు జాగ్రత్ స్వప్నకాలము లయందలి మనోవృత్తులనన్నింటిని ఏకము చేయుచున్నాడు. అనగా, ఎటువంటి కల్పనలు, భావనలు, స్మృతులు, వాసనలుగూడ లేక ఘనీభవించిన ప్రజ్ఞకలవాడై, ఏమియు ఆలోచించక, ఏమియుచేయక, కర్తృత్వ, భోక్తత్వములు లేక, ఎటు వంటిభోగములుకూడ లేక ఆనందరూపుడై యుంటున్నాడు. ఈ అవస్థయందు విశ్వునికివలె బాహ్యప్రజ్ఞగాని, తైజసునికివలె "అంతఃప్రజ్ఞ" కాని లేవు. జాగ్ర త్కాలము మరియు స్వప్నావస్థయందు విషయములను కల్పించు, భోగించు బహి ష్ప్రజ్ఞమరియు అంతఃప్రజ్ఞ ఘనీభవించి ఎటువంటి వికల్పములు,మరియు తజ్జని తమైన విషయములులేక, విషయవాసనలు గూడలేక శాంతుడై కేవలానందమును, అనుభవించుచుండును. అంతేకాదు ఈతడు "చేతోముఖుడు" అనగా జాగ్రత, స్వప్న ములనెడు రెండు అవస్థలకును ప్రేరకుడు, కారకుడు అనగా ఆ రెండు అవస్థలను వెలిగించువాడు, కలిగించువాడు. ఈతడు ప్రేరేపించినందువలననే ఆ రెండు అవస్థలు కలుగుచున్నవి. అనగా ఆ రెండు అవస్థలకు కారణము ఈతడే. కావున సుషుప్తి అవస్థయందువున్న ప్రజ్ఞకు, జీవునకు, చైతన్యరూపునకు "ప్రాజ్ఞుడు" అని పేరు.

స్థూల పదార్థభోగస్థానమైన జాగ్రదవస్థయందలి మానసిక వృత్తికి "దర్శన వృత్తి" అనిపేరు. అనగా బాహ్యేంద్రియముల ద్వారా విషయములను దర్శించు చుండును. అట్లే కేవల వాసనా భోగస్థానమైన స్వప్నావస్థ యందలి స్వప్న వృత్తికి (మానసిక వృత్తికి) బాహ్యేంద్రియముల ద్వారా విషయములను దర్శించుట గాని, భోగించుట గాని లేక కేవల సూక్ష్మ వాసనలు మాత్రమే భోగించు అవకాశము వున్నందున దానికి "అదర్శన వృత్తి" అని నామ కరణము. వీటి రెంటికీ అనగా జాగ్రత్‌వృత్తులు. మరియు స్వప్నవృత్తులు దర్శన అదర్శన వృత్తులు-రెండూ ఈ సుషుప్తి అవస్థయందు ఒకే విధముగ అవస్థను పొందుచున్నందువలన, అనగా పై రెండు వృత్తులు ఏకీ కృతమై కాన రాకుండ లయమైపోవు చున్నందు వలన, అందు చే ఈ అవస్థయందున్న ప్రజ్ఞను, జీవుని, పరమార్థ చైతన్య స్వరూపుని చక్కగా

తెలుసుకొనుటకు అవకాశము కలుగుచున్నది. "యత్రసుప్తః" అనగా ఎచ్చట జాగ్రద్ స్వప్నావస్థలయందు గోచరించు మాయాప్రపంచమంతయు కాన రాకుండ పోవుచున్నదో అని తాత్పర్యము. వాస్తవముగ విచారించి చూచిన పై మూడు అవస్థలయందును. అనగా జాగ్రద్ స్వప్న, సుషుప్తి అవస్థల యందును పరమార్థ తత్వము అనగా బ్రహ్మ యొక్క యదార్థస్వరూపము తెలియజాలని స్థితి వుండి యున్నది. అనగా అగ్రహణము అనగా బ్రహ్మ తత్వమును తెలియకుండుట, అనగా స్వస్వరూపమును గుర్తింపజాలకుండుట, మూడుఅవస్థలయందును సమానము గా వుండి యున్నది. జాగ్రదవస్థను వ్యాపించి యున్న వైశ్వానరుడుగాని, స్వప్నా వస్థను వ్యాపించియున్న తైజసుడుగాని, సుషుప్తిఅవస్థను వ్యాపించియున్న ప్రాజ్ఞుడు గాని, ఈ ముగ్వురూ ప్రజ్ఞాస్వరూపులే అయినను, తన యొక్క యదార్థ స్వరూప మును, అనగా పరమార్థ తత్వమును, బ్రహ్మరూపమును తెలుసుకొన లేకుండుట యందు సమానులే. ఇట్లు అగ్రహణమునందు అనగా స్వస్వరూపమును గుర్తించ లేకుండుటయందు మూడు అవస్థలయందును సమానమే అయినను, ఈ సుషుప్తి అవస్థయందు జాగ్రద్ స్వప్నావస్థలయందు లేని విశేషము ఒకటి దాగి యున్నది. అదియే తన—సుషుప్తియందు జాగ్రద, స్వప్నావస్థలయందు అగ్రహణముఅనగా తన యొక్క నిజ స్వరూపమును తెలియకుండుట, అటు పైన అన్యథాగ్రహణము అనగా ఆ బ్రహ్మ తత్వమును ప్రపంచముగా తెలుసుకొనుట అను రెండు వృత్తులు వున్నవి. అట్లే స్వప్నావస్థయందు గూడా జాగ్రదవస్థయందు వలెనే అగ్రహణము అనగా తన యదార్థ స్వరూపమును అనగా బ్రహ్మస్వరూపమును గుర్తించకుండుట, మరియు అన్యథాగ్రహణము అనగా ఆ బ్రహ్మతత్వమును ప్రపంచరూపమున గ్రహించుట అను రెండు వృత్తులు వున్నవి. కాని ఈ సుషుప్తి యందు కేవలము అగ్రహణము అనగా తన నిజస్వరూపమును గుర్తించకుండుట మాత్రమే వున్నది. అన్యథాగ్రహణము అనగా ఆ బ్రహ్మతత్వమును ప్రపంచముగా చూచుట అనునది లేదు. ఈ సుషుప్త స్థానీయుడగు "ప్రాజ్ఞుడు" అను నామధేయునికి జాగ్రద ప్రపంచము గాని, స్వప్న ప్రపంచముగాని లేనందున ఎట్టి విషయములు, వాటిని పొందవలయుననెడి ఎట్టి కోరికలు గూడా లేవు.

స్థాన ద్వయమందు అనగా జాగ్రత్ స్వప్నావస్థలయందు ప్రజ్ఞ అనగా వైశ్వానరుడు మరియు తైజసుడుగా చెప్పబడుచున్న ప్రజ్ఞమనోబుధ్యాల్పదుతో తాదాత్మ్యమును బొంది, వృత్తిరూపము ధరించి ఆ వృత్తి పరిణామమైన ద్వైత బుద్ధిని కలిగి కల్పిత ప్రపంచమును, అనగా వృత్తిరూపమాత్రమైన ప్రపంచమును సృష్టించి ఆ ప్రపంచమంతయు తనకంటె ఇతరముగ అనగా తనకు బాహ్యముగా వున్నదని భ్రాంతిజెంది, ఆ అవిద్యాజనితమైన ప్రపంచమునందు కర్తృత్వ భోక్తృత్వాదులు మొదలగు భోగములయందు లీనమైయుండు ప్రజ్ఞ, ఈ సుషుప్తియందు ఆ కల్పిత ద్వైత ప్రపంచమంతయు "ఏకీభూతమై" అనగా ఘనీభవించి, చీకటిచే మ్రింగబడిన అనగా కప్పబడిన దినము ఏ విధముగా సప్రపంచకమయ్యు, అగాడాంధకారమున లేనట్లుగా తోచునో అట్లే ప్రపంచభావము లేనిదానివలె ఘనీభవించియుండును. అనగా తిరిగి భ్రాంతిజన్యమైన ప్రపంచమును కలిగించు అజ్ఞానము ఈ సుషుప్తియందు దాగియుండును. ఆ దాగియుండుటనే ఇచ్చట "ఏకీభూతః" అని చెప్పబడినది. అందువలన ఈ అవస్థయందు జాగ్రత్కాల, స్వప్నకాల మనః స్పందనలన్నియు ఘనీభవించి, ఏకీభూతమై, ముద్దగట్టి, ఆ ప్రపంచమంతయు లేనిదానివలె, అణిగియుండును. అందువలననే ఈ అవస్థ సుషుప్తి అనగా నిద్రించిన అవస్థ అనబడుచున్నది. ఆవిధముగా ఎన్నడూ లేని ద్వైతమును, అనగా కార్యరూప ప్రపంచమును సృష్టించునటువంటి అజ్ఞానమంతయు ఈ అవస్థయందు ఘనీభవించి లేనిదానివలె వుండును. రాత్రికాలమందు గూడ ఈ ద్వైత ప్రపంచమంతయు వుండును, కాని ఆ ప్రపంచ జ్ఞానమును కలిగించు భాస్కరుడు,సర్వమును భాసింపజేయువాడు, లేనందున, గాఢమైన చీకటి వ్యాపించియుండగా, ఆ చీకటియందు చూచువానికి ఏ వస్తువు కానరాక, వస్తువులు ఏమియులేనట్లుగా, ఆ చీకటి మాత్రమే ఏకరూపముగా కనుపించునో అట్లే ఈ సుప్తునికి ప్రపంచ భావమును కలిగించు అనగా ద్వైతమును సృష్టించు మనోబుద్ధులు ప్రాణములయందు లీనమైపోయినందున,ఆభ్రాంతి జన్యమనోనిర్మిత ద్వైతప్రపంచమంతయుకానరాదు. అందుచే ఈతడు ఘనీభవించిన ప్రజ్ఞగలవాడు. అనగా ప్రజ్ఞానఘనుడు; అనగా తన ప్రజ్ఞచే ఎట్టి ద్వైత ప్రపంచమును సృష్టించి కర్తగా, భోక్తగా వుండనివాడు అని అనబడుచున్నాడు. ఆ కారణముచేత ఈ సుప్తునికి జాగ్రత్కాల స్థూల విషయానుభవము

వుండదు. అట్లే స్వప్నకాల సూక్ష్మవిషయానుభవము గూడ వుండదు. ఆ అనుభవ మంతయు నిద్ర అనబడు అవివేకమునందు ఘనీభవించియుండును. అనగా నీరు గడ్డగా ఘనీభవించినప్పుడు ఏ విధముగా ఆ జలమునకు చంచలత్వములేక రాయి వలె ఒకచోట పడియుండునో అట్లు ఆ పూర్వవాసనలన్నియు పూర్తిగా నశింపక ప్రస్తుతము చలనములేనివై, మనస్సుతో సహా ఏకమై ప్రాణములందు దాగియుం డును. రాత్రి కాలమున గాఢమైన చీకటి జగత్తునంతటిని ఆవరించి ఈ నానా నామ రూపాత్మకమైన జగత్తును చీకటి ముద్దవలె అనగా అందులోనున్న నానాత్వమును కానరానీయక వుంచుచున్నదో అట్లే ఈ సుషుప్తి అవస్థయందు జాగ్రద స్వప్నకాల ములయందలి భ్రాంతిజన్య ద్వైతప్రపంచమంతయు అజ్ఞానావరణముచేత అనగా నిద్రచేత మనస్సుపై ముసుగువలె పడియున్న కప్పబడియున్న అజ్ఞానమనే చీకటి యందు సుప్తమైయుండును. ఏ విధముగా తిరిగి బాలభానుడు ఉదయించగనే చీకటం తయూ పటాపంచలై పారిపోగా, ఆ భానుని వెలుగులో ద్వైత ప్రపంచమంతయు తన సహజమైన నానా నామరూపాత్మకమై భాసించుచున్నదో అట్లే ఈ సుషుప్తి – నిద్ర–తొలగగనే మరల జాగ్రత్కాల భ్రాంతిజన్యప్రపంచమంతయు ఎప్పటివలె రూపము దాల్చును. అందువలన ఈ సుషుప్తియందున్న జీవుని "ప్రజ్ఞాన ఘనుడు" అని చెప్పబడినది.

పై శ్లోకమునందు "ప్రజ్ఞానఘనః" అను శబ్దము తరువాత "ఏవ" అను శబ్దముగూడ వున్నది. "ఏవ" అనగా "అన్నట్లుగా" అనగా ప్రజ్ఞానఘనఏవ" అనగా ప్రజ్ఞ అంతయు ఘనీభవించిన వానివలె" అని అర్థము. అప్పుడు దాని తాత్పర్యమేమన-ప్రజ్ఞానము అనగా మనస్సుతోకూడిన కల్పిత ద్వైత ప్రపంచము నంతటిని సృష్టించగల శక్తిగలిగిన ప్రజ్ఞానము వున్నది. కాని ఇచ్చట అనగా ఈ సుషుప్తియందు ఆ ప్రజ్ఞానమంతయు ఘనీభవించినట్లుగా, ఆ శక్తిలేని దానివలె అనగా నిద్రించిన సింహమువలె వున్నది అని భావము.

జాగ్రత్, స్వప్నావస్థల రెంటియందును అంతఃకరణమునకు అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారముల సముదాయమునకు అనేక విధములుగా

విషయములను సృష్టించి, వాటినన్నింటిని అనుభవించుట యను కార్యక్రమమునందు లీనమై శ్రమించుటచే అలసట కలుగుచున్నది. ఆ అలసటచే దుఃఖము కలుగుచున్నది. అట్టి దుఃఖము-అలసట—ఈ సుషుప్తునికి లేదు. అందుచే ఈతడు "ఆనందమయుడు," "ఆనందమయో" అని చెప్పబడుచున్నాడు. "ఆనందమయుడు" అంటే ఎక్కువగా ఆనందము కలవాడు అని అర్థము. అంతేగాని సాక్షాత్తు ఆనంద స్వరూపుడని మాత్రము కాదు. అట్లేలయన ఈ సుషుప్తియందు గల జీవునకు కలిగినది సోపాధిక ఆనందము మాత్రమే. అనగా ఉపాధితో కూడిన ఆనందము. ఉపాధితో కూడిన ఆనందమనగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరములతో సంబంధించిన ఆనందము. ఈ ఉపాధులతో సంబంధములేని బ్రహ్మానందము కాదు. బ్రహ్మానందమనగా జీవుడు జ్ఞానబలంతో ఉపాధి సంబంధములైన తాదాత్మ్యమును వదిలి తన స్వస్వరూపమును గుర్తించినపుడు కలుగు అపరిచ్ఛిన్నమగు ఆనందము. ఈ సుషుప్తియందు కలుగు ఆనందము శాశ్వతము, అపరిచ్ఛిన్నము అయినది కాదు. సుషుప్తి తొలగి తిరిగి జాగ్రదవస్థ కలుగగా ఈ ఆనందము విచ్ఛిన్నమగుచున్నది. అనగా ఈ సుషుప్తియందు కలుగు ఆనందము ఆ అవస్థకు మాత్రమే సంబంధించినది. సుషుప్తియందున్న జీవునకు ఈ ఆనందము జ్ఞానసంపాదన వలనగాని, తన నిజ స్వరూపమును దర్శించి తద్రూపము చెందినవలన కలుగుచున్నది గాదు. ఈ సుషుప్త్యానందము అనాయాసముగా అనగా ఇంద్రియములన్నియు ఆయాసముచే విశ్రమించియున్నప్పుడు, మనస్సుకూడ ఎట్టి వికల్పములులేక ప్రాణముల యందు లయమైనప్పుడు, అనగా ఏ విధమైన మానసిక, శారీరక, వ్యాపారములు లేనప్పుడు కలుగు సహజానందము ఇది. ఇట్టి ఆనందము పశుపక్ష్యాదులకు కూడ కలుగుచున్నది. అందుచేతనే ఈ సుషుప్తుని "ఆనందభుక్" అనగా ఆనందమును భుజించువాడు లేక అనుభవించువాడు అని చెప్పబడినది. అజ్ఞాన దశయందు ప్రాణులన్నింటికి ఇదియే పరమానందము. ఇంతకు మించిన బ్రహ్మానందము లేక తురీయానందము వాటి కలుగనేరదు. ఈ సుషుప్తునికి "చేతోముఖః" అనికూడ మరియొక పేరు కలదు

ఏలయన-జాగ్రత్ స్వప్నాదులను కలిగించు చైతన్యము ఈ సుషుప్తుని నుండియే కలుగుచున్నది. జాగ్రద్ స్వప్నాదులు కలుగుటకు అవసరమైన చేతస్సు,

అనగా చైతన్యము. ఈ సుషుప్తుని ద్వారానే కలుగుచుండుటచేత, అనగా ఆ చైతన్యమునకు ద్వారభూతుడు అగుచున్నాడు. అట్లేలయన-ఈ సుషుప్తి లేనిచో జాగ్రత్ స్వప్నావస్థలు కలుగనేరవు. సుషుప్తి నుండియే ఆ స్వప్న, జాగరణములు తమ స్థితికి అవసరమైన చైతన్యమును పొందుచుండుటం జేసి ఈ సుషుప్తి స్వప్న జాగరములకు మాతృకగా తలంచబడుచున్నది. మాతృక ఏలయన- ఆ స్వప్న జాగరములు రెండూ సుషుప్తిద్వారా లభించిన చైతన్యమును పొంది తమ తమ వ్యాపారములు జరుపగలుగుచున్నవి. స్వప్న-జాగరములనుకలిగించు చైతన్యము సుషుప్తి ద్వారానే కలుగుచుండుటం జేసి ఈ అవస్థకు యోని, లేక "చేతోముఖః" అను విశేషనామములు కలుగుచున్నవి.

ఈ సుషుప్తునికి అనగా సుషుప్తి అవస్థయందున్న ప్రజ్ఞా చైతన్యమునకు, "ప్రాజ్ఞుడు" అను మరియొక పేరు గలదు. ప్రాజ్ఞుడన చక్కగా సమస్తమును తెలియువాడు, అని అర్థము. చక్కగా సమస్తమును తెలియువాడు అనగా భూత భవిష్యత్, వర్తమానముల తెలివి ఈతనికికలదు అని తాత్పర్యము. మూడుకాలముల తెలివి ఈతనికి కలదు. అదెట్లన-అంతఃకరణము అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము-సుషుప్తి కాలము నందు ప్రాణముతో కలిసి లీనమై తిరిగి తనసమస్త పూర్వ వాసనలతో జాగ్రదవస్థయందు మేల్కొనుచున్నది గాన, గత సంస్కారములున్నూ, చిత్తమునందు బీజరూపమున దాగియున్న ఆగామిభోగ్యకర్మ బీజములున్నూ, వర్తమాన జాగ్రద్ స్వప్న కాలీన వ్యవహారములున్నూ, ఈ సర్వమూ తమ తమ స్వరూపములను కోల్పోవక పూర్వము చెప్పినట్లుగా, ముగ్ధత్వమును పొంది, అనగా ఘనీభవించి,ముద్దగా అయి సుషుప్తుని యందు దాగి యుండుటచే ఈ సుషుప్తునికి త్రైకాలిక ప్రజ్ఞ అనగా మూడు కాలములకు సంబంధించిన తెలివి యున్నట్లుగా చెప్పబడుచున్నది.

ద్వైతభాష్యమునందు "ప్రాజ్ఞ "శబ్దమునకు ప్ర+అజ్ఞ=ప్రాజ్ఞ అనగా బాగుగా తెలియని వాడు" అని అర్థము చెప్పబడియున్నది. కాని అట్టి అర్థము మాండూక్యమునననుసరించి సరికాదు. ఏలయన —సుషుప్తి యందు జీవుడు ఆనందమును అనుభవించుచున్నాడు. ఆ అనుభవమును పొందుచుండుటచేతనే జాగ్రద్ కాలమునందు "నేను హాయిగా నిద్రించితిని" అనిచెప్పగలుగుచున్నాడు. అట్టి స్మృతి

అజ్ఞానకు కుదరదు గదా! తన అనుభవమును తెలుసుకొనువాడు అజ్ఞాడు కాజా లడు. ప్రాజ్ఞుడు అనగా సర్వమును చక్కగా తెలుసుకొనువాడు అగుచున్నాడు. ఆ సుషుప్తి యందు—"నాకేమియు తెలియలేదు" అని చెప్పుటను విచారించి చూచిన అచ్చట తెలుసుకొనుటకు "ఏమియులేదు" అని మాత్రమే అర్థము చెప్పవలెగాని, తెలుసుకొనుటకు అవసరమైన తెలివి లేదు అని మాత్రము చెప్పరాదు. ఏలయన– సర్వమును కల్పించు అంతఃకరణము అనగా మనస్సు అచ్చట లీనమైయుండగా తెలుసుకొనుటకు విషయములు వుండవుగదా! అందుచేత సుషుప్తి యందు త్రైకా లిక ప్రజ్ఞ అనగా మూడుఅవస్థలను మేల్కొలుపు ప్రజ్ఞ వుండియే వున్నది. ఆ విధముగా మూడు అవస్థలయందును కలుగు చైతన్యమునకు ఆధారభూతుడగుటం జేసి ఈ సుషుప్తుడు నిజముగా ప్రాజ్ఞుడే అనగా సర్వమును తన యందు కలిగి యున్నవాడే.

అంతేగాక ఎటువంటి వికల్పములు లేక కేవలము ప్రజ్ఞారూపుడై యున్నం దు వలన గూడా ఈతడు ప్రాజ్ఞుడే. ప్రజ్ఞ అనగా జ్ఞానమేగదా! మరి జ్ఞాన రూపుడే అయిన వాడు ప్రాజ్ఞుడు. అన్నీ తెలిసినవాడు గాన ప్ర+అజ్ఞుడు=ఏమీ తెలియని వాడు ఎట్లగును? జాగ్రద్ స్వప్నావస్థలయందు సుఖ-దుఃఖములు రెండూ వుండును. కాని సుషుప్తియందు మాత్రము ఆనందమే గాని దుఃఖముండదు గావున, అనగా జగత్తుకు సంబంధించిన వాసనలు ఏమియూలేక శుద్ధమైన ఆనందమేయుండును గాన ఈ అసాధారణ శుద్ధజ్ఞానరూపమును – జ్ఞానమయమగు-స్వరూపము గల వాడగుటచే ఈతడు నిజమైన ప్రాజ్ఞుడు.

జాగ్రదవస్థయందును, స్వప్నావస్థయందును, కలుగు ఆనందము శుద్ధమైన, నిర్మలమైన ఆనందముకాదు. ఏలయన ఆయానందము విషయభోగము వలనకలుగు ఆనందము. అనగా విషయజన్యమైన, అనగా సుఖదుఖాత్మకమైన మిశ్రిత స్వభావ ముగల ఆనందము, కాని సుషుప్తియందు కలుగు ఆనందము అట్టిదికాదు. ఈ ఆనం దము విషయరహితమైనది. అనగా శుద్ధ జ్ఞాన రూపమైన అనగా జ్ఞానము కలు షితముగాని స్థితియందు కలుగుచున్న ఆనందమగుటచే ఈ ఆనందమునకు విశిష్టత్వ మున్నది. ఇది నిర్వికల్పానందము.

ఈ సుషుప్తి అవస్థయొక్క విశేషమేమన - ఈ అవస్థయందు జీవుడు అనగా ప్రజ్ఞ ఉపాధి సంబంధమైన తాదాత్మ్యములేక శుద్ధరూపమున తన సహజమైన జ్ఞాన రూపమున నిలిచి వుంటున్నాడు. సాధకునకు ఆశుద్ధ జ్ఞానరూపుని, ఆ ప్రత్యగాత్మను తెలుసుకొనుటకు ఇచ్చట మంచి అవకాశము కలుగుచున్నది. ఇది ఒక విధమైన ఆత్మసాక్షాత్కారమే, ఇదియే నిజమైన స్వ స్వరూప సాక్షాత్కారము.

"ఏష సర్వేశ్వర, ఏషసర్వజ్ఞః, ఏషోంతర్యామి.

ఎషయోనిః, సర్వస్య ప్రభవాప్యయో

హి భూతానాం" మాండూ. 6వ మంత్రము

అనగా ఈ ప్రాజ్ఞుడు సర్వేశ్వరుడు, ఇతడు సర్వజ్ఞుడు, ఇతడు అంతర్యామి. ఇతడు సర్వమునకు ఉత్పత్తిస్థానము అనగా యోని. సకలప్రాణులయొక్క జన్మ—మరణములకు స్థాన భూతుడు అనగా కారకుడు అగుచున్నాడు—

ఈ ప్రాజ్ఞుడు ప్రత్యగాత్మ రూపుడనియు, జ్ఞానస్వరూపుడనియు, పైన వివరించి యున్నాము. ఈ మంత్రముద్వారా అధ్యాత్మికమగు ప్రాజ్ఞునకు, అనగా ఈ దేహమనెడు ఉపాధియందున్న ప్రత్యగాత్మకును, అధి దైవికుడైన అనగా బయట అంతటను వ్యాపించియున్న ఈశ్వరునకును ఎటువంటి భేదము లేదని సిద్ధాంతము చేయబడుచున్నది. ఈ ప్రాజ్ఞుడు అనగా ఉపాధి రహితస్థితిని కలిగియున్న శుద్ధచైతన్య స్వరూపుడు, ఆ బయట సర్వత్రా వ్యాపించియున్న చైతన్యము కంటె భిన్నుడు కాడు. ఆ విధముగా ఈతడు ఆధిదైవికమునకు మరియు ఆధిభౌతికమునకు ఈశ్వరుడు అధికారి. అనగా సకల విశ్వమునకు స్థితిలయములను కలిగించునట్టి దేవుడు. ద్వైతులు జీవునికంటె ఈశ్వరుడు భిన్నుడని, తటస్థేశ్వరుడని, జగత్ సృష్టికి ప్రకృతి ఉపాదాన కారణము, ఈశ్వరుడు కుండకు కుమ్మరివానివలె, నిమిత్త కారణమని తలంచుచున్నారు. కాని అట్టివాదమును అద్వైతులు అంగీకరించలేదు. ఉభయ కారణము ఈశ్వరుడేయని అద్వైతుల సిద్ధాంతము. అందుచే ఈశ్వరుడు జీవునికంటె భిన్నమైన జాతికి చెందినవాడు కాడు- * - అనగా ఈ సుషుప్తుడే — ప్రాజ్ఞుడే - ఆ ఉభయకారణుడైన ఈశ్వరుడు. "అయమేవహి సర్వస్య సర్వభేదర్యవస్థా జ్ఞాతా ఇతిఏష సర్వజ్ఞః" అని శ్రుతి వాక్యము. అనగా ఈ ప్రాణము ఈశ్వరుడు—మనస్సును గూడ బంధించ గలడు.

---

* చూ. జీవబ్రహ్మలఐక్యాను సంధానమే మోక్షము అను వ్యాసము.

ఈ ప్రాజ్ఞుడు సర్వజ్ఞుడు అనగా ఈతడు జాగ్రత్, స్వప్న, సుషుప్తు లందుండి సర్వద్వైత కార్యములకు అనగా ధర్మా - ధర్మ, పుణ్యపాప, జీవ ఈశ్వర, జడ చైతన్య ఇత్యాది ద్వైతకార్యములను కల్పించి చూచువాడు-సాక్షిచైతన్యమై సర్వకర్మలు చేయించుచు, వాటి వాటి ఫలములను కలిగించువాడు. కావున సర్వజ్ఞుడు. ఈ ప్రాజ్ఞుడు సర్వాంతర్యామి, ఏలయన - ఈతడు సర్వప్రాణులయందు నిండియుండి సర్వమును చైతన్యవంతము చేయువాడు. సర్వమును కలిగించువాడు. ఇంద్రియములను, ప్రాణములను, అంతఃకరణ వృత్తులను, ప్రారబ్ధాది కర్మత్రితయమును, అవన్నియు తమ తమ హద్దులలోవుండి తమ తమ ధర్మములను నిర్వర్తించునట్లుగా చేయు అధిపతి ఈతడే, ఈ ప్రాజ్ఞుడు, అనగా జీవుడు ఈశ్వరుని కంటె భిన్నుడు కానందున ఈతనికి సర్వాంతర్యామిత్వము చెల్లును. ప్రాజ్ఞుని యందున్న ప్రజ్ఞా చైతన్యమే జాగ్రదాది అవస్థలయందు ప్రవేశించి చైతన్య వంతము చేయుచున్నందున ఈతడు సర్వాంతర్యామియే.

ఈ ప్రాజ్ఞుడు సర్వయోని, అనగా సర్వమును ప్రసవించువాడు. అనగా జాగ్రద్ స్వప్నావస్థల ద్వారా ద్వైత ప్రపంచమును కలిగించుచున్నాడు. తల్లిపిల్లలను కనుచున్నట్లుగా ఈ ప్రాజ్ఞుడు జాగ్రద్ స్వప్నావస్థలను కనుచున్నాడు. తద్వారా అధి దైవిక, అధి భౌతిక, ఆధ్యాత్మిక రూపంబైన జడ చైతన్య మిశ్రితమగు; భిన్నముగా గోచరించు జగత్తును కలిగించుచున్నాడు అనగా కనుచున్నాడు. దాని అంతటికి తానే కారణము అగుచున్నాడు. కావున ఈతడు "యోని" అనబడుచున్నాడు.

ఏ విధముగా కుండలు, ముంతలు, కడవలు మొదలగునవన్నియు మట్టినుండి జనించి తిరిగి మట్టియందే కలసిపోవుచున్నవో, లీనమగుచున్నవోఅట్లే జడచైతన్యరూపమగు ఈభూతజాతమంతయు ఈశ్వరరూపుడైన ఈతనినుండియేజనించి తిరిగి కాలాంతరమున ఈతనియందే లీనమగుచున్నది. కావున ఈ భూత సంఘాతమునంతటికీ ఈతడే ఉపాదాన నిమిత్త కారణము. అట్లేలయన-జాగ్రద, స్వప్నావస్థలు రెండున్నూ ఈ సుషుప్తుని నుండియే జనించి తిరిగి ఈ సుషుప్తుని యందే లీనమగుచున్నవి. ఈ విధముగా ఈసుప్తుడు అనగా జీవుడు సర్వకారకుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు, సర్వమునకు కారణము. అందుచేతనే ఈతడు అనగా ఈసుప్తుడు—

బహిష్ప్రజ్ఞో విభుర్విశ్వో హ్యంతః ప్రజ్ఞస్తు తైజసః
ఘన ప్రజ్ఞ స్తథాప్రాజ్ఞః ఏకఏవ త్రిధాస్మృతః" మాండూ 7.
అని చెప్పబడినాడు.

అనగా బాహ్య ప్రపంచమును కలిగించి అనుభవించువాడును అగు సర్వవ్యాపకుడైన విశ్వుడితడే. అట్లే సూక్ష్మములగు అంతర్విషయములను కల్పించి కర్తగా భోక్తగా వాటినన్నింటిని అనుభవించు తైజసుడు ఈతడే. అదే విధముగా సర్వమును ఘనీభవింపజేసి సర్వమును ఎరిగియు, ఏమియు ఎఱుంగనివానివలె వుండు సుప్తుడు; ప్రాజ్ఞుడుగూడ ఈతడే. ఈ విధముగా ఈ మూడు అవస్థలయందును నిండియుండి, మూడురూపములుగా స్మరింపబడువాడు ఈ ఒక్కడే సర్వాంతర్యామియగు ఈశ్వరుడు, బ్రహ్మ. ఆబ్రహ్మమే నీవు. ఇదియే ఆత్మసాక్షాత్కారము. ఇదియే స్వస్వరూప సాక్షాత్కారము. ఈ విధముగా ఒకటి తరువాత ఒకటి వరుసగా జాగ్రద్, స్వప్నసుషుప్తులను మూడు అవస్థలయందును సంచరించువాడు. "సోఽహం" అనెడువాడు ఒక్కడే. అతడే ఆత్మ. ఆ ఆత్మ అవస్థాత్రయమునందు సంచరించుచున్నట్లున్నదై యున్నను, ఆయా ఉపాధుల గుణదోషములచే దూషితముకాదని సిద్ధాంతము. జీవునకు తాదాత్మ్యధ్యానముచే అవస్థాత్రయమునందు సంగత్వము కలిగి సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. ఇట్టి జీవానుభవము ఆత్మకు కూడ వుండనరాదు. ఆత్మ మూడు అవస్థలయందును నిస్సంగముగ వ్యాప్తిని చెంది యున్నాడు. యథార్థమును పరిశీలించి చూచిన జాగ్రదవస్థయందే విశ్వ, తైజస, ప్రాజ్ఞులైన ముగ్గురూ అనుభవ యోగ్యతను కలిగి యున్నారు. అదెట్లన—కుడికంటియందు విశ్వుడును, మనస్సునందు తైజసుడును, హృదయాకాశమునందు ప్రాజ్ఞుడును, చక్కగా వ్యవహరించు చున్నారు. ఈ విధముగా ఆత్మ ఒక్కడే దేహమునందు మూడు విధములుగా స్థానీయుడై జీవరూపమున, వ్యవహరించుచున్నాడు. ఆమూడు విధములుగా వ్యవహరించుచున్న ఆత్మయే మన స్వస్వరూపము. అదెట్లన-జాగ్రదవస్థయందు జీవుని కుడికంటి ద్వారా బాహ్యప్రపంచమును వెలిగించు ఆత్మను విశ్వుడనియు, స్వప్నావస్థయందు కేవలము మనస్సు ద్వారా కల్పనాజగత్తును, అనగా స్వప్న జగత్తును సృష్టించు ఆత్మ చైతన్యమును తైజసుడనియు, సుషుప్తి అవస్థయందు ఎటువంటి విషయములు మరియు వాసనలుగూడ లేక ఆత్మ చైతన్యము తన స్వస్వరూపమునందే నిలిచి యుండుటచే ప్రాజ్ఞుడనియు, మొత్తము మీద మూడు అవస్థలయందును భాసించునది ఆత్మచైతన్యమేననియు, స్పష్టమగుచున్నది.-

"దక్షిణాక్షి ముఖేవిశ్వః, మనస్యంతశ్చ తైజసః
ఆకాశేచ హృదిప్రాజ్ఞః త్రిధాదేహే వ్యవస్థితః" మాండు. కారిక. 2.

# ఈ ప్రపంచము బుద్ధి కల్పితమే

ఈ ప్రపంచమునందలి మానవులందరూ ఏదో ఒక విధముగా దుఃఖమును అనుభవించుచునేయున్నారు. దుఃఖములేని జీవితమును గడుపువారు ఎంత వెదకి చూచిననుకానరారు. ధనవంతుడు తనదైనరీతిలో దుఃఖాన్ని అనుభవిస్తూవుంటే, బీద వాడుగూడ తనదైన పద్ధతిలో దుఃఖాన్ని అనుభవిస్తూనేవున్నాడు. విద్వాంసుడు మొదలు మూర్ఖునివరకు అందరూ దుఃఖపీడితులే. ఇందులకు కారణము అందరూ అనాదినుండియూ వెదకుచునేయున్నారు. కానినిజమగు కారణము తెలిసి, దానిని తొలగించుకొని సుఖించినవారు అరుదు.

ప్రాచీన కాలమునుండియు భారతీయ ఋషులు తనదైనమార్గాన దుఃఖ నివృత్తికి అనేక ప్రయత్నములు చేసియున్నారు.అందులో అద్వైతమార్గము చాలగొప్పది. తిరుగులేనిది. అదియేదన—"ఈ సృష్టిరహస్యమును ఎవ్వరు ఎఱుంగుదురో వారే ఈ ప్రాపంచిక దుఃఖమునుండి పూర్తిగా నివృత్తినిపొంది శాశ్వతమైన ఆనందమును అనుభవించగలరు" సృష్టి రహస్యమనగా ఈ ప్రపంచము ఎలా పుట్టినది? ఎప్పుడు పుట్టినది? దీనిని ఎవరు సృష్టించినారు? మొదలగు ప్రశ్నలకు సరియగు సమాధానమును ఎఱింగిన మహాపురుషులకు సుఖ దుఃఖములే వుండవు. వారు సత్యమును గుర్తించినవారై, సదానంద భరితులై, శాశ్వతమైన ఆనందమున నివసింతురు. కావున ఇపుడు ఆ ప్రపంచ సృష్టిరహస్యమును తెలిసికొనుటకు ప్రయత్నించెదము గాక.

మన అనుభవమునుబట్టి చూచిన స్వప్నమునందు కానవచ్చు ప్రపంచము బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో యే ఒక్కరిచేతను సృజింపబడినట్లుగా నిర్ణయించుటకు వీలులేదు. సామాన్యముగా జాగ్రదవస్థయందలి అనుభవమును అనుసరించియే స్వప్నావస్థయందలి అనుభవము కలుగుచుండుటచే ఆ స్వప్నప్రపంచము జాగ్రత్ సంస్కారముతో కూడినబుద్ధిచేతనే కల్పింపబడినదనుట నిశ్చయమగుచున్నది. ఒకొక్కొక కలయందు తానెన్నడూ జాగ్రదవస్థయందు అనుభవింపని విషయము గోచరించుట తటస్థించినను, అది, ఆ అపూర్వవిషయము, మనోరాజ్య కల్పితముగా—

"ఇట్టి పదార్థమొకటి ప్రపంచమున వుండి అది మనకు అనుభవింప తటస్థించిన మేలుగనుండును" అని తలంచి యుండుటచే ఏర్పరుపబడినదిగాగాని—, అద్భుతములగు ఇతిహాసాదులయందు వినబడి సంతతము మనసున భావింపబడుచుండినదిగాగాని అయివుండును, లేక రాబోవుశుభాశుభములను సూచించుటకై ఉపాస్య దేవతలచే నిర్మింపబడినదిగాగాని అయివుండును.

"దేవతలు శుభాశుభములను సూచించుటకై కొన్ని పదార్థములను కల్పింతురు అనిన ఆ విషయములు బుద్ధికల్పితములు కాకపోవలసివచ్చుటచే విరోధము వచ్చును గదా" అని అనుకొన్నచో ఇందు ఒక రహస్యము కలదు. ఈ ప్రపంచమువలెనే ఆ ఉపాస్యదేవతలుగూడ మనఃకల్పితములే. "తాను వేరు దేవతలువేరు" అనుభావము గూడ భ్రాంతి సిద్ధమేకదా! కావున ఆ దేవతలు ఈ వస్తువులతో-" అనగా వీనిని స్వప్నములందు జూపి శుభములను సూచింతురు." ఈ వస్తువులతో అశుభములను గూడ సూచింతురు; అను సంకల్పబలముచే ఆయా కాలములందు ఆయా వస్తువులు బుద్ధిచేతనే కల్పింపబడుచున్నవి. అదియునుగాక అనాదినుండియు వచ్చుచున్న కర్మవాసనలు తమవలన కలుగబోవు శుభాశుభములను ముందుగనే సూచించు స్వభావము కలిగియుండును.

యతోయతోధావతిదైవచోదితం మనోవికారాత్మకమాపపంచసు,
గుణేషు మాయారచితేషు, దేహ్యసౌప్రపద్యమానః సహతేనజాయతే

అనగా-కర్మచే-అనగా ఫలాభిముఖమైనకర్మచేప్రేరేపింపబడిన సంకల్ప రూపమైన మనస్సు, మాయానిర్మితములైనట్టియు, పంచభూతాత్మకములైనట్టియు యే యే దేహాదులనుగూర్చి ఆశింపుచుండునో ఈ జీవుడును ఆయా దేహాదులందు ప్రవేశించుచుండును

యం యం వాపి స్మరంభావం త్యజత్యం కళేబరం
తం తమేవైతి కౌంతేయ తధా తద్భావితం. గీత.

"జీవుడు మరణకాలమున యే యే పదార్థములను స్మరించుచు శరీరమును త్యజించునో ఉత్తరజన్మమున ఆ సంస్కారభావబలమువలన ఆయా పదార్థములనే అనగా ఆయా జన్మలనే పొందును." అను మొదలగు ప్రమాణములను అనుసరించి "కర్మలు తామియ్యబోవు శుభాశుభములను ముందుగనే సూచించును" అను విషయమును స్పష్టము చేయుచున్నవి. రాబోవుదేహమును సూచించిన ఆ దేహముద్వారా

కలుగబోవు సుఖదుఃఖములను సూచించినట్లే అగునుకదా! దేహస్వభావమునుబట్టి చూచిన అందు అనుభవమునకురాగల సుఖదుఃఖములను ఎఱుంగలేని వారలెవ్వరు?

కావున కర్మలకు తామియ్యబోవు సుఖఃదుఃఖములను ముందుగా సూచించు స్వభావము కలదు. ఈ కారణమువలన ఆ అపూర్వ విషయమును కర్మావాసనలే కల్పించినను కల్పించవచ్చును. ఆ కర్మవాసనలు బుద్ధిని ఆశ్రయించి వుండునవియే కావున ఆ అపూర్వ విషయముగూడ బుద్ధియే కల్పించినదనవలె. ఈ విధముగా జూచిన స్వప్నమునందలి సర్వపదార్థములును బుద్ధి కల్పితములే కావున వాని వలెనే జాగ్రదవస్థ యందలి పదార్థములు గూడ బుద్ధి కల్పితములే అనుటకు ఎటువంటి సందేహము వుండరాదు. ఒకప్పుడు అనగా స్వప్నావస్థయందు పదార్థములను సృష్టించ గిలిగిన బుద్ధి మరియొకప్పుడు అనగా జాగ్రదవస్థయందు మాత్రము కల్పించలేక పోవునా?

పైన వివరించిన విధముగా ఈ స్వప్న-జాగ్రత ప్రపంచములు రెండునూ బుద్ధిచే కల్పింప బడినవియే అగుచున్నవి. ఈ కారణము వలననే జాగ్రదవస్థ యందుగానవచ్చు ప్రపంచము స్వప్నావస్థయందును, ఆ స్వప్నావస్థయందు గాన వచ్చు ప్రపంచము జాగ్రదవస్థయందును కానవచ్చుట లేదు. ఆబుద్ధి ఇంద్రియము లతో కూడి ప్రవర్తించుచున్నప్పుడు కలుగునది జాగ్రదవస్థ. అందుగానవచ్చు ప్రపంచము బాహ్య ప్రపంచము అనగా దృశ్య ప్రపంచము. ఇంద్రియములతో సంబంధము లేక స్వతంత్రముగా విహరించుబుద్ధి కల్పించునది స్వప్నావస్థ. అదియే అభ్యంతర ప్రపంచము. ఈ రెండు ప్రపంచములు అందరికీ అనుభవైక వేద్యములే. మరియు ఇట్లు ప్రపంచముల కల్పనకు కారణమగు బుద్ధికిని ఆ అవస్థల యందు అవస్థాబేధములు కలవు. కావున జాగ్రదవస్థయందు గాన వచ్చిన ప్రపంచము స్వప్నావస్థయందు వుండుటలేదు. అట్లే స్వప్నావస్థయందుగాన వచ్చిన ప్రపంచము జాగ్రదవస్థయందు కానరాదు. ఇదియునుంగాక సుషుప్తి కాలమున ఆబుద్ధి సంపూర్ణముగా ప్రాణములందు లయమైనప్పుడు ఏ ప్రపంచమును కానవచ్చుటలేదు. ఈ కారణము వల్ల "బుద్ధి యెచ్చట వుండునో ప్రపంచము అచ్చట వుండును. బుద్ధి ఎచ్చట లేదో ప్రపంచము అచ్చటలేదు." అను సిద్ధాంతము ఏర్పడుచున్నది.

జాగ్రదవస్థయందు ఆబుద్ధి బాహ్యేంద్రియములతో కూడియుండును. స్వప్నావస్థయందు ఆ ఇంద్రియములన్నియు లీనములు కాగా ఆబుద్ధి తాను మాత్రమే వుండును. ఈ విధముగా బుద్ధి ప్రవర్తించుచుండు ఈ రెండు అవస్థలయందు మాత్ర

మే ఈ ప్రపంచము కానవచ్చుచున్నది. సుషుప్తియందు ఆబుద్ధి ఇంద్రియములతో కూడిగాని, స్వయముగా గాని వుండక ప్రాణములందు లయమునొందును. అప్పుడు ఈ ప్రపంచము కాన వచ్చుటలేదు. —

"యత్ర చిత్తం తత్రవిశ్వం స్వయమేవ ప్రతీయతే.
యత్రచిత్తం నాస్తి తత్రనాస్తి కించిత్ జగత్క్వ ధా."
"యత్ర యత్ర మనస్ఫూర్తి స్తత్ర తత్ర జగత్రయం
యత్ర యత్ర మనోనాస్తి తత్ర తత్రనకించనః" మ.కా.ద. 63.

కావున ఈ ప్రపంచమంతయును బుద్ధికల్పితమే అయివున్నది.

ఈ ప్రపంచము దానియొక్క అధిష్ఠానజ్ఞానముకలుగగానే నశించును. నశించుట అనగా బాధయే; ధ్వంసముకాదు. జ్ఞానముచే ఈ ప్రపంచము పొడి చేయబడదు. జ్ఞానము కలుగగానే మాయా కల్పితమగు ప్రపంచము కానరాదు. జాగ్రత్ స్వప్న ప్రపంచములు రెండునూ సమానములే అగుటచేత "ఇది కల, ఇందలి పదార్థములు కేవలము మనో వికారములేగాని యథార్థములుకావు" అని తెలిసికొనుటచే అనగా ప్రపంచ కల్పనకు మూలకారణమగు అధిష్ఠాన బ్రహ్మమును ఎఱుంగుటచే స్వప్న ప్రపంచము ఎట్లు మాయమగునో అనగా వున్నట్లుగా కనబడుచున్నను లేనిదే యగునో, అట్లే జాగ్రత్ ప్రపంచము గూడ అధిష్ఠానమగు బ్రహ్మమును గుర్తించుటచే బాధనొందును అనగా కనబడకుండా పోవును.

స్వప్నావస్థను అనుభవించుచున్నప్పుడు అందలి పదార్థములు సత్యములు కావను విషయము అందరకు తెలిసినదే. స్వయముగా అసత్యములు అయివున్నట్లు తోచు పదార్థములు మరియొక పదార్థముపై కల్పింపబడినవనుటలో సంశయము ఏమీ వుండకూడదు. అట్లు మరియొక సత్య పదార్థముపై కల్పింపబడక స్వతంత్రములు అయి వుండునేని వానికి ఎప్పటికి అసత్యత్వమే వుండకూడదు. కావున స్వప్న పదార్థములును వాని వలెనే మరియొక అవస్థయందు కానరాని జాగ్రత్ కాలీన పదార్థములును మరియొక సత్యపదార్థమగు అధిష్ఠానముపై కల్పింపబడినవియే. అధిష్ఠాన జ్ఞానముచే బాధనొందునవియే.

ఈ కారణము వలన ఈ ప్రపంచమంతయును కేవలము భ్రాంతి జన్యమైనదియే. వాస్తవ స్థితిలో అసత్యములై యున్నవానిని సత్యములుగ దలంచుట కంటె అజ్ఞానము, భ్రమ కాకమరేమి? "మనస్సు ప్రపంచమును కల్పించెను" అనిన

అర్థము ఇదియే. "ప్రపంచము తోచుట మనోగతమగు అజ్ఞానము వలననే" అనుటయే. ఇట్లు కాకున్న ఆ బుద్ధి మృత్తికా పాషాణాదులతో గృహములను నిర్మించదు కదా!

మరియు ఈ ప్రపంచ మంతయు ఆ పరబ్రహ్మమునందే కల్పింపబడినది. బాగుగా విచారించిన ఆ పరబ్రహ్మమున కంటె భిన్నమగు వస్తువు మరొకటి లేదు, అనగా ప్రపంచ కల్పనకు ఆధారము ఆగుటకు ఆ పరబ్రహ్మముకంటె వేరు వస్తువు లేదు. చేతన పదార్థము బ్రహ్మమే అగుటచే ఆయన యందు ఆరోపింప బడకుండిన ఎడల ఈ ప్రపంచమునందు చేతనత్వము అనుభవమునకు రాకూడదు. ఈ కారణము వలన ఈ ప్రపంచము కేవలము బుద్ధి కల్పితమే అనితెలియుచున్నది..

ఈ విధముగా ప్రపంచము ఆ పరబ్రహ్మమునందు అరోపింపబడినదనుటకు ఏమువంటి సందేహమును లేదు. అందుచే బ్రహ్మస్వరూప జ్ఞానము కలిగినపుడు ఈ ప్రపంచము బ్రహ్మరూపముననే గాన వచ్చును గాని బ్రహ్మ భిన్నముగా కానరాదు. ముత్యపు చిప్పను జూచి "ఇది వెండి" అని భ్రాంతి జెందిన వానికి అదిష్టానమగు ముత్యపు చిప్ప తెలియబడకుండునంతవరకే అనగా "ముత్యపుచిప్పయే" అనితెలియ బడనంతవరకు ఆ వెండి కానబడుచుండును. "ఇది ముత్యపు చిప్ప" అని యదార్థ జ్ఞానము కలుగగానే ఆ వెండి కాన రాకుండా పోవును.

ఇట్లే త్రాటిని జూచి "ఇది సర్పము" అని భ్రాంతి జెందిన పురుషునకు "ఇది త్రాడు" అను యదార్థజ్ఞానము కలుగకుండునంతవరకే ఆ కల్పిత సర్పము తోచుచుండును, భయమును కలిగించును. ఆ త్రాడు యొక్క యథార్థజ్ఞానము కలిగిన వెంటనే ఆ సర్పమును, దాని దర్శనము వలన కలిగిన భయము మొదలగు వికారములును తొలగిపోవును.

ఇట్లే అధిష్టానమగు పరబ్రహ్మమును తెలియలేకుండునంతవరకు ఈ కల్పిత ప్రపంచము తోచుచుండును. రాగ ద్వేషాదులను గూడా కలిగించుచుండును. దేనిని తెలియనందు వలన ఈ సకల జగత్తు చూడబడుచున్నదో, దేని జ్ఞానము వలన సర్వము లయమునొందుచున్నదో, అట్టి ఆత్మతత్వము తెలిసినపిమ్మట ఇంక ద్వైత ప్రపంచము వుండదు. ఆ బ్రహ్మజ్ఞానము కలిగిన క్షణముననే సర్వము అంతర్ధానమగును. "అంతర్ధానమగును" అనుటకు "సంపూర్ణముగనశించును" అనికాని "గృహా క్షేత్రములు కానరావు" అని కానిఅర్థము కాదు. ఈ నాశము బాధయే. అనగా అజ్ఞానముచే మరియొక విధముగా తలంపబడుచున్న వస్తువులను అనగా ప్రపంచమును

జ్ఞాన బలముతో, యదార్థరూపముతో యెఱుంగుటయేకాని ధ్వంసము అనగా కర్ర లతో, సుత్తులతో పగులగొట్టి మసి చేయుట కాదు. కావున "ప్రపంచము నశించును" అనగా ప్రపంచము యధాపూర్వకముగా కానవచ్చుచునే యున్నను, ఇంతకుపూర్వము వలె బ్రహ్మ భిన్నముగా తోపదు అని తాత్పర్యము.

శుక్తి, రూప్యాదుల విషయము గూడా ఇట్టిదియే. భ్రాంతితొలగిన పిదపగూడా 'ఆహా! ఏమి చిత్రము ఈ ముత్యపు చిప్ప స్వచ్ఛమైన వెండి వలెనే తోచినది" "ఆహా! ఈ త్రాడు నిజమైన సర్పము వలెనే కనిపించినది. కావుననే నేను భ్రాంతి జెందితిని" అను మొదలగు అనుభవములు అందరికీ తెలిసినవే. ఇట్టి వ్యవహారము వలన అప్పటికిని వెండి తోచుచున్నదని చెప్పవలసి వచ్చినను పూర్వమువలె ఆ వెండి ముత్యపు చిప్పకంటె భిన్నమగు రూపముతో తోచుటలేదని నిశ్చయముగా చెప్ప వచ్చును.

ఈ విచారణమును బట్టి తేలినదేమన ఈ ప్రపంచము కేవలము బుద్ధికల్పితమే అధిష్టానమును తెలుసుకొనలేక పోవుటచే వచ్చినదియే అగుటచే ఆ బ్రహ్మ స్వరూప మును ఎఱింగినచో తక్షణమే ఆ భ్రాంతి తొలగిపోవును. తిరిగి అటువంటి భ్రాంతి కలుగనేరదు. ఏ పదార్థమైనను ఒక మారు నశించిన మరియొక మారు ఏదియో ఒక విధముగ ప్రత్యక్షమైనను కావచ్చును. కాని అజ్ఞానము మాత్రము ఒకమారు తొలగి పోయిన తిరిగి పుదయింపనేరదు.

అజ్ఞానము వేఱు. మరపువేఱు. ఒక మనుష్యుని ఎఱుంగనివానికి ఆ మను ష్యులు లేక పదార్థమును గురించి ఒక్కమారు తెలియజేసిన మరల ఆ పురుషునకు ఆ అజ్ఞానము వుండదు కదా! విశేషకాలము గడిచినచో తాను ఎఱింగిన పురుషుల లేక వస్తువులను మరువవచ్చును. అయితే అది అజ్ఞానముకాదు. మరుపు మాత్రమే ఈ విధముగా అజ్ఞానము నశించిన పిదప మరల జనించు స్వభావము కలదికాక పోవుటచే, దానివలన కలుగు భ్రాంతియు మరల కలుగనేరదు. శుక్తి రూప్యాది విష యములందుమాత్రము ఆ భ్రాంతి మరల మరల కలుగుటలో ఆశ్చర్యమేమియులేదు. అనగా ఒకమారు ముత్యపుచిప్పను జూచి దానిని వెండిగా భ్రమించిన పురుషుడు మరియొకమారుగూడ అట్లు భ్రమించిన భ్రమించుగాక; వానికి అప్పుడు మూలా జ్ఞానము అనగా సర్వ కారణమగు అజ్ఞానము నశింప లేదన్నమాట. కేవలము తాత్కాలికమగు తూలాజ్ఞానమే నశించినదన్నమాట. కావున మూలాజ్ఞానబలము వలన ఎన్నిమాఱులైనను తూలాజ్ఞానము నశించుచు తిరిగి జనించుచు వుండ

వచ్చును. ప్రపంచ విషయమునందన్ననో బ్రహ్మజ్ఞానముచే మూలాజ్ఞానమే ధ్వంసమగును. అందుచే ఆ జగద్భ్రాంతి రెండవమాఱు కలుగుటకు వీలులేదు.

ప్రపంచము వలెనే పరబ్రహ్మమునకు గూడ బాధ ఏలరాకూడదన్నచో, బాధ అనగా జ్ఞానముచే కలుగు నాశమే. అనగా మరియొక విధముగా భావింపబడుచున్న పదార్థమును యథార్థస్వరూపముతో ఎఱుంగుటయేకాని వేరుకాదు. ఇట్టినాశము సత్య పదార్థములకు సంభవించుటకు వీలులేదు. ఎవ్వరు ఎట్లు భావించినను వస్తుస్థితికి హాని కలుగదనియు, విపరీత భావనలను మాత్రమే సవరించుకొనవలయుననుటయు స్పష్ట మైన విషయమే. కాబట్టి యే యే పదార్థములు ఆ విధముగా బాధనొందునో అవి అన్నియు అసత్యములై వుండవలయును. లోకమున నిత్యమూ అందరూ ఈ విష యమును అనుభవించుచునేయున్నారు. ముత్యపుచిప్పయందు భ్రాంతిచేరజితమును ఆరోపించునపుడు ఆ రజితము ఆ ముత్యపుచిప్పయందు యథార్థముగా లేకపోవుటచే సత్యము కాదని ఋజువు అగుచున్నది. ఇట్లగుటచే అది "ఇది ముత్యపుచిప్ప" అని శుక్తియొక్క యథార్థ స్వరూపజ్ఞానము కలుగగానే ఆ వెండిబాధ నొందుచున్నది. ఆ రజితమునకు ఆధారమై సత్యమైయున్న ముత్యపుచిప్ప మాత్రము అట్లు బాధ నొందుటలేదు. కావున అసత్యము అగుటచే ఈ ప్రపంచము బ్రహ్మజ్ఞానముచే అనగా అధిష్ఠానమగు బ్రహ్మముయొక్క యథార్థస్వరూపమును ఎఱుంగుటచే బాధ నొందును. కాని అధిష్ఠానమై, సత్యమైయున్న బ్రహ్మమునకు మాత్రము ఎటువంటి బాధ వుండుటలేదు.

ఎంత సత్యముగ వున్నట్లుతోచుచున్నను ఈ ప్రపంచమంతయు అసత్యమే. ఇందు సంశయమేమియులేదు. ముత్యపుచిప్పయందు ఆరోపింపబడిన వెండివలె ఈ ప్రపంచము గూడ అజ్ఞానముచే బ్రహ్మమునందు ఆరోపింపబడినదియే అగుటచే అజ్ఞానకార్యమేకదా!

ఏయే పదార్థములు అజ్ఞానముచే మరియొక దానియందు కల్పింపబడు చున్నవో అవి అన్నియు అసత్యములే అనుటలో సంశయము ఏమియులేదు.

"ఇట్లయిన శుక్తిరూప్యాది దృష్టాంతములయందును భ్రాంతికల్పితములు అన బడు వెండి మొదలగు వానివలె సత్యములనబడు ముత్యపుచిప్ప మొదలగునవిగూడ అసత్యములే కావలసివచ్చును. అప్పుడన్నింటికిని బాధ వచ్చును. ఇదియే యథార్థ మైన" ఈప్రపంచ విషయమును నిరూపించుటకు శుక్తిరూప్యాది దృష్టాంతముల అర్థములుకానేరవు" అను సంశయము అర్థరహితము ఏలయన-వాస్తవస్థితిలో

బ్రహ్మముకంటె యితరమగు సత్యపదార్థము మరియొకటి ఎచ్చటనులేదు. దృష్టాంతము చెప్పవలసి వచ్చినప్పుడు సమాన స్వభావముకల రెండు పదార్థములు వుండితీరవలయును. ఈ కారణము వలన లోకవ్యవహారానుసారముగ "ముత్యపుచిప్ప సత్యము, దానిపై ఆరోపింపబడిన వెండి అసత్యము" అని చెప్పబడినది. కావుననే ఇవి సత్యములు అని జనులచే వ్యవహరింపబడు పదార్థములకు "వ్యావహారిక సత్యములు" అని పేరు. బ్రహ్మము పారమార్థిక సత్యము. వ్యావహారిక సత్యమునందు కల్పింపబడిన పదార్థము ఏవిధముగా వ్యావహారిక అసత్యమై బాధ నొందుచున్నదో, అట్లే పారమార్థిక సత్యమునందు కల్పింపబడిన పదార్థముకూడ వ్యవహారమున సత్యరూపమే, వ్యావహారిక సత్యమే అయ్యును పారమార్థిక అసత్యమై బాధ నొందుచున్నది. ఇదియే శుక్తి–రూప్యాది దృష్టాంతములకు తాత్పర్యము. ఇంతియే కాని శుక్త్యాదులకు పారమార్థిక సత్యత్వమును కల్పించుటకాదు.

ఈ కారణము వలన దృష్టాంత దార్ష్టాంతికములకు వైధర్మ్యము-విరుద్ధము లగు ధర్మములు కలిగియుండుట-లేదు. ఈ విధముగా ప్రపంచము భ్రాంతికల్పితమే అగుటచేత "ఇది అసత్యము, ఇట్లగుటచేతనే జ్ఞానముచే బాధింపబడుచున్నది" అని న్యాయానుసారముగా నిర్ణయించుటకు వీలుకలుగుచున్నది. ఇట్లగుటచే అధిష్ఠానభూతుడగు బ్రహ్మమును తెలిసికొనిన-గుర్తించిన క్షణముననే ఈ ప్రపంచము శుక్తిరూప్యమువలె బాధనొందుచున్నది. అప్పుడు బ్రహ్మభిన్నముగా ఏదియు కానరాదు.

"ఇంత సత్యముగ గానవచ్చుచున్న ఈ ప్రపంచము అసత్యము అనుటలో మరియు భ్రాంతికార్యము అనిన నమ్మశక్యము కాకున్నది" అనువారలకు సమాధానముగా ఇట్లు చెప్పబడుచున్నది—

ఈ ప్రపంచము భ్రాంతి జన్యమనియు, ఆ కారణముచే అసత్యమనియు చెప్పతగిన కారణములు వుండుటచే ఋషివర్యులు ఈ సిద్ధాంతమును అంగీకరించియున్నారు. స్వాభావికముగా యే పదార్థము సత్యమై నిత్యమై యుండునో ఆ పదార్థము ఒకప్పుడు ఒక విధముగా మరియొకప్పుడు మరియొక విధముగాను, అనగా ఒక సమయమునందు వున్నట్లుగా తోచుచు, మరియొక సమయమునందు లేనట్లుగా తోవకయుండదుగదా!

ఈ ప్రపంచము జాగ్రదవస్థయందు ఒక విధముగాను, అనగా ఇంద్రియములతో కూడియున్న మనస్సునకు ఒక విధముగాను, స్వప్నావస్థయందు అనగా ఇంద్రియములు మరియు స్థూలశరీరముతో ఎటువంటి సంబంధములేని మనస్సునకు మరి

యొక విధముగాను తోచుచు, సుషుప్తియందు అనగా మనస్సేలేని గాఢనిద్రా సమయములందు బొత్తుగనే తోపక యున్నదిగదా! కావున ఈ ప్రపంచమునకు స్వాభావికమగు వునికియే లేదనుటలో సంశయము ఇంచుకయైనను లేదుగదా!

ఈ విధముగా ప్రత్యేకమైన వునికి లేకపోవుటచేతనే, స్వతంత్రప్రకాశము అనగా స్వయముగా ప్రకాశించు సామర్ధ్యముగూడాలేదు. వస్తువే అసత్యమైన దాని యందలి ధర్మము సత్యమెట్లగును? ఎండమావులనీరే అసత్యమైన దాని యందలి చల్లదనము సత్యమగునా? అదియునుగాక "లేని వస్తువు కానబడును" అనుట మాత్రము ఎట్లు సంభవించును? ఒక వేళకానబడినను పిత్తభ్రమకలవానికి ఏదేదో తోచినట్లు తోచుటయే అగునుగాని సత్యమగునా? అందుచే ఈ ప్రపంచమునకు అవస్థాభేదములయందు స్థితి భేదములు కానవచ్చుట వలన స్వాభావిక సత్యత్వము గాని ప్రకాశముగాని లేదు. "ఇది ప్రపంచము. నేను దీనిని చూచుచున్నాను" అనుట అంతయును కేవల సంకల్పమేగాని మరేమియు కానేఱదు.

ఇదియునుగాక పైనవివరించిన సిద్ధాంతమును అనుసరించి చూచిన ఈ ప్రపంచమును, దీని వునికియు, మనస్సుచే మాత్రమే కల్పింపబడినవియే అగును. అనగా "ఇది ప్రపంచము, దీనిని నేను చూచుచున్నాను" అని మనసుచేయు నట్టి సంకల్పమే ఈ ప్రపంచమునకు ఆకారము, ఈ ప్రపంచ ప్రకాశమునకు స్వరూపము. ఏయే పదార్థములకు సంకల్పాతిరిక్తమగు రూపములేదో అవి అన్నియు అజ్ఞాన కల్పితములే. ముత్యపుచిప్పయందుతోచు వెండికి "ఇది వెండి" అను సంకల్పమున కంటె అన్యమగు స్వరూపము లేదు. ఆ వెండి అజ్ఞాన కల్పితము, భ్రాంతి సిద్ధము కాదనియు చెప్పుటలేదు. కావున ఈ ప్రపంచము భ్రాంతిసిద్ధమే. ఎట్లు చూచినను దీనికి అనగా ఈ ప్రపంచమునకు మనస్సున కంటె భిన్నమగు రూపమేలేదు. అందుచే ఈ కారణములన్నింటిని బాగుగా విచారించియే మహాత్ములు "ప్రపంచము భ్రాంతిసిద్ధము" అని నిశ్చయించియున్నారు. "భ్రాంతి కల్పితమగు పదార్థము ఎప్పటికినీ సత్యము కానేఱదు. కాబట్టి ఈ ప్రపంచము సత్యము కానేరదు." అని సిద్ధాంతము చేసియున్నారు. ఈ విషయము సర్వానుభవ సిద్ధమే.

"ఆరోపితము అదిష్ఠానముకంటె భిన్నము కాదు. భ్రాంతికల్పితమగు పదార్థము అసత్యము" అనుటలో సంశయము ఏమియులేదు. లోకమున త్రాటిని జూచి "ఇది సర్పము" అని అజ్ఞానముచే తలంచిన ఆ సర్పము ఎప్పటికైననూ సత్యము అగునా? ఎవ్వడైననూ అట్లు తలంచుచున్నాడా? భ్రాంతినొందిన పురుషులు సహితము ఆభ్రాంతి తొలగిన పిదప "ఇంత వరకు నేను చూచుచుండిన సర్పము అసత్యము" అనియే నిశ్చయించునుగదా! కావున ఒక అధిష్ఠానమునందు మరియొక పదార్థము భ్రాంతిచే కల్పింపబడెనేని అప్పుడు ఆ ఆరోపిత పదార్థము ఆ యధిష్ఠానముకంటె భిన్నము కానేరదు. సత్యమును కానేరదు. దానికి అనగా ఆయారోపిత పదార్థమునకు ప్రత్యేక సత్తా అనగా స్వతంత్రమైన సత్యత్వము లేకపోవుటయే ఆయాధిష్ఠానా భేదమునకు కారణము.

"ఒక అధిష్ఠానమునందు-అనగా మూలపదార్థమునందు-మరియొక పదార్థము ఆరోపింపబడినచో ఆ అరోపిత పదార్థము ఆ అధిష్ఠానమునకంటె భిన్నము కానేరదు" అను విషయము సర్వానుభవ సిద్ధము. ముత్యపుచిప్పను జూచి వెండియని భ్రాంతి జెందినప్పుడు ఆ వెండి అధిష్ఠానమగు ముత్యపు చిప్పకంటె భిన్నముగ వుండునా? ఒకవేళ భ్రాంతివలన అట్లు తోచినను భ్రాంతి తొలగిన పిదప అట్లు అనగా ఇదివరకు మనము చూచుచున్న వెండి ఆ ముత్యపు చిప్పకంటె భిన్నముగ వుండెను అని తోపదు. యధార్థముగా ఆ వెండి ఆరోపిత పదార్థము-అధిష్ఠానమగు ముత్యపు చిప్పకంటె భిన్నముగ వున్నదియే అగునేని ఎప్పటికీ అట్లే వుండవలయును. అట్లు వుండుటలేదు. కావున ఈ అనుభవమునుబట్టి చూచిన ఆరోపితము అధిష్ఠానమునకంటె భిన్నము కానేరదు.

కేవలము భ్రాంతిచేతనే కల్పింపబడిన శుక్తి-రూప్యాదులేకాక ఉలి మొదలగు సాధనములచే రాయి, కర్ర మొదలగు వానియందు కల్పింపబడిన పన్నియు గూడ వాని వాని ఉపాదాన కారణములకంటె వేఱు కానేరవు. ఒక రాతియందు సాధన సహాయముచే హస్తములు, పాదములు మొదలగువానిని ఏర్పరచి, ఒక రూపము సిద్ధపరచి "ఇది విష్ణువు" అని భావించిన ఆ విష్ణువు ఆ శిలకంటె భిన్నమై

యుండనేరదుగదా! బాగుగా విచారించిన శిలామయ రూపము-ప్రతిమ-ఆ శిలకంటెను, ఆ ప్రతిమయందు భావింపబడిన విష్ణువునకు ఆ ప్రతిమకంటెను భిన్నమగు స్వరూపము కలదని నిరూపించుటకు ఎట్లును సాధ్యము కాదు. వాస్తవ స్థితిలో ఆ విష్ణువు కూడ ప్రతిమయందు అనగా ఆ శిల లేక కర్రయందు భ్రాంతిచే భావింపబడుచున్న వాడేకదా!

ఈ విధముగానే పరబ్రహ్మమునందు కల్పింపబడిన ప్రపంచమునకు గూడ బ్రహ్మ వ్యతిరిక్తమగు స్వరూపము సంభవము కాదు. అది ఆ బ్రహ్మముకంటె భిన్నమును కానేరదు. అందుచే బాగుగా విచారించినచో ఈ ప్రపంచము ఆ పర బ్రహ్మముకంటె భిన్నము కాదు. కావున ఎట్లు చూచినను చేతనా చేతనాత్మకమగు ప్రపంచమంతయును, అనగా జీవులును, జడపదార్థములును భ్రాంతి సిద్ధములే. భ్రాంతి సిద్ధములకు అధిష్ఠానా తిరిక్తమగు వునికి గాని రూపముగాని లేదు. కావున ప్రపంచమునకును, దానికి అధిష్ఠానమును అగు బ్రహ్మమునకును ఎటువంటి భేదమును లేదు. శ్రుతియందు గూడ—

"యత్సర్వ్యం కల్పితం బ్రహ్మ సర్వ్వ హేతత్ బ్రహ్మ బ్రహ్మైవేదం విశ్వం" అను మొదలగు వాక్యములచే పై విషయమే ధృవపరుపబడి యున్నది.

ఈ విధముగా భ్రాంతిచే ముత్యపు చిప్పయందు ఆరోపింపబడిన వెండి అధిష్ఠానమగు ఆ ముత్యపు చిప్పయే అయినట్లు పరబ్రహ్మమునందు భ్రాంత బుద్ధిచే కల్పింపబడిన ప్రపంచము ఆ పరబ్రహ్మమే అగుననుట సిద్ధాంతము.

—o—

"రోగశీలమైన దానిని అనామయముగను,
మరణశీలమైన దానిని అమర్త్యముగను,
నశ్వరమైన దానిని అవినాశిగను,
నశించు దానిని వుండునట్లుగాను
చేయగలవాడు లేడు"

అంగుత్తరనికాయము.

—o—

# దేహాభిమానము బంధహేతువే

"అన్నజనసంభూత అన్నవర్ధితమగు
తనువన్నమయకోశమనగనొప్పు"....
శ్రీసీతారామాంజనేయ సంవాదము 332

దేహము అన్నమునుండి జనించినది. అన్నము చేతనే పోషింపబడుచున్నది. అన్నము లేక నశించుచున్నది. ఈ దేహము స్థూల, మధ్యమ. సూక్ష్మరూపమున పరిణమించుచున్న భుజింపబడిన ఆహారము యొక్క కార్యము.

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనునవి సూక్ష్మభూతములు. ఇవి ఏర్పడినప్పుడు సూక్ష్మరూపమున వుండెను. తదుపరి ఒక్కొక్క భూతము పంచీకృతమగును అనగా అయిదేసి అంశములుగా విభక్తమగును. తైత్తరీయోపనిషత్తుననుసరించి ఐదుభూతములను ఒక్కొక్క దానిని ముందురెండుగా విభజించి, ఒక సగభాగమును అటుంచి మిగిలిన సగభాగమును నాలుగు భాగములుగా జేసి ఇతర భూతముల సగభాగములతో కలిపినచో పంచీకరణము జరుగును.

"ద్విధావిధాయచైకైకంచతుర్ధా ప్రథమంపునః
స్వస్వేతర ద్వితీయాంశై ర్యోజనాత్ పంచపంచతే"
"పంచదశి"

ఈ విధముగా ఒక్కొక్క స్థూలభూతమునందును తనకు చెందిన సగభాగము ఇతర భూతముల ఎనిమిదవభాగము వుండును. ఈ విధముగా పరస్పరాంశములతో కూడిన పిమ్మట ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి మొదలగు శబ్దములతో వ్యవహరించుటకు తగిన స్థూలభూతములుగ ఏర్పడిన ఈ పంచమహాభూతములు ఈ స్థూలశరీరమునకు కారణమగుచున్నవి.

"నభోనభస్య ద్దహానాంబు భూమయః
సుక్ష్మణి భూతాని భవన్తితాని
పరస్పరాంశైర్మిళితాని భూత్వా
స్థూలాని చ స్థూల శరీర హేతవః" వి. చూ. 75

మజ్జయు, ఎముకలు, క్రొవ్వు, మాంసము, రక్తము, చర్మము, సూక్ష్మ

చర్మము, అను పేర్లుగల ధాతువులతో కూడినదియు, పాదములు, తొడలు, వక్ష స్థలము, భుజములు! వీపుఅనబడు పృష్ఠభాగము, శిరస్సు అనెడు అవయవముల తోడను, చిన్న అవయవములతోడను కూడినదియు, "నేను, నాది" అని ప్రసిద్ధమైన దియు, అజ్ఞానమునకు మూలమైన ఈ శరీరము స్థూలదేహము అని పండితులచే చెప్పబడుచున్నది.

స్థూల, మధ్యమ, సూక్ష్మరూపమున పరిణమించుచున్న భుజింపబడిన ఆహారముయొక్క బాహ్యరూపమే ఈ స్థూలదేహము. తేజఃపదార్థమగు ఘృతము మొదలగువాని మధ్యమభాగమే మజ్జ, దానియొక్క స్థూలభాగమే ఎముకలు. దానియొక్క సూక్ష్మరూపమే క్రొవ్వు. మాంసము అన్నముయొక్క మధ్యమభాగము. త్రాగిన నీటియొక్క మధ్యమభాగముర క్తము. దేహముయొక్క స్థూలావరణము చర్మము. సూక్ష్మవరణము త్వక్కు, లోపలవున్న ధాతువులను నాడి మొదలగు వాటిని ఏడు ఆవరణములు కప్పి వుంచినవి. ఈ ఆవరణములలో పైనవున్నవి దేహము యొక్క బాహ్యభాగములు. లోపలవున్నవి సూక్ష్మభాగములు, మజ్జ మొదలగు యే ఏడు ధాతువులుగలవో అట్టిధాతువులతో కూడియున్నది. పాదములు, హస్తములు తొడలు, వక్షస్థలము, భుజములు, పృష్ఠభాగము, శిరస్సు అను ఆరు అంగముల తోడను, మడమలు, మోకాళ్ళు, పిక్కలు మొదలగు ఉపాంగములతోడను కూడి యున్నది, ప్రత్యక్షముగా, స్థూలముగా కనబడుచున్న ఏ దేహముకలదో అది స్థూల దేహము.

"నేను వెళ్ళుచున్నాను, వచ్చుచున్నాను, గ్రహించుచున్నాను, తినుచున్నాను" మొదలగు వ్యవహారములచేత "నేను" అను అహంకారమునకు విషయమైనదియు, మరియు "ఇవి నా చేతులు, ఇవి నా కాళ్ళు, ఇది నా శిరస్సు, ఇది అంతయు నా శరీరము" అని మమకారమునకు ఆస్పదమైన ఈ స్థూలదేహము అనేకములైన దోషములతో కూడి యున్నను "నేను, నాది" అను మోహముచే "ఆత్మ" అను భ్రమకు ఆశ్రయమైయున్నది. యథార్థముగా ఇటుకలు, సిమెంటు మొదలగువాటితో ఏర్పరుపబడిన గృహము ఎట్లు ఒక యజమాని భోగముకొఱకు ఏర్పరుపబడు చున్నదో అట్లే అనేక పదార్థముల కలయికచే ఏర్పడిన ఈ దేహముగూడ ఒక భోక్తయగు యజమానియొక్క భోగముకొఱకు ఏర్పడినదే. అందుచే ఈ స్థూల శరీరము ఆత్మయొక్క అనగా జీవునియొక్క భోగముకొఱకు ఏర్పడిన స్థూలావర

ణమే. ఇట్టి ఈ పంచభూతాత్మకమైన స్థూలదేహము దాని భోక్తయగు జీవునకు సుఖ దుఃఖములను కలిగించు సాధనము, ఆవరణము, అగుచున్నది.

ఈ పంచభూతాత్మకమైన స్థూలదేహము జీవునకు ఈ ప్రపంచమును ఐదు విధములుగా భోగించుటకు సాధనమగుచున్నది. ఆకాశముయొక్క గుణము శబ్దము పృథ్వియొక్క గుణము స్పర్శ, అగ్నియొక్క గుణము రూపము, జలముయొక్క గుణము రసము, వాయువుయొక్క గుణము గంధము, వీటన్నింటిని జీవుడు ఈ స్థూల శరీరమునకు సంబంధించిన బాహ్యేంద్రియములు అనగా చెవులు, ముక్కు, నోరు, కన్నులు, చర్మముద్వారా భోగించుచున్నాడు. వాస్తవముగా ఈ భూతముల వలన కలుగు భోగము అనగా సుఖము, సుఖాభాసము మాత్రమే. ఏల యన ఈ భూతములు కూడి విడిపోవు గుణము కలిగినవి అగుటచే, ఆత్మకువలె సత్యమూ, నిత్యమూ అయినవి కావు. అనిత్యము అసత్యములు. అందుచే వీటి కార్య ములగు విషయములు అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు గూడ అనిత్య ములు, అసత్యములు అగుచున్నవి.

"మాత్రాస్తదీయా విషయాభవన్తి
శబ్దాదయః పంచసుఖాయ భోక్తుం" వి.చూ. 76.

అయితే ఈ పంచభూతములయొక్క కార్యములగు శబ్ద, స్పర్శ, రూప,రస, గంధములనెడు విషయములు జీవుని రాగము అనెడు గొప్ప పాశముచే బంధించు చున్నవి. జీవుడు ఈ విషయములతో తాదాత్మ్యము చెందినవాడై, ఈ స్థూలదేహము ద్వారా ఆ విషయములను పొందుటకై నానావిధములైన పుణ్య, పాపకర్మలుచేయుచు ఆ కర్మఫలములను అనుభవించుటకై ఎడతెగని జన్మమరణములను పొందుచున్నాడు

"యయేషు మూఢా విషయేషుబద్ధా
రాగోరుపాశేన సుదుర్దమేన
ఆయన్తి నిర్యాన్త్యధ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మ దూతేన జవేననీతాః" వి. చూ. 77.

ఈ గుణయుక్తమైన స్థూలదేహముతో తాదాత్మ్యము చెందిన జీవుడు, తన జ్ఞానరూపమైన స్వరూపమును మరచి ఈ దేహమే తానని భ్రాంతిజెందినవాడై,

తొలగింపరాని రాగమనెడు గొప్ప పాశముచే ఆ విషయములకు కట్టుబడి,నానావిధము లగు కర్మల నాచరించుచు, ఆ కర్మఫలములను-అనగా పుణ్య-పాప ఫలములను అనుభవించుటకై నానావిధములైన యోనులందు అనగా దేవ, మనుష్య, పశు, పక్షి, కీటకములందు తిరుగుచూ ఎడతెగని దుఃఖములను అనుభవించుచున్నాడు. అనగా జన్మ-మరణములనెడు చక్రమునందు తగుల్కొని క్రిందికి పైకి తిరుగుచున్నాడు.

ఈ శబ్ద, స్పర్శ,రూప, రస, గంధములగు విషయములు తనకు సుఖమును కలిగించునను భ్రాంతితో వాటిని పొందుటకై పుణ్యపాప భావములతో కూడిన కర్మలు చేయుచున్నాడు. ఆ కర్మల ఫలితముగా లభించిన సుఖదుఃఖములను అను భవించుటకై ఉన్నతస్థానమగు స్వర్గమునకు వెళ్ళి ఆ చేసిన పుణ్యము క్షీణించగనే తిరిగి మర్త్యలోకయోనియందు జన్మించుచున్నాడు.ఇంక చేసినవి పాపకార్యములే అగుచో సర్వదా అధోగమనమే, అనగా నారకీయమగు జీవితమే నారకీయమగు యోను యందు జన్మమే. జన్మాంతరములయందు ఆచరించిన అనేక పుణ్యకర్మల ఫలి ముగా జీవునకు నరజన్మప్రాప్తించుచున్నది. మరలరాగము కలుగగనే క్రిందికి పో చున్నాడు. ఈ విధముగా దేహాభిమానము కలిగిన జీవుడు విషయాభిలాష కలవాడై తన స్వరూపమును, తన ధర్మమును మరచి, సుఖ-దుఃఖహేతువు జన్మమరణహే వును అగు ఈ బంధమునుండి తప్పించుకొనలేక పోవుచున్నాడు.

ఈ స్థూలదేహముతో తాదాత్మ్యమును చెందిన జీవునకు పంచభూతాత్మకమై శబ్దాదులగు విషయములు జన్మ-మరణహేతువు అగు బంధమును కలిగించుచున్న అదెట్లన, "కురంగ, మాతంగ పతంగ, మీనభృంగాః" లేడి, ఏనుగు, మిడుత, చే తుమ్మెద అనెడు ఈ ఐదు జంతువులు వాటివాటికి ఆసక్తిని కలిగించు (గుణములచే విషయములచే అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము మొదలగు ఐదింటి క్రమముగ ఒక్కొక్క దానిచే బంధింపబడి పంచత్వమును అనగా మరణమును పొందుచున్నవి.

ఈ విధముగా ఒక్కొక్క విషయమే వాటికి మరణపర్యంతమగు బం మును కలిగించుచుండగా ఈ ఐదింటితోను కూడిన అనగా ఐదింటియందు నిత్యమూ ఆసక్తుడైయుండు మానవునకు ఎంతటి మహామృత్యువు కలుగునో చెప్ప కష్టముగదా! లేడి చాలా చపలస్వభావముగలది. అది చాలా వేగముగా పరుగె త్త గిన జంతువు. అయినను దానికి వేణుగానాది మధుర ధ్వనులయందు ఆసక్తిమెం అందుచే అది ఆ గానమునకు అనగా ఆ మధుర ధ్వనియగు విషయమునకు

బడి, బోయవానికి చిక్కి, మరణమును పొందుచున్నది. ఈ విధముగా శబ్దమొక్కటియే హరిణమునకు బంధహేతువు అగుచున్నది. అట్లే వనమధ్యమున స్వేచ్ఛగా విహరించు మహాగజము స్పర్శసుఖమునందు ఆసక్తికలదియగుటచే ఆడ ఏనుగును చూచి దానికై ఒడలు మరచి బంధింపబడుచున్నది. అదే విధముగా దీపమునందలి భాస్వరరూపమును జూచి, ఆ దీపమును ఏదియో భోగ్యపదార్థమని తలంచి, భ్రాంతి జెంది, అది తనను దహించునను సత్యమును ఎఱుంగక, ఆ పతంగము ఆ దీపమును జేరి మరణించుచున్నది. రూపము మృత్యుహేతువను సత్యము ఆ పతంగమునకు తెలియదు.

అట్లే రసమును ఆస్వాదింప ఆసక్తిగల మత్స్యము జాలరి గాలమునందలి ఎరను తినుటకు ఆశించి, ఆ గాలమునందు చిక్కి మరణమును పొందుచున్నది. అదే విధముగ సుగంధమునందు ఆసక్తిగల తుమ్మెద చంపక పుష్పమునందలి గంధమును ఆశించి మరణించుచున్నది.

ఈ విధముగా శబ్దాదులలో ఏ ఒక్కదానిని అసక్తితో సేవించినను మరణాంతకము అగు అనర్థము కలుగుచున్నది. అందుచే శబ్దాదివిషయముల ఐదింటియందును అమితమగు ఆసక్తికలిగి, వాటిని సేవించుటకై సత్కర్మను ఆచరించక ఆ విషయముల వెంటబడి పాపాచరణము చేయునరుడు రెండులోకములకు చెడి నానావిధ దుఃఖములను అనుభవించుచు జన్మ-మరణచక్రమునందు పడి తిరుగుచున్నాడు.

"శబ్దాదిభిః పంచభిరేవపంచ
పంచత్వమాపుః స్వగుణేనబద్ధాః,
కురంగ మాతంగ, పతంగ మీన
భృంగా నరః పంచభిరన్వితః కిమ్॥ వి. చూ. 78.

కావున ఏ మహాపురుషుడు వివేకవైరాగ్యాదులచే మేల్కొన్నవాడై, త్యజించుటకు చాలకష్టమైన విషయములనెడి మహాపాశమునుండి ముక్తుడగునో అతడు మాత్రమే మోక్షమును పొందుటకు సమర్థుడగును. ఇతరులు అనగా వివేకవైరాగ్యాదులు లేనివాడు, ఎంతటి విద్వాంసుడైనను శాస్త్రములన్నియు పఠించినవాడైనను ఆ విషయముల బంధమునుండి విడువడి మోక్షమును పొందజాలడు.

కావున ఎవడు అనేక వస్తువుల సంఘాతమగుటచే అసత్యము, అనిత్యము అగు ఈ దేహమును పోషించుటయందు ఆసక్తుడై, తనయొక్క స్వస్వరూపమైన

ఆత్మను మరచి, "ఈ దేహమే - నేను" అని విశేషాభిమానముతో దానిని పోషించుట యందే తన జీవితకాలమునంతటిని వ్యర్థము చేయునో, అతడు ఈ స్థూల శరీరముతో తనను తాను హింసించు కొనుచున్నాడు. ఏలయన ఈ స్థూలదేహము అజ్ఞానముచే ఏర్పడినదై యున్నది. తిరిగి జ్ఞానము కలుగగానే ఈ దేహము భ్రాంతిచే రజ్జువునందు తోచినసర్పమువలె తొలగిపోవు స్వభావము గలదై యున్నది. అందుచే శరీరపోషణమునందు అధికాసక్తి గల నరునకు ఆత్మ దర్శనము కలుగకుండుటయేగాక, దానిపై అనగా అనిత్యము మరియు అనాత్మపదార్థమును అగు స్థూలదేహముపై అతని అభిమానము బలీయమై, అతనిని సంసార సముద్రమున ముంచి మోక్షమును పొందుటకు పనికిమాలిన వానినిగా చేయును. అందుచే ఎవ్వడు శరీర పోషణమును కోరుచూ స్వస్వరూపసాక్షాత్కార లబ్ధిని పొందవలెనని ఆశించునో అతడు తెప్పకర్రయను బుద్ధితో మొసలిపైఎక్కి నదిని దాటగోరు మూఢునితో సమానము అగుచున్నాడు—

"శరీరపోషణార్థీ సన్ య ఆత్మానందిదృక్షతే,
గ్రాహం దారు ధియా ధృత్వానీదం తర్తుం సఇచ్ఛతి" వి.చూ. 86.

"అందుచేత వివేకవంతుడు అగు నరుడు సంసార బంధమునుండి విడువడి ముక్తి కొఱకై స్థూలదేహాభిమానమును విడిచిపెట్టవలయును" అని శాస్త్రాదులు ఘోషించుచున్నవి. మోక్షమును పొందగోరువానికి దేహాదుల యందు ఆసక్తియే గొప్ప బంధము. కావున ఎవడు దేహాదుల యందలి మోహమును జయించునో అతడే మోక్షమునకు తగియున్నాడు—

"మోహ ఏవమహామృత్యోర్ముముక్షోర్వపురాదిషు,
మోహోవినిర్జితో యేన సముక్తిపదమర్హతి" వి.చూ. 87

స్థూలదేహము మరియు దానికి సంబంధించిన భార్యా పుత్రాదులయందు కలిగి యుండెడి అహంకార మమకారములే ముముక్షువునకు గొప్పబంధములు. మరణించినవాడు ఏ విధముగా ఏ పనిని చేయజాలడో అట్లే శరీరాదులయందు అహంకార మమకారములు గల పురుషుడు మోక్షమును సంపాదింప జాలడు. ఎవనిచే దేహాదులయందలి అహంకార మమకారములు విడువబడినవో అతడే ముక్తి పదమునకు తగినవాడు. అందుచే స్థూలదేహాభిమానము విడువతగియున్నది.

ఆత్మకు అనగా ఆత్మయొక్క ప్రతిబింబమైన జీవునకు ఈ స్థూలదేహము భోగమునకు స్థానమైయున్నది. ఇది ఆ జీవునకు పూర్వకర్మలచే పంచీకృతములగు

స్థూల భూతములనుండి లభించినది. ఈ స్థూల శరీరము జీవునకు కేవలము జాగ్రదా వస్థయందు మాత్రమే అనుభవమునకు వచ్చును. నరునకు నిత్యము అనుభవము నందుగల స్వప్నావస్థయందుగాని, మరియు సుషుప్తావస్థయందుగాని ఈ స్థూలదేహానుభవము వుండదు.

ఈ స్థూల శరీరము జీవునకు తాను పూర్వ పూర్వ శరీరములందుండి చేసిన పుణ్యపాపకర్మల ఫలితములను అనుసరించి లభించినది. అనగా అతడు చేసిన కర్మల ఫలితములను అనుభవించుటకుతగినట్లుగా లభించినది అని అర్థము. అందుచే ఒక జీవునకు రావలసిన శరీరము మరియొకనికి కలుగుట అనునట్టి సాంకర్యము లేకుండ కలిగినదని అర్థము. కర్మఫలదాతయు, సర్వజ్ఞుడును అగు ఈశ్వరుడు ఆయా జీవులకు వారివారి కర్మల ననుసరించి ఆయా శరీరములను ఇచ్చుచుండును గాన సంకరమగుటకు అవకాశములేదు. ఎవరి కర్మలకు తగినట్లుగా అనగా ఆయా కర్మల ఫలితములను అనుభవించుటకు వీలుగా ఈ స్థూల దేహాములు లభించుచుండును. అందుచేతనే ఈ స్థూల దేహాములందు ఎటువంటి సామ్యమూలేదు. ఎవరి శరీరము వారిదే. అందుచే ఎవరి సుఖ-దుఃఖములు, ఆకార ప్రకారములు, అన్నీ పరస్పర భిన్నములే. కర్మసామ్యము లేనందున ఫలసామ్యములేదు. ఫల సామ్యము లేనందున ఆ ఫలములను అనుభవించు దేహాదులందుగూడ ఎటువంటి సామ్యము కానరాదు.

ఈ స్థూల శరీరము జీవునిచే జాగ్రదవస్థయందు మాత్రమే అభిమానింపబడు చున్నది. శరీరము యొక్క ఆ యవస్థమారినను అందలి జీవులు మాత్రము ఎట్టి మార్పునులేక మిగిలిన రెండు మూడు అవస్థలయందును అనగా స్వప్న సుషుప్తి అవస్థలయందును జాగరూకులై వుంటున్నారు. ఈ స్థూలదేహము యొక్క ఆ యవస్థ అసాధారణమైన యవస్థ అనగా ఇది జీవునకు భోగహేతువగు సమయము. జాగృత కాలము. అనగా ఈ స్థూల శరీరము తన బాహ్యేంద్రియములతో గూడి సర్వ విధ కర్మలు చేయుచున్న కాలము మాత్రమే. అనగా ఇంద్రియముల ద్వారా విషయము లను గ్రహించెడి కాలమునకు జాగ్రదవస్థయని పేరు. దిక్కులు మొదలగు వాని అభిమాని దేవతలచే అనుగ్రహీతములగు శ్రోత్రాది ఇంద్రియములచే గ్రహింపబడు శబ్దాది విషయములు స్థూలవిషయములు. స్వప్నకాలమునందు బాహ్యేంద్రియముల వ్యాపారము లేకుండుటచే ఆయవస్థయందు వాసనా రూపముననున్న శబ్దాదులు దేవతా

నుగ్రహములగు ఇంద్రియములు గ్రహించుట అనునది వుండదు. స్వప్నావస్థయందు కేవలము మనస్సు మాత్రమే వుండును. అదియే సర్వేంద్రియముల కార్యములను ఒంటరిగా నిర్వహించుచుండును.

ఈస్థూల శరీరము వలనను స్థూలశరీరాభిమానము వలనను, ఏ స్థూలవిషయముల అనుభవము కలుగుచున్నదో ఆ కారణమువలన ఈ స్థూలదేహమునకు జాగ్రదవస్థయే అనుభవ కాలము.

పంచకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా.
సముత్పన్న మిదం స్థూలం భోగాయతన మాత్మనః
అవస్థా జాగరస్తస్య స్థూలార్థానుభవో యతః॥ వి.చూ. 91

ఈ స్థూలదేహముతో తాదాత్మ్యమును పొందిన జీవులు బాహ్యములగు ఇంద్రియముల సహాయముతో స్థూల పదార్థముల సేవనముచేయుచున్నారు. ఆయా ఇంద్రియముల ద్వారా కలుగు సుఖ-దుఃఖానుభవమును పొందుచున్నారు. ఈ విధముగా జాగ్రదవస్థయందు స్థూలదేహము మరియు బాహ్యేంద్రియములద్వారా స్థూలవిషయములను అనుభవించు జీవుడు వైశ్వానరుడు లేక విశ్వుడు అనబడుచున్నాడు. మనస్సు ద్వారా స్థూల శరీరమునందు ప్రతిఫలించిన ఈ విశ్వుడనబడుస్వరూపముతో బాహ్యవిషయములను కల్పించుచున్నాడు. స్వప్నావస్థయందు మనస్సునకు స్థూలదేహముతో సంయోగము వుండదు. అందుచే దానియందు స్వరూప ప్రతిబింబమునదిగూడ ఉండదుగాన అపుడు స్థూల శరీరము భోగహేతువుకాదు. స్వప్నావస్థయందు భోగహేతువు అయినది కాల్పనికము, వాసనామయము అగు మరియొక స్థూలశరీరమే. ప్రసిద్ధమగు తమతమ స్థూలదేహముల కంటె భిన్నములైన తిర్యగ్దేవాది దేహములతో గూడ స్వప్నావస్థయందు భోగములను అనుభవించుచున్నారు. ఈ విషయము అందరకూ అనుభవయోగ్యమే అయివున్నది. కావున ఈస్థూల శరీరమునకు జాగ్రదవస్థయందుమాత్రమే ఉనికి,అనగా ప్రాముఖ్యము. స్వప్న,సుషుప్తి అవస్థలయందు ఈ స్థూలదేహవిషయమున అభిమానమేవుండదు. అనగా ఆయవస్థలలో ఈస్థూలదేహము కానరాదు. ఈ విధముగ స్వప్నసుషుప్త్యవస్థలురెండింటియందును భాసింపక కేవలము జాగ్రదవస్థయందు మాత్రమే భాసించుచున్న ఈస్థూలదేహము మూడు అవస్థలయందును అనుస్యూతమై భాసించు ఆత్మకంటె భిన్నమని తెలియనగును. ఆ విధముగా ఈ స్థూలశరీరము స్వప్నసుషుప్త్యవస్థలయందు నివర్తించుచుండు స్వభావము

కలదగుటచే సత్యము. నిత్యముకాకపోవుటచే అనాత్మ పదార్థమేయని సులభముగ గ్రహింపనగును.

బాహ్యేన్ద్రియైః స్థూలపదార్థసేవాం
స్రక చందన స్త్ర్యాది విచిత్రరూపాం
కరోతి జీవః స్వయమే తదాత్మనా,
తస్మా త్ప్రశ స్తిర్వపుషోఽస్య జాగరే" వి. చూ. 9

పైవివరణమునననుసరించి ఈ స్థూలదేహము జీవునకు గృహమువంటిది. గృహము ఎల్లప్పుడును గృహస్వామికి వాసయోగ్యమగు వస్తువేగాని అందువాసము చేయు గృహస్వామికానేరదు. అట్లేఈస్థూలదేహము ఆత్మకు అనగా ఆత్మప్రతి బింబమగు జీవునకు నివాసయోగ్యమగు ఒక ఉపాధి-కోశము—మాత్రమే.

"సర్వోపి బాహ్యః సంసారః పురుషస్య యదాశ్రయః
విద్ధిదేహమదంస్థూలం గృహవ ద్గృహమేధినః" వి. చు. 92

అనగా పురుషునియొక్క బాహ్యమైన సమస్తమైన సంసారము దేనిని ఆశ్రయించుకొనియున్నదో అట్టి ఈ స్థూలదేహమును గృహస్థునికి గృహమువంటి దానినిగా తెలుసుకొనవలెను.

"బాహ్యము, అంతరము" అని సంసారము రెండువిధములు- సుఖము, దుఃఖము, కర్తృత్వము, భోక్తృత్వము మొదలగునవి అంతర సంసారమునకు సంబంధించిన విషయములు. జన్మము, జర, మరణము, స్థూలత్వము, బాల్యము యౌవనము, మొదలగునవి బాహ్యసంసారమునకు సంబంధించినవి. అనగా పుట్టుక, ముసలితనము, మరణము, స్థూలత్వము, కృశత్వము, తెలుపు, నలుపు, మొదలగు వర్ణములును, అనేక ప్రకారములుగల ధర్మములు. శిశుత్వము, కౌమారము, యౌవనము, వార్ధక్యము అను అవస్థలు, వర్ణాశ్రమాది అనగా బ్రహ్మణ, క్షత్రియ, వైశ్యత్వ, శూద్రత్వములు, బ్రహ్మచర్య, గార్హ్యస్థ్యవానప్రస్థ సన్యాసాది ఆశ్రమ వ్యవస్థలు, గోత్రము, సూత్రము మొదలగునవిగూడ వాటికి సంబంధించిన నియమములు, అనగా బ్రాహ్మణత్వ, బ్రహ్మచర్యాదులకు సంబంధించిన ధర్మములు, కులాద్యాచారములు, అనేక విధములగు జ్వరము, తలనొప్పి, మొదలగు అనారోగ్యములు-వ్యాధులు, పూజలు, అవమానము, బహుమానము, మొదలగు విశేషములు, నిందాస్తుతులు, జాతకర్మాది సంస్కారములు అనగా నామకరణ,కేశముండన, అన్నప్రాశన, కర్ణఛేదన, ఉపనయన, వివాహ, దహన, పిండదానాది మొదలగు సంస్కా-

రములు, ఇవన్నియు ఈ స్థూల శరీరమునకు సంబంధించినవియేగాని ఆత్మప అనగా ఈ శరీరమనే ఉపాధికి స్వామియగు జీవునకు సంబంధించినవికావు. ఆయా ఆశ్రమములకు సంబంధించిన చిహ్నములుగూడ ఈ స్థూలదేహమునకు సంబంధించినవే. అందుచేత వర్ణాశ్రమాదినియమములు స్థూలదేహమునకే అనిచెప్పబడినది. అంతరంగ సంసారమునకు గూడ కొన్ని అంతరనియములువున్నను ఈ ప్రత్యక్షములగు నియమములన్నియు ఈ స్థూలదేహమునకు మాత్రమే సంబంధించినవి.

వాస్తవమున సంసారరహితుడగు జీవునకు దేనివిషయమున తాదాత్మ్యధ్యాసము అనగా "ఈ దేహమే నేను" అని భ్రాంతి కలుగుచున్నదో, అట్టి ఈ స్థూలదేహము గృహస్థాశ్రమములోనున్న కుటుంబికునకు గృహము వంటిది అనితెలియనగును. భ్రాంతిచే స్థూల శరీరమే తాను అని తలంచుచున్న జీవుడు మాత్రమే దాని ధర్మములగు అనగా స్థూలదేహ ధర్మములను అనగా జరామరణాధికములను తనకు సంబంధించినివిగా భావించి సుఖఃదుఖములను అనుభవించుచున్నాడు. జీవునకు అట్టి భ్రాంతి జన్య తాదాత్మ్యాధ్యాసము లేకుండినచో దుఃఖాదికమే లేదుకదా! స్థూల దేహాభిమానములేని సుషుప్తి అవస్థయందు ఈ జరారోగాదుల వలన కలుగు దుఃఖములు లేవుగదా! కావున తేలిన సారాంశమేమన తనకు సంబంధములేని ఈ స్థూలదేహమునందు "అహం భావము అనగా ఈ "దేహమే నేను" అనుభావమే సమస్తమైన దుఃఖాధిబంధములకు మూల కారణము అగుచున్నది అని అర్ధము.

ఈ సంసారమనెడువృక్షమునకు మూలకారణము అనగాబీజమువంటిది అజ్ఞానము. అజ్ఞానమనగా ఈ దేహమే నేను అనెడు బుద్ధి. అనాత్మ పదార్థమగు దేహదుల యందు ఆత్మత్వ బుద్ధి అజ్ఞానము వలన మాత్రమే కలుగును గాన ఆ దేహాత్మ బుద్ధియే ఆ బీజమునుండి బయలుదేరు అంకురము. అంకురము జనించిన తరువాత ఏ విధముగా చిగుళ్లు, ఆకులు కొమ్మలు పువ్వులు కాయలు జనించునో అట్లే శరీరమునందు ఆత్మత్వబుద్ధి కలిగిన తోడనే శరీరానుకూలములగు పదార్థములే తనకు అనుకూలములు అనెడు అభిప్రాయముకలిగి విషయములయందు రాగముఏర్పడును. ఆ రాగము వెంట ఆ విషయములను పొందుటకై కర్మలు చేయుదురు. ఆ కర్మలచే కలుగు ఫలములను అనుభవించు చుందురు. తిరిగి భోగము కొఱకు కర్మలు. ఈ విధముగా జీవునకు కర్మ-భోగబంధములు ఏర్పడి జన్మ—మరణ పరంపర ఏర్పడు చున్నది.

బీజం సంసృతి భూమి జస్యతు తమో దేహాత్మ ధీరంకురః
రాగః పల్లవ మ మ్బు కర్మతు వపుః స్కంధోఽసవః శాఖికాః
అగ్రాణీంద్రియ సంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖంఫలం.
నానా కర్మ సముద్భవం బహువిధం భోక్తాత్ర జీవఃఖగః     వి.చూ. 147

కావున దేహాత్మబుద్ధి రూపమగు బంధము రాగద్వేషాది దోషములను కలిగించుట ద్వారా ధర్మాధర్మరూపములగు కర్మలకు హేతువు అగుచున్నది. ఆ కర్మలచే శరీర పరంపర కలుగుచు దాని యందు "అహం"అను అభిమానము జనించుచుండును. ఈ విధముగ స్థూల దేహాభిమానముచే దృఢమూలమగు ఈ సంసార బంధము నిలిచియున్నది.

సర్వలోక ప్రసిద్ధమగు ఈ దేహము మొదలగు అనాత్మ పదార్థములతో ఏర్పడిన తాదాత్మ్యాభిమానము స్వస్వరూపమును తెలియకుండ జేయునటువంటి అజ్ఞానమే మూలముగాగలది. పూర్వ పూర్వాధ్యాసమువలన ఏర్పడిన సంస్కారములు హేతువులుగా కలది. అనాదియగు అజ్ఞానము యొక్క కార్యమగుట వలన ఈ బంధము ఎప్పుడు పుట్టినదో చెప్పశక్యము కానిది. జ్ఞానము లేకుండా నాశములేనిది. ఇట్టి బంధము ఈ జీవునకుశరీరోత్పత్తి, రోగము, వార్ధక్యము, మరణము మొదలగు దుఃఖపరంపరకు హేతువు అగుచున్నది.

"అజ్ఞానమూలోయ మనాత్మబంధో, నైసర్గికోఽనాది రనన్త ఈరితః
జన్మాప్యయ వ్యాధిజరాది దుఃఖప్రవాహోతా పంజనయత్యముష్య" విచూ. 148

వాస్తవముగ అయిదు కోశములకును ఆంతరముగ నున్నట్టియు, జ్ఞానమే శరీరముగా కలిగియున్నట్టియు, సంతత ఆనందమూర్తియును అగు ఆత్మరూపుడైన జీవునకు ఈ స్థూలదేహమునందు "నేను" అనెడు తాదాత్మ్యాధ్యాసముచే జననము, వార్ధక్యము, మరణము మొదలగు సర్వదుఃఖములు కలిగించు ఈ సంసారము వచ్చి పడుచున్నదో, అనగా ప్రాప్తించినట్లుగా భాసించుచున్నదో, అట్లు ఈ సూక్ష్మభూతముల వలన జనించినదియు, ఆత్మయొక్క ప్రతిబింబమును గ్రహించి చైతన్యవంతమగునదియు, జీవునియొక్క సహజమగు స్థితిని అనగా వానియొక్క చిదానంద రూపత్వమును హరించుచున్నదియు, అనగా ప్రత్యగ్రూపమగు ఆత్మను-జీవుని-పరాగ్రూపమైన దానినివలె చేసి స్వస్వరూపమును పొందనీయక అనాత్మయగు దేహమునందు "నేను" అనెడు బుద్ధిని వివేకము ద్వారా తొలగించుకొనినేనగాని ఈ జీవు

నకు ఈ సంసార బంధము తొలగి స్వస్వరూపసాక్షాత్కారానందము కలుగదు. దేహాదులే ఆత్మయని ఎల్లప్పుడూ భావించుచుండు వానికి మరణాదుల తప్పవు. అట్టివాడు "సర్వము వున్నది" అను భ్రాంతిలో వుండి వుండుటచే ఎల్లప్పుడునూ సంసారబంధము నందు చిక్కుకొనియేయుండును. కావున అట్టి పతిత నకు మరల బ్రహ్మలాభము అనగా బ్రహ్మసాక్షాత్కారము అనగా స్వస్వరూప సాక్షాత్కారము, అనగా స్వస్వరూప జ్ఞానము కలుగదు. ఆ కారణమువలన వ్యాధి గ్రస్తుడు అనారోగ్యములగు వస్తువులను ఏ విధముగ పరిత్యజించునో అట్లే సకలము లైన అనర్థములకును కారణమైన ఈ స్థూలదేహాభిమానమును విడువవలయును అని స్మృతిబోధ.

మలపూర్ణమైన ఈ స్థూలదేహమునందు "అహం" బుద్ధిచే కలుగుచున్న ఆశను బలాత్కారముగా నశింపజేయవలయును. అటు తరువాత వాయువుతో సమాన మైన లింగదేహమునందు గూడ అభిమానమును విడువవలయును. వేదములచే కీర్తింపబడిన నిత్యమైన ఆనంద స్వరూపమును తానే యని నిశ్చయించి బ్రహ్మ రూపముతో వుండవలయును.

"జహి మలమయకోశేఽహంధి యోత్థాపితాశాం
ప్రసభమనిలకల్పే లంగదేహేఽపి పశ్చాత్
నిగమ గదిత కీర్తిం నిత్యమానందమూర్తిం
స్వయమిత పరిచీయ, బ్రహ్మరూపేణ తిష్ఠ" వి.చూ. 396.

మానవులు ఎంతవరకు చైతన్యహీనమగు స్థూలదేహతాదాత్మ్య శవత్వమును పొంది యుందురో అనగా స్థూలదేహాభిమాని శవముతో సమానము అని తాత్ప ర్యము. అనగా పాదాంగుష్ఠము మొదలు శిరస్సువరకు వున్న శరీరమే నేను అనెడు బుద్ధితో శవాకారమునుపొందియుండునో అంతవరకును మలమయమగు ఆ శరీరము అశుచియగుటచే తాను వాస్తవమున పవిత్రుడైయున్నను, స్థూలదేహ తాదాత్మ్య బుద్ధిచే అశుచిగనే యుండును. మరియు శత్రు-వ్యాఘ్రాదుల భయము వుండును. ఈ లోకమున జనన-మరణ వ్యాధులు మొదలగునవి కలుగుచుండును. దేహమును ఆత్మగా భావించువాడు —

"యోఽన్యథాసన్తమాత్మానం" అనుస్మృతి ననుసరించి పాపవంతుడుగాన దేహపాతానంతరము నరకమనే దుఃఖమును అనుభవించును. ఈ విధముగా అట్టి వానికి అనగా స్థూలదేహాభిమానికి సర్వకాల సర్వావస్థలయందును ఎడతెగని దుఃఖమే....

"నహవై స శరీరస్య సతః ప్రియా ప్రియ యోరపహాతిరస్తి" అనగా స్థూల శరీరాభిమానము వున్నంతవరకును ప్రియా ప్రియములు తొలగవు. అందుచే దుఃఖమూ తొలగదు. ఎప్పుడు సాధనచతుష్టయసంపన్నుడై యథాశాస్త్రముగ గురువును సమీపించి, ఉపనిషద్వాక్యములను విని, వాటిని అనుసరించిన యుక్తులచే ఆత్మ దేహత్రయాతీతము-అనగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు అతీతమగు టచే-శుద్ధమైనదనియు, ఆనంద స్వరూపమైనదనియు, ఎప్పుడు తెలిసికొనునో అప్పుడు పరులవలన కలుగు క్లేశములనుండియు, జన్మమరణ వ్యాధిరూపమగు నరకమునుండియు ముక్తుడగును

"అశరీరం వావ సన్తం కప్రియాప్రియే స్పృశతః" అను శ్రుతి ననుసరించి శరీరాభిమానము లేనివానిని ప్రియాప్రియములు ముట్టజాలవు.

"తరతిశోకమాత్మవిత్" అనగా ఆత్మజ్ఞానము కలవాడు శోకమును తరించును.

"తమేవం విద్వా నమృతర్నాహభవతి" అనగా ఆత్మను సాక్షాత్కరించు కొనినవాడు ఇచటనే ముక్తిని పొందును.

"క్షీణైః క్లేశర్జన్మ మృత్యు ప్రహాణిః" అనగా పాపములు క్షీణించుటచే జన్మ మరణములు తొలగిపోవును.

"జ్ఞాత్వా శివంశాన్తిమత్యన్తమేతి" అనగా ఆనంద స్వరూపమగు ఆత్మను తెలిసికొనిన పిమ్మట శాశ్వతమగు శాంతిని పొందును.

ఈ స్థూలశరీరము పంచభూతములచే కల్పింపబడి యున్నది. ఆ భూతములు అవిద్యచే-మాయచే-కల్పింపబడినవి; గావున అసత్యములైనవి. అపరిశుద్ధము లైనవి, దుఃఖరూపములైనవి. ఆ పరబ్రహ్మసాన్నిధ్యమూలముననేగదా ఈ భూతములు లేక ప్రపంచము చైతన్యవంతమై యున్నది. అట్లు కానిచో ఇది అంతయు జడపదార్థమేగదా! అట్టి ఈ దేహముయొక్క యథార్థ స్థితిని ఎఱుంగ లేక అజ్ఞానముచే లోకులు "దేహమే నేను" అని తలంచును ఆత్మయొక్క

స్వరూప లక్షణములగు నిర్మలత్వమును, ఆనందత్వమును, నిత్యత్వమును ఈ దేహమునందే ఆరోపించి నానావిధములగు దుఃఖముల పొలగుచున్నారు.

"శుద్ధి మిచ్ఛంత్య శుద్ధస్య నిత్య దుఃఖాత్మనా సుఖం
అనిత్య స్యైవ నిత్యత్వ మహో అజ్ఞ జనాజ్ఞతా" మ.వా.ద. 3.

ఈ స్థూలదేహము ఎట్లు ఆహార పరిణామమువల్ల జనించెనో మలము కూడ అట్లే ఆహార పరిణామమువలన జనించినది. ఈ విధముగా కారణమును అనుసరించి చూచిన రెండునూ సమానములే యగును. కాని జనులు మాత్రము దేహమునందు మాత్రము ఆత్మాభిమానము కలిగి దానితో సమానమైన మలమునందు మాత్రము అట్టి అభిమానమును వుంచుటలేదు. మలమువలె ఈ స్థూల దేహముగూడ అభిమానింప దగినది కాదని వారికి తెలియుటలేదు. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయము.

"నా శరీరము, నా ఇంద్రియము, నా బుద్ధి, నా మనసు పనిచేయుచున్నవి. వీటి నన్నింటిని నేను ఇప్పుడు అనగా జాగ్రదవస్థయందు తెలిసి కొనుచున్నాను." అని "మొదలగు వ్యవహారములు సర్వలోక ప్రసిద్ధములై యున్నవి. వీనిని బట్టి చూచిన "తాను వేఱు-మనోబుధ్యాదు లన్నియు వేఱు" అని తెలియుచున్నది. కావున మన స్సాక్షియై ఘటాకాశమువలె శరీరము నంతటిని ఆవరించివున్న చైతన్యమే "నేను" అను పదమునకు అర్థమగును గాని దేహాదులు కానేరవు.

బాగుగా విచారించినచో నీవు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములలో ఎదియును కావు. వాటినన్నిటికి నీవు సాక్షిరూపుడవు. అన్నమయాది పంచ కోశములచే కప్పబడి, సర్వాంతరుడై, కూటస్థుడని చెప్పబడుచున్న జ్ఞానస్వరూపుడవు నీవే. బ్రహ్మమునకును ఆ జ్ఞానమే స్వరూపముగాన ఆ పరబ్రహ్మమునకును నీకును ఎట్టిభేధము లేదు—

"నస్థూలోసి నసూక్ష్మో ఒసి నాపికారణ విగ్రహః
బ్రహ్మై వాసిన సందేహః ప్రత్యగ్బోధైక లక్షణః" మ.వా.ద. 185.

జన్మ మరణంబులును, బాల్యాద్యవస్థలును, జ్వరాది రోగములును, వర్ణాశ్రమాదులును, నీకు ఉపాధిగానున్న సూక్ష్మ శరీరమునకు సంబంధించినవియే గాని వాటి నన్నింటికి సాక్షి రూపముగా వున్న నీకు సంబంధించినవి కావు. ఉపాధులగు ఘటాదులకు సంబంధించిన నీలత్వాది వికారములు వాటి యందు వ్యాపించియున్న ఆకాశమునకు అంటనియట్లుగా ఆ జన్మ మరణాదులతో నీకు అనగా జీవునకు ఎట్టి సంబంధమూ లేదు. ఏలయన—సర్వకర్మలను ఆచరించునది ఆ సూక్ష్మ శరీరమే. అనగా. అందలి ముఖ్యావయము అగు అంతఃకరణమే కావున ఆయా పుణ్య పాప కర్మం

ననుసరించి వానిని అనుభవించుటకు యోగ్యములైన స్థూల శరీరములయందు ఆ సూక్ష్మ శరీరము ప్రవేశించుటయే జన్మము అనబడును.

కర్మానుగుణమగు మరియొక శరీరమును ఆశ్రయించుటకై పూర్వ శరీరము ను విడుచుటయే మరణము, ఇంతియేగాని ఆ సూక్ష్మ శరీరమునకు గూడా వినాశము-అనగా మరణము లేదు. వాస్తవ స్థితిలో సర్వంబును బ్రహ్మ రూపమే కావున దేని కిని వినాశమనునది లేదు కదా! ప్రపంచమునకు బాధయేగాని ధ్వంసము లేదు. భ్రాంతి వశమున స్థూల శరీరమునకు సంబంధించిన వృద్ధి-క్షయములను అనగా బాల్య, యౌ వనాద్యవస్థలను తనకు సంబంధించినవిగా భావించుటవలన ఆ యంతఃకరణము నకు స్వయముగనే ఆహారానుసారముగ స్థూల శరీరముతో పాటు అభివృద్ధి చెందుట స్వాభావికమే యగుట వలనను, ఈ బాల్యాద్యవస్థలు గూడా సూక్ష్మశరీరమునకు సం బంధించినవే. రోగములు, కులగోత్రాదులును స్థూల శరీరమునకే సంబంధించినవేయ య్యును భ్రాంతి జన్యమగు అభిమానముచే-అభిమానించునది మనస్సులేక బుద్ధిగనుక సూక్ష్మ శరీరమునకు సంబంధించినవియే అగుచున్నవి. అందుచే "నేను పుట్టితిని. నేను మృతి చెందుచున్నాను" అను మొదలగు వ్యవహారములను బట్టి చూచిన ఆ జనన మరణాదులను ఆత్మధర్మములుగా భావించుచుండుటఅందరకుతెలిసినవిషయమే. కావున ఒక దాని ధర్మములు మరియొక దానియందు ఆరోపించుట భ్రాంతియేగదా! కావున నీకు ఈ స్థూల, సూక్ష్మ శరీరములకు సంబంధించిన జనన మరణాదులతో సంబంధము ఇంచుకయైనను లేదు. నీవు సాక్షాత్తుగా ఆ సర్వసాక్షియగు పరమాత్మవే.

"జన్మమృత్యు జరారోగాః కులగోత్రాశ్రమాదయః
సూక్ష్మస్యైవ తవైతేషాం సాక్షిణో నైవ కళ్చన". వి. చూ. 186

మరియు జ్ఞానాజ్ఞానములు, జాడ్యప్రకాశములు. అలసత్వ త్వరితములు. మూర్ఛ బోధములు, నిద్రయు-జాగ్రతయు, భ్రాంతియు, దాని అభావంబును మొదలగున వన్నియు, కారణ శరీరధర్మములు. త్రిగుణాత్మికయగు అనగా తమోగుణము, రజోగుణము, సత్వగుణములతో కూడియున్న మాయయే లేక అవిద్యయే కారణ శరీరముగావునను జ్ఞానాజ్ఞానాది ధర్మములన్నియును గుణత్రయమునకు సంబం ధించినవియే కావునను ఆ ధర్మములన్నియు కారణ శరీరమునకు సంబంధించినవే. సుషుప్తియందునీవు ఆ కారణశరీరమునకుగూడ సాక్షివైయున్నందున ఆ జన్మ-మరణాది ధర్మములలో యే ఒక్కటియు నీకు సంబంధించినది కాదు.—

14)

"అజ్ఞాన జడతాలస్య మోహానిద్రాభ్రమాదయః
కారణస్యైవ తేఽమీషాం సాక్షిణోనైవ కశ్చన" మ. వా. ద. 187

బాగుగా పరిశీలించిచూచినచో కర్తృత్వ, భోక్తృత్వములును, అహంకార, మమకారములును, మొదలగు ధర్మములే స్వరూపముగాగల ఈ సంసారము, బుద్ధికి మాత్రమే సంబంధించినది. "నేను కర్తను" అని ఆ ఆత్మప్రకాశ సంబంధముచే ఆ బుద్ధియే అభిమానించుచున్నది. పుణ్యపాప కర్మలనన్నింటినీ ఆ బుద్ధియే ఇంద్రియములసహాయముతో ఆచరించుచున్నది. అందుచే ఆ కర్మఫలములను అనుభవించుచున్నది. పరిశీలించిచూచిన ఆ బుద్ధితోగాని, దాని కర్మలతోగాని, అది ఆ కర్మఫలములను అనుభవించుటతోగాని జీవుడవగునీకు ఎట్టి సంబంధమునులేదు. నీవు సర్వమును తటస్థముగా వుండి చూచుచున్న సంసారసాక్షివే....

"కర్తృతా, భోక్తృతా హంతా మమతాదిక లక్షణః
బుద్ధిరేవైష సంసారోనతే సంసృతి సాక్షిణః మ. వా. ద. 188.

కావున ఈస్థూలశరీర సంబంధంబును, జనన-మరణంబులును, సంసారంబును, అజ్ఞానముచే స్వస్వరూపమునందు కల్పింపబడినవేగాని యధార్థములుకావు.

"నేను నల్లనివాడను, సన్ననివాడను, అనుమొదలగు వ్యవహారములనుబట్టి చూచిన స్థూల శరీరసంబంధంబును, "నేను గ్రుడ్డివాడను, చెవిటివాడను, ఆకలితోయున్నాను." అను మొదలగు వ్యవహారములను బట్టి చూచిన సూక్ష్మశరీర సంబంధంబును, "నేను నిదురించుచున్నాను." మొదలగు వ్యవహారము వలన కారణశరీర సంబంధంబును, ఆత్మకు వున్నట్లుగా తోచుచున్నది. "నేను పుట్టుచున్నాను, లేక పుట్టితిని, మృతినొందుచున్నాను, కర్తను, భోక్తను" అను మొదలగు వ్యవహారములను బట్టి చూచిన జనన-మరణ సంబంధంబును, సంసారబంధముగూడ ఆత్మకే వున్నట్లుగా తోచుచున్నది. ఇది అంతయు అజ్ఞానముచేత కల్పించబడినదే. ప్రత్యగాత్మ రూపుడవగునీకు ఎట్టి మార్పును, వికారమునులేదు. నీవు ఎల్లప్పుడూ నిర్వికారుడవే. ఎట్టి వికారములు లేనివాడవే.

"స్థూలాదిదేహసంబంధో జన్మమృత్యూశ్చ సంసృతిః
స్వ జ్ఞానేన త్వయా స్వస్మిన్ సర్వమేతత్ప్రకల్పితమ్" మ. వా. ద. 189

మరియిక ఈ దేహాభిమానముతో వచ్చిన బంధమునుండి తొలగి మోక్షమును పొందు మార్గము లేదా యన్నచో "ఉన్నది" అని సమాధానము —

వాసనాక్షయమే మోక్షసాధనము. ఈ వాసన స్థూల, సూక్ష్మ, కారణభేదములచే మూడు విధములు. సర్వ ప్రపంచంబును వాసనారూపమే యగుటచే ఆత్మగా అభిమానింపబడు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు వాసనారూపములే యనుటలో విరోధమేమియు లేదు. కావున ముందుగ ఆయా శరీరముల స్వభావములను తెలిసికొనుట మంచిది-

1. అన్నము వలన బుట్టి, దానిచేతనే అభివృద్ధి నొందుచు, చలన, ధావనాది కార్యములను ఆచరించుచు ప్రత్యక్షగోచరముగ నున్న దేహము స్థూల దేహము
2. సంస్కారములే అనగా సంకల్పములే స్వరూపముగా గలిగి మనోమయమై వుండు దేహము సూక్ష్మదేహము.
3. సర్వ ప్రపంచమునకు మూలకారణమగు అజ్ఞానము ఏది కలదో ఆదియే కారణ శరీరము. ముందుగా ఈ కారణ శరీరము యొక్క బంధము నుండి తొలగు ఉపాయము—

బ్రహ్మవేత్తయగు అనగా బ్రహ్మతత్వమును బాగుగా ఎఱింగిన సన్యాసి తనకు గల జీవ బ్రహ్మలు ఒక్కరన్న జ్ఞానముతో తన కంటె భిన్నమగు పదార్థము మరేదియు లేదని ఎఱింగి కారణ శరీరమును నశింపజేయగలడు. జ్ఞానికి అభేద జ్ఞానము వుండును గాన ఇటువంటి భ్రాంతిని చెందడు. అందుచే కారణ శరీరము ఆతనిని బాధింపనేరదు.

"బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన శక్త్యైవ బ్రహ్మవిద్యతిః
నాశయేత్కారణం దేహమకుర్వాన్ కించిదంతరం" మ.వా.ద 285

అట్లే పరబ్రహ్మ రూపమును గుర్తించిన జ్ఞాని సర్వ ప్రపంచమును బ్రహ్మరూపమననే జూచుచుండుటచే సూక్ష్మ శరీరమును నశింపజేయును. ఈ సూక్ష్మ శరీరమునకు సంకల్పములే స్వరూపము. ఆ సంకల్పములును "ఇది ఘటము, ఇది పటము" అని పదార్థములను పరస్పర భిన్నములుగా జూచుచుండిననేగాని కలుగవు. బ్రహ్మజ్ఞానికి అట్టి పదార్థ భిన్నత్వభావన వుండదు గావున ఆతనికి సంకల్పములే వుండవు. అందుచే జగద్బ్రహ్మాభేదమును ఎఱింగిన వాడగుటచే ఈ సూక్ష్మ శరీరమును నశింపజేయును. సంకల్పములులేకున్న మనస్సు నిర్మలముగా వుండి శాంతిని పొందును. మోక్షమనగా ఇట్టి శాంతియేగదా!

"విశ్వం బ్రహ్మాత్మనా పశ్యన్నజస్రం వాసనా తనుం
నిర్మూల్య బ్రహ్మ విద్యాతి ముక్తిం నిర్వాణ లక్షణామ్" మ.వా.ద 286

అదే విధముగా "నేను కర్తనుగాను, భోక్తనుగాను" అను జ్ఞానముచే స్థూల శరీరమును నశింపజేయవచ్చును. స్థూల శరీరమును కలిగించునవి ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలే. కావున "నేను ఎట్టికర్మలను చేయువాడనుకాను" అని తన స్థూల దేహము యొక్క జడత్వమును ఎఱింగిన ఆ కర్మలు తనకు సంబంధించినవి కాక పోవును. వాస్తవ స్థితిలో సర్వము అసత్యము అనగా ఆ బ్రహ్మయందు భ్రాంతిచే కల్పింపబడినదే గావున అజ్ఞాన జన్య సంబంధము జ్ఞానము కలుగగనే నశించు ననుటలో ఎటువంటి సందేహము వుండదు. ఈ విధముగా కర్మ సంబంధము తొలగగానే స్థూల శరీర సంబంధము గూడ తొలగిపోవును. స్థూలదేహముల యందు అభిమానము లేకుండుటయే వానికి అనగా ఆ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు నాశమని గుర్తింపవలయును. -

"అకర్తాత్మ జ్ఞాన వహ్నిజ్వాలా యాం త్రివిధం స్ఫుటం
కర్మదగ్ధ్వా స్వయం తస్మాన్ముక్తః స్థూలం వినాశయేత్ మ.వా.ద. 287

ఈ విధముగ పై చెప్పిన ఉపాయములచే స్థూల, సూక్ష్మ, కారణ వాసనలు నశించిన సంసారము సంపూర్ణముగ నశించినట్లే, ముక్తిలభించినట్లే. ప్రపంచమునకు ధ్వంసము ఎప్పటికిని లేదు. కావున స్థూలాది శరీరముల యందలి అభిమానము లేకుండుటయే, వానికి నాశమని ఎఱుంగ వలయను. "నేనే బ్రహ్మమును, ఈ ప్రపంచ మంతయును బ్రహ్మమే. కావున బ్రహ్మ భిన్నమగు వస్తువు ఏదియునులేదు" అను దృఢమైన తలంపు సర్వకాల సర్వావస్థలయందును అనగా ఎట్లు వ్యవహరించుచున్నను, ఏమి చేయుచున్నను దృఢముగ నిలిచి యుండుటయే సంసార నాశమునకు గుర్తు. అట్లు భేద దృష్టిని సంపూర్ణముగ తొలగించి తనను, సర్వ ప్రపంచమును బ్రహ్మ మాత్ర ముగ తలంచునట్టి మహాత్ముడు మోక్షమును పొందినవాడే అగుచున్నాడు. వ్యవహార దశయందు తనకు ఏయే పదార్థములు ఎట్లు కాన వచ్చినను వానిని ఘట, పటాది దృష్టితో జూడక బ్రహ్మదృష్టితో చూచుచు వుండునో అట్టి బ్రహ్మజ్ఞానికి వాసనా క్షయము కలుగును. వాసనా క్షయము కలిగిన తోడనే వాని కార్యములగు కర్మాచు లన్నియు నశించును. ఇదియే ముక్తి, మోక్షము.

—o—

"జగత్తును చూచుటయు మరియు తెలుసుకొనుటయు పూర్తిగా మానినంతనే నీకు ఆత్మజ్ఞానము ఉదయించును." — వివేకానందుడు.

—o—

# కర్మలన్నియు బంధహేతువులే

"మనఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః॥

ఈ సంసారమున కంతటికిని మనస్సే మూలకారణము. మనస్సే ఈ ప్రపంచమునకు సృష్టికర్త. స్వప్నావస్థయందు పదార్థములను ఏ బ్రహ్మయు సృష్టించుట లేదు. ఆ స్వప్నప్రపంచమును సృష్టించునది మనస్సేయని అందరకు తెలిసిన విషయమే. సర్వపదార్థములకును గూడ ఈ మనస్సే మూలకారణము. ఇట్టి బంధము నుండి విడువడుటకు మానవశరీరము ఎంతో సహాయకారి. ఏలనన "శరీరమాద్యం ఖలుమోక్షసాధనం" అనగా శరీరమే మోక్షప్రాప్తికి ముఖ్యసాధనము. ఈ అవకాశము ఒక్క మానవునికితప్ప యితర యేప్రాణికిని లేదు—

"జంతూనాం నరజన్మదుర్లభం తతః పుంస్త్వం తతోవిప్రతా
తస్మాద్వైదిక ధర్మమార్గపరతా, విద్వత్వం అస్మాత్పరం
ఆత్మానాత్మ వివేచనం, స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శతకోటి జన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే"

వివేకచూడామణి 2

అనగా జన్మించు స్వభావముగల ప్రాణులకు మనుష్యత్వము అనగా మానవశరీరము లభించుట చాలాకష్టము. జన్మమనగా జీవునకు శరీరసంబంధము కలుగుటయే. కావున ఒక్కనికే అనేకజన్మలు వుండునను విషయము తెలియుచున్నది. అందుచేతనే అనేక జన్మములుకలుగు జీవునకు ఈ నరజన్మము లభించుట దుర్లభము అని చెప్పబడినది. సుఖహేతువగు శరీరము లభింపవలెనన్నచో, దుఃఖహేతువగు శరీరము లభింపకుండ వుండవలెనన్నచో నర శరీరధారియగు ఈ జీవునకు పుణ్యము చేయవలసి యుండునని వేదములు చెప్పుచున్నవి. జ్ఞానముద్వారా పూర్వాపూర్వజన్మములయందు చేయబడిన సకల కర్మఫలములను అనుభవించకుండ తప్పించుకొనవలెనన్నచో ఈ నర శరీరము ఎంతయో మంచి సాధనము. ఒకే వ్యక్తి శుభాశుభ మిశ్రమములు అగు కర్మలను ఆచరించుటచే ఒక విజాతీయమగు—విశిష్టమగు—శరీరము ఆతనికి లభించునని శ్రుతి చెప్పుచున్నది—

శుభై రాప్నోతి దేవత్వం నిషిద్ధైర్నారకీంతనుమ్,

ఉభాభ్యాం పుణ్య-పాపాభ్యాం మానుష్యం లభతేవశః॥

జీవుడు శుభకర్మలచే దేవత్వమును అనగా దేవతలకు లభించు శరీరమును, నిషిద్ధకర్మలచే నరకయోగ్యమగు శరీరమును, పుణ్య-పాపములు రెండునూ ఆచరించుటచే మనుష్యశరీరమును పొందును. దీనిని తప్పించుకొనజాలడు. అట్లుకానిచో లోకమునందుకానవచ్చుచున్న సుఖదుఃఖాది భిన్నత్వమునకు కారణము చెప్పుట దుర్లభము. వారివారికర్మలనుబట్టికాక ఈశ్వరుడే కొందరు ప్రాణులను సుఖవంతులు గను, మరికొందరిని దుఃఖవంతులగను చేయుచున్నాడన్నచో ఈశ్వరునకు పక్షపాతము, దయారాహిత్యము మొదలగు దుర్గుణములున్నవని చెప్పవలసివచ్చును. అట్లయినచో ఆయనగారి ఈశ్వరత్వమునకే భంగము కలుగునుకదా! అందువలన ఆయన వారివారికర్మల ననుసరించియే వారికి అనుకూలమగు శరీరములను కల్పించుచున్నాడు.

"న కర్మావిభాగాదితి చేతనానాదిత్వాత్"

"కర్మవిభాగము కుదరదుగాన ఈశ్వరునకు కర్మాపేక్షత్వము చెప్పుట యుక్తము కాదు." అని అనరాదు. ఏలయన కర్మసంసారాదికము అనగా సంసారమును కల్పించుచున్నది. అందుచే అనాది. ఈశ్వరుడు కర్మ-సాపేక్షకుడనియు, సంసారము అనాది యని శ్రుతులు చెప్పుచున్నవి.

ఇట్టి అనాదియగు సంసారమును తొలగించుకొనవలెనన్నచో "సన్యాస రూపమగు నివృత్తి ధర్మములను ఆశ్రయించి, పరమ పురుషార్థ సాధనమగు బ్రహ్మసాక్షాత్కారమును పొందవలసి వుంటుంది. అంతేగాని ప్రవృత్తి ధర్మమును అనుసరించి ఎన్ని శాస్త్రములు పఠించినను, ఎన్నిసార్లు ఇంద్రాది దేవతలను యజ్ఞముల ద్వారా సేవించినను, కర్మలచే దేవతలను నిరంతరము భజించినను, ఆ త్మైక్య జ్ఞానము లేకుండ నూరు బ్రహ్మాంతరములలోగూడ ఎవ్వనికి ముక్తి సిద్ధింపదు" అని వేదాంతములగు ఉపనిత్తులు ఘోషించుచున్నవి—

"పఠన్తుశాస్త్రాణి, యజన్తుదేవాన్
కుర్వన్తు కర్మాణి, భజన్తుదేవతా
ఆత్మైక్య బోధనవినా విముక్తిః
న సిధ్యతి బ్రహ్మ శతాంతరేఽపి" వి-చూ-శ్లో-6

ఎందువలననగా-ధనముచే మోక్షము లభించునది కాదు. అది కేవలము జ్ఞానముచేతనే లభించునది. కర్మలు ముక్తికి హేతువులు కాదు అని శ్రుతి స్పష్టముగా చెప్పుచున్నది.

"అమృతత్వ స్యనశాస్తి విత్తేన త్యేవహిశ్రుతిః
బ్రవీతి కర్మణో ముక్తే రహేతుత్వం స్ఫుటంయతః" వి-చూ-7

"అమృతత్వస్య నశాస్తివిత్తేన" అను వాక్యముద్వారా ధన సాధ్యమగు కర్మలు అనగా యజ్ఞముచేయుట, సత్రములు కట్టించుట, నూతులు త్రవ్వించుట, పాఠశాలలు కట్టించుట మొదలగునవి సాక్షాత్తుగా మోక్షప్రాప్తికి సాధనములు కాజాలవని శ్రుతి చెప్పుచున్నది. మోక్షప్రాప్తికి ఎల్లప్పుడు బ్రహ్మలగ్నమగు మనస్సును కలిగియుండుట అవసరము. అట్టి బ్రహ్మలగ్నమగు మనస్సును కలిగియుండుటకు కర్మసన్యాసము లేనిచో అసంభవముగాన వివేకము కలిగిన వైరాగ్యవంతుడు తాను సకల కర్మలను సన్యసించి బ్రహ్మనిష్ఠుడగు గురువును సమీపించి బ్రహ్మవిచారము చేయవలయును. అప్పుడే మోక్షప్రాప్తి సంభవము. సమస్తమైన అనగా సర్వవిధములగు కర్మలను సన్యసించి మనస్సును బయటి విషయములందు లగ్నము కాకుండ అదుపులో వుంచుకొన్నవారును, ఆత్మకు సంబంధించిన శ్రవణాదులయందు ప్రవర్తించుచున్న పండితుల ఉపదేశానుసారముగ సంసారబంధముల ముక్తి కొఱకు ప్రయత్నించవలయును.

"సన్యస్య సర్వకర్మాణి భవబంధ విముక్తయే
యత్యతాం పండితైర్ధీరై రాత్మాభ్యాస ఉపస్థితైః" వి-చూ-10

ఉపనిషద్గ్రంథములయందు ఇట్లు కర్మసన్యాసమునుగూర్చి చెప్పబడియున్నను వైదిక ధర్మాచరణులకు కర్మసన్యాసమును గురించి అనేకమైన అనుమానములు, ఆశంకలు కలుగుచుండును. ఎట్లన?—

1. "యావజ్జీవం అగ్నిహోత్రం జుహూయాత్"
"జీవించియున్నంత కాలము అగ్నిహోత్రము చేయవలయును"

2. "యావజ్జీవం ధర్మపూర్ణమాసాభ్యాం యజేత"
"జీవించియున్నంతవరకు ధర్మపూర్ణమాస యాగములు చేయుచుండవలెను"

3. "అహరహః సంధ్యాముపాసీత"
"ప్రతిదినమును సంధ్యోపాసనము చేయవలయును"

4. "కుర్వన్నేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః"
"కర్మలు చేయుచునే నూరు సంవత్సరములపాటు జీవనము గడుపుటకై అభిలషించవలెను.

మొదలగు శ్రుతులు జీవించి యున్నంత వరకును కర్మలు చేయుచునేయుండవలెనని బోధించుచున్నవి కదా! కర్మసన్యాసము చేసినచో శ్రుతి ధర్మమును నిరాకరించినట్లుకాదా'' అని అనుటకు అవకాశము కలుగుచున్నది. కాని అట్లుకాదు. ఏలయన - ఆశ్రుతులన్నియు చిత్తశుద్ధిలేని వారికై చెప్పబడినవి. "నేను మానవుడను, పుట్టుచున్నాను, మరణించుచున్నాను", అని యే అజ్ఞాని తలంచుచుండునో అతడు చిత్తశుద్ధి కొఱకు అట్టి కర్మలన్నియు చేయుచునే వుండవలయును'' అని ఈశావాస్యోపనిషత్తు నందు చెప్పబడియున్నది. కాని మోక్షప్రాప్తికి కర్మలు సాధనములు కావని —

"న కర్మణా నప్రజయా, ధనేన, త్యాగేనైకే అమృతత్వమానశుః'' "కర్మచేతకాదు, సంతానము కనుటచేకాదు, ధనముచే కాదు, కర్మత్యాగము చేతనే విద్వాంసులు మోక్షమును పొందగలుగుచున్నారు.'' అని శ్రుతులు చెప్పుచున్నవి.

"ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః
అష్టా దశోక్తమవరం యేషు కర్మ
ఏత చ్ఛ్రేయో యే అభిన న్దన్తి మూఢా
జరా మృత్యుం తే పునరేవాపి యన్తి'' వి.చూ. 25.

"యజ్ఞోపాధి భూతులగు ఈ పదునెన మండుగురును, పదునారుగురు ఋత్విక్కులు, యజమానుడు, అతని భార్య దుర్బలమైన తెప్పలు, వారిపై ఆధారపడియున్న యజ్ఞ రూపమగు కర్మగూడ క్రింది తరగతికి చెందినదే. ఏ మూఢాత్ములు ఈ కర్మనే శ్రేయస్సుగా అభినందింతురో వారు మరల మరల జరామృత్యువుల పాలగుచుందురు''

"తమేతం వేదాను వచనేన బ్రాహ్మణా వివిదన్తి యజ్ఞేన దానేన తపసానాశకేనః

"బ్రాహ్మణులు వేదాధ్యయనము చేతను, యజ్ఞముచేతను, దానము చేతను, అనశ్వరమగు తపస్సుచేతను, ఈ ఆత్మను తెలిసికొన నిచ్ఛగించుచున్నారు''

"యోగినః కర్మకుర్వన్తి సంగ త్యక్త్వాత్మ శుద్ధయే''

"యోగేశ్వరులు సంగమును విడిచి కర్మలను చిత్తశుద్ధికొఱకై ఆచరించుచుందురు.'' ఇటువంటి శ్రుతి వాక్యములను విచారించగా కర్మలచే చిత్తశుద్ధి, తద్వారా జ్ఞానేచ్ఛకు అవకాశము కలుగునని మాత్రమే నిర్ణయించబడుచున్నదిగాని ఈ కర్మలను ఎల్లప్పుడూ చేయుచుండవలెనని మాత్రముకాదు.

"అత ఏవచా గ్నీంధనా ద్యనపేక్ష
సర్వాపేక్షేచ యజ్ఞాది శ్రుతేరశ్వవత్"

విద్యయే, జ్ఞానమే - పరమ పురుషార్ధ హేతువు అగుటచే అగ్నీన్ధనాదులగు - గృహస్థాది ఆశ్రమ కర్మలు మోక్ష విషయమున సహాయకారులుకావు. అందుచే ఆశ్రమ కర్మలన్నియు విద్య, జ్ఞానము, లభించుటకు మాత్రమే ఉపయోగపడును.

మోక్ష ఫలమును కలిగించునది మాత్రము జ్ఞానమే అని స్పష్టముగా చెప్ప బడియున్నది.

అశ్వాదులు బండిలాగుటకు మాత్రమే ఉపయోగపడునుగాని దుక్కిదున్నుటకు కానట్లు, కొన్ని వస్తువులు కొన్నింటిని సాధించుటకు మాత్రమే ఉపయోగపడును. అట్లే యజ్ఞాదులు అని బ్రహ్మ సూత్రమునందు గూడ ఈ భావమే ప్రకటింపబడి యున్నది. అందుచే కర్మలు పరమ పురుషార్ధమగు మోక్షమును ఈయ జాలవు. కేవలము చిత్తశుద్ధికి మాత్రమే సహాయకారులగును.

"చిత్తస్య శుద్ధయే కర్మనతు వస్తూప లబ్ధయే.
వస్తు సిద్ధి ర్వి చారేణ నకించిత్కర్మకోటిభిః" వి.చూ. 11

"కర్మలు చిత్తము యొక్క శుద్ధి కొఱకు మాత్రమే ఉపయోగపడునుగాని వస్తు జ్ఞానము, తత్వ జ్ఞానము కొఱకు ఉపయోగించవు. వస్తుజ్ఞానము విచారణచేయు ట చేతనే కలుగును. కోటి కర్మలు చేసినను ఏమియు ప్రయోజనము లేదు"

త్రాడునందు భ్రాంతిచే ఆవిర్భవించిన ఏ మహా సర్పము యొక్క జ్ఞానము వలన కలిగిన దుఃఖమును తొలగింపజాలిన రజ్జుతత్వ నిర్ణయము బాగుగా ఆలో చించుట వలన కలిగినదో అట్లే భ్రాంతిచే కలిగిన సంసారదుఃఖమును తొలగించెడి తత్వనిర్ణయము అనగా ఆత్మయొక్క యథార్థ స్వరూప జ్ఞానరూపమగు ఆత్మ సాక్షాత్కారము గూడ సమ్యక్ విచారణ చేయుట వలననే కలుగుసుగాని ఎటువంటి కర్మలు చేతను కాదు.

"అర్థస్యనిశ్చయోదృష్టో విచారేణహితోక్తితః
నస్నానేన దానేన, ప్రాణాయామశతేనవా" వి. చూ. 13.

"వస్తువుయొక్క నిర్ణయము హితులైనవారియొక్క అనగా శాస్త్రము, గురువు మొదలగు వారియొక్క ఉపదేశము వలన కలుగు విమర్శచేత చేయబడినది. అంతే గాని స్నానముచేతకాదు; దానముచేతకాదు; అనేక ప్రాణాయామాది కర్మలచేతకాదు.

వస్తువుయొక్క యధార్థస్వరూపమును నిర్ణయించుటకు అనుకూలమగు మానస వ్యాపారమునే విచారమందురు. భ్రాంతికలిగినపుడెల్ల దానిని తొలగించి వస్తువుయొక్క యధార్థస్వరూపమును తెలుపగలిగినది హితుల వుపదేశమువలన కలిగిన విచారమే అను విషయము సర్వవిదితము. కావున శ్రుతులచేతను, గురూపదేశముచేతను వివేకముకలిగి విచారణచేసి వస్తువుయొక్క యధార్థస్వరూపమును సాక్షాత్కరింప జేసికొనిననేగాని అధ్యాసతొలగి ఆత్మసాక్షాత్కార రూపమగు మోక్షము కలుగదు. అంతేగాని యజ్ఞము, యాగములు, దానములు, ధర్మములు మొదలగు కర్మలచే కలుగదని భావము.

ఇందులకు ఒక ఉదాహరణ :-

ఒకసారి విక్రమాదిత్యుడు తన రాజ్యముయొక్క స్థితిగతుల గురించి తెలుసుకోవడానికని మారువేషంలో దేశసంచారానికి బయలుదేరాడు. ఒకచోట ఒక బ్రాహ్మణుడు యజ్ఞంచేస్తున్న దృశ్యం కనబడింది. ఆబ్రాహ్మణుని ఆశ్రమం ప్రక్కనే యజ్ఞభస్మం గుట్టలుగా పడివుంది. విక్రమాదిత్యుడు ఆయన దగ్గరకు వెళ్ళాడు. "స్వామీ! మీరేమిచేస్తున్నారు" అని అడిగాడు. "నాయనా నేడుకాదు, నిన్నకాదు. గత అరువది సంవత్సరములనుండి భగవంతుణ్ణి సంతోషపెట్టడానికని నేను ఈ యజ్ఞంచేస్తున్నాను. ఈ ప్రక్కన గుట్టలుగా పడియున్నది ఆ యజ్ఞభస్మమేను. ఈ యజ్ఞంలో డబ్బాలకొలది నెయ్యిపోసాను. సుగంధ ద్రవ్యాలను అర్పించాను. బండ్లకొలది గంధపుచెక్కలను ఆహూతిచేసాను. వీటన్నింటి ఫలితంగానే ఆ యజ్ఞభస్మం అలాగుట్టలుగా పెరిగిపోయింది." అన్నాడు. "మరి మీరేమైన భగవదనుగ్రహమునకు పాత్రులైనారా" అని ప్రశ్నించాడు విక్రమాదిత్యుడు. "అదే నా ఆవేదన ఒక్కసారైనా ఆ భగవంతుడు నాకు దర్శనము యివ్వలేదు. కనీసం స్వప్నము నందైనా కనుపించలేదు" అంటూ ఆ బ్రాహ్మణుడు తన ఆవేదనను వ్యక్తంచేశాడు.

విక్రమాదిత్యుని మనస్సు కరిగింది. తాను ఆ ఆశ్రమంలోనే కూర్చుని భగవంతుణ్ణి చిత్తశుద్ధితో ధ్యానించాడు. అప్పుడు భగవంతుడు ఆయనకు ప్రత్యక్షమై— "రాజా....ఏమికావాలి నీకు? కోరుకోయిస్తాను" అన్నాడు. "దేవా! నాకేమీ అక్కరలేదు. కాని ఈ వృద్ధబ్రాహ్మణుడు గత అరువది సంవత్సరాలుగా మీగురించి యజ్ఞం చేస్తున్నా అయనకు మీరెందుకు దర్శనమీయలేదు. ఆతనిపై మీ అనుగ్రహ వర్షాన్ని ఎందుకు కురిపించలేదు." అని విక్రమార్కుడు ప్రార్థించగా చిన్నగానవ్వి పరమాత్ముడు "రాజా! నేను భావప్రియుడునే గాని బాహ్యప్రియుడనుకాను. నీవు ఎన్ని సమారాధనలు చేసావో, ఎంతమందికి అన్నదానం చేసావో, ఎంతమందికి వస్త్రదానం

చేసావో, యజ్ఞాలు ఎంత ఖర్చుతో ఆచరించావో, ఆ లెక్కలు నాకు అక్కరలేదు. నాకు కావలసింది భావమే. భావశుద్ధితో ధ్యానించినవాడే నాకు ప్రియమైన భక్తుడు. అట్టి ప్రియమైన భక్తులకు నేను దాసానదాసుణ్ణి. ఈ బ్రాహ్మణుడు నిరంతరం మంత్రాలను ఒకటి తరువాత మరొకటి ఏమిటని క్రమం తెలుసుకొంటూ నోటితో వుచ్చరిస్తున్నాడేగాని, ఆ విధంగా మంత్రాలక్రమము, ఉచ్చారణాశుద్ధతపైనే తన ధ్యానాన్ని కేంద్రీకరించుతున్నాడుగాని తన మనస్సును నాయందునిల్పి ఒక్కసారైనా "మాధవా!" అని పిలువలేదు. కేశవాయనమః, నారాయణాయనమః, మాధవాయ నమః" అంటూ పెదవులతో మంత్రాలు మాత్రమే వల్లిస్తున్నాడు. నాకు కావలసింది మంత్రాలుకాదు. నిండుమనస్సుతో ఒక్కసారి "మాధవా!" అంటే నేను వరుగెత్తు కొస్తాను. ఇతడు భక్తితో యజ్ఞం చేసినట్లుగా నీకు కనిపిస్తుంది కాని ఇది నిజమైన భక్తికాదు. కేవలం తన శక్తిసామర్థ్యాలను లోకంలో ప్రకటించుకొంటున్నాడు. అలాంటివారితో నాకేమిపని?" అన్నాడు. అంతే.

అందుచేత తేలినదేమంటే ఈ యజ్ఞయాగ, దానాది పుణ్యకర్మలు తమ ప్రజ్ఞా పాటవాలను చాటుకొంటూ అహంకారాన్ని పెంచేవేగాని మోక్షప్రదమైన జ్ఞానాన్ని కలిగించేవి మాత్రముకావు.

"యత్రచిత్తం తత్రవిశ్వం స్వయమేవ ప్రతీయతే
యత్ర చిత్తంనాస్తి తత్రనాస్తి కించిజ్జగత్కథా" మ.వా.ద. శ్లో 140

"ఎచ్చటబుద్ధి-మనస్సు-వుండునో ప్రపంచము అచ్చట వుండును. బుద్ధి ఎచ్చటలేదో ప్రపంచము అచ్చటలేదు" మానవునకు మనస్సుద్వారానే బంధము కలుగుచున్నది. తిరిగి ఆ మనస్సు ద్వారానే మోక్షము కలుగు చున్నది. అందుచేతనే శ్రుతి. "మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని చెప్పినది. అది ఎట్లన— మనస్సు ఎప్పుడు ఇంద్రియములతోకూడి బయటకు వ్యాపించి విషయములను సృష్టించునో అప్పుడు ఇంద్రియములన్నియు ఆ విషయము లను సంపాదించుటకు, తిరిగి వాటిని అనుభవించుటకు కర్మలు చేయుచున్నవి. ఈ విధముగ భోగ్యపదార్థముల సృష్టికి కారణభూతమగు మనస్సే భోగ్యములను అందించుట ద్వారా జీవునకు భోక్తృత్వము కల్పించుచున్నది. అందుచే మనస్సే భోక్తను గూడ కల్పించుచున్నది. స్వప్న జాగ్రదావస్థలయందు మనస్సు వున్న ప్పుడే సంసారము కనబడుచున్నది. సుషుప్తిలో అదిలేనపుడు సంసారము కనబడుట లేదు. కావున మనస్సు కంటే భిన్నమగు సంసారములేదు అని సిద్ధాంతమగు చున్నది.

కాని మనస్సు అనగా ఏ మనస్సుపైవిధముగా బంధమును కల్పించుచున్నదో, ఈ దేహాది విషయములందు వైరాగ్యమును, అనాసక్తిని, బాగుగా కల్పించి ఈ పురుషుని దేహాదులందు అభిమానరూపమగు బంధమునుండి పూర్తిగ విడిపించు చున్నది.

ఈవిధముగా ఒకే మనస్సు బహిర్ముఖమై విషయములందు వ్యాపించి, నానా విధములగు కర్మలను చేయుటద్వారా బంధమును కలిగించుచున్నది. తిరిగి ఆమనస్సే శాస్త్రపఠనము, గురూపదేశము మొదలగు హితవచనముల, నిధిధ్యాసనములద్వారా వివేకవైరాగ్యముల సంపాదనజేసి విషయములనుండి విముఖము కలదై జీవునకు మోక్షప్రాప్తికి సాధనముగా అగుచున్నది.

కావున మనస్సు ఒక్కటేయైనను గుణభేదమునుబట్టి, అనగా తమోరజస్సు లతో కూడియున్నప్పుడు బహిర్ముఖమై కర్మలు నిర్వర్తించి వాటిఫలములను అను భవించుటద్వారా జన్మమరణములు కలిగించుచూ బంధమునకు కారణమగుచున్నది. అదేమనస్సు సత్వగుణముతోకూడి అంతర్ముఖమై సర్వకర్మ సన్యాసము గావించి, బ్రహ్మభావముతోనిండి మోక్షమును కలిగించుచున్నది.—

"తస్మాన్మనః కారణమస్యజంతో
ర్బన్ధస్య-మోక్షస్యచ వావిధానే
బంధస్య హేతుర్మలినం రజోగుణై
ర్మోక్షస్య హేతుర్విరజస్తమస్కమ్" వి.చూ. 176

అసంగము చిదానందరూపము అగు తనస్వరూపమును తెలిసికొనిన పురుషుడు ఏమియుకోరడు, ఏ కర్మలను ఆచరింపడు. అందుచే కర్తృత్వమైనను భోక్తృత్వ మైనను దేహము ఇంద్రియములు మొదలగు వానియందు అధ్యాసచే అనగా దేహా దులయందు ఆత్మాభిమానము కలుగుటచే వచ్చినవే-

"కుర్వతేకర్మభోగాయ కర్మకర్తుంచ భుంజతే"

భోగముల కొఱకై కర్మలు చేయుచున్నారు. కర్మలుచేయుటకై అనుభవించు చున్నారు." కావున ఆత్మానాత్మ భేదశూన్యుడైన పురుషునకు అనాత్మలయందు ఆత్మబుద్ధి దృఢముగ కలుగుటవలన అవిచ్ఛిన్నమగు జన్మ-మరణపరంపర కలుగు చున్నది.

దేహాదులపై రాగమున్నపుడు కర్మలు చేయును. కర్మలు చేసినచో విక్షేపము అనగా అనాత్మ పదార్థములు సుఖహేతువులను భావము కలుగును. రాగనిర్మూలన

ముచే సకల కర్మలను విడిచి వివేక వైరాగ్యాదులచే జ్ఞానవంతుడై మోక్షమును పొందును.

ఈ వివేచనముచే తేలిన సారాంశమేమన మోక్షమును పొందగోరువాడు సకల కర్మ సన్యాసమును చేయువలయును. అనగా సర్వవిధ కర్మలను పరిత్యజింప వలయును. స్నానముగాని, మంత్రజపముగాని, దేవపూజగాని, రామ–కృష్ణాది నామ సంకీర్తనముగాని, తీర్థయాత్రలుగాని, మరి యే కర్మలుగాని వానికి అక్కరలేదు. ఈ కర్మలు వానికి బంధమును కలగించునవియేగాని సహాయము చేయునవి కానేరవు. అనగా మోక్షమును కలిగింపజాలవు.

భేదబుద్ధి కలిగి మూర్ఖులై యున్నవారలను క్రమముగా ఉద్ధరించుటకై భేదమును అంగీకరించి అధికారానుసారముగా ఉన్నత స్థితిని చెందు ఉపాయములను బోధించు అనాత్మవిషయిక శాస్త్రములయందు మాత్రమే ఈ విషయము ప్రస్తావించ బడి యున్నది. కావున దీనిని ఆచరింప వలయుననిన సాధ్యసాధక సాధన ఫల భేదములను అవశ్యముగ అంగీకరించి తీరవలయును. "నేను ఈ కర్మలను చేయు చున్నాను" దీనిని సాధించుటకు తగిన సాధనములన్నియు నా యొద్ద సిద్ధముగనున్నవి. దీని వలన బహుధాన్యములు ఫలించును" అను మొదలగు భేదవ్యవహారములు అందరి అనుభవమునందు వున్నవియే కదా! ఈ విధముగా భేదమును అంగీకరించుట వలన క్రమక్రమముగా అభేద బుద్ధియే అభివృద్ధినొందునుగాని అభేద బుద్ధి కలుగనేరదు. కావున ముముక్షువునకు కర్మప్రత్యక్ష విరోధి. కర్మ ఒక్కటియేకాదు భేదమును అంగీకరించి చెప్పబడిన అన్ని విషయములును ఇట్టివే. అనగా అభేద జ్ఞానమును సంపాదింప దలంచిన వారికి విరుద్ధములే. కావున మోక్షేచ్ఛగలవాడు కర్మలను సన్యసించియే తీరవలయును.

"నస్నాన మంత్రార్చనకీర్తనాదివా, నతీర్థసేవాదివ కర్మ భిక్షోః,
యుక్తం యతోఽనాత్మమతి ప్రవర్థకం, హ్యనాత్మ శాస్త్రైరితమప్యశేషమ్"
మ.వా.ద. 223.

ఇంతేకాదు –

"న కర్మణా, నప్రజయా, ధనేన, త్యాగేనైకే అమృతత్వమానశుః"

"కర్మలు, సంతానము, ధనము అనునవి యాథార్థమైన మోక్షమును కలిగింపజాలవు. ఏలయన" అస్థిరములు, అసత్యములు అయిన సాధనములద్వారా సత్యము నిత్యము అయిన మోక్షము లభించదు" అని సిద్ధాంతము, 'జ్ఞానము' అనెడు సత్యమును, నిత్యమును అయిన సాధన ద్వారా మాత్రమే సత్యము నిత్యము అయిన మోక్షము

కలుగును. అందుచే సన్న్యాసము ఒక్కటియే అనగా సర్వకర్మ పరిత్యాగమే మోక్షమునకు సాధనము." అను మొదలగు వాక్యములచే పరమ ప్రమాణభూతమగు శ్రుతి గూడ పై విషయమును నిర్ణయించి ముముక్షువులకు ఉపదేశించుచున్నది. మోక్ష ప్రాప్తికై కర్మలను సంపూర్ణముగ నిషేధించుచున్నది. —

"న కర్మ మోక్షం ప్రతికారణం త్వితి
స్వయం వినిశ్చిత్య విముక్తి మిచ్ఛతాం,
న కర్మణా నప్రజయేతి సాక్ష
త్కార్మాఖిలం సాధునిషేధతి శ్రుతిః" మ.వా.ద 224

మరియు "సంనస్యశ్రవణంకుర్యాత్" అను మొదలగు శ్రుతిగూడ

"కర్మలను విడిచిననేగాని వేదాంత వాక్యములను వినుటకు గూడ అధికారము కలుగదు." అని చెప్పుచు పై సిద్ధాంతమును బలపరచుచున్నది. కావున త్రికరణ శుద్ధిగ ముక్తినిగోరి దానికై ప్రయత్నించు ముముక్షువు అవశ్యముగ సన్న్యాసమును స్వీకరింప వలయును. స్నానాది కర్మలతో అతనికి యిసుమంతయు ప్రయోజనము లేదు. కావున అట్టి కర్మలను ఆచరింపనక్కరలేదు.

"అయమేవయతేర్ధర్మం కర్తవ్యోమోక్ష కాంక్షిణః
నైవ స్నానం నాపి జపోన పూజాపిన కీర్తనమ్" మ. వా. ద. 226

బియ్యముతో సంబంధము కలిగినతోడనే టెంకాయ ఎట్లు సమూలముగ నశించునో, నీరు తగులగానే ఎట్లు తేనె నిరర్థకమై చెడిపోవునో, అట్లే వేదాంత వాక్య శ్రవణము వలన కలిగిన అభేదజ్ఞానము కర్మానుష్ఠానములచే సంపూర్ణముగ తొలగిపోవును. కావున మోక్షమునుగోరి దాని ప్రాప్తికై ప్రయత్నించు ముముక్షువు కర్మను ఇంచుకయైనను ఆచరింపరాదు. ఆ కర్మాచరణము వానికి అపకారమును కలిగించునేగాని ఎటువంటి ఉపకారమును కలిగింప జాలదు.

ఉదా "యథా తండులం సంపర్కాన్నారికేళం వినశ్యతి,
యద్వై వోదక సంపర్కా త్సమూలం మధునశ్యతి,
తథా శ్రవణజో బోధః కర్మయోగ ద్వినశ్యతి,
తతో ముముక్షోస్తు యతేర్న కార్యం కర్మకించన" మ. వా. ద. 228.

ఇట్టి స్థితియందు ముముక్షువుని కర్తవ్యమేమి? అన్నచో—

"సర్వ కర్మాణి సంనస్య" అను మొదలగు వాక్యములచే వేదముపై సిద్ధాంతమునే దృఢము చేయుచున్నది. కావున ఈ విషయమున కొంచమైనను సంశయింప

పని లేదు. మరియు జీవ బ్రహ్మలకు గల సహజమైన అభేదమును యెఱుంగుటయే ముముక్షువునకు కలుగు ఫలమని పండితులు చెప్పుచున్నారు. ఇట్టి ఫలమును కలుగ జేయుట యందు సహాకారులు కానందుననే కర్మలు ముముక్షువునకు పనికిరావు.—

సర్వ కర్మాణి సన్యస్యే త్యేవం వక్తి స్వయంశ్రుతిః

శ్రవణాదేః ఫలం ప్రాహుర్బ్రహ్మాత్మైక్య బోధనం" మ.వా.ద. 229

పైన చెప్ప బడిన జీవబ్రహ్మైక్యజ్ఞానము లేకుండిన ముముక్షువు చేయు సర్వప్రయత్నములును నిరర్థకమే అగుచున్నవి. చిలక మాటలాడు మాటలు అభిప్రాయ శూన్యములగుటచే ఎట్లు నిరర్థకములు అగుచున్నవో అట్లే ముముక్షువు చేయు శ్రవణాదులును అభిప్రాయ శూన్యములే అగును. అనగా అర్థగ్రహణములేనివి అగుటచే శ్రవణాదులచే వినబడిన శబ్దముల అర్థమును గ్రహింపలేక పోవుటచేత -నిరర్థకములే అగును. కావున మోక్షేచ్ఛకలిగి దానికై ప్రయత్నించు పురుషుడు ఆ శ్రవణాదుల అర్థమును బాగుగా ఎఱుంగనంత వరకు పదిమారులైనను, నూరు మారులైనను మరి ఎన్ని మాఱులైనను వేదాంత వాక్య శ్రవణమును శ్రద్ధతో చేయుచునేఉండ వలయును. మనస్సునందు శ్రవణజన్య జ్ఞానము—జీవబ్రహ్మైక్య జ్ఞానము—నిశ్చంశయముగ దృఢమగునంతవరకు ఎన్ని మాఱులైనను మననమును ఆచరింప వలసినదియే. ఇట్లుచేసి మహా ప్రయత్నముతో అ జీవ బ్రహ్మైక్య జ్ఞానము సంపాదింప వలసియుండును. అప్పుడే ఈ సంసార భ్రాంతి తొలగుటకు అవకాశము ఏర్పడును. యధార్థమైన ముక్తి లభించును.

"తదభావే యతేరస్య నిష్ఫలం శుక జల్పవత్

దశధా శతధావాపి శ్రుత్వా మత్వాపివాయతేః

సంసార ధ్వంసకం జ్ఞానం సంపాద్యమతియత్నతః" మ.వా.ద. 230.

కర్మములే జన్మ మరణములకు మూలహేతువులు. మనస్సు సంగరహితమును అనగా అఖండ జ్ఞానమే రూపముగాగల ఆత్మను దేహము యొక్కయు, ఇంద్రియముల యొక్కయు మరియు ప్రాణములకు సంబంధించిన గుణములచే జీవుని తన వాస్తవమగు రూపమును తెలిసికొనుటకు అసమర్థునిగజేసి ఆ దేహేంద్రియ ప్రాణాదిగుణములయందే బంధించి దేహేంద్రియాదులయందు "నేను" అను అభిమానమును, వాటి ధర్మముల యందు "నావి" అను అభిమానమును కల్పించి ఎల్లప్పుడును తన కృత్యముల యందు అనగా లౌకిక వైదిక కర్మల యందును ఆసక్తి గల వానినిగా జేసి వానికి అనగా జీవునికి జన్మమరణములు కల్పించుచున్నది.

అసంగ చిత్రూవ మముం విమోహ్య
దేహేంద్రియప్రాణ గుణై ర్నిబధ్య.
అహం మమేతి భ్రమయత్య జస్రం
మనః స్వకృత్వేషు ఫలోప భుక్తిషు" వి-చూ- 180

సర్వకర్మ సన్యాసములేకుండ మోక్షస్థితికలుగదు. అయితే ఈ సర్వకర్మసన్యాసమును చేయుటకు మోక్షాసక్తి తీవ్రతరముగ వుండవలయును. అప్పుడు సర్వవిధ కర్మల నుండి ముక్తుడై మోక్షమును పొందును. ఒక్క-మోక్షమునందే ఆసక్తి కలిగియున్న పురుషుడు—ముముక్షువు-అనగా తీవ్రమగు మోక్షేచ్ఛ చేత దేహాది విషయములందు -అవి సుఖహేతువులు అనెడు భ్రాంతిచే వాటిపై కలిగిన ఆసక్తిని అహంకార పరి త్యాగము ద్వారా నిర్మూలించి, నిష్కామ కర్మలను, నైమిత్తిక కర్మలను అనగా సర్వ విధములగు కర్మలను త్యజించి, సత్తునందు అనగా కాలత్రయాబాధ్యమగు బ్రహ్మమునందు శ్రద్ధచే లేదా గురువేదాంత వాక్యములయందు అచంచలమైన భక్తిచే ఏ పురుషుడు శ్రవణాదుల యందు అనగా జ్ఞాన సంపాదనమునందు స్థిరముగ వుం డునో అతడే మోక్షము అను స్థితిని పొందును.—

మోక్షైకసక్తా విషయేషురాగం నిర్మూల్య సంనస్యచసర్వకర్మ
సచ్ఛ్రద్ధయాయఃశ్రవణాదినిష్ఠో రజస్స్వభావం సధునోతి బుద్ధేః"

ఏలనన దేహాదులపై రాగమున్నపుడు కర్మచేయును. కర్మయున్నచో విక్షే పము కలుగును. కావున రాగనిర్మూలనముచే సకల కర్మలను విడిచి, శ్రవణాదులచే అంతర్నిష్ఠుడగు శ్రద్ధావంతునకు బుద్ధి విక్షేపము కలుగుటకు అవకాశము వుండదు. కావున విరక్తుడగు సన్యాసి మోక్షమును పొందుటకై బుద్ధి దోషములను తొలగించు కొనుటకై శ్రద్ధగ సర్వకర్మలను విడిచి శ్రవణాదికము చేయవలయును.

జీవునకు దేహాదులయందు అనగా స్థూలదేహము . ఇంద్రియములు ప్రాణ ములు మొదలగు వానియందు "నేను. నేను" అను అభిమానము బుద్ధిచేతనే కలుగు చున్నది. బుద్ధిలేనిదే కలుగుటలేదు. కావున జీవత్వమే ఈబుద్ధి రూపమగు ఉపాధిని బట్టి కలుగుచున్నది. ఆ బుద్ధి జీవునితో తాదాత్మ్యమును పొంది జాగ్రత స్వప్నముల యందు వాసనలతో కూడిన అనేక విధములగు కర్మలను చేయుచు, వాటి ఫలము లను అనుభవించుచు క్రిందికి పైకి వచ్చుచు పోవుచు వున్నది. వాస్తవముగాలేని జనన మరణములను అనుభవించుచూ వున్నది.

"అనాదికాలోయ మహాంస్వభావో జీవస్య మస్తవ్యవహారవోఢా
కరోతి కర్మాణ్యను పూర్వవాసనా పుణ్యాన పుణ్యాని చతుత్ఫలాని
భుక్తే విచిత్రాస్వపి యోనిషువ్రజ న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః
అస్యైవ విజ్ఞాన మయస్య జాగ్రత్స్వప్నాద్యవస్థా సుఖదుఃఖ భోగః
వి. చూ. 189

"అనాది కాలము కలవాడును, దేహేంద్రియాదుల యందు అహం వాసన కలవాడును, సమస్త లోకవ్యవహారములను నిర్వహించువాడును అయిన ఈజీవుడు నానావిధములైన పూర్వవాసనలు కలవాడై పుణ్యములైనవి, అపుణ్యములైనవి అగు అనేక కర్మలను చేయుచున్నాడు. వాటియొక్క ఫలములను గూడ విచిత్రము లైన యోనులయందు వెళ్ళుచు అనుభవించుచున్నాడు గూడ. అందుచే జన్మమరణము లను పొందుచున్నాడు. జాగ్రద్ స్వప్నావస్థలను కలిగి సుఖదుఃఖములను అనుభవిం చుచున్నాడు ఆ పుణ్యాపుణ్య కర్మలచే—

"భువిజచ్చున్ దివిజొచ్చు అచ్చటను చావుంగాంచి చొచ్చున్ భువిన్
భువి చావుందివిచావునాగనిటుచావు్రెండు భూతాళికిన్
భువి చావుం సుఖసూప్తివోలెబడయన్ బోనౌనుగా కక్కటా
దివి చావుంనను జావనీకుము కపర్దిస్వామి మృత్యుంజయా" "కంకణము"

అని విలపించుచున్నాడు ఈజీవుడు. అట్లయిన మోక్షమార్గమేమనగా

అజ్ఞానమే కర్మకు తత్పరిణామమగు సంసారమునకు మూలముగా వుండుట చేత జ్ఞానముచేత అజ్ఞానము నశించిన తరువాత మరి కర్మలు జరుగనేరవు. జ్ఞానము మరిదేని సహాయము లేకుండగనే అజ్ఞానమును నశింపజేసి మోక్షమును కలుగ జేస్తుంది. మోక్షము నిత్యసిద్ధమగు వస్తువు అగుటచేత దానిని వాక్యము తెలి యజేసిన తరువాత ఇంక మోక్షప్రాప్తికై చేయవలసిన కర్మ ఏదియు మిగిలియుం డదు. కర్మముజ్ఞానమునకు సహాయకారి మాత్రమేగాని మోక్షప్రదాయినికాదు. శాస్త్ర మునందు చెప్పియున్న కర్మలుగూడ భేద జ్ఞానమును కలిగించునవిగా వుండుట చేత వాటిని గూడ వానికి సాధనములైయున్న యజ్ఞోపవీతాదులను గూడ ముము క్షువు అనువాడు త్యజించవలసినదే. ఎందుచేతనంటే ఆత్మకు కర్మాది సంబంధము ఏదియు లేదనియు, ఆత్మ-పరమఆత్మేననియు చెప్పడము శ్రుతి ఉపదేశములకు కర్మాదులు విరుద్ధమౌతాయి.

చూ. ఉ. స. సా. పుట 12.

"పరమాత్మ ఒక్కడే పరమార్థము. సంసారియగు జీవుడుగాని, చేతనమైన జగత్తుగాని అతనికంటె వేఱుగ వుండుటలేదు." అటువంటి ఈ శ్రుతి వాక్యమును అనుభవమునకు తెచ్చుకొనుటకై ఇచ్ఛించు ముముక్షువులు పుత్ర, విత్త లోకైషణములను వదలి సర్వకర్మ సన్యాసము చేయవలయును. ఎందుకంటే వర్ణాశ్రమాది అభిమానముఈ పరమార్థజ్ఞానమునకు విరుద్ధము.

చూ. ఉ. స. సా. పుట 14.

వర్ణాశ్రమాద్యభిమానము వున్నవారికిగాను కర్మలను శాస్త్రము విధించుచున్నది. అయితే వర్ణాశ్రమాదులు శరీరమునకు సంబంధించినవేగాని ఆత్మకు సంబంధించినవికావు. శరీరాభిమానము అజ్ఞానముచేత కలుగుచున్నది. దీనిని తొలగించునది జ్ఞానము. అనగా విద్య. సన్యాసికి ఏ విధముగా అశౌచాదులు వుండవో ఆ విధముగా జ్ఞానికి జాత్యాదినిమిత్తమైన కర్మలులేవు. కర్మయొక్క ఫలము ఉత్పాద్యము వికార్యము, సంస్కార్యము అను మూడు విధములుగా వుండును. అయితే మోక్షము ఈ మూడింటిలోను ఒకటిగూడ కానందున మోక్షమునకుగాను కర్మలు ఏవిధముగాను సహాయకారులు కాజాలవు.

చూ. ఉ. స. సా. పుట 44.

సర్వకర్మలను త్యజించి వాక్యార్థజ్ఞానముద్వారానే మోక్షమును పొందవలసి వుంటుంది. అయితే అందుచేత సన్యాసగ్రహణము వ్యర్థము కాగలదని తలంచుట సరికాదు. ఏలయన "త్వం" పదార్థముయొక్క వివేకమునకు సన్యాసగ్రహణమును విధిగాచేయవలసి వుంటుంది. దుఃఖరహితమైన ఆత్మ "తాను" అను పదార్థజ్ఞానమును మొదటనే కనుగొనువానికి ఈ ఆత్మేసర్వము అను వాక్యార్థజ్ఞానముగూడ కలుగుతుంది. ఈ జ్ఞానముకలిగిన తరువాత ప్రమాణవ్యవహారమే బాధితమగుచుండుటచేత ఆ తరువాత ఒక్క విధికి కూడ అవకాశము వుండదు. ఈ వాక్యార్థ జ్ఞానమునకు "నేను కర్తను" అను జ్ఞానమునకు పరస్పర విరోధమున్నది.

"నేను కర్తను" అనునది స్వాభావికజ్ఞానము అగుటచేత ప్రమాణజన్యమైన "నేను బ్రహ్మము" అను జ్ఞానముద్వారా అదే బాధితము అగుచున్నది. కర్తృత్వము భయరూపమై యుండుటచేత, అభయమైన బ్రహ్మమే తానని తెలుసుకొన్న

వాడు మరల కర్తృత్వమును అంగీకరించడు. ముముక్షువు అయినవాడు వాక్యార్థ జ్ఞానమునకుగాను సన్యాసమును స్వీకరించి పదార్థవివేచనచేస్తూ ఉండుటచేత అతనే మరలకర్మను చేయుటకు ఉత్సాహపడడు. ఈ విధముగా వుండుటయందు "నేను అకర్తృవైన బ్రహ్మమును" అను జ్ఞానముతో తృప్తి పడినవాడు తిరిగి ఎందుకు కర్మలయందు ప్రవర్తించును? అందుచేత వాక్యజ్ఞానము అయిన తరువాత చేయ దగిన కర్మలంటూ ఏవీ వుండవు.

దేహాత్మబుద్ధిరూపమగు బంధము రాగద్వేషాది దోషములను కలిగించుట ద్వారా ధర్మాధర్మరూపములగు కర్మలకు హేతువు అగుచున్నది. ఆ కర్మలచే శరీర పరంపర కలుగుచు దానియందు "అహం" అను అభిమానము జనియించుచుండును. ఈ విధముగా దృఢమూలముగా ఆ బంధము నిలిచియున్నది.

ఆత్మ జాగ్రతయందునూ, స్వప్నమునందునూ, తనకు విషయముగా కను పించుచున్న మనస్సు కంటె భిన్నము. ఈ ఆత్మ వర్ణాశ్రమధర్మము లేవియు లేని వాడు. అందువలన అజ్ఞానముచేత కర్మలుచేసి శరీరమును ధరించడమును వదలి ఆత్మజ్ఞానమును సంపాదించుకొని ముక్తుడుగా కావలయును. ఆత్మజ్ఞాన సంపాదన శ్రవణ, మనన, నిధి ధ్యానములచే సమకూరునవియేగాని కర్మలచేత మాత్రముకాదు. ఆత్మజ్ఞానము కర్మయొక్క అపేక్షచే కలుగునదికాదు. అది నిత్య సిద్ధమైయున్నది.

ఆత్మజ్ఞానికి ఏ కర్తవ్యములేదు అనుటకు ఆత్మ నిష్క్రియుడు అనునదియే కారణము. తనయాత్మ సర్వభూతములయందును, సకలభూతములు తనయందును వున్నాయని బాగుగా తెలుసుకొని వుండుటచేత అతను కృత కృత్యుడు. ఆప్తకా ముడు. నిత్య, శుద్ధముక్త స్వభావముకలవాడు. ప్రాణముగాని, మనస్సుగాని, లేని ఆత్మే తానని తెలిసికొనియుండుటచేత ఆయన చేయవలసిన కర్మలుగాని, పొందవల సిన సమాధిగాని, పోగొట్టుకోవలసియున్న దోషములుగాని, ఏవియులేవు. అతడు మనోరహితుడగుటచేత చేయవలసిన ధ్యానములేదు. అప్రాణుడగుటచేత చేయదగిన కర్మలులేవు.

—o—

# పంచకోశములు అనాత్మ పదార్థములే

"అడుగడుగున గుడి వుంది
అందరిలో గుడి వుంది
ఆ గుడిలో దీపముంది
అదియే దైవం............"

"అన్నజసంభూత అన్నవర్ధితమగు, తనువన్నమయకోశమనగనొప్పు
ప్రాణకర్మేంద్రియ పంచకంబులుగూడి, వినుప్రాణమయకోశమనగదనరు,
జ్ఞానేంద్రియోపేత మానసచిత్తంబులును మనోమయకోశమనగజెల్లు
శబ్దాదివిషయపంచక సమన్వితబుద్ధి, విజ్ఞానమయమన వెలయుచుండు"

మోహజప్రియ మోదప్రమోదవృత్తి
సంయుతోరు సమస్త దృశ్యప్రపంచ
కారణానాద్య విద్యాంధకారపటల
మంచి తానందమయకోశమనగదనరు"

శ్రీ సీతారామాంజనేయ సంవాదము-232.

సర్వవిధ దుఃఖములకు మూలకారణము అజ్ఞానము. ఈ అజ్ఞానము జీవునకు ఉపాధియగు దేహ సంబంధమువలన కలుగుచున్నది. ఈ దేహము పూర్వాపూర్వజన్మలయందు చేయబడిన కర్మలఫలితముగా పంచీకృతములగు స్థూలభూతముల నుండి కలిగినది. జీవుడు తాను ఈ స్థూల శరీరమునందు తాదాత్మ్యబుద్ధితో బాహ్యేంద్రియములగు ఇంద్రియములచే స్థూల పదార్థములను అనుభవించుచున్నాడు. అందుచేత జీవునియొక్క—పురుషునియొక్క—బాహ్యమైన సమస్తమైన సంసారము ఈ స్థూల దేహమును ఆశ్రయించుకొని యుండుటచే ఆతడు అజ్ఞానకృతమగు తాదాత్మ్యాభిమానముచే ఆ దేహమునే "నేను" అని అభిమానించుచు, దానికి కలుగు సుఖ దుఃఖములను తనవిగా భావించుచున్నాడు. ఈ స్థూలశరీరమే కర్తయనియు భోక్త యనియు తలంచి దానియందు కర్తృత్వ భోక్తృత్వాభిమానము కలిగి సత్వ, రజ, తమోగుణముల సంబంధముకలిగి అవస్థాత్రయమును,అనగా జాగ్రద్,స్వప్న,

సుషుప్త్యాది అవస్థలను పొందుచున్నాడు. రజోగుణ సంబంధముచే జాగ్రదవస్థను, సత్వగుణ సంబంధముచే స్వప్నావస్థను, తమోగుణ సంబంధముచే సుషుప్తి అవస్థను నిత్యమూ అనుభవించుచున్నాడు. ఈ గుణత్రయమైన అజ్ఞానమునందున్న రజస్తమో గుణములకు సంబంధించిన ఆవరణ విక్షేపరూపములగు శక్తులచేతనే పురుషునకు-అనగా జీవునకు "అది కాని దానిని అదియని భావించుట" అను రూపముగల అధ్యాస—భ్రాంతి-వచ్చి పడుచున్నది. ఆ అధ్యాసచే జనించిన భ్రాంతిచే కప్పబడిన జీవుడు తనయొక్క నిజమైన స్వరూపమును తెలియజాలక "ఈ దేహమే నేను" అని తలంచి ఆ దేహ ధర్మములగు దుఃఖములను అనుభవించుచున్నాడు. కావున ఆ కల్పిత దుఃఖజాలమునుండి విడువడి శాశ్వతమైన తన స్వరూపానందమును పొందవలెనన్నచో ఆత్మానాత్మ వివేకము చేయవలసియున్నది. అట్టి ఆత్మానాత్మ వివేకముచేతనే అనాత్మ పదార్థములగు పంచకోశములను అనగా స్థూలదేహములతో కూడియున్న అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము మరియు ఆనందమయకోశము, తొలగించి స్వస్వరూపమును సత్తుగాను, జ్ఞానముగాను, ఆనందముగాను తెలిసికొని మోక్షస్థితిని బొంది ఆనందవంతుడగును.

అసంగమును అనగా సంగ రహితమును, క్రియారహితమును అగు ఆ యాత్మ తత్వమును దృశ్య వర్గమునుండి అనగా పంచ కోశములనుండి వేరుచేసి తిరిగి దాని యందే సమస్తమైన ఈ దృశ్య ప్రపంచమును విలీనము చేసి ఎవరు అనగా యే ముముక్షువు-సాధకుడు-ఆ యాత్మరూపముననే పొంది యుండునో అతడే సత్యమూ, నిత్యమూ, అగు ఆత్మానందమును పొందును. కాని సకల భూతముల యందును గూఢముగా నిక్షిప్తమైయున్న ఆ యాత్మ సామాన్యముగా ప్రకాశింపదు. కాని సూక్ష్మ దృష్టికలవారిచే, సూక్ష్మమును, ఏకాగ్రమును అగుబుద్ధిచే ఆ యాత్మ చూడబడుచున్నది. అందువలన విహిత కర్మానుష్టానముచేతను, ఉపాసనాదులచేతను, సంస్కృతమైన బుద్ధిచే అనాత్మ సమూహమునుండి అనగా ఆ పంచకోశములనుండి వేఱుచేసి, వాటినన్నింటినీ వివేకముచే బాధించి బ్రహ్మ భావమును పొందవలయునని శాస్త్రగ్రంధములు ఘోషించుచున్నవి.

ఈ కోశములు ఆత్మను కప్పియున్నవి. అందులో అన్నింటికంటె ముందుగా ఆ యాత్మ పదార్థమును కప్పియుంచిన కోశము అవిద్యా పరిణామ రూపిణియగు ఆనందమయ కోశము. ఆ కోశముతో సహా ఆ యాత్మను కప్పియుంచిన రెండవ

కోశము బుద్ధీంద్రియములతో ఏర్పడిన కోశము విజ్ఞానమయ కోశము. ఈ రెండు కోశములతో కప్పబడియున్న ఆత్మను జ్ఞానేంద్రియములతో కూడియున్న మనోమయకోశము ఆవరించియున్నది. ఈ మూడుకోశములతో ఆవరించియున్న ఆ ఆత్మ పదార్థమును శబ్దాది విషయపంచకముతో ఏర్పడిన ప్రాణమయకోశము ప్రాణులకు కనబడకుండా చేయుచున్నది. ఈ నాల్గుకోశములతో కప్పబడియున్న ఆ పరమార్ధమును: అజ్ఞాన రూపుడగు ఆత్మనుఅన్నింటికంటె బాహ్యమునవున్న అన్నాదులతో ఏర్పడిన అన్నమయకోశము జిజ్ఞాసువులకు కానరాకుండఅనగా తెలియరానీక కప్పి వుంచుచున్నది.

ఆ సర్వాంతరమగు ఆత్మనుగ్రహించుటకై పంచకోశములలో సామీప్యమును బట్టి చివరిదైనను, అన్నిటికంటె స్థూలమగుటచే మరియుబాహ్యము అగుటచేఇప్పుడు మనము నిత్యానిత్య వస్తువివేకముచే కలిగిన జ్ఞానమనే పదునైనఖడ్గముచే ఒక్కొక్కటిగా బాహ్యము నుండి ఆరంభించి ఈ కోశములన్నింటిని తొలగించి ఆ యాత్మ దర్శనము చేయవలసి యున్నది. అందుచే ముందుగా అన్నమయ కోశమును వివేచించి చూచెదము గాక—

"దేహోయమన్న భవనోఽన్నమయస్తు కోశో,
హ్యన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః
త్వ క్చర్మ మాంస రుధిరాస్థి పురీష రాశిః
నా యం స్వయం భవితు మర్హతి నిత్య శుద్ధః" వి.చూ. 156

అనగా అన్నమునుండి జన్మించిన ఈ స్థూలదేహము అన్నమయకోశముగా చెప్పబడుచున్నది. ఎందుచేతననగా ఈ స్థూలదేహము అన్నముచే రూపమును దాల్చి అన్నబలముచే జీవించుచున్నది. తిరిగి ఆ యన్నము లేకపోవుటచే నశించుచున్నది. త్వక్కు, చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, మలము, వీటి యొక్కరాశియైన ఈ స్థూల దేహము తానుగా శుద్ధమైన, నిత్యమైన, అపరిచ్ఛిన్నమైన ఆత్మ యగుటకు తగియున్నదికాదు. అన్నముతో అనగా ఆహారపదార్థములతో తయారైనదిగాన ఇది అన్నభవనము. తల్లి దండ్రులు భుజించిన ఆహారము యొక్క వికారముచే పుట్టుచున్నదిగాన, అనగా రూపము దాల్చుచున్నదిగాన ఈ అన్నమయ కోశము అనగా స్థూల శరీరము అన్నభవనము అని పిలువబడుచున్నది. అన్నముతో తయారైనదిగావుననే ఇది అన్నమయకోశము అని పిలువబడుచున్నది. దీనిని అనుసరించి చూచిన ప్రాణులయొక్క స్థూలశరీరములన్నియు అన్నమునుండి యే పుట్టుచున్నవి. పుట్టిన తరువాత అన్నమును భుజించియే జీవించుచున్నవి. అంటే

అన్నమునుండి పుట్టి అన్నముచేతనే పోషింపబడుచున్నవి. ఈ స్థూలదేహము లన్నియు చివరకు ఆ అన్నములేక మరణించుచున్నవి. కావున ఈ స్థూలదేహము అన్నాధీనమైయున్నది. ఆవిధముగా పరాధీనమై యున్నది. అనగా స్వంత వునికి లేక ఇతరముపై ఆధారపడియున్నది. అటుపైన అనేక పదార్థముల సంఘాతమై యున్నది. అనగా స్థూల పంచభూతముల—గాలి, నీరు, మట్టి, గగనంబు, అగ్ని తోనిర్మతమైనదిగా యున్నది. అదియునుగాక ఈ స్థూలదేహమగు అన్నమయ కోశము జీవునకు కేవలము జాగ్రదవస్థయందు మాత్రమే ఉపాధిగా అగుచున్నది. స్వప్నసుషుప్త్య వస్థలయందు ఈ కోశముకానరాదు. స్వప్నావస్థయందు జీవునకు సూక్ష్మదేహము, సుషుప్తియందు కారణదేహము ఉపాధులుగా అగుచున్నవి. ఈ విధముగా జీవునకు సర్వకాల సర్వావస్థలయందును ఉపాధిగా వుండని ఈ కోశము నిత్యసిద్ధమగు ఆత్మకాజాలదు. ఇది కేవలము జీవుని జాగ్రతవస్థయందు మాత్రమే తననిజస్వరూపమును తెలియని వానినిగా చేయుచున్నది. అందుచేత నిత్యత్వ శుద్ధ త్వాదిధర్మములుగల ఆత్మకాజాలదని చెప్పబడుచున్నది. ఏ విధముగా అనిత్యమూ, అశుద్ధము అగు కేశములు, నఖములు మొదలగునవి ఆత్మ పదార్థముకావో ఆ విధముగానే ఈ అనిత్యము, అశుద్ధము అగుదేహము అనగా అన్నమయ కోశము గూడ ఆత్మకాజాలదు.

ఇంక కొంత వివేచన చేసి చూచిన తన జన్మకంటె పూర్వము, తన మృత్యువు తరువాత ఈ దేహము వుండుట లేదు. ప్రతిక్షణము మారుచుండు స్వభా వము కలది. తనకు తానుగా తనను, మరియొక పదార్థమును తెలుసుకొనునటువంటి తెలివి, జ్ఞానము ఈ కోశమునకు లేదు. అందుచేఇది జడపదార్థము. అటుపైన మరియొకరిచే దృశ్యముగ చూడబడుచున్నది. అందుచే ఈ కోశము సర్వసాక్షియగు ఆత్మకాజాలదు.

ఉత్పత్తికి పూర్వము లేనిది, మరణానంతరము వుండనిది అగు ఈ కోశము మధ్యలో కొంతకాలము వున్నట్లుగా తోచినను అదిలేని దాని వంటిదేయని-మాం డూక్యో పనిషత్తు చెప్పుచున్నది.

"ఆదావంతేచయన్నాస్తి వర్తమానే పితత్తథా" అనగా.

"ఏది ఆదియందును అంతమునందునులేదో అది వర్తమానమునందు కూడ లేనిదే యగుచున్నది"

కావున ఈ దేహము దృష్ట నష్టస్వరూపము కలది అనగా కనుపించినట్లుగా తోచినను కనుపించనది. అంటే ప్రతిక్షణమూ పరిణామము పొందుచూ అనగా వున్న రూపముతో వుండకుండా మారుతూ తుదకు కనుపించకుండాపోయే స్వభావము కలది. ఆ విధముగా వృద్ధిక్షయములు కలది. ప్రతిక్షణము భోజనము, జలాదులపానము చేయుచుండుటచేతనే అస్తిత్వము కలిగియుండునది. అది లేనిచో మరణించుచున్నది ఆ విధముగా నిశ్చితమైన స్వభావములేనిది. అనగా స్వరూపముగా వుండి నిత్యమూ, సత్యమూకానిది. అనేకమైనది అనగా బాల్యమునందు ఒక విధముగాను, యౌవనము నందు ఒక విధముగాను, వృద్ధాప్యమునందు మరియొక విధముగాను కానుపించు స్వభావము కలది. ఘట పటాదులవలె దృశ్యమైనది. పరులచే ప్రకాశమును పొందునది. అందుచేత సర్వప్రకాశము, సర్వాత్మయు, అపరిచ్ఛిన్నమును సర్వ సాక్షియును అగు ఆత్మకాజాలదు.

"పూర్వంజనేరపి మృతేరధనాయమస్తి
జాతక్షణక్షణగుణోఽ నియతస్వభావః
నైకోజడశ్చ ఘటవత్పరి దృశ్యమానః
స్వాత్మాకథం భవతి భావవికారవేత్తా" వి.చూ. 157

కఠోపనిషత్తు ఈ విషయమును అనగా ఈ కోశము ఆత్మకాజాలదని స్పష్ట ముగా బోధించుచున్నది. అదెట్లన—

"నప్రాణేన, నపానేన, మర్త్యోజీవతి కశ్చన,
ఇతరేణతు జీవన్తి యస్మిన్నేతా వుపాశ్రితౌ" "కఠ"

అనగా ఏమర్త్యుడును ప్రాణముచేతగాని, అపానముచేతగాని జీవించుట లేదు. ఆ రెండూ కూడా అనగా ప్రాణము అపానము గూడా ఆత్మచైతన్యముపై ఆధారపడి యున్నవి.

ఆ విధముగా ఈ శరీరము ప్రాణముపై ఆధారపడి జీవించుటలేదు. ఈ స్థూల దేహము ఆ సర్వశక్త్యాశ్రయమగు ఆత్మ చైతన్యముపై ఆధారపడి జీవించుచున్నది. అందుచే ఆ విధముగా నియమించ బడుచున్న దేహము నియామకమగు ఆత్మకా జాలదని చెప్పినట్లయినది. ఈ విధముగా సావయవము మరియు మరియొక దానిచే నియమింపబడు దేహము, నిరవయము, నియామకమును అగుఆత్మకాజాలదు. కావున ఈ అన్నమయ కోశమగు స్థూలదేహము జీవుడు అనగా ప్రత్యగాత్మకాదు. ఇది కేవలము ఆ జీవుని బాహ్య ఉపాధియగు స్థూల శరీరము మాత్రమే. అందుచే మోక్ష మును అభిలషించు ముముక్షువు "నేను ఈ దేహమును కాను, ఇంద్రియములు కాను

అంతః కరణముకూడ కాదు. అహంకారముకాదు. ప్రాణసముదాయము అనగా ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానముకాదు. బుద్ధికాదు. నేను భార్యకు భర్తనుకాను. పుత్రునికి తండ్రినికాను, ఈ క్షేత్రములకు అధికారిని కాను, ఈ సంపదలకు యజమానినికూడ కాను. వీటన్నింటికిని వేరుగా; అతీతంగా వుండి వీటన్నింటిని చూస్తూవున్న, వీటన్నింటి వునికికి ఆధారభూతమై వున్న సాక్షిని, అట్టి సాక్షియగు పరబ్రహ్మమును" అని తలంచుచు ఈ కోశమును నిషేధించి ఎల్లప్పుడు ఆ బ్రహ్మరూపముననే వుండవలయును. అట్లు వుండుటయే మోక్షము—

"నా హందేహోనేన్ద్రియాణ్యన్తరంగం, నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః,
దారా పత్యక్షేత్ర విత్తాదిదూరః సాక్షినిత్యః ప్రత్యగాత్మాశివోఽహం"

వి-చూపుట-362

ఈ అన్నమయ కోశమైనటువంటి స్థూలదేహము అశుద్ధమైనది. అనిత్యమైనది. నిత్యపరిణామతత్వము కలిగి తుదకు నశించునది. అందుచే దీనియందు ఆత్మభావమును కలిగియుండి "ఇదే నేను" అని తాదాత్మ్యమును చెందు జీవుడు జన్మమరణ చక్రమునందు పడి ఊర్ధ్వ-అధో లోకములయందు తిరుగుచుండును గాన ముముక్షువు అయిన పురుషుడు ఈ స్థూల దేహముయొక్క స్వభావ, స్వరూపము లను గుర్తించి బాగుగా విచారించవలయును. అట్లు విచారణ చేయగా దానియొక్క నిజస్వరూప స్వభావములు బోధపడును. అందుచే దానితో ఏలా వ్యవహరించవలయునో కూడ బోధపడును. కావున దాని స్వరూప స్వభావముల గురించి విచారింతము—

"శల్యరాశిర్మాంసలిప్తో మలపూర్ణోఽతి కశ్మలం
కధంభవే దయంవేత్తా స్వయమే తద్విలక్షణః" వి-చూ-160

అనగా ఈ స్థూలదేహము ఎముకలే రాశిగా కలది. మాంసముచే కప్పబడినది. మరియు అనగా చీమిడి, పుసులు, గులిమి, అసిద్దము మొదలగువాటితో నిండియుండునది. చెమట మొదలగువాటి దుర్గంధముతో కూడినది. ఈ విధముగా మిక్కిలి అశుద్ధమగు ఈ స్థూల శరీరము, దీనికంటె విలక్షణమైన, సర్వదా శుద్ధము, నిర్మలము అయిన ఆత్మగా కాజాలదు. అవివేకముచేత అనగా విచార శూన్యుడైన పురుషుడు భ్రాంతిచెందిన బుద్ధికలవాడై త్వక్కు, మాంసము, క్రొవ్వు, ఎముకలు పురీషము మొదలగు అశుద్ధ పదార్థముల రాశియైన ఈ ఈ స్థూలదేహమునందు "నేను"

అనెడు తాదాత్మ్యబుద్ధిని కలిగి నానావిధములగు దుఃఖములను అనుభవించుచున్నాడు. వివేకశీలుడగు పురుషుడు అట్లుచేయక దేహమునకు విలక్షణముగా నున్నదియు, పరమార్థమైనదియు అగు అనగా కాలత్రయాబాధ్యమును అగు తన నిజస్వరూప మును గుర్తించి "ఆ పరమార్థమును నేను" అని దృఢమగు బుద్ధితో సర్వదుఃఖ ములనుండి ముక్తిని పొందుచున్నాడు.

"త్వంగ్మాంసమేదో అస్తిపురీషరాశౌ వహంమతిం మూఢజనః కరోతి,
విలక్షణంవేత్తి విచారశీలో నిజస్వరూపం పరమార్థభూతం" వి-చూ-161

అంతేకాదు. భ్రాంతిజెందిన పురుషునకు "ఈ స్థూలదేహమే నేను" అను బుద్ధి వుండును, పండితునకైతే, దేహమునందును, జీవునియందుగూడ "నేను" అను బుద్ధివుండును. కాని వివేకముగల మహాపురుషునకు మాత్రము "నేను ఈ దేహ మును కాను, జీవుడనుకూడా కాను, నేను ఆ సర్వాత్మయగు బ్రహ్మ పదార్థమునే అను బుద్ధియుండును.

"దేహోఽహ మిత్యేవ జడస్యబుద్ధిర్దేహేచ జీవే విదుషస్త్వహం ధీః
వివేక విజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాహమత్యేవ మతిః సదాత్మని"
వి-చూ-162.

దేహాదులయందు "నేను" అను అభిమానమును త్యజించనంత కాలము కేవ లము శాస్త్రాధ్యయనము వలన కలుగు జ్ఞానము వలన మోక్షము కలుగదు. విద్వాంసుడైనను మిథ్యాభూతములగు స్థూలదేహము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధి మొదలగు అనాత్మ పదార్థములయందు ఎంతకాలమువరకు, "ఇవియే నేను" అను భ్రాంతివలన కలిగిన ఆత్మబుద్ధి వుండునో అంత కాలము వరకు ఆ పురుషునకు మోక్షభావము కలుగదు. అతడు ఎంత వేదాంతశాస్త్ర పండితు డైనను, దేహాదులయందు అభిమానము విడువనంతవరకు ఆతడు ముక్తికి అర్హుడు కాడు. అందుచే నిరంతరము, ఆత్మభావము కలిగి దేహాదులయందలి విప రీత భావమును విడువవలయును.

"దేహేంద్రియాదావసతి భ్రమోదితాం. విద్యానహంతాం నజహాతియావత్,
తావన్న తస్యాస్తి విముక్తి వార్తా ప్యస్త్యేష వేదాంత నయాంత దర్శీ"
వి.చూ. 164.

కావున ఛాయా రూపమైన శరీరము నందును, శరీరము యొక్క నీడ యం దును, అద్దమునందు కనుపించు తన ప్రతిబింబమునందును, స్వప్నావస్థలో కనబడు దేహమునందును, మనస్సుచే కల్పించబడు శరీరమునందును ఏ విధముగా వివేకవం

తుడగు పురుషునకు ఇవన్నియు కల్పిత శరీరములే అని ఆత్మయనుబుద్ధి వుండదో, అట్లే ప్రాణములతో తిరుగాడుచున్న ఈ స్థూల శరీర విషయమునగూడా ఆత్మబుద్ధి లేకుండపోయిననే గాని మోక్ష మనునది ప్రాప్తించదు.

"ఛాయాశరీరే ప్రతిబింబ గాత్రేయత్స్వప్న దేహే హృదికల్పితాంగే.
యధాత్మబుద్ధి స్తవనాస్తికా చిత్, జీవచ్ఛరీరేచ తథైవ మాస్తు"
వి.చూ. 165

ఈ విధముగా అనాత్మపదార్థములగు అనగా ఆ బ్రహ్మకంటె భిన్నమగు అనాత్మ పదార్థములయందు అనగా దేహమే ఆత్మయను బుద్ధిగల పురుషునకు ఆ శరీరమునకు సంబంధించిన జన్మమరణాదులు, తనకు సంబంధించినవే అనుకొనుటచే అనగా భ్రాంతిచెంది యుండుటచే దుఃఖమును అనుభవించకతప్పదు. ఎప్పుడు పురుషునకువివేకము కలిగి యధార్థమగు తన ఆత్మ స్వరూపమును గుర్తించి దేహాదుల యందలి ఆత్మాభిమానమును విడచునోఅప్పుడు జీవించియుండియే మోక్షమును పొందును.

(2) ప్రాణమయకోశము—

"ప్రాణ కర్మేంద్రియ పంచకంబులు గూడి, విను ప్రాణమయ కోశమనగదనరు" స్థూలదేహము ఏ విధముగాఅన్నమయకోశముగావుండి స్వస్వరూపమునుకప్పి వుంచి పురుషుని జన్మమరణాదులనెడు దుఃఖమునకు హేతువు అగుచున్నదో, అట్లే ఈ ప్రాణమయకోశము గూడ స్వరూప సందర్శనము కలుగ నీయక దుఃఖహేతువు అగుచున్నది.

వాక్కు అనగా మాట్లాడు. పాణి=గ్రహించు పాద=నడుచు, పాయు;మూత్ర విసర్జన చేయు, ఉపస్థ=మల విసర్జనను కలిగించు వాక్, పాణి. పాద, పాయు, ఉపస్థలు మొదలగు కర్మేంద్రియములతో కూడిన వాయురూపమగు ప్రాణములు ప్రాణమయ కోశము అనబడుచున్నవి. కర్మేంద్రియములతో కూడినదియు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి మొదలగు పంచభూతములయొక్క రజోగుణము వలన కలిగినదియు, సమస్త శరీరమునందును ప్రాణ, అపాన, ఉదాన, వ్యాన, సమానరూపములతో సంచారము కలదియు అగు వాయురూపమగు ఈ ప్రాణమయకోశము వాస్తవముగా ఎటువంటి ఆకలిదప్పులు ఎఱుంగని ఆత్మను పొందుటకు అవకాశము ఇవ్వని ఈ కోశము ఆ యాత్మరూపుడగు జీవునికి "నేను ఆకలి గొనియున్నాను, నేను దప్పికచే తపించుచున్నాను" అను అనుభూతిని కలిగించుచున్నది. ఈ కోశము తనంతట తానుగా చైతన్య వంతమై కార్యములను నిర్వహించు సామర్థ్యము కలది

కాదు. తనకుఆంతరముగానున్న మనోమయ, విజ్ఞానమయఆనందమయాదికోశముల ద్వారాఆత్మచైతన్యమునుగ్రహించుటచే చైతన్యవంతమగుచుండు ఈకోశము తనకంటె వెలుపలవున్నఅన్నమయకోశమును చైతన్యవంతముచేయుచున్నది.ఆత్మతత్వము దేహము యొక్క నఖ శిఖ పర్యంతము వ్యాపించి యున్నందున-"స ఏష ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" అను శ్రుతి ప్రకారముగ ఈ ప్రాణమయకోశము పురుష రూపము కలిగి యున్నది. అందుచే తనకు వెలుపలగానున్నఅన్నమయకోశముయొక్క సహాయముతో సర్వ విధ కర్మలను నిర్వహించుచున్నది. ఈ ప్రాణమయ కోశమునుండి చైతన్యము ప్రసరింపకున్న అన్నమయ మంతయు జడముగానే వుండిపోవుచున్నది. చేతనాధిష్ఠాన మైననేకదా అచేతనము కార్యములను చేయునది. అన్నమయము యొక్క ఏ భాగమునందు ప్రాణసంబంధముండదో ఆ భాగము నిర్వ్యాపార మగుట లోకమున నిత్యము చూడబడుచునే యున్నది-కావున ప్రాణసంబంధము వలననే దేహమునందు క్రియాత్మకమైన వ్యాపారముండుట కలుగుచున్నది, ప్రాణ సంబంధము లేక పోవుటచే, అనగా ఆత్మ సంబంధమును కలిగించు ద్వారమగు ప్రాణమయకోశము లేనప్పుడు స్థూలదేహము మృతత్వమును పొందుచున్నది అనగా నిర్వ్యాపారముగా అగుచున్నది.

ఈ ప్రాణమయకోశము సమిష్టి కార్యరూపమైనది. కర్మేంద్రియములన్నియు,ఈ ప్రాణమయాంతర్భూతములే. ఏలయన ఆయా ఇంద్రియములన్నియు ఈ ప్రాణము చేతనే చైతన్యవంతములై కార్యములు నిర్వహించు సామర్థ్యము కలవిగా అగుచున్నవి. అయినను ఈ ప్రాణమయకోశము వాయు వికారమగుటచే అనగా వాయుపు రూపమున ప్రతిక్షణము లోపలికి బయటకు వచ్చుచూ వెళ్ళుచూ వుండుట చేతను, తనను గురించిగాని, వేరొక పదార్థమును గురించిగాని తెలుసుకొను సామర్థ్యము లేకపోవుట చేతను, ఈ కోశమునకు ఇష్టాఇష్టములుగూడ లేకపోవుటచేతను, పరాధీనము అయినది అగుటచేతను, అనగా యోగులు మొదలగు పురుషుల ద్వారా బంధింపబడుచున్నది అగుటచేతను, తనకు తానుగా చైతన్యవంతము, జ్ఞానవంతముకలదిగా కాకపోవుటచేతను, సక్రియము మరియు పరిచ్ఛిన్న స్వభావము కలదియగు ఈ కోశము, సర్వవ్యాపియు, నిష్క్రియమును అగు ఆత్మకాజాలదు.

"నైవాత్మాయం ప్రాణమయో వాయు వికారః
గన్తాగన్తావాయువదన్తర్బహిరేషః,
యస్మాత్కించి త్క్వాపిన వేత్తిష్ట మనిష్టం
స్వంవాన్యం వా కించన నిత్యం పరతంత్రః" వి. చూ. 168.

వాయువుయొక్క కార్యమైన ఈ ప్రాణమయకోశము సర్వోపాదాన కారణమగు ఆత్మకాజాలదని నిర్ణయము. ఈ కోశము పూర్తిగా వాయురూపమున ప్రతిక్షణము బయటకు వచ్చుచు, లోనికిపోవుచు సక్రియము, పరిచ్ఛిన్నము అగుచున్నందున, సర్వవ్యాపియు, నిష్క్రియము, అపరిచ్ఛిన్నమును అగు ఆత్మపదార్థము కాజాలదు. అటుపైన ఈ కోశము స్వతంత్రమైన అనగా స్వంత వునికి కలిగియున్న పదార్థముకాదు. అనగా ఈ కోశము స్వతఃచైతన్యవంతమైనదికాదు. ఆ చైతన్యమునకు ఈ కోశము తనకు ఆంతరముగానున్న మనోమయముపై ఆధారపడియున్నది. అంతేకాక ఈ కోశమునకు జ్ఞానమనునదిలేదు. సుఖదుఃఖములనుగాని, ఇష్టాఇష్టములుగానిలేవు. దేశకాలాదుల జ్ఞానముగూడ ఈ కోశమునకులేదు. జీవనమునకు కారణభూతమైన సంచారము కలదగుటచే అనగా ఇతరులచే ప్రేరేపింపబడి, కార్యములు చేయు స్వభావము కలదగుటచే ఇది పరతంత్రము. ప్రాణాయామాది సమయములందు ఇది నిరోధింపబడుచున్నది. ఈ విధముగా సక్రియత్వము, పరిచ్ఛిన్నత్వము, అచేతనత్వము, పరాధీనత్వము, కలదగుటచే ఈ కోశము ఇందులకు పూర్తిగా విరుద్ధ లక్షణములుగల అనగా అక్రియము, అపరిచ్ఛిన్నము, చైతన్యవంతము, సర్వసత్తాకప్రతిపత్తి కలిగి సర్వస్వతంత్రము అయిన ఆత్మపదార్థము కాజాలదని పండితుల నిర్ణయము.

(3) మనోమయకోశము —

"జ్ఞానేంద్రియోపేత మానసచిత్తంబులును మనోమయకోశమనగజెల్లు"....
శ్రవణ, దర్శన, రూప, రస, గంధములను కలిగించు శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణములనబడు జ్ఞానేంద్రియములును, కామ, సంకల్ప, విచికిత్సా వృత్తులను కలిగియుండెడి మనస్సును కలసి మనోమయకోశముగ చెప్పబడుచున్నది. ఈ కోశమునందు మనస్సు ముఖ్యావయవము అగుట వలనను, తదితరములగు ఇంద్రియముల యొక్క సర్వవ్యాపారములు మనస్సు యొక్క అధీనమునందే వుండియుండుటచేతను స్వప్నకాలమునందు ఇంద్రియములన్నియు పనిచేయకున్నను మనస్సు ఒక్కటే వుండి ఆ పనులన్నింటిని తాను మాత్రమే నిర్వహించుచుండుట వలనను, ఈ కోశము కార్యప్రాధాన్యత ననుసరించి మనోమయకోశముగా వ్యవహరింపబడుచున్నది. జ్ఞానేంద్రియములన్నియు ఒక్కొక్కటి ఆకాశాది పంచభూతములలో ఒక్కొక్కదాని సత్వగుణకార్యము. ఈ విధముగా మనస్సు, మరియు పంచేంద్రియముల ఈ సమిష్టి సత్వగుణముయొక్క కార్యమైయున్నది. కావుననే మనస్సు

మరియు పంచేంద్రియముల ఈ సమిష్టి మనోమయమనబడుచున్నది. ఇట్లగుటచేతనే "నేను వినుచున్నాను. నేను చూచుచున్నాను, నేను తాకుచున్నాను, నేను రుచి చూచుచున్నాను. నేను వాసన చూచుచున్నాను, నేను కోరుచున్నాను, నేను సంకల్పించుచున్నాను ఇత్యాది విధమున ఆ ఇంద్రియములన్నింటియందును సమిష్టిబుద్ధి అనగా ఆత్మబుద్ధి కలిగియుండుట వలనను, ఇంతకు పూర్వము బాహ్యమునుండి అన్నమయము తరువాత ఆంతరముగా చెప్పబడిన ప్రాణమయకోశమునకు ఈ మనోమయకోశము ఆంతరము. అందుచే ఈ విధముగా సర్వేంద్రియములను తన యధీనమునందుంచుకొని వానిచే తనకనుకూలమగు నానావిధకార్యములు చేయించు సామర్థ్యముకలదై "నేనే ఆత్మను" అనుచున్న ఈ మనోమయముగూడ తనజ్ఞానము కార్యములద్వారా ఆ యథార్థమగు ఆత్మను తెలుసుకొనకుండ చేయుచున్నది గాన ఇది కూడ ఆత్మకు ఒక కోశము వంటిది మాత్రమే అని అంగీకరించబడుచున్నది.

ఈ మనోమయకోశము మనస్సు ప్రధానముగా గలదిగనుక "నేను, నాది" యను వస్తువికల్పమగు కార్యముకలది అగుచున్నది. ఈ మనస్సు సంకల్పవికల్పాత్మకము అగుటవలన దేహేంద్రియాదుల విషయమున "నేను, అనెడు బుద్ధిని, గృహక్షేత్రాదులయందు "నాది" అనుబుద్ధిని, కలిగించుచున్నది. ఈ మనస్సు నామరూప భేదములను కల్పించు సామర్థ్యముగలది. అనగా ఇది ఘటము, ఇదిపటము, ఇదిలావుగావున్నది. ఇది సన్నముగావున్నది. ఇది ఎఱుపు, ఇది నలుపు, ఇత్యాది విధముగా ఒకే విధముగవున్న వస్తువునకు నానావిధములగు రూపనామములను కల్పించి గ్రహించుసామర్థ్యముకలది అనగా వస్తురూపమగు సకల వృత్తులు ఈ మనస్సును ఆశ్రయించియే కలుగుచుండును.

ఈ విధముగా నామరూపాత్మకమైన ఈ ప్రపంచమునకు సృష్టికర్త ఈ మనస్సుయే. ఏలయన, శబ్దములు, అర్థములు ఈ రెండింటి కంటె భిన్నమగు ప్రపంచము వేరేలేదు కదా! కావున ప్రపంచమంతయు తనకు సంబంధించిన వృత్తిగల అనగా తనను గ్రహించు మనస్సునందే యున్నదిగాన ఈ మనస్సు చాలా శక్తి సంపన్నమైనది. జీవునకు బంధమోక్షములు కలిగించునదిగూడ ఈ కోశమే. ప్రాణమయ, అన్నమయ కోశములకు జ్ఞానశక్తిలేదు గావునను, ఈ మనోమయము ద్వారానే అవి రెండూ ఆత్మసంబంధముగలవిగా అగుచున్నందున ఆ రెండును ఈ కోశముయొక్క అధీనమును స్వీకరించియే తమతమ కార్యములను నిర్వహించుచున్నవి. ఈ విధముగా ఈ మనోమయము తనకంటె ఆంతరంగముగానున్న

విజ్ఞానమయ కోశమునుండి ఆత్మచైతన్యమును గ్రహించి, తనకంటె బాహ్యముగ నున్న ప్రాణమయ కోశమును ఆత్మతత్వముతో చైతన్యవంతముచేయుచున్నది.

"జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయః స్యాత్
కోశో మమాహమితి వస్తువికల్పహేతుః
సంజ్ఞాది భేదకలనా కలితో బలీయాన్
తత్పూర్వకోశమను పూర్య కి జృంభతే యః॥ వి. చూ. 169.

ఇంతకు పూర్వమే చెప్పినట్లుగా ఈ మనోమయకోశము ఇంద్రియములతో కూడి, విషయములను కల్పించి, వాటియందు రమించి, అనగా ఆ విషయములను గురించియే నిరంతరము ఆలోచించుచూ, వాటియందే చిక్కుకొని, పూర్వాపర విచారము లేకుండ వాటిని భోగించుచు, అవి దుఃఖకరములైనను, వాటినే భ్రాంతిచే సుఖకరములుగా భావించి, వాటియందే నిమగ్నమై, పురుషార్థమగు ఆత్మను గుర్తించకుండా స్వస్వరూపజ్ఞానము పొందుటకు జీవుని అయోగ్యునిగా చేయుచున్నది.

యథార్థముగా విచారించి చూచినచో మనస్సుకంటె మించిన అవిద్యలేదు. సుషుప్తికాలమందు కారణరూపమగు అవిద్యవున్నను, అది కార్యరూపమునలేదు గావున ఆ అవిద్య బంధహేతువు కాజాలదు. ఆ సుషుప్తికాలమందలి ఏ కారణరూపమగు అవిద్యకలదో అది మనస్సుద్వారా కార్యరూపమును పొందుటచే ఈ మనస్సే భవబంధమునకు హేతువుగా అగుచున్నది. ఈ మనస్సులేని సుషుప్తియందు ఎట్టి వికారములులేక బంధకారణముకూడ లేకున్నది. కాని ఈ మనస్సు వున్నపుడే అనగా జాగ్రతకాలమందే ఈ మనస్సుచేయు దేహాద్యభిమానముచే వాసనారూపమగు బంధము ఏర్పడుచున్నది.

"యత్రచిత్తం తత్రవిశ్వం స్వయమేవ ప్రతీయతే,
యత్ర చిత్తంనాస్తి తత్రనాస్తి కించిత్ జగత్కథా" మ. వా. ద. 140.

వాస్తవ స్థితిలో ఆత్మకు కర్తృత్వముతోగాని, సంసారముతోగాని ఎటువంటి సంబంధమూలేదు. సంసారమనునది పూర్ణముగా శూన్యమైనదియే. కేవలము మనో విచారరూపమైనదియేగాని అందు సత్యమిసుమంతయులేదు. స్వప్నావస్థ అందరకునూ అనుభవసిద్ధమైనదియే కదా! ఆయవస్థయందు శబ్దాది విశేషములేవియు లేవను విషయము గూడ అందరకూ తెలిసినదే. అట్లున్నను ప్రతివాడును కలగాంచుచున్నాడు. అందు బహువిధములైన సాంసారిక సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. అప్పుడు ఆ సంసారము ఎక్కడనుండివచ్చినది? ఆ అవస్థయందు కేవలము

మనస్సు మాత్రమే వుండియున్నది. కావున అదియే అచ్చట సర్వసంసారమును కల్పించుచున్నది. జాగ్రదవస్థయందుకాని, పూర్వజన్మమునందుకాని, సంపాదించిన వాసనాబలముతో ఆ మనస్సే స్వాప్నిక సంసారమును కల్పించుచున్నది. స్వప్నమునందు విషయములు లేకున్నను వాసనాబలమువలన, సర్వవిషయములను అనగా బంధహేతువును అగు సంసారమును కల్పించుచున్నట్లే జాగ్రదవస్థయందును సంసారమును కల్పించుచున్నది ఈమనస్సే. ఈవిధముగా జాగ్రదసంసారముగూడ మనోకల్పితమేయగుటచే ప్రపంచ మంతయుగూడ మనఃకల్పితమే యనుటలో సంశయము ఏమియులేదు. ఇది యదార్ధము. ఈవిధముగా ఈమనోమయకోశము తన కల్పనా బలముచే లేని సంసారమును కల్పించి జీవునికి బంధహేతువు అగుచున్నది.

"మనఏవాఖిలం విశ్వం సృజత్యత్రతునోవిధిః
స్వప్నవన్నహి స్వాప్నార్ధో బ్రహ్మణా సృష్టఈక్ష్యతే" మ.వా.ద. 60

ఈవిధముగా ఈమనస్సే నామరూపములన్నింటిని అనగా ప్రపంచమంతటిని కల్పించుచున్నది. వాస్తవస్థితిలో ఆ పరబ్రహ్మమునందులేని నామరూపములు మనస్సుచే సంస్కారానుసారముగ కల్పింపబడి "ప్రపంచము" అని వ్యవహారింపబడుచున్నది. అంతేగాని మరేమియులేదు. ఈవిధముగా ఆమనస్సే ప్రపంచమును సృష్టించి బ్రహ్మరూపుడగు పురుషునకు గూడ సంసారబంధమును కలిగించుచున్నది అనగా "సంసారము వాస్తవము" అనుభ్రాంతిని కలిగించుచున్నది. కావున ఈబంధములన్నింటికి ఈమనస్సే కారణము—

"మనఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః" మ.వా.ద. 49

ఈవిధముగా మనస్సు కలిగిన ప్రపంచముకలుగుచున్నది. అదిలేకున్న ప్రపంచము వుండుటలేదు. సంసారముగూడ వుండుటలేదు. ఈవిధముగా ఈ రహస్యమును ఎఱింగినవానికి అనగా "ఆత్మకును ప్రపంచమునకును ఎట్టి సంభంధము లేదని ఉన్నదంతయు బ్రహ్మమే, ఈప్రపంచముగూడ ఆ బ్రహ్మమునందే కల్పించబడినది" అని ఎఱింగినవానికి ఎట్టి బంధమును లేదు. అదియే మోక్షము.

"యత్రయత్ర మనస్ఫూర్తి స్తత్రతత్ర జగత్రయం
యత్రయత్ర మనోనాస్తి తత్రతత్ర న కించన" మ.వా.ద. 63

ఆ మనస్సు వున్నప్పుడే దేహాదులతో కూడిన అభిమానముకలుగుచున్నది. ఆ మనస్సు లేనపుడు ఆయభిమానము వుండుటలేదు. కావున ఈ మాయారూపమగు జగత్తును సృష్టించి పురుషునకు బంధమును కల్పించుచున్నది ఈ మనస్సే. కావున ఈమనస్సు నిర్వాపనముగ అనగా ఎటువంటి పూర్వవాసనలులేని దానిగా ఎప్పుడు

పూర్తిగా నశించునో అప్పుడు సర్వము నశించును. అనగా బంధరూపమగు జగత్తు కానరాదు.

"నహ్యస్త్య విద్యా మనసోఽ తిరిక్తా
మనోహ్య విద్యా భవబంధహేతుః
తస్మిన్వినష్టే సకలం వినష్టం
విజృంభితేఽస్మిన్ సకలం విజృంభతే" వి. చూ. 171

"మనస్సు శరీరములోపలనున్న నాడులయందు సంచరించు అవస్థ" అని శ్రుతి చెప్పుచున్నది. అట్టి మనస్సు ఎటువంటి పదార్థములు వుండుటకు అవకాశము లేని స్వప్నమునందు తన మాయాపూర్ణమైన శక్తిచే సమస్తమైన కర్తృత్వ భోక్తృత్వములతో కూడిన ప్రపంచమును సృష్టించుచున్నది. అదే విధముగా జాగ్రదవస్థ యందు గూడ జాగ్రద్ప్రపంచమును సృష్టించుచున్నది.ఈరెండు ప్రపంచముల యందు ఎటువంటి భేదములేదు. ఏలనన ఇది అంతయు మనస్సుచే కల్పించబడిన ప్రపంచమే—

"స్వప్నే అర్థశూన్యే సృజతి స్వశక్త్యా భోక్త్రాది విశ్వం మనఏవసర్వం,
తథైవ జాగ్రత్యపి నోవిశేషః తత్సర్వమేతన్మనసో విజృంభణమ్"
వి. చూ. 172

ఈ విధముగా భోగ్యపదార్థముల సృష్టికి కారణ భూతమగు మనస్సే భోగ్య పదార్థములను సృష్టించి అందించుటద్వారా జీవునకు లేనిపోయిన భోక్తృత్వమును కల్పించు చున్నది. ఆ విధముగా ఈ మనస్సు భోగ్యపదార్థములతోపాటు ఆ పదార్థ ములను భోగించు భోక్తను గూడ సృష్టించు చున్నది. స్వప్నమునందు వలెనే జాగ్రదవస్థయందుగూడ ఈ మనస్సే సర్వమును సృష్టించుచున్నది. కావున ఇది యంతయు మనోవిలాసమేకాని అన్యమేదియును కాదు.

ఈ మనస్సుకు, అనగా ఈ మనస్సు కలిగిన మానవునకు, మూడు అవస్థలు కలవను విషయము సర్వానుభవమేగదా! సుషుప్తి అవస్థయందు మనస్సు విషయ ముల యందు ప్రవర్తించుటమాని కారణరూపమున ముడుచుకొని యున్నప్పుడు ఈ జగత్తు వుండుటలేదు. ఆ సుషుప్తిలో "నాకు ఏమియు తెలియలేదు"అనునది సర్వాను భవము. ఆకారణము వలన బద్ధుడైన పురుషునియొక్క సంసారము మనస్సుచే కల్పింపబడినదేగాని వేఱుకాదు. ఈ విధముగా స్వప్న జాగ్రదవస్థలయందు మనస్సు

వున్నప్పుడే సంసారము కనబడుచున్నది. అంటే మట్టి వున్నప్పుడే కుండవుండి ఆ మట్టి లేనపుడు కుండవుండుటలేనట్లే, మనస్సు వున్నప్పుడే సంసారము వుండి అదిలేనప్పుడు ఆ సంసారము వుండుటలేదు.

ఆ విధముగా ఈ మనోమయకోశము ఒకవైపున అనగా మనస్సు బయటకు వచ్చి విషయములను సృష్టించి తదాకారమును చెందినప్పుడు పురుషునకు సంసార రూపమున బంధమును కలిగించు చున్నది. ఆ మనస్సే రెండవవైపున వివేక వైరాగ్యభావములచే సుసంపన్నమై, విషయములందు రమించక బ్రహ్మభావముతో తాదాత్మ్యము చెందినప్పుడు పురుషునకు ఆ బంధమును తొలగించి మోక్షమును అనగా ముక్తిని కలిగించుచున్నది. అందుచేతనే-

"మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని శ్రుతులలో చెప్ప బడినది. ఈ శ్రుతివాక్యమును అనుసరించి ప్రాణియొక్క బంధమునకుగాని మోక్ష మునకుగాని సాధనమగునది మనస్సే, రజోగుణముచేత కలుషితమైన మనస్సు బంధమునకు హేతువగు చున్నది. ఆ మనస్సే రజస్తమోగుణముల నుండి విముక్తి పొందినదై మోక్షమునకు హేతువు అగుచున్నది. కావున మనస్సు ఒక్కటియే యైనను గుణభేదముననుసరించి కాలభేదముచే పరస్పర విరుద్ధములగు ఈ రెండు కార్యములకు అనగా బంధమోక్షములకు హేతువు అగుచున్నది.

"తస్మాన్మనః కారణమస్య జన్తోర్బన్ధస్య మోక్షస్య చవావిధానే,
బంధస్య హేతుర్మలినం రజోగుణైర్మోక్షస్య హేతుర్విరజస్తమస్కమ్"
వి. చూ. 176.

అయితే ఈ మనస్సు రజస్తమో గుణముల సంబంధమును వదలి సత్వగుణ సంపన్నత్వము కలిగినది ఏట్లగునన్నచో—వివేకవైరాగ్యాదిగుణ వర్ధనముచే శుద్ధ త్వమును పొంది అనగా ధృఢమైన వివేకము, తీవ్రతరమైన వైరాగ్యాదులు కలు గగా తత్ఫలితముగా బ్రహ్మయే సత్యము, జగత్తంతయూ దృష్టనష్ట స్వరూపము కలిగినదియేయని నిశ్చయము కలిగిన తరువాత ఆ మిథ్యాభూతమునందు ఆసక్తి విరమించును. అట్టి ఆసక్తి లేనిమనస్సు శుద్ధము అనబడును. వివేక వైరాగ్యాదు లతో సుసంపన్నమైన మనస్సు నిర్మలత్వమును పొంది, బహిర్ముఖత్వము లేకుండు టచే ఏకాగ్రతతో తనకు అధిష్ఠానమగు బ్రహ్మభావముతోనిండి సంసార హేతువగు బంధనివృత్తికి హేతువగును. వివేక వైరాగ్యాతిరేకములతో కూడిన మనస్సు ఈ విధముగా ముక్తికి కారణమగుట వలన ముక్తిని పొందగోరు పురుషుడు ఆ వివేక వైరాగ్యములను సంపాదించి ధృఢముచేసికొన వలయును.—

"వివేక వైరాగ్యగుణాతిరేకాచ్ఛుద్ధత్వ మాసాద్యమనో విముక్త్యై
భవత్యతో బుద్ధిమతో ముముక్షోస్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్యమగ్రే"
వి చూ. 177

మోక్షార్థియగు పురుషుడు అట్టిమోక్షమును పొందుటకై ముందుగా, తన మనస్సును నిర్విషయికముగా అనగా ఆ మనస్సును విషయములులేని దానినిగా చేయవలసి యుండును.

నిత్యమూ కామములందు భోగములయందు వ్యవహరించు మనస్సును, ఉపాయముచే బ్రహ్మమార్గమునందు మరల్చవలసియుండును. ఏలయన, లౌకికకామక్రోధాదులయందు చిక్కుకొన్నమనస్సుచే జప, తప, భక్తి,యోగ, సమాధులగు పారలౌకిక కార్యములు మరియు వాటిఫలములను సాధించజాలము. అందుచే కామ, క్రోధాదులనుండి మనస్సును వెనుకకు మరల్చుటలో ఉపరతి అనగా విషయములనుండి నివృత్తి సహాయకారి అగునుగాన దానిని వివేకవైరాగ్యాదులచే సాధించవలయును. అప్పుడు విషయాదులనుండి మనస్సు వెనుకకు మరలును—

ఉపాయేన నిగృహ్ణీయాత్, విక్షిప్తం కామభోగయోః
సుప్రసన్నం లయేచ్చైవ యథాకామాలయస్తథా" మాండూ 3. 42.

ఈ విధముగా మనస్సును విషయాదులనుండి వెనుకకు మరల్చినచో-రత్నము రాయి ఒక్క రూపుగా కనుపించగా. ఆ మనస్సు భయరహితమగు స్థితినిపొందును. అట్టి స్థితినిపొందిన మనస్సు జీవుని కర్తృత్వ, భోక్తృత్వాదులనుండి ముక్తుని చేయును. అంతేగాక జీవునకు స్థూలరూపమునను, అనగా జాగ్రతకాలమందుకలుగు స్థూలదేహము, వర్ణములు, ఆశ్రమములు, జాతులు, గోత్రనులు మొదలగు సమస్తమైన భేదబుద్ధులనుండి ముక్తిని కలిగించును. వాస్తవమున ఇవియే బంధములు. అటుపైన గుణములు,క్రియలు, వాటిహేతువులు, ఫలములు అనెడు సమస్తమైన విషయములనుండి వేఱుచేయును.

"మనః ప్రసూతే విషయానశేషాన్ స్థూలాత్మనా సూక్ష్మతయాచభోక్తృం,
శరీరవర్ణాశ్రమ జాతిభేదాన్ గుణక్రియాహేతు ఫలాని నిత్యమ్" వి.చూ.179.

ఈ మనస్సు ఇంద్రియములతోకూడి నానావిధములగు కర్మలు చేయుచు శరీరములు, వర్ణములు, ఆశ్రమములు, జాతులు, వాటియొక్క భేదములను, అనగా దేవ తిర్యగ్మనుష్యాది శరీరములను, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రరూప వర్ణభేదములను, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాది ఆశ్రమములను, దేవ మను

ష్యాది శరీరములను కలిగించుచున్నది. సుషుప్తి అవస్థయందు ఈ మనస్సు లేనపుడు ఈ భేదములన్నియు కానరావు. కావున ఈ బంధహేతువులన్నియు మనస్సు వున్నపుడే కలుగుచున్నవిగాన ఈ మనస్సును వివేక వైరాగ్యాదులచే వాటినుండి మరల్చుటయే ఆ బంధములనుండి విడువడుటకు మార్గమగును.

అఖండజ్ఞానమే రూపముగాగలిగినట్టియు, సదానందరూపుడును, సంగరహితుడును అగు ఆ పరమార్థమును ఈ మనస్సు తన శక్తిచే విజృంభించినదియై దేహేంద్రియప్రాణాదులయొక్క గుణములచే వ్యాపించి జీవుని తనయొక్క వాస్తవిక రూపమును తెలిసికొనుటకు అసమర్థునిగజేసి ఆదేహేంద్రియప్రాణ గుణములతో బంధించి, ఆదేహేంద్రియప్రాణములయందే "నేను" అను అభిమానమును, మరియు వాటి ధర్మములగు కర్మలయందును, అనగా లౌకిక వైదిక కర్మలయందును "నావి" అను అభిమానమును కలిగించుచున్నది. అంతేగాక ఆయా కర్మలవలన కలుగు ఫలముల భోగముల యందును ఆసక్తునిగా చేయుచున్నది-

"అసంగ చిద్రూపమముం విమోహ్యదేహేంద్రియప్రాణ గుణైర్నిబధ్య,
అహం మమేతి భ్రమయత్యజస్రం మనః స్వకృత్యేషు ఫలోపభుక్తిషు"
వి. చూ. 180.

అసంగము, చిదానందరూపము, అగు తనస్వరూపమును తెలిసికొనిన పురుషుడు ఈలోకమున ఏమియుకోరడు. ఏలయన? ఆ పరమాత్మయే, అనగా ఆ సర్వాంతర్యామియే, ఆ సర్వోపాధానకారణుడే తానని తెలిసికొన్న పురుషుడు అనగా జీవుడు ఏమికోరుచూ, ఏకామముకొఱకై తపించుచున్న ఈ శరీరమును అనుసరించి తాపమును చెందును? తనస్వరూప జ్ఞానమునుపొందిన జీవుడు యే కర్మలను ఆచరింపడు. అందుచే కర్తృత్వమైనను, భోక్తృత్వమైనను, ఆ దేహము, ప్రాణము మొదలగు అనాత్మ పదార్థములనుబట్టి వచ్చినవేగాని వేఱుగాదు. సుషుప్తికాలమునందు మనస్సు ప్రాణములయందు లీనమైపోయినప్పుడు అనగా ఆ మనస్సు ఇంద్రియములతోచేరి ఎట్టి వికల్పములు చేయకుండునప్పుడు జీవునకు ఈ దేహేంద్రియాదుల అభిమానము వుండుటలేదు. అందుచే ఈ అభిమానమునకు మూలకారణము ఈ మనస్సే. మనస్సు వున్నపుడే అభిమానమువుండి ఆ మనస్సు లేనప్పుడు ఆ అభిమానము వుండుటలేదు. కావున సుషుప్తియందలి అవిద్య యనునది ఒకటి వున్ననూ అది మనస్సులేనిచో బందహేతువు కాజాలకున్నది. అందువలన మనస్సే సర్వవిధ బంధములకు హేతువు అగుచున్నది.

రజోగుణము, తమోగుణము మొదలగు దోషములతో కూడిన అనగా ఆవరణ విక్షేపములకు హేతువులగు దోషములతో తాదాత్మ్యముచెందిన జీవుడు ఆత్మానాత్మభేదజ్ఞాన శూన్యుడై, అనాత్మపదార్థములయందు ఆత్మబుద్ధిని కలిగి అవిచ్ఛిన్నమగు జన్మ-మరణ పరంపరను పొందుచున్నాడు. సంసారమునకు మూలకారణమగు అధ్యాసకు ఈ మనస్సే మూలకారణము. అధ్యాసరూపమగు అనగా కల్పితమగు అజ్ఞానముతోకూడిన బంధముకూడ ఈ మనస్సుచేతనే కల్పితమగుచున్నది. స్థూల దేహము ఇంద్రియాదులుగూడ ఈ మనస్సుచేతనే కల్పింపబడుచున్నవి. ఆ కల్పింపబడిన దేహేంద్రియాదులపై "నేను" అను అధ్యాసముగూడ మనస్సుచేతనే కల్పింపబడుచున్నది. ఈ విధముగ అవిచ్ఛిన్నమగు జన్మ-మరణ పరంపరారూపమైన సంసారమునకు హేతువగు అధ్యాసకు హేతువగుటచే ఈ మనస్సే జన్మ-మరణ జరారోగాదులవలన కలిగిన సకలవిధ దుఃఖములకు ఆదికారణము అగుచున్నది.

అందుచే తత్త్వవిదులు అనగా తత్త్వము బాగుగా ఎఱింగిన పండితులు, ఈ మనస్సును సంసారమునకు మూలకారణమగుటవలన అవిద్యనుగా వర్ణించి చెప్పుచున్నారు. మనస్సే అవిద్యాకార్యము అగుటవలనను, మనస్సు సహాయములేని అవిద్య సంసారహేతువు కాజాలనందునను, మనస్సే సమస్తమైన జీవులను, జన్మ మరణ చక్రమునందుంచి పైకి క్రిందికి త్రిప్పుచున్నది—

"అతఃప్రాహుర్మనో అవిద్యాం పండితా తత్త్వదర్శనః
యేనైవభ్రామ్యతే విశ్వం వాయునేవాభ్రమండలం" వి.చూ, 182

అనగా రజస్తమోగుణముల దోషములతోకూడినదైనమనస్సు జీవునకు అధ్యాసద్వారా సంసారమునకు కారణమగుటవలన తీవ్రమైన మోక్షేచ్ఛగల పురుషునిచే అత్యధికమగు ప్రయత్నముచే ఆ మనస్సునందున్న రజస్తమోరూపములగు ఆవరణ విక్షేపములతో కూడిన దోషములను తొలగించుకొనవలసి యున్నది. అప్పుడు అనగా ఈ మనస్సు రజస్తమోగుణములనుండి ముక్తిపొందినదై కేవల సత్వగుణప్రధానముగ వున్నప్పుడు మాత్రమే జీవునకు తన స్వరూపమును గుర్తించసాధ్యమగుచున్నది.

"తన్మనఃశోధనం కార్యంప్రయత్నేన ముముక్షుణా
విశుద్ధేసతి చైతస్మిన ముక్తిః కరఫలాయతే" వి.చూ, 183

తీవ్రమగు మోక్షేచ్ఛగల ముముక్షువు చేయవలసిన ముఖ్యమగుప్రయత్నము దేహాది విషయములందు "అతిసుఖకరములు" అని కలిగిన భ్రాంతిని విడిచిపెట్టుటయే. దేహాదులయందున్న అహంకారమమకారములను పరిత్యజించి అన్నివిధములగు నైమి

త్తిక, సకామ, నిష్కామ కర్మలను వదిలి శాస్త్ర, గురూపదేశాది వాక్యములందు అచంచలమయిన శ్రద్ధతో, కాలత్రయాబాధ్యము, సర్వాధిష్ఠానము, సర్వప్రకాశము, జ్ఞానస్వరూపమును అగు బ్రహ్మమునందు శ్రద్ధతో, శ్రవణమనన, నిధిధ్యాసనముల యందు నిమగ్నమై యుండవలయును. అట్టి పురుషుడు రజస్తమోగుణముల ప్రభావముచే కలిగిన ఆవరణ, విక్షేపశక్తులవలనకలిగిన దోషములనుండి ముక్తుడై త్రికాలాబాధ్యమైన ఆనందమును అనుభవించును.

దేహాదులయందు అహంకార మమకారములు వున్నంతకాలము, వాటియందు రాగమోహము లున్నంతవరకు ఈ ప్రాపంచిక సుఖములకై కర్మచేయును, కర్మచే విక్షేపము కలుగును. ఏ పురుషుడు దేహాదులయందలి రాగమోహములను వదలి శ్రవణాదులయందే, మనోవాక్కాయములచే నిమగ్నమైయుండునో, అటువంటివానికి బుద్ధివిక్షేపము కలుగుటకు అవకాశముండదు. అందుచేత మోక్షేచ్ఛగల పురుషుడు బుద్ధిదోషములను, అందుచేకలిగిన ఆవరణ విక్షేపములను తొలగించుకొనుటకై శ్రవణ మననాదికములయందే నిమగ్నుడై యుండవలయును.

ఈ విధముగ మనోమయకోశమును గురించి బాగుగా తెలిసికొనిన ముముక్షువునకు ఆ మనోమయకోశము ఆత్మకాదు అను విస్పష్టమైన జ్ఞానము కలుగును. అది ఎట్లన, ఆ మనోమయము ఆద్యంతములుకలది. సుషుప్తియందు ప్రాణాదుల యందు లయము పొందుచూ జాగ్రదాదులయందు పుట్టు స్వభావముకలదై యున్నది. అందుచే ఆద్యంతములేని ఆత్మకాజాలదు. అట్లే నిత్యమూ పరిణామమును చెందున దగుటచే అనగా కామసంకల్పాదిరూపమున పరిణమించుచుండు స్వభావము కలదగుటచే పరిణామశూన్యము, మరియు వికారరహితమును అగు పరమాత్మకాజాలదు. ఇదేవిధముగా సుఖదుఃఖాత్మకము అగుటవలన గూడ ఈ మనోమయము నిత్యమూ వివేకవంతులగు పురుషులచే శోధింపబడుచున్నది, విరోధింపబడుచున్నది. కావున ఈ మనోమయము నిత్యానంద స్వరూపమైన పరమాత్మకాజాలదు, అంతేగాక సాక్షిరూపుడగు ప్రత్యగాత్మచే విషయముగ చేయబడుచున్నదిగాన విషయరూపమగు ఈ కోశము సర్వసాక్షియు, విషయశూన్యము అయిన ఆత్మకాజాలదు. చూచువాడు చూడబడువానికంటె ఎప్పుడూ అధికుడే. ఈ విధముగా మనస్సు వున్నప్పుడును, అది ప్రాణాదులయందు లయమై లేకుండ వున్నప్పుడును, సాక్షిచే దానియొక్క ఉనికి లేములు తెలియబడుచుండుటచేతను, ఆ విధముగా దృశ్యమగుచున్న మనోమయకోశము దృక్స్వరూపమగు ఆత్మకాజాలదు. ఆ విధముగా ఈ మనోమయకోశము అనాత్మపదార్థమే.

(4) విజ్ఞానమయ కోశము

"శబ్దాది విషయ పంచక సమన్వితబుద్ధి, విజ్ఞానమయమన వెలయుచుండు" బుద్ధీంద్రియములతో కూడియుండు నిశ్చయాత్మక వృత్తిగలది మరియు కర్తృత్వాది లక్షణములు కలదియు, పురుషుని యొక్క అనగా జీవునియొక్క సంసారమునకు హేతువు అయినదియు అగుబుద్ధి విజ్ఞానమయ కోశముగ చెప్పబడుచున్నది.—

"బుద్ధిర్బుద్ధీంద్రియైః సార్థం సవృత్తిః కర్తృలక్షణః
విజ్ఞానమయకోశః స్యాత్ పుంసః సంసార కారణమ్" వి.చూ. 186

చెవి, ముక్కు, చర్మము, కన్ను, నాలుక అనబడు ఐదు జ్ఞానేంద్రియములతోనూ, అనగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధాదులను గ్రహించగల ఇంద్రియములతోడను, మరియు నిశ్చయాత్మకమైన వృత్తి కలిగిన బుద్ధి, జ్ఞాన, ఇచ్ఛ, కర్తృత్వ, భోక్తృత్వలక్షణముగల విజ్ఞానమయకోశముగా చెప్పబడుచున్నది. జీవునియొక్క సంసార భావమునకు హేతువుగా గల ఒకే అంతఃకరణము సంశయాత్మక వృత్తి కలదై యున్నప్పుడు మనస్సనియు, నిశ్చయాత్మక బుద్ధికలదై యున్నప్పుడు బుద్ధియనియు చెప్పబడుచున్నది. ఆ విధముగా మనస్సుచే చేయబడిన సంకల్ప వికల్పాత్మక వృత్తి నిశ్చయాత్మకమగు బుద్ధిచే స్థిరపడగా క్రియలు ఆరంభమగునుగాన, మనస్సును కరణమనియు, బుద్ధి కర్తయనియు, చెప్పుదురు. పూర్వాపరభావమును అనుసరించి బుద్ధి లోపలను అనగా ముందును, మనస్సు బాహ్యముగ అనగా తరువాతను వుండుటచే బుద్ధి ఆంతరము, మనస్సు బాహ్యమును అగుచున్నవి. కావున బాహ్యము నుండి ఆంతరమునకు పోవుచు కోశములను తెలుసుకొను చున్నందున మనోమయ కోశము తరువాత అనగా మనోమయము కంటెలోపల బుద్ధ్యాత్మకమగు విజ్ఞానమయ కోశము వేఱుగ చెప్పబడుచున్నది. జ్ఞానేంద్రియములు ఐదును రెండు కోశముల యందు భేదములేకుండ వుండి వుండుటచే వీటిని వేఱువేఱుగ తెలిసి కొనుటకు కష్టమగును. కాని ఇప్పుడు అట్టి సంశయమునకు అవకాశములేదు.

బుద్ధి భూతపంచకము నందలి సత్త్వగుణ సంపన్నమైన సమిష్టి కార్యము యొక్క పరిణామము అగుటచే చాలా నిర్మలమైనది. అనగా రజస్తమోగుణముల ప్రభావము తక్కువగా కలది యగుటచే దానియందు అనగా బుద్ధియందు ఆ పదార్థము అనగా చిత్తు స్పష్టముగా, ముందుగా ప్రతిబింబించుచున్నది. అందుచే చిద్రూపమగు పరమాత్మయొక్క ప్రతిబింబమైన ఏ జీవుడు కలడో ఆ జీవునియొక్క భాసకత్వ శక్తికలదిగా ఈ విజ్ఞానమయకోశము అగుచున్నది. ఆ విధముగా చిత్తు యొక్క ప్రవేశముచే ఈ కోశము చిద్వ్యాప్తమైనదిగా, అగుచున్నది.

ఈ విజ్ఞానమయకోశము మూల ప్రకృతియొక్క అనగా అవిద్యయొక్క వికారమై యున్నది. సూక్ష్మభూత పంచకము అవిద్యకార్యము. ఈబుద్ధి సూక్ష్మభూత పంచకము నందలి సత్వభాగముయొక్క సమిష్టికార్యము, కావుననే వృత్తి రూప మగు జ్ఞానము, విషయవిచారము, ధ్యానము, లోకాంతరగమనాది రూపమగు క్రియలు మొదలగు గుణములు కలది. అందుచేత ఈబుద్ధి లేకుండ జీవులకు దేహా దులయందు అభిమానము కలుగదుగాన జీవత్వమే ఈ బుద్ధిరూపమగు ఉపాధిని బట్టి ఏర్పడుచున్నది. ఈవిధముగా ఈ విజ్ఞానమయకోశము అధ్యాసచే జీవునితో తాదాత్మ్యమును పొందుచున్నందున జీవాభిన్నముగ తలంచబడుచున్నది. ఇట్టి తాదాత్మ్యమువలననే ఎల్లప్పుడునూ అనగా జాగ్రతస్వప్నములయందు జీవుడు "నేను మనుష్యుడను, స్థూలముగ వున్నాను, నడచుచున్నాను, చూచుచున్నాను, వినుచున్నాను ఊపిరి పీల్చుచున్నాను, విడుచుచున్నాను, మొదలగు విధమున తాదాత్మ్యభిమానము కలవాడుగా అగుచున్నాడు. అనగా జీవత్వమును పొందుచున్నాడు. అందువలన జ్ఞానరూపుడగు చిదాభాసునితో సంబంధము కలది అగుటచే ఈ కోశము జ్ఞానము కలదిగా అగుచున్నది,

"అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తిః విజ్ఞాన సంజ్ఞః ప్రకృతేర్వికారః
జానక్రియావానహమిత్యజస్రం దేహేంద్రియాది యాదిష్వభిమన్యతే
భృశమ్." వి. చూ. 187

ఈ విజ్ఞానమయకోశము ప్రకృతియొక్క కార్యము, మరియు వికారము అని చెప్పుటచే ఈ కోశము ఆదిఅంత్యములు కలదియే అగుచున్నది. ఇట్లు ఈ కోశమును అనాదియని చెప్పుటకు కారణమేమన ఈకోశము అనగా ఈ సూక్ష్మ శరీ రము ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు మూడుకలసియే సూక్ష్మశరీరము అనబడుచున్నవి. కామరూపిణియగు ఈ సూక్ష్మశరీరమునకే లింగ శరీరము అను మరియొక పేరుకూడా కలదు. మహాప్రళయ సమయమున కూడ కారణ స్వరూపముతో అవ్యక్తముగ దాగియుండును. నశింపదు. ఏలయన? పూర్వ పూర్వకర్మలకు, మరియు తజ్జన్యమగు వాసనలకు ఆశ్రయమైన ఈ బుద్ధికోశము నశించినచో మరల సృష్టి జరుగనేరదు. విదేహాకైవల్యము అనగా కారణ శరీర ముతో సహా నశించు వరకును ఈ కోశమునకు వినాశము లేదు. అందుచేతనే పురు షుని—జీవుని, సంసారమునకు కారణభూతమైన ఈ బుద్ధిమయకోశము అనాదియే యని చెప్పబడుచున్నది.

కావుననే దీనివలన దేహేంద్రియాభిమానము గూడ అనాదియే. ఈ అభిమానమును దేహమున్నంతకాలము-దేహమనగా-స్థూల, సూక్ష్మ, కారణ దేహములు మూడూ దేహములే-దానియందు అభిమానము వుండియే వుండును. ఈ దేహము అనగా ఈ కోశము ఎప్పుడు, ఏ సమయమున ఆరంభమైనదో చెప్పుట శక్యముకాదు గాన అనాదియని చెప్పబడుచున్నది. ఈ విధముగా దేహేంద్రియాదులందు "నేను" అనెడు స్వభావము, అనగా అభిమానము కలిగిన, అనగా పూర్వవాసన కలిగిన, జీవుడు-అనగా ఈ విజ్ఞానమయకోశమే, సమస్త వ్యవహారములకు, యజ్ఞాది కర్మలకు మూలము అని శ్రుతి వాక్యము—

"విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపిచ"

సమస్తమైన లౌకిక వైదిక వ్యవహారములను నిర్వహించునది ఈ కోశరూపమైన జీవుడే. ఆ వ్యవహారములే ఈ జీవుని పూర్వాపూర్వజన్మలకు సంబంధించిన, అవిద్యా కర్మలను, పూర్వ ప్రజ్ఞయు కలసి ఆతనిని వేరు వేరు స్వభావములు కలవానినిగ చేయుచున్నవి.

"పుణ్యో వై పుణ్యేన కర్మణాభవతి, పాపఃపాపేన" పుణ్యకర్మలచే పుణ్యాత్ముడగుచున్నాడు. పాప కర్మలచే పాపాత్ముడగుచున్నాడు. పుణ్యకర్మలనగా శాస్త్ర విహితములు. పాప కర్మలనగా శాస్త్ర నిషిద్ధములు, భోజన స్వాపాదులు శాస్త్ర విహితములు, శాస్త్రనిషిద్ధములు కాని, అనగా పుణ్య పాపములు రెండూ కాని ఉదాసీన కర్మలు. ఈ కోశమునందున్న జీవుడు ఈ విధమగు త్రివిధ కర్మలు చేయుచున్నాడు. ఆ కర్మలయొక్క ఫలములను దేవ తిర్యగ్మనుష్యాదులగు ఎనుబది లక్షల భేదములు గల దేహములు ధరించి సంచరించుచు సుఖదుఃఖాదులు కలవాడుగా అగుచున్నాడు. స్వర్గనరకాది లోకములకు వెళ్ళి వచ్చుచున్నాడు. ఈ విధముగా ఈ జీవుడు "నేను మెలకువగ వున్నాను" "నేను నిద్రించుచున్నాను" "సుఖవంతుడను" "దుఃఖవంతుడను" మొదలగు విధములుగా ఆత్మయందు వున్నట్లు కనబడుచున్న ఈ ధర్మములన్నియు ఈ బుద్ధిమయ కోశముతో ఏర్పడిన తాదాత్మ్యాభిమానము చేతనే ఎర్పడుచున్నవి. వాస్తవమున ఆత్మకు ఎటువంటి ధర్మములు, అనగా సుఖదుఃఖాదులులేవు. జాగ్రత్ స్వప్నావస్థలు సుఖ,దుఃఖానుభవములు. ఇవన్నియు ఈ విజ్ఞాన మయ కోశమునకు చెందినవే. అనగా ఈ సూక్ష్మ శరీరమునకు సంబంధించినవే.—

"అనాది కాలోయ అహం స్వభావో జీవస్యమ_స్త వ్యవహార వోఢా,
కరోతి కర్మణ్యను పూర్వ వాసనః పుణ్యాన పుణ్యాని చ తత్ఫలాని"
వి.చూ. 188.

"భుక్తై్క విచిత్రాస్వపి యోనిషు వ్రజన్నాయాతి, నిర్యాత్యధ ఊర్ధ్వమేషః,
అస్యైవ విజ్ఞానమయ స్య జాగ్రస్వప్నాద్యవస్థాః సుఖదుఃఖ భోగః"
వి.చూ. 189.

అంతేకాక ఆయా దేహములకు సంబంధించిన బ్రహ్మచర్యాది ఆశ్రమములు మనుషత్వ బ్రాహ్మణత్వాది ధర్మములు, స్థితిగతి మొదలగు లౌకిక కర్మలు మంత్రోచ్చారణాది వైదిక కర్మలు, హ్రస్వత్వ దీర్ఘత్వాదులు, లేదా సుగుణ, దుర్గణములు, వీటినన్నింటిని "నావి" అను అభిమానము కలదగుచున్నది.

ఆత్మ ప్రతిబింబముతో కూడిన బుద్ధి, ఇంద్రియముల తోడను, దేహము తోడను, సంబంధించినదై వాటి ధర్మములను తనపై ఆరోపించుకొనుచున్నది. స్వతహాగా-వా_స్తవమున, ఈ బుద్ధి జడమే అయినను, చేతనమువలె వ్యవహరించుటకు కారణమే మన—

"పరాత్మనః చ్చేతనశ్చేతనానామ్" అను శ్రుతిననుసరించి కేవలము, నిర్మలము, అసంగము, చిద్రూపము, అగు పరమాత్మయొక్క "ప్రకృష్ట సాన్నిధ్యవశాత్" అనగా ఇతర వస్తువుల అపేక్షలేని ప్రతిఫలనముయొక్క మహిమచే ఈ బుద్ధి-ఈ విజ్ఞానమయకోశము-అతి ప్రకాశమయమైనది అగుచున్నది. ఇతరములగు ఇంద్రియములయందు ఇట్టి సాక్షాత్ చైతన్య సంబంధము లేకుండుటచే వాటికి ఈ విధమగు అతి ప్రకాశము లేదు. ఈ విధముగా అతి సామీప్య ప్రకాశ సంబంధముచే ఈ కోశము "జీవుడు" అను భేదమునకు హేతువు అగు ఉపాధిగా అగుచున్నది. క_ర్తృత్వ, భోక్తృత్వములతో కూడిన జీవత్వమను ధర్మమునకు ఇది మూలకారణము అగుచున్నది. అందుచే జీవుడు ఈ ఉపాధియందు "నేను" అను బుద్ధికలవాడై భ్రాంతిచే క_ర్తృత్వాది దుఃఖములను అనుభవించుచున్నాడు.

ఈ విజ్ఞానమయకోశము సాక్షాత్తు ఆ పరబ్రహ్మము తరువాత పరబ్రహ్మమంతటి మహత్తుగలది. చక్షురాది ఇంద్రియముల సమీపమున, హృదయమునందు ప్రకాశించుచున్న "స్వయంజ్యోతి" స్వరూపమగు ఈ విజ్ఞానమయము ఆత్మతత్త్వమును అన్నిటికంటె ముందుగా పొంది ఆ ఆత్మతత్త్వమునకు ఉపాధిగావుండి క_ర్తృత్వము, భోక్తృత్వముకల జీవుడుగా అగుచున్నది. మోక్షము కలుగువరకును ఈ

కోశము ఆత్మతాదాత్మ్యమును వదలక తానే ఆత్మగా వ్యవహరించుచున్నది. అందు చేతనే దీనికి "విజ్ఞానమయ కోశము" అను పేరు కలిగినది.

"యోఽయం విజ్ఞానమయః ప్రాణేషుహృది స్ఫురత్స్వయం జ్యోతిః
కూటస్థ స్సన్నాత్మా కర్తాభోక్తా భవత్యుపాధిస్థః" వి-చూ-191

అనగా-చక్షురాదీంద్రియముల సమీపమున, హృదయమునందు ప్రకాశించు చున్న, స్వయంజ్యోతి స్వరూపమగు ఏ ఈ విజ్ఞానమయమైన ఆత్మకలదో అది కూటస్థమైనను, ఉపాధియందున్నదై కర్తగాను భోక్తగాను అగుచున్నది.

ఈ విధముగా జ్ఞానము, క్రియనుగల బుద్ధియందు ప్రకాశించుచున్న ఆత్మయే విజ్ఞానమయ కోశముగా చెప్పబడుచున్నది.

అసత్యమైన స్వరూపముగల బుద్ధియొక్క తాదాత్మ్యముచేత మాత్రమే తాను అనగా ఆయాత్మ 'సర్వంఖల్విదంబ్రహ్మ" మొదలగు శ్రుతుల ననుసరించి సర్వా త్మకుండైనను, సర్వోపాదానమగు తనకంటె భిన్నమైనది యేదియు లేకున్నను, తనకంటె వేఱుగా "నేను, వాడు, ఇది, నీవు" మొదలుగాగల భేదబుద్ధి కలవాడగు చున్నాడు. ఇది అంతయు ఈ కోశముయొక్క మహాత్మ్యమే.

ఇనుముయొక్క ధర్మమైన దీర్ఘత్వ, వర్తులత్వాదులను, వాస్తవమున అట్టి ధర్మము లేవియులేని అగ్నికివలె, అనగా ఇనుము పొడవుగ నున్నచో అందు వ్యాపించియున్న అగ్ని పొడవుగ నున్నదనియు, ఆ ఇనుము వర్తులముగనున్న అగ్ని వర్తులముగ నున్నదనియు లోకమున జనులు నిత్యమూ ఎట్లు భ్రాంతబుద్ధికల వారగుచున్నారో అట్లే ఎల్లప్పుడును తనయొక్క సచ్చిదానంద స్వరూపము వలన నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావుడైనను ఈ కారణములచే అనగా ఈ విజ్ఞాన మయ కోశమునందు ప్రకాశించుటచే, సర్వవిధ వికార శూన్యుడైనను, పరమాత్మ ఈ ఉపాధి సంబంధముచే అనగా తనచే ప్రకాశింపబడినదైనను, తనకు ఉపాధిగా నున్న, అవిద్యచే కల్పితమైన తాదాత్మ్య సంబంధమువలన కర్తృత్వము, భోక్తృ త్వము మొదలగు ఉపాధి ధర్మములను అనుసరించి అనగా ఈ విజ్ఞానమయ కోశముయొక్క ధర్మములన్నింటిని తనయందు ఆరోపించుకొని "నేను చేయుచు న్నాను, నేను సుఖవంతుడను, దుఃఖవంతుడను, ఇత్యాది విధమున కర్తృత్వాదులు కలవానివలె అగుచున్నాడు. ఆత్మప్రకాశముచే ప్రకాశించుచున్న ఈ విజ్ఞానమయ కోశము-బుద్ధి-తననే ఆత్మగా భావించి "నేను" "నాది" యను భ్రాంతిని కల్పించి సుఖదుఃఖములను అనుభవించుచున్నది. తన ఉపాధిగతమైన ధర్మములను ఆ యాత్మకు ఆపాదించుచున్నది.

"ఉపాది సంబద్ధవశాత్పరాత్మా ఉపాధి ధర్మాననుభాతి తద్గుణః
అయోవికారా నవికారి వహ్నివత్ సదైవ రూపోఽపి పరః స్వభావాత్"
వి-చూ-193

సంసార రహితుడు మరియు సర్వోత్కృష్టుడును అగు ఆ పరమాత్మకు, ఏ ఉపాధి తాదాత్మ్యముచే జీవత్వము చెప్పబడుచున్నదో ఆ ఉపాధియైన విజ్ఞాన మయకోశము "అనాదికా లోయ మహం స్వభావోజీవః" మొదలగు శ్రుతి ననుసరించి అనాది యగుటవలన ఆత్మవలె అనాదియగు దీనికిని నాశము అంగీకరింపబడదు. ఆ కారణము వలన అనగా ఆత్మయొక్క జీవ భావమునకు హేతువగు ఉపాధిగూడ అనాది యగుట వలన దానికిని ఆత్మవలె నాశము అసంభావ్యము కావునను; ఈ పరమాత్మ యొక్క జీవత్వము గూడ నిత్యమే యగుచున్నదికదా అప్పుడు ఆ విధముగా జీవభావము నిత్యమైనచో, సంసారము గూడ నిత్యమే యగునుగాన మరి ఆ జీవునకు మోక్షము ఏట్లు కలుగునన్నచో— మోహము కలిగినవాని కల్పన -మోహము - అనగా తెలియవలసియున్న విషయమును తెలిసికొనకుండుట - ఇది తమోధర్మము. వాస్తవమున నిర్మల జ్ఞాన స్వరూపుడైనను, దృఢమైన అజ్ఞాన జనిత భ్రాంతిచే పైన చెప్పిన విధమున జనించిన మోహముకల పురుషుడు తాను వాస్తవముగ సంసారి కాకపోయినను, సంసారినని చేసిన కల్పన యధార్థముకాజాలదు, అట్టి కల్పన భ్రమవలన కలిగిన మోహము వలన జనించుచున్నది. కావున పరమాత్మయొక్క జీవత్వముగూడ అప్రామాణికమే అగుచున్నది. ఏలయన ?, సంగరహితమును, క్రియాశూన్యమును, ఆకార రహితమును అగు ఆత్మకు — ద్రష్టయైనట్టియు, నిర్గుణమైనట్టియు, క్రియాశూన్యమైనట్టియు, బోధరూపమైనట్టియు, మరియు ఆనంద స్వరూపమును అగు ఆత్మకు బుద్ధి యొక్క తాదాత్మ్య భ్రాంతిచే ప్రాప్తించిన జీవత్వము సత్యము కానేరదు. మోహము తొలగిన వెంటనే ఆ జీవ భావముగూడ తొలగి పోవును.

అవిద్యయొక్క కార్యమైన ఈ విజ్ఞానమయ కోశమునకుగూడ అవిద్యకువలెనే అనాదిత్వము అంగీకరింపబడును. కాని విద్య పుట్టినదగుచుండగా అనగా సమ్యగ్ జ్ఞానము కలిగినపుడు ఈ అవిద్యా సంబంధమైనదంతయు అనాదియైనను మెలకువ వచ్చిన వానికి స్వప్నమువలె సమూలముగా నశించుచున్నది. అవిద్యా సంబంధమైనదంతయు అనాదియే యైనను ప్రాగ భావమువలె నిత్యమైనదికాదు. ఆత్మకు బుద్ధితో సంబంధము మిథ్యా జ్ఞానము ననుసరించి వచ్చినదేగాని సత్యమును, నిత్యమును

అయినదికాదు. అందుచే సమ్యగ్ జ్ఞానముచేత ఆ బంధము యొక్క నివృత్తి యగును, మరియొక విధముగా మాత్రముకాదు. బ్రహ్మయు, జీవాత్మయు ఒక్కడే అను విజ్ఞానమే సమ్యగ్ జ్ఞానముగా శ్రుతి చెప్పుచున్నది—

"బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానం సమ్యగ్జ్ఞానం శ్రుతేర్మతమ్"

వి. చూ – 204.

ఆత్మానాత్మలయొక్క బాగుగా విచారణచేతనే ఆ సమ్యగ్ జ్ఞానము సిద్ధించును. అందుచే ఏ మహాపురుషుడు ప్రత్యగాత్మ యొక్కయు, జీవాత్మ యొక్కయు వివేకము చేయునో అతనికే పరమాత్మ అఖండ చైతన్య ప్రకాశ రూపమున సాక్షాత్కరించును. ఆ విధముగా పరమాత్మ యొక్క స్ఫుటమైన జ్ఞానము అసత్తులగు అన్నమయాదులు నివర్తించిన పిమ్మట కలుగును.

ఆ కారణము వలన అనాత్మయైన ఈ విజ్ఞానమయ కోశము యొక్క నిరాసము బాగుగా చేయతగి యున్నది.

అందువలన విజ్ఞానమయమను పేరుగల ఈ కోశము వికారమును చెందునదగుటవలనను,జడమగుట వలనను,పరిచ్ఛిన్నమను కారణము వలనను దృశ్యమగుట వలనను, వ్యభిచరించునదగుట వలనను పరమాత్మకాజాలదు. నిత్యమైన ఆత్మ అనిత్యమైన విజ్ఞానమయకోశముగ అంగీకరింపబడదు

ఈ విజ్ఞానమయము మరుస్థలమున తోచిన ఉదకమువలె వున్నట్లుగాతోచుట యేగాని వాస్తవమున వుండుటలేదు. ఆత్మయే అనిత్య పదార్థముల మధ్య నున్న ఏకైక నిత్యపదార్థము. "నిత్యో అనిత్యానామ నిత్యత్వాచ్ఛ్రుతాభ్యః (బ.సూ.23.3.17) ఇత్యాదులగు శ్రుతులననుసరించి ఆత్మనిత్యమని, తెలియుటవలనను, ఆత్మజనించునది కాదు అను సూత్రమువలనను, నిత్యమగు ముక్తితో సంబంధించి యుండుటచే ఈ ఆత్మనిత్యము అను యుక్తిచేతను నిత్యమగు ఆత్మ వికారిత్వాది హేతువులచే అనిత్యమైన విజ్ఞానమయకోశముగ అంగీకరించబడదు.

"విజ్ఞానమయకోశః ఆత్మభిన్నః వికారిత్వాత్, జడత్వాత్ పరిచ్ఛిన్నత్వాత్, దృశ్యత్వాత్, వ్యభిచారిత్వాత్ స్థూలదేహావత్" అను సూత్రమును అనుసరించి ఈవిజ్ఞానమయకోశము స్థూలదేహామువలె వికారియగుట వలనను జడమగుట వలనను, పరిచ్ఛిన్నమగుట వలనను, దృశ్యమగుట వలనను, వ్యభిచారి యగుట వలనను, ఆత్మకంటె భిన్నమైనది. ఇది, ఈ కోశము అనాత్మయను విషయము దృఢమగుటకు అనేకమైన హేతువులు చెప్పబడినవి. ఇన్ని హేతువులున్నను విడరాని మోహము వలన దీనినే ఆత్మయని భ్రాంతిజెందుచున్నారు.

1) వికారిత్వమనగా - జన్మనాశములు కలిగియుండుట,

2) జడత్వమనగా - తనంతట తానుగా ప్రకాశింపజాలకుండుట,

3) పరిచ్ఛిన్నత్వ మనగా - సర్వవ్యాప్తము కాకుండుట,

4) దృశ్యత్వ మనగా – జ్ఞానగోచరము అగుట, తెలియబడుట.

5) వ్యభిచారిత్వ మనగా - ఉన్నట్లుగా తోచియు వాస్తవమున లేకుండుట.

ఈవిధముగా ఈవిజ్ఞానమయకోశము అవస్థాత్రయమునందు అనగా సుషుప్తియందు అనువర్తించకపోవుటచే అది దృష్టనష్ట స్వరూపము అను విషయము అనగా కనబడి నశించిపోవునది అగుచున్నది. కావున ఈవిజ్ఞానమయకోశము సర్వవ్యాప్తము నిత్యము, ఆనందరూపము జ్ఞానరూపము ప్రకాశరూపము అగు ఆత్మకాజాలదు.

(5) ఆనందమయకోశము :–

....“మోహజప్రియ మోదప్రమోదవృత్తి
సంయుతోరు సమస్త దృశ్యప్రపంచ
కారణానాద్య విద్యాంధకార పటల
మంచితానందమయ కోశమనగదనరు” సి. రా. ఆం. సం. 332.
“ఆనంద ప్రతిబింబచుంబిత తనుః వృత్తిస్తమోజృంభితా
స్యాదానందమయః ప్రియాదిగుణకః స్వేష్టార్థలాభోదయః
పుణ్యస్యానుభవే విభాతికృతినా మానందరూపః స్వయం,
భూత్వానందతి యత్రసాధుతను భృన్మాత్రః ప్రయత్నంవినా” వి.చూ. 209.

అనగా ఆనందముయొక్క ప్రతిబింబముచే స్పృశింపబడిన శరీరముకలదియు, అవిద్యాపరిణామ రూపమైనదియు అగు వృత్తి, ప్రియము మొదలగు గుణములు కలదియు, తనకు ఇష్టమైన అర్థము లభించునపుడు ఉదయించునదియు అగు ఆనందమయ కోశము అగును. పుణ్యాత్ముల యొక్క పుణ్యమును అనుభవించు సమయమున భాసించును. దేనియందు ప్రాణిమాత్రము ఎట్టి ప్రయత్నము లేకుండగనే తాను ఆనందరూపుడై బాగుగా సంతోషించునో అది ఆనందమయకోశముగ చెప్పబడుచున్నది.

పరమాత్మయొక్క స్వరూపము ఆనందము. ఆ ఆనందముయొక్క ప్రతిబింబముచే ప్రకాశవంతమైన ఏ స్వరూపముకలదో అదియే శరీరముగా కలది, ఇది

అవిద్యవలన పుట్టినది. అవిద్యా పరిణామరూపమైనది. అట్టివృత్తి ఆనందమయకోశ ముగా చెప్పబడుచున్నది.

ఈ ఆనందమయకోశము ప్రియమే శిరస్సుగాకలది. మోదము దానియొక్క కుడిభాగము. ప్రమోదము దానియొక్క ఎడమభాగము. ఆనందము దాని ఆత్మ. బ్రహ్మప్రతిష్ఠాహేతువు అగు పుచ్ఛము అను శ్రుతిని అనుసరించి—ఇష్ట వస్తువుల దర్శనము, లాభము, భోగము, వీటివలన కలిగిన సుఖవిశేషమే అవయవములుగా గల ప్రియము మొదలు ప్రమోదమువరకు వున్నది గుణముగా అనగా అవయవ ములుగాగలది. ఇది నిరంతరము జీవుని విడువక వుండునదికాదు. అప్పుడప్పుడు మాత్రమే వుండునది-కలుగునది. అనగా తనకు ఇష్టమైన పుత్రమిత్రాదులు, విషయ ములు అనగా పదార్థములు లభించినపుడు అనగా వాటి దర్శనముకలిగినప్పుడు మాత్రమే కలుగుచుండునది అనగా పుట్టునది.

ధీమంతులయొక్క పూర్వజన్మ కృతమును, ఫలోన్ముఖమును అగు పుణ్య మును అనుభవించు సమయమున విశేషరూపముగా భాసించును.

ఏ సమయమున ప్రాణులన్నియు ఎటువంటి ప్రయత్నము లేకుండగనే అనగా ఆ సమయమున ఎటువంటి ప్రయత్నము చేయకపోయినను అనగా పూర్వము చేసిన పుణ్యకర్మల ఫలముగా ఇప్పుడు లభించునో అట్టి సుఖమును—ఆనందమును తానే ఆనందరూపుడుగా వుండి ఆనందించునో అపుడు జీవునకు ఆనందమయకోశ ముతో సంబంధము ఏర్పడినదని తెలియవలయును.

"దేహప్రాణేంద్రియ మనోబుద్ధ్యాది భిరుపాధిభిః
యైర్యైర్వృత్తేః సమాయోగః తత్తద్భావోఽస్యయోగినః" వి. చూ. 371.

అనగా ఏయే దేహము ప్రాణములు, ఇంద్రియములు, బుద్ధి మొదలగు ఉపా ధులతో మనోవృత్తియొక్క తదాకారత్వరూపమగు సంబంధము ఏర్పడునో అదియే ఆనందమయకోశమనేబడుచున్నది.

ఈ విధముగా జాగ్రత్ స్వప్నావస్థలలో పుణ్యబలమువలన కలుగు సుఖా కారమైన తామసవృత్తి ఆనందమయకోశముగా చెప్పబడుచున్నది.

ఈ కోశముగూడ దీనికి వెలుపలవున్న విజ్ఞానమయ, మనోమయ, ప్రాణ మయ అన్నమయ కోశములవలె స్వరూపమును కప్పివుంచునదే. ఈ కోశముతో సంబంధము ఏర్పడినప్పుడు దుఃఖమిశ్రితము కానిదియు,నిత్యమూ,నిరూపాధికమును

అగు సుఖస్వరూపమును, పరమానందస్వరూపమును, తెలిసికొనుట కుదరదు. అందుచేతనే—

"నప్రహృష్య త్ప్రియంప్రాప్య" ప్రియములభించినపుడు సంతసింపకూడదు.

"ఆత్మానం హర్షశోకాభ్యాం శత్రుభ్యామివ నార్పయేత్"

తనను శత్రుతుల్యములైన హర్షశోకములకు అర్పింపకూడదు"

"హర్షామర్షభయోద్వేగై ర్ముక్తోయః సచమేప్రియః"

"సంతోషము, అసూయ, భయము, ఉద్వేగము, వీటినుండి ముక్తుడైనవాడు నాకు ప్రియుడు" ఇత్యాది స్మృతివాక్యములు ఈ విధమగు ఆనందమును హేయమని చెప్పుచున్నవి. కావున ఆనందమయ కోశమును భాసింపజేయునది కామ్య కర్మల వలన కలిగిన పుణ్యఫలములే అనియు తెలియుచున్నది. తామసియగు సుఖాకార వృత్తియే ఆనందమయకోశముగ తెలియుచున్నదిగాన సుషుప్తి అవస్థయందు ఆ వృత్తిబలముగవుండును. ఆ సుషుప్తియందు పుణ్యాజనితముకాని, స్వరూపసుఖమే అవిద్యావృత్తికి విషయమగుచుండును. ప్రతిదినమునందును ఫలమునిచ్చుటకు ప్రారంభించిన పుణ్యము క్షీణించినపుడు మాత్రమే సుషుప్తి కలుగుచుండును. అందుచే ఇది దైనందిన ప్రళయముతో సమానము.—

"ఆనందమయకోశస్య సుషుప్తే స్ఫూర్తిరుత్కటా,

స్వప్న జాగరయోరీషదిష్ట సందర్శనాదినా" వి. చూ 210

అనగా సుషుప్తియందు ఆనందమయకోశముయొక్క తీవ్రమైన అనుభవము వుండును. ఆ సమయమున దుఃఖమిశ్రమముకాని సుఖముండునుగాన అపుడు ఆనందమయకోశ స్ఫురణము అధికమని అభిప్రాయము. స్వప్నజాగృదావస్థలలో ఇష్టవస్తువుల సందర్శనము, భోగము మొదలగువాటిచే ఇట్టి ఆనందముయొక్క స్ఫురణము స్వల్పముగా వుండును. ఆ అవస్థలయందు భిన్నవిషయములగు వృత్తులు ఈ ఆనందమయ వృత్తిని నశింపజేయుచుండును. కాని సుషుప్తియందు ఇతర వృత్తులేవియు వుండవుగాన అప్పుడు ఈ ఆనందమయకోశముయొక్క స్ఫురణము ఎక్కువగాను, స్పష్టముగాను వుండును.

ఈ కోశమునందు కలుగు ఆనందము తామసవృత్తికి సంబంధించిన దగుటచే ఈ కోశముగూడ అనాత్మ పదార్థములకు సంబంధించినదియేయని తత్వవేత్తల తీర్మానము—

"నైవాయమానందమయః పరాత్మా సోపాధికత్వాత్ప్రకృతేర్వికారాత్,
కార్యత్వహేతోః సుకృతక్రియాయా వికారసంఘాత సమాహితత్వాత్"
వి. చూ. 211

అనగా ఈ ఆనందమయకోశము ఉపాధిసంబంధముకలదగుటవలనను,
ప్రకృతియొక్క వికారమగుటవలనను,
పుణ్యముయొక్క కార్యము అగుటవలనను,
అవయవ సముదాయముతో కూడినదగుటవలనను నిత్యమూ
సత్యము, వికారరహితమును అగు పరమాత్మకాజాలదు.

ఈ ఆనందమయము ముఖ్యాత్మకాజాలదు ఏలయన ?

1) నిమిత్తముకలదగుటవలన, అనగా ఇష్టసందర్శనాదులవలన కలిగినదగుటవలన.

2) మూలప్రకృతియొక్క అనగా అవిద్యయొక్క వికారమగుటవలనను, అనగా అజ్ఞానమునందు జనించినదగుటవలనను,

3) దర్శనము, లాభము, భోగము, మొదలగువాటివలన జనించిన సుఖరూపములైన అవయవముల సముదాయమునుండి జనించినదగుటవలనను.

4) పుణ్యకార్యముల ఫలరూపముగా ఇష్టవస్తువులు లభించినపుడు తమోమిశ్రితమగు సత్వము ఉద్భవింపగా "నేను సుఖవంతుడను" అను విధముగా సుఖాకార వృత్తి జనించును. భోగము కలిగినపుడుగూడ ఈ వృత్తి తీవ్రరూపము దాల్చుచుండును. ఈవిధముగ ఈ వృత్తి పుణ్యము, ఇష్టవిషయములు మొదలగు వికారములవలన జనించుచున్నది. కావున ఈ ఆనందమయకోశముగూడ స్వరూపమును పొందకుండ జీవుని అజ్ఞానములో వుంచునదియేగావున అనాత్మ పదార్థమే.

ఈ విధముగా ఈ కోశపంచకముయొక్క వివేచనముచేయగా కలిగిన లాభమేమనగా స్థూలదేహము అనగా అన్నమయకోశము మొదలు ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, మరియు ఆనందమయకోశములకు సంబంధించిన

దంతయు ఆత్మపదార్థముకాదని బోధపడుచున్నది. ఈ విధముగా ప్రతికోశము విష యమునను "ఇది ఆత్మకాదు, ఇది ఆత్మకాదు" అను నిషేధము చేయబడగా ఆ ఆ నిషేధమునకు ఆధారభూతమైనట్టియు, అనగా అట్లు నిషేధించగా మిగిలిన వస్తువే నిర్విషయకమగు, కేవల జ్ఞానరూపమగు వస్తువు సాక్షియైన పరమార్థమే యని రుజువగుచున్నది.

"పంచానామపి కోశానాం నిషేధేయుక్తితఃకృతే
తన్నిషేధావధిఃసాక్షిబోధరూపోవఽశిష్యతే" వి. చూ. 212

ఆ విధముగా ఏది శేషించినదో అది ఆత్మ. స్వయముగా ప్రకాశించునదియు, పంచ కోశములకు అంతరముగవుండి వాటికి భిన్నమైనదియు, జాగ్రద్. స్వప్న సుషుప్తి అనబడు మూడు అవస్థలకును సాక్షిగా నున్నదియు. సర్వవిధముల అబాధ్య మును, సర్వకాల సర్వదేశములయందు వ్యాపించి వుండునదియు, వికారరహితమును ఇతరవస్తుసంబంధ రహితమును, ఎల్లప్పుడును ఆనందస్వరూపుడును అగు ఆత్మ పండితులచే స్వస్వరూపముగా తెలియదగినదిగా అగుచున్నది. ఏ దేహాదులయందు ఆత్మత్వము అజ్ఞానముచే కల్పింపబడెనో వాటినన్నింటిని అనగా అన్న మయకోశమగు స్థూలదేహమును ప్రాణమయకోశముగా ఎంచబడుచున్న ప్రాణకర్మేంద్రి యములను, మనోమయకోశముగా చెప్పబడుచున్న జ్ఞానేంద్రియములతోకూడియున్న మనస్సును, విజ్ఞానమయకోశముగా తలంచబడుచున్న శబ్దాదివిషయములతో తాదా త్మ్యము చెందియున్న బుద్ధియును, మరియు ప్రియము. ఆనందము, ప్రమోదము, మోదము, మొదలుగాగల తమోవృత్తిమూలకమైన ఆనందమయకోశమునుగూడ అనాత్మగాఎంచి నిషేధించగా అట్టి నిషేధమునకును, ఆరోపితములగు వానికన్నింటి కిని, అధిష్ఠానమును అనగా సర్వాధారముగ తెలియబడుచున్న ఆ పరబ్రహ్మమే వాస్తవమైనదని అనగా సత్యమైనది నిత్యమైనది అని నిర్ణయమగుచున్నది.

—o—

"పంచకోశములతో కప్పబడియున్న పరమార్థమే జీవుడు"

తైత్తరీ....

# త్రిగుణములు బంధ హేతువులే

ఆకాశాది భూత పంచకము మొదట అతి సూక్ష్మరూపమున ఏర్పడుచున్నది. ఈ భూత పంచకము నందలి ప్రతి ఒక్కటి మిగిలిన నాలుగుభూతముల మిశ్రమము అయివుండును. అనగా ఒక్కొక్క భూతము పంచీకృతమగును. అనగా ఐదేసి భూతాంశములుకలదిగా అగును. అయిదు భూతములను—ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి—ఒక్కొక్కదానిని రెండుగా విభజించి, అందులో ఒక భాగమును విడిగా వుంచి, మిగిలిన సగభాగమును నాలుగు భాగములుగా విభజించి, ఇతర భూతముల సగ భాగములతో కలిపినచో పంచీకరణము జరుగును. అట్లుచేయగా ఒక్కొక్క స్థూల భూతమునందును తనకు చెందిన సగ భాగము ఇతర భూతముల ఎనిమిదవ భాగమును వుండును. ఈ విధముగా పరస్పరాంశములతో ఏర్పడినపిమ్మట గగనాది శబ్దములతో వ్యవహరించుటకు తగిన స్థూల భూతములుగా ఏర్పడిన ఈ పంచ మహాభూతములు జగత్తునకు కారణమగుచున్నవి.

"అవ్యక్త నామ్నీ పరమేశ శక్తిరనాద్య విద్యాత్రిగుణాత్మికాపరా,

కార్యాను మేయా సుధియైవ మాయా యయాజగత్సర్వ మిదం ప్రసూయతే"

అనగా అవ్యక్తము అను పేరు గలదియు, పరమేశ్వరుని శక్తియైనదియు, ఆది రహితమగు అవిద్యయు త్రిగుణస్వరూపము గలదియు, పరమైనదియు అగు మాయచే ఈ సమస్తమైన జగత్తు సృష్టింపబడుచున్నది. శ్రీమద్‌భగవద్గీత యందు గూడా ఈ విషయము ఇట్లే స్పష్టముగ చెప్పబడినది.

"మమయోని ర్మహ్యద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం

సంభవః సర్వభూతానాం తతో భవతి భారత" 14/3

గొప్పదైన మూల ప్రకృతి—మాయ-నా యొక్క సర్వభూతోత్పత్తి స్థానము. అద్దానియందు నేను గర్భకారణమైన చైతన్య రూపమగు బీజమును వుంచుచున్నాను. దానివలన సమస్త ప్రాణులయొక్క వుత్పత్తి సంభవముఅగుచున్నది. అట్లే-

"సర్వ యోనిషు కౌంతేయ మూర్తయస్సంభవంతి యాః

తాసాం బ్రహ్మమహద్యోనిరహం బీజప్రదః పితా" భ.గీ. 14/4

దేవ మనుష్యాది సమస్త జాతుల యందును, ఏప్రాణులు; శరీరములు ఉద్భవించుచున్నవో వానికి మూల ప్రకృతి-మాయ-యే మాతృస్థానము-తల్లి-నేను బీజమును వుంచునట్టి తండ్రిని.

ఈ విధముగా ఈ శరీరములు ఉద్భవించినపుడు ప్రకృతికి సంబంధించిన మూడుగుణములు సత్వగుణము, రజోగుణము, తమోగుణము, ఆయా శరీరముల నాశ్రయించి జీవుని నడిపించుచున్నవి. ఈ మూడు గుణములే జీవుని తనమూల స్వరూపమును అనగా ఆత్మను తెలుసుకోనివ్వకుండా సంసారమున బంధించుచున్నవి. ఈ మూడు గుణములను జయించినవాడే నిజమైన ముక్తుడు. ఏలనన ఆత్మ నిర్గుణుడు, గుణాతీతుడు. ఎటువంటి అవయములులేని నిరవయవుడు. కావున ఎవ్వడు దేహాభిమానమును విడిచి తనస్వరూపమునందే నిలిచియుండునో అతడేముక్తుడు.

మాయకు సంబంధించిన ఈ మూడు గుణములు-సత్వగుణము, రజోగుణము, తమో గుణము-అప్రత్యక్షములు-అనగా కారణ రూపమున సూక్ష్మములు, అందుచే ఇవి వాటి వాటి కార్యముల ద్వారా మాత్రమే వ్యక్తమగుచుండును.

(1)- రజోగుణము-దాని కార్యములు—

"విక్షేప శక్తీ రజసః క్రియాత్మికాయతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ,
రాగదయోఽస్యాః ప్రభవన్తి నిత్యం,దుఃఖాదయో యేమనసో వికారాః
వి.చూ. 113.

విక్షేప శక్తి రజోగుణమునకు సంబంధించిన క్రియాత్మకమగు శక్తి. దీని వలన ప్రాచీనమైన-అనాది కాల సిద్ధమైన ప్రవృత్తి విస్తృతమైనదో అది. దీని వలన రాగము మొదలగునవియు, మనస్సు యొక్క వికారము అగు ఏ దుఃఖము మొదలగునవియు కలవో అవి ఎల్లప్పుడును పుట్టుచున్నవి.

మాయయందు విక్షేపశక్తి, ఆవరణశక్తి, జ్ఞానశక్తి అను మూడు శక్తు లున్నవి. వీటిలో మొదటి రెండును బంధహేతువులు. మూడవది మోక్షహేతువు. వీటిలో విక్షేపశక్తి రజోగుణమునకు సంబంధించినది. ఇది కార్యరూపమైనది. ఈ రజోగుణము ఉద్రిక్తమైనపుడు అనేక విధములగు విక్షేపములు కలుగుచుండును. రజఃకార్యమగు ఈ విక్షేప శక్తివలన అనాదికాల సిద్ధమగు సంసార హేతువగు ప్రవృత్తి కలుగుచుండును. ప్రపంచసృష్టికిగూడ ఈ విక్షేప శక్తియే మూలకారణము. రజఃకార్యమగు ఈ విక్షేపశక్తివలన ప్రవృత్తి హేతువులగు రాగద్వేషాది దోషములు, జీవునకు నిత్యము కలుగుచుండును. వాటివలన మనస్సుయొక్క వికారము లగు, దుఃఖము, సంతోషము, కామము, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు, బుద్ధి, భయము ఇవియన్నియు మనస్సునకు సంబంధించిన ధర్మములే. గుణములే. అనగా రజోగుణమునకు సంబంధించిన కార్యములే.

కామము, క్రోధము, లోభము, దంభము, అసూయ, అహంకారము, మత్స రము మొదలగు దుర్గుణములు రజోగుణ జన్యములు. ఈ రజోగుణము వలన పురుష ప్రవృత్తి-అనగా కార్యములుచేయు ప్రవృత్తి కలుగుచుండును. అందుచే ఈ రజోగుణము జీవునకు బంధహేతువు.

విషయాభిలాష, అనగా కామము. ఆ కామమునకు అడ్డుతగిలినపుడు కలుగు కోపము అను పేరుగల మనోవృత్తి, లభించిన సంపత్తిని రక్షించుకొనవలెననెడు బుద్ధిలోభము, ధర్మాత్ముడనని పైకి ఆడంబరము చూపుట దంభము, పరుల ఔన్న త్యమును చూచి సహించలేకపోవుట అసూయ, తానే గొప్పవాడను అను అభిప్రా యము అహంకారము, పరుల గుణములనుగూడ దోషములుగ చిత్రించి వర్ణించుట ఈర్ష్య మొదలగునవన్నియు ఇహపరలోకములు రెండింటియందును భయహేతువులు అగుటచే ఘోరముగా చెప్పబడినవి. కామ క్రోధాదులు గలవాడు తన ప్రవృత్తిని విడనాడజాలడు. ఎల్లప్పుడునూ ఏదియో ఒక పని, ప్రయత్నము చేయుచునే యుండును. అందుచే ఈ కర్మలన్నియు రజోగుణ సంబంధములుగా చెప్పబడినవి. ఈ ధర్మములన్నింటిని దృష్టియందుంచుకొనియే శ్రీమద్భగవద్గీత యందు—

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
స్సంగత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః
స్మృతి భ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి"

"విషయములనుగూర్చి నిత్యమూ ఆలోచించువానికి వాటిపై ఆసక్తి ఏర్ప డును. ఆసక్తివలన కామము కలుగును. కామమువలన క్రోధము జనించును. క్రోధమువలన మోహము, మోహమువలన స్మృతిభ్రంశము, స్మృతి భ్రంశమువలన బుద్ధినాశము కలుగును. బుద్ధినశింపగా వివేకము లేక అతడే నశించును." ఈ విధ ముగా రజోగుణము జీవుని కర్మలయందు ఆసక్తుడు అగునట్లుగా చేయునని గీత యందు స్పష్టముగా చెప్పబడియున్నది. ఈ విధముగా ఎల్లప్పుడును ఏదియో ఒక కర్మ చేయుటకు కారణభూతములగు ఈ ధర్మములన్నియు రజోగుణ ప్రేరితములే. న్యాయసూత్రములుగూడ జీవుని కర్మలయందు ప్రవర్తింపజేయుటయే దోషముల లక్షణమని చెప్పుచున్నవి. ఈ దోషములు అన్నింటిని క్రమముగ ప్రయత్నించి తొలగించుకొన్నచో సుఖము కలుగును. ఈ కామాదులన్నియు ప్రవృత్తిని కలిగించి చివరకు దుఃఖమును కలిగించునవేనని గీతయందు చెప్పబడినది.

"లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ"

రజోగుణము వృద్ధిపొందినపుడు లోభము, ప్రవృత్తి, కర్మలను ఆరంభించుట, శాంతి లేకపోవుట, ఆసక్తి అనునవి జనించును".

కావున దేనివలన పురుష ప్రవృత్తి కలుగుచున్నదో, సర్వజనానుభవ సిద్ధమైన మాయాగుణముగా చెప్పబడిన రజోగుణము జీవునకు బంధహేతువు. శరీరము మరియు ఇంద్రియముల సంఘాతాధ్యాసమే బంధమును కలిగించును. అధ్యాసము లేనిచో కర్మయే వుండదు. అందుచే రజోగుణమే బంధహేతువని గ్రహింపవలెను.

(2) తమోగుణము—

సకల సంసారమునకును ఆదికారణమైనదియు, విక్షేపశక్తి విజృంభించుటకు ముఖ్యహేతువు అయినదియు అగు ఆవరణ శక్తిని పెంపొందించునటువంటిది తమోగుణము.

"ఏషావృత్తిర్నామ తమోగుణస్య శక్తిర్యయా వస్త్వవభాసతేఽన్యథా
సైషానిదానం పురుషస్య సంసృతేః విక్షేపశక్తేః ప్రసరస్యహేతుః"

వి-చూ-115

"ఏ ఆవరణశక్తిచే వస్తువు మరియొక విధముగా భాసించుచున్నదో అది తమోగుణము యొక్క ఆవృత్తి యనెడు శక్తి. ఇది పురుషునియొక్క సంసారమునకు మూలకారణము. మరియు విక్షేపశక్తియొక్క ప్రకోపమునకు ప్రముఖ కారణము."

ఏ శక్తిచే సచ్చిదానందరూపమగు వస్తువు అనగా పరమార్థము అంతఃకరణ, దేహాదిరూపమున భాసించుచున్నదో అది తమోగుణమునకు సంబంధించిన ఆవరణశక్తి. ఈశక్తి దుఃఖ, జన్మ, జరామరణాదిరూపమగు పురుషునియొక్క సంసారమునకు మూలకారణము. ఎందుచేతననగా పురుషుడు ఈశక్తిచే ప్రేరేపింపబడినవాడై, భ్రాంతిచే అనాత్మవస్తువులకు సంబంధించిన ధర్మములను ఎటువంటి సాంసారిక బంధములు లేనటువంటి ఆత్మయందు అనగా పరమార్థమునందు ఆరోపించుచున్నాడు. అందుచేత యథార్థము, సత్యము, నిత్యమూకాని వస్తువు భాసించుట యనెడి ఆకారముగల భ్రాంతికి హేతువగు ఈ తమోగుణజన్యమైన ఆవరణశక్తియే జీవునియొక్క సంసారమునకు మూలకారణము. ఈ ఆవరణ శక్తిలేకున్నచో విక్షేప

శక్తి ఏమియుచేయజాలదని బుధులచే చెప్పబడుచున్నది. అనగా అగ్రహణమేలేన ప్పుడు అన్యథాగ్రహణమునకు అవకాశము వుండదుకదా అని భావము.

అదెట్లన రజ్జుస్వరూపము ఆవరణశక్తిచే కప్పబడినపుడే దానియందు భ్రాంతిచే సర్పరూపవిశేషము తోచుచు భయమును కలిగించును గాని మరియొక విధ ముగాకాదు అని తాత్పర్యము. కావుననే జ్ఞానులయందు ఆవరణము జ్ఞానబలముచే భగ్నమైపోవుటవలన ప్రారబ్ధమునకు సంబంధించిన కర్మఫలము ఇంకను అనుభ వించవలసియున్ననూ, ఈ విక్షేపశక్తి వారికి బంధమును కలిగించలేకపోవుచున్నది. అది అనగా ఆ విక్షేపశక్తి కేవలము మూఢబుద్ధిగలవారిని మాత్రమే అనగా సమ్యక్ జ్ఞానములేనివారిని మాత్రమే అనేక దుఃఖములతో నశింపజేయుచున్నది—అందుకు ఒక ఉదాహరణ—

కబలితదిననాథేదుర్దినే సాన్ద్రమేఘైః
వ్యథయతి హిమ ఝంఝూవాయు రుగ్రోయథైతాన్,
అవిరతతమసాత్మన్యావృతే మూఢబుద్ధిం
క్షపయతి బహుదుఃఖైస్తీవ్ర విక్షేపశక్తిః వి. చూ. 145.

అనగా దట్టమైన మేఘములచే సూర్యుడు కప్పివేయబడినప్పుడు తీవ్రమైన చలితో కూడిన వాయువు ఏ విధముగా దారివెంటనడచు ప్రయాణీకులను బాధించునో అట్లే గాఢమైన తమస్సుచే అనగా అజ్ఞానాంధకారముచే ఆత్మ ఆవరింపబడగా జ్ఞానమనే ప్రకాశములేని మూఢబుద్ధిగలవారిని ఈ తీవ్రమైన విక్షేపశక్తి భ్రాంతి జన్యమైన సంసారమును కల్పించి అనేక దుఃఖములతో నశింపజేయుచున్నది. అనగా దట్టమైన మేఘమువలె గాఢమైన తమస్సుచే సూర్యస్థానీయమగు ఆత్మ పూర్తిగా కప్పివేయబడగా ఆయాత్మ కానరాక నష్టప్రాయమైయుండగా, కామక్రోధాది రూప మున పరిణమించుచున్నదియు తమోగుణమునకు సంబంధించిన ఆవరణశక్తిచే ప్రేరితమైన ప్రబలమగు విక్షేపశక్తి తామసమగు ఆవరణశక్తిచే తెలిసికొను అవ కాశమున్నను తెలిసికొనజాలని బుద్ధిగల పురుషుని జన్మ-మృత్యు-జరా రోగాది జన్యములగు అనేక దుఃఖములచే నశింపజేయుచున్నది. ఎల్లప్పుడును దుఃఖములందు మునిగియున్నవానికి ఆనంద రూపమగు స్వరూపజ్ఞానము ఎట్లు కలుగును? అది లేనిచో ఆత్మదర్శనము లేకుండుటచే ఆయాత్మ లేనిదానివలె తోచుచున్నదని భావము.

లోకమునందుగూడ ఏదైన ఒక వస్తువువిషయమున సంశయముగాని, విపర్యయ బుద్ధిగాని యెవ్వనికి వుండునో అతడే వ్యాకులము చెందిన మనస్సుకలవాడగుచుండును. నిశ్చితమగు జ్ఞానముకలవానికి అట్టివిక్షేపమే కలుగదు. కావున తమోగుణముయొక్క శక్తి వస్తువుయొక్క యథార్థస్వరూపమును కప్పివేసి, అదే వస్తువును మరియొక విధముగా తలంచునట్లుగా చేయుచు విక్షేపపమును కలిగించుట ద్వారా బంధహేతువు అగుచున్నది. వాస్తవముగా ఆవరణశక్తి, మరియు విక్షేపశక్తి రెండూ బంధహేతువులే. కాని తమోగుణ సంబంధమైన ఈ ఆవరణశక్తి రజోగుణ సంబంధమైన విక్షేపశక్తికంటె గూడ అతి ప్రబలమైనది. అందుచే ప్రజ్ఞావంతులగు పండితులుగూడ ఈ తమోగుణజనితమైన ఆవరణశక్తిచే సమ్మోహితులై బంధమును పొందుచున్నారు—

"ప్రజ్ఞావానపి పండితోపి చతురోఽప్యత్యన్త సూక్ష్మార్థ దృ
గ్వ్యాలీఢ స్తమసానవేత్తి బహుధా సంబోధితోపి స్ఫుటమ్
భ్రాన్త్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణాన్
హంతాసౌ ప్రబలాదురన్త తమసః శక్తిర్మహాత్యావృత్తిః" వి. చూ. 116.

అనగా ప్రజ్ఞకలవాడైనను, పండితుడైనను, ఎంతనేర్పు కలవాడైనను, మిక్కిలి సూక్ష్మములగు విషయములను చూడగల్గినవాడైనను మానవుడు అనేక విధములుగా బోధింపబడినవాడైనను తమోగుణముచే ఆక్రమింపబడినవాడై వస్తువుయొక్క సత్యరూపమును స్పష్టముగా తెలిసికొనజాలడు. భ్రాంతిచే ఆరోపింపబడిన దానినే సత్యమైనదానినిగా భావించుచున్నాడు. దానియొక్క గుణములను గ్రహించుచున్నాడు. దుఃఖాంతమైన తమోగుణముయొక్క ఈ ఆవృత్తి యనెడు గొప్పశక్తి చాలా బలముతో కూడియున్నది."

అవిద్యచే ఆవరింపబడినవాడు ఆత్మవిషయమున మిగుల గ్రుడ్డివాడు. అతడు ఎంతటి ప్రజ్ఞావంతుడైనను, శాస్త్రములయందు గొప్ప నేర్పుగలవాడైనను, స్వస్వరూప దృష్టి ఎక్కువగలవాడైనను, సద్గురువులచే, శ్రుతి, స్మృతియుక్తులచే అనేక ప్రకారములుగా బాగుగా ఉపదేశింపబడినవాడైనను, తత్వమును ఎఱుంగజాలడు. ఏలయన భ్రాంతుడు భ్రాంతిచే కల్పింపబడిన రజ్జువునందు సర్పమును, శుక్తియందు వెండిని యథార్థములుగా జూచులాగున అజ్ఞానావృత్తుడు భ్రాంతిచే కల్పింపబడిన జగత్తుయందు సత్యత్వమునే, ఆత్మయందు అనాత్మవస్తువునే; యథార్థములుగా భావించుచున్నాడు. ఆ యారోపితములనేసత్యములుగా స్వీకరించుచున్నాడు.

ఈ విధముగా ఎడతెగని తమోగుణముయొక్క ఆవరణశక్తి ఎంతగొప్పది? పండితులైనను ప్రపంచవిషయమున ఎంతగా వైజ్ఞానికులైనను ఆత్మవిషయమున అజ్ఞానులుగనే మిగిలిపోవుచున్నారు. వారి దృష్టియంతయు బహిర్గతమేయగు చున్నది. అందుచే ఆత్మశక్తిని పొందజాలకున్నారు. అంతర్దృష్టిని పొందజాల కున్నారు. మూర్ఛితుడు. భ్రాంతుడు, పిత్తాదిదోష దూషితుడు, వ్యాధిగ్రస్తుడు, పిశాచ గ్రస్తుడు, అంధుడు ఆయా దోషములు వున్నవారు యథార్థములను తెలియజాలరు. అదే విధముగా అజ్ఞానావస్థలో నిద్రితుడుగూడ సత్యమును తెలియజాలడు. దుష్ట మైన పర్యవసానముగల, అనగా అనర్థమునకు దారితీయునదియగు తమోగుణము యొక్క అవృతియనెడు ఈ మహాశక్తి సత్వోత్కర్షలేనిదే తొలగింపశక్యముకానిది. ఇట్లు ఇది అత్యంత మోహహేతువు అగుటచే విక్షేపశక్తికంటెగూడ ప్రబలమైనది.

ఈ తమోగుణ జనితమైన ఆవరణశక్తి స్వస్వరూపమగు బ్రహ్మవిషయ మున అసంభావనను అనగా దాని జ్ఞానము లేకుండ చేయుచున్నది. శరీరాది అనా త్మల విషయమున విపరీత ఆత్మత్వభావనను కలుగజేయుచున్నది. అటుపై శ్రుతు లును, ఆచార్యులును బోధించిన విషయములపై సంశయమును కలిగించుచున్నది. ఇంకను అనేక విధములుగా మానస విక్షేపమును కలిగించుచు పురుషుని భాసింపని స్వరూపము కలవానినిగా చేయుచున్నది.

"అభావనా వా విపరీతభావనా, సంభావనా విప్రతిపత్తిరస్యాః
సంసర్గయుక్తం న విముంచతిధ్రువం విక్షేపశక్తిఃక్షపయత్యజస్రమ్"

వి. చూ. 117.

అనగా వస్తువుయందు వస్తుశూన్యత్వారోపణ రూపమగు అభావనయు,అనగా లోపలవున్న కూటస్థునిలేదనియు, ఆ వస్తువునందు వస్త్వారోపణరూపమగు విపరీత భావనము; అనగా అనాత్మయందు, దేహాదివస్తుసముదాయమందు ఆత్మారోపణము చేయుటయు, శాస్త్రాదులయందు విప్రతిషేధము కలుగుట అనగా శాస్త్రాదులుచెప్పిన విషయములను విరుద్ధముగా తలంచుటయు అనునవి ఈ ఆవరణశక్తియొక్క గుణ ములు. ఈ ఆవరణశక్తితో సంబంధముగలవానిని, విక్షేపశక్తి విడువక ఎల్లప్పు డును నశింపజేయును. ఆవరణశక్తి విజృంభించి సత్యమగు ఆత్మ వస్తువును కప్పి వేయగా విక్షేపశక్తి వెంటనే అసద్వస్తువులయందు మోహమును కలుగజేసి సంసార మున పడద్రోయుచున్నది.

ఈ తమోగుణము కార్యరూపముననే బుద్ధిగోచరము అగుచుండును. అందుచే దీనిని కార్యములుద్వారానే గుర్తించగలము,

"అజ్ఞానమాలస్య జడత్వనిద్రాప్రమాద మూఢత్వముఖా స్తమోగుణాః,
ఏతైః ప్రయుక్తోనహివేత్తికించిన్నిద్రాళువత్ స్తమ్భవదేవ"తిష్ఠతి"
వి. చూ. 118

అనగా"తెలివిలేనితనము, సోమరితనము, జడత్వము, నిద్ర, జాగరూకత లేకుండుట, మూర్ఖత్వము, మొదలుగా గలవి ఈ తమోగుణముయొక్క కార్యములు లేక గుణములు. వీనితో కూడినవాడు సత్యమును గుర్తింపజాలడు. నిద్రించువాని వలె జడరూపమున స్తంభమును పోలియుండును. మరియు నిద్రించువానికి నిద్ర యందే ప్రీతి. నిద్రయుండిన చాలును. మిగిలిన విషయములు అంతగా అవసరము లేదు. అటులనే తమోగుణసంపన్నుడు తన మలిని సంసారమునే ప్రేమించుచుండును. ఆ సుఖమునందే ప్రీతిగలవాడగును. పేడయందలి పురుగు పేడయందేపుట్టి, అచ్చటనే సంచరించుచు, జీవించుచుండును. అట్లే సంసారియు తన నీచమైన జీవితము నందే మగ్నమైసంచరించుచుండును. జడత్వాది గుణములతో కూడుకొన్నవాడై తన స్వభావమును గురించిగాని, తన మలిన సంసారమును గురించిగాని కొంచెమైనను ఆలోచించడు. ఎన్ని బాధలు కలుగుచున్నను అన్నింటిని పశువువలె సహించుచు తన మలిన సంసారమునుండి ముక్తుడగుటకు ప్రయత్నించడు.

(3) సత్వగుణము——

సత్వ గుణము గూడ గుణమే. అందుచే ఈ గుణము గూడ జీవునకు దేహాభిమానమును కలిగించుటద్వారా బంధహేతువే ఆగుచున్నది. అయితే రజస్తమో గుణములవలె అతి ప్రబలమైన బంధహేతువుకాదు. ఏలయన దీనియందు ఆవరణ శక్తి-విక్షేపశక్తిగాక జ్ఞానశక్తి ఎక్కువగా వుండియున్నది. అయినను జీవుడు ఈ గుణమును గూడ విడువక ముక్తుడు కాజాలడు.

"సత్వం, విశుద్ధం, జలవత్తథాపి, తాభ్యాం మిలిత్వాసరణాయకల్పతే,
యత్రాత్మబింబః ప్రతిబింబితఃసన్, ప్రకాశయత్యర్క ఇవాఖిలంజడమ్"
వి. చూ. 119

అనగా ముందు రజోగుణము, మరియు దాని కార్యములు, తరువాత తమో గుణము మరియు దాని కార్యములు అనగా వాని యొక్క ప్రత్యేక స్వరూపములు, మరియు వాని ధర్మములు చెప్పబడినవి. ఇప్పుడు మిశ్రసత్వగుణ స్వభావము మరి

యు దాని ధర్మములు తెలుపబడుచున్నవి. సత్వ గుణము ప్రధానముగను, రజస్తమోగుణములు అప్రధానములుగను వున్నప్పుడు అంతఃకరణమునందు ప్రతిఫలించిన ఆత్మ అనగా జీవాత్మ-చిత్ప్రతిబింబము—సమస్త జడ పదార్ధములను మరియు వాటి వృత్తులను తెలియుచున్నది. ఆత్మచైతన్య పదార్ధము — బింబము-అదియే అంతఃకరణమున ప్రతిఫలించినప్పుడు ప్రతిబింబము అనబడుచున్నది. మిగిలిన బుధ్యాదులు జడములు. ఇట్టి మిశ్రమ - సత్వగుణముగల జీవునకు ఆత్మ విషయము స్ఫురించునని భావము.

ఇప్పుడు త్రిగుణములు మరియు వాటి మిశ్రమములను గురించి సంక్షిప్తముగా తెలియనగును. 'అంతఃకరణము త్రిగుణములతో కూడుకొని యున్నప్పుడు, ఐదు విధములగుచున్నది.

1. చిత్తము రజోగుణముతో కూడినప్పుడు — క్షిప్తమనియు,
2. చిత్తము తమోగుణముతో కూడినప్పుడు - మూఢ మనియు,
3. రజస్తమోగుణ మిశ్రసత్వ గుణముతో కూడినప్పుడు - విక్షిప్తమనియు,
4. శుద్ధ సత్వ గుణముతో కూడినప్పుడు — ఏకాగ్రమనియు,
5. ఆ సత్వగుణమును గూడ చిత్తము వదలినప్పుడు — నిరుద్ధమనియు చెప్పబడుచున్నది.

1. క్షిప్తము-దైత్యదానవులకు వుండును. అందువలన వారలు రజోగుణ ప్రేరితులై విషయాదులయందు ప్రవర్తింతురు.

2. మూఢము - పిశాచ, రాక్షసులకుండును. కావున వారు తమోగుణముచే వివేకశూన్యులై నిద్రాదులయందు వర్తింతురు.

3. విక్షిప్తము దేవతలకు వుండును.
ఆ కారణమున వారు మిశ్రసత్వగుణ ప్రభావముచే కష్టములు వచ్చినప్పుడు సుఖమును అభిలషించి దైవ ధ్యానదులయందు యత్నింతురు.

4. ఏకాగ్రము — సంప్రజ్ఞాత సమాధియందు ఆరితేరిన వారికి మాత్రమే వుండును. అందుచే వారును కేవల సత్వ గుణముచే ప్రేరితులై యమనియమాది యోగాంగముల సిద్ధియందును, ఈశ్వర ధ్యానమందును మనస్సును నిలిపి యుందురు.

5. నిర్యుద్ధము – అసంప్రజ్ఞాతి సమాధియందున్న వారికుండును. వీరున్ను సత్త్వగుణమును అధిగమించిన వారు గనుక బ్రహ్మభావమునందే లీనమై యుందురు.

ఈ విధముగా త్రిగుణ సంకలనము జీవుని బంధించి విడిపించుచున్నది.

స్వభావముచే జలము నిర్మలమైనట్లే సత్వగుణము గూడ నిర్మలమైనదేమైనను, ఆ రజస్తమో గుణములతో కలసి సంసారమునకు హేతువు అగుచున్నది. నిర్మలమగు అద్దమునందు ముఖము స్పష్టముగా ప్రతిబింబించునట్లుగా ఆత్మ శుద్ధమగు సత్వమునందు ప్రతిబింబించి, నిర్మలమగు అద్దమునందు ప్రతిబింబించిన సూర్యునివలె, సమస్తమగు అనాత్మపదార్థమును ప్రకాశింప చేయుచున్నాడు. అందుచే సత్వము జ్ఞానమును కలిగించుచున్నది. కావున ఎప్పుడు ఈ దేహమునందలి అన్ని ద్వారముల యందును (ద్వారములు పంతొమ్మిది) – ప్రకాశము అనగా జ్ఞానము వృద్ధి పొందునో అప్పుడు వానికి సత్వము వృద్ధిపొందినదని గ్రహింపనగును. స్మృతి గూడ ఈ విషయమును దృఢ పరచుచున్నది—

"సర్వద్వారేషు దేహేఽస్మిన ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత."

పాతంజలి యోగసూత్రము.

రజస్తమోగుణములు పూర్తిగా నశించక పోయినను సత్వగుణము వృద్ధిపొంది యున్నప్పుడు దాని ప్రభావము జీవునియందు స్పష్టముగా భాసించును—

"మిశ్రస్య సత్వస్య భవన్తిధర్మా, స్త్వమానితాద్యా, నియమా, యమాద్యాః,
శ్రద్ధాచ భక్తిశ్చ ముముక్షుతాచ దైవీచ సంపత్తి రసన్నివృత్తిః"

వి. చూ. 120

ఈ మిశ్రిత సత్వగుణము యొక్క ప్రభావముచే –

"అమానిత్వ మందభిత్వమహింసాక్షాంతిరార్జవమ్" అను భగవద్గీతాను సారముగా అమానిత్వాదిగుణములు ఈశ్వరుని ఆరాధించుట, వ్రతములు మొదలగునియమములు. యమనియమాధి అష్టాంగయోగాభ్యాసములు, సకలశ్రేయస్సులకును మూలకారణమగు ఆస్తిక్యబుద్ధిని కలిగించు శ్రద్ధ, భక్తి, ఈ భక్తి రెండువిధములు — పరభక్తియనియు, అపరభక్తి యనియు. అపర భక్తికేసాధన భక్తియని నామాంతరము – నారద భక్తి సూత్రములను అనుసరించి భక్తి-నవధాభక్తి-తొమ్మిది విధములు--

"శ్రవణం, కీర్తనం, విష్ణో, స్మరణం, పాదసేవనం,
అర్చనం వందనం, దాస్యం, సఖ్యమాత్మనివేదనమ్" పుట. 135

మోక్షేచ్ఛ, దైవీకసంపత్తు, అసత్పదార్థములయెడ త్యాగ భావము ఇవన్నియు మిశ్ర సత్వగుణమునకుండును. అందుచే సంసారసాగరమును దాటి మోక్షమును పొందగోరువారు ఏయే ధర్మములను ఆశ్రయించవలయునో, వానిని ముఖ్యముగా తెలిపియున్నారు. ఈ ధర్మములన్నియు భగవద్గీత యొక్క పదునారవ అధ్యాయమందు - దైవాసుర సంపద్విభాగ యోగమునందు - చాలా వివరముగా చెప్పబడి యున్నది—

"అభయం సత్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్" భ,గీ. 16/1
"అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్" 16/2
"తేజః క్షమాధృతిశ్శౌచమ ద్రోహోనాతిమానితా,
భవన్తి సంపదం దైవమభిజాతస్య భారత" 16/3

అనగా—భయములేకుండుట, అంతఃకరణశుద్ధి, జ్ఞాన యోగమునందుండుట, దానము, బాహ్యేంద్రియనిగ్రహము, జ్ఞానయజ్ఞము, ఎల్లప్పుడు వేదశాస్త్రాదుల-ఆధ్యయనము- తపస్సు అనగా మనసా, వాచా, కర్మణా, సామ్యము. ఋజుత్వము, అనగా కపటము లేకుండుట• అహింస, అనగా ఏ ప్రాణికిన్ని బాధకలుగ జేయకుండుట. సత్యము అనగా సద్వస్తువగు పరమార్థమును ఆశ్రయించుట. అనగా సత్యమునే పలుకుట, కోపము లేకుండుట, త్యాగబుద్ధి కలిగియుండుట ఎటువంటి ఆవేశములు లేక శాంతముగ వుండుట, అన్ని ప్రాణులయందు దయా భావము కలిగియుండుట, విషయములందు ఆసక్తి లేకుండుట, మృదుత్వము, ధర్మవిరుద్ధ కార్యములందు సిగ్గు, చాంచల్యము లేకుండుట, ఎల్లప్పుడు బ్రహ్మభావమును కలిగియుండుట, కష్టసహిష్ణుత, ధైర్యము బాహ్యాంభ్యంతర శుచిత్వము ద్రోహచింతనము లేకుండుట, స్వాతిశయము-గర్వము లేకుండుట ఈ గుణములన్నియు దైవీసంపత్తిగా చెప్పబడినవి.

రజస్తమో గుణములతో ఏమాత్రము సంబంధములేని సత్వగుణము జీవునకు సాక్షాత్తుగా మోక్షమునే కలుగజేయగలదని చెప్పుచూ దాని ధర్మములను వివరించుచున్నారు.

"విశుద్ధ సత్వస్య గుణాఃప్రసాదః స్వాత్మానుభూతిః పరమాప్రశాన్తిః
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠాయయా సదానన్దరసం, సమృచ్ఛతి"
వి.చూ—121

విశుద్ధమనగా ఇతర గుణములతో అనగా రజస్తమో గుణములతో కొంచము గూడ సంబంధములేని సత్వగుణము. అందుచే ఈ శుద్ధ సత్వగుణ ధర్మములు మిశ్రిత సత్వగుణముయొక్క ధర్మములకంటె భిన్నముగా వుండును. ఇట్టి శుద్ధ

సత్వగుణ ధర్మములతో సంపన్నుడైన ముముక్షువు ఎల్లప్పుడును ప్రసన్నచిత్తుడై యుండును, స్వాత్మసాక్షాత్కార జ్ఞానము కలిగియుండును. ఉపరతి జనితమైన పరమశాంతి కలిగియుండును. ఏదైన ఒక వస్తువు లభించవలయుననిగాని, లభించ లేదని ఎటువంటి విచారముగాని లేక నిత్య తృప్తుడైయుండును. పరమానంద పూర్ణుడై యుండుట, ఎల్లవేళల ఎడతెగని బ్రహ్మానంద రసమును అనుభవించుచుం డుట మొదలగునవన్నియు శుద్ధ సత్వగుణ సంపన్నుని ధర్మములుగా చెప్పనగును. ఇటువంటి అమిశ్రిత సత్వగుణ సంపన్నుడు తన మనస్సును చలింపనివ్వక "అహం బ్రహ్మాస్మి" అను తాదాత్మ్య భావమునందు లీనమైయుండును. ఆ విధముగా "నేను బ్రహ్మమును" అను బ్రహ్మాకార వృత్తితో కూడుకొనియుండును. ఇచ్చట కేవలము సత్వగుణము మాత్రమే వుండును. దానికంటె ఎక్కువస్థితి తాను ఆ సత్వగుణమును గూడ అధిగమించి బ్రహ్మముగానే యుండుట ఒక్కటే. ఇదియే అసంప్రజ్ఞాత సమాధి. ఈ సమాధియందున్న వారందరు విశుద్ధ సత్వగుణ సంపన్నులే అని తలంపవలసియుండును. అటుపైన త్రిగుణాతీతమగు ఆ పరబ్రహ్మ భావమును కలిగియుండుటకు ఈ సత్వగుణమును గూడ వదలి ఆ బ్రహ్మమే తానగును. అచ్చోట ఏ వ్యవహారమును వుండదు. అది పరిపూర్ణస్థితి. అప్పుడు ఆత్మ నిష్క్రి యము, నిరంజనము, నిత్య, శుద్ధ, బుద్ధ ముక్తము. అదియే పరిపూర్ణబోధ. ఇట్టి త్రిగుణాతీతుని గురించి భగవద్గీతయందు విశదముగా చెప్పబడియున్నది—

"ప్రకాశంచ ప్రవృత్తించ మోహామేవచపాణ్డవ
నద్వేష్టి సం ప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి
ఉదాసీన వదాసీనో గుణై ర్యో నవిచాల్యతే
గుణావర్తన్త ఇత్యేవయోఽ తిష్ఠతి నేంగతే 14/22,23

అనగా ఎవడు తన శరీరముద్వారా తనకు ప్రాప్తించిన ఈ సత్వగుణ సంబంధమగు ప్రకాశములను, సుఖమునుగాని, రజోగుణ సంబంధమగు కార్యప్రవృ త్తినిగాని, తమోగుణ సంబంధమగు మోహమునుగాని ద్వేషింపక, అవి తొలగి పోయినందున దుఃఖించక తటస్థుడై యుండునో, గుణకార్యములగు సుఖాదులచే చలింపక యుండునో, గుణములు ప్రవర్తించుచున్నవని మాత్రము తెలిసికొనుచుం డునో, ఎవడు సుఖ—దుఃఖములయందు చలింపక సమభావము కలిగియుండునో-ఆత్మభావమునందే స్థిరముగ వుండునో-మట్టిగడ్డ—రాయి, బంగారము వీనియందు సమబుద్ధి కలిగియుండునో, సర్వకార్యములందు కర్తృత్వ బుద్ధిని వదలి యుండునో, అనగా సమస్త కర్మలను త్యజించి నిరంతరము బ్రహ్మభావమునందు లీనమైయుండునో, అట్టివాడు గుణాతీతుడై మోక్షమును పొందినవాడగును"

భ. గీత. 14/22.

# స్వస్వరూపమే ప్రత్యగాత్మ,
# ప్రత్యగాత్మయే బ్రహ్మము

లోకమున ప్రతి పురుషునకు "నేను" అనువ్యవహారము అనుభవమునందు వుండియే వున్నది. ఆ వ్యవహారము వలన ఆ శబ్దమునకు అనగా "నేను" అనుశబ్దమునకు అర్థమేదియో అదియే ఆత్మ రూపమనుటలో ఎవ్వరికిని ఎట్టి సంశయము వుండదు. అందుచే "నాకు ధనము కావలయును, నాకు పశువులు కావలయును," అని సర్వ పదార్థములను తన కొఱకై అనగా తనకు ఆనందము కలిగించుటకై కోరబడుచున్నవని కూడా అందరి అనుభవమునందున్న విషయమే. ఈ అనుభవమును బట్టి చూచిన ఆత్మయే అనగా స్వస్వరూపమే అన్నింటి కంటె ఎక్కువగా ప్రేమింపబడుచున్నదనుట స్పష్టమగుచున్నది. ఎవ్వడు, ఎప్పుడు, ఏదికోరినను తనకొఱకే అనగా వాని వలన తనకుఆనందము లభించుననియే కదా! ఈ అనుభవమును దృష్టియందుంచుకొని విచారించి చూచిన ఆత్మ- అనగా స్వస్వరూపమే ముఖ్యము మరియు ఆత్మచే అనగా తనచేకోరబడు వస్తువులు అముఖ్యములు అనితెలియ వచ్చుచున్నది. ఏవస్తువు ప్రేమించబడినను దానియందు ఆనందము కలిగించు సామర్థ్యము వుండి తీరవలయుననుటయు అందరి అనుభవమునందు వున్న విషయమే. తనకు బాధను కలిగించు వస్తువులను ఎవ్వడునూ ప్రేమించలేడు గదా! కావున భార్య, పుత్రులు ధనము మొదలగు సర్వ పదార్థములు తనకు ఆనందము కలిగించుననియే ప్రేమించబడుచున్నవి. కావున తాను ప్రధానము, ఆ వస్తువులన్నియు అప్రధానములు. ఆత్మ పదార్థము అన్నింటికంటె ముఖ్యముగా ప్రేమించబడుచున్నది గాన ముఖ్యుడు. ఇట్లగుటచేత అనగా తనకు ఆనంద కరములగు అన్ని వస్తువులకంటెను ముఖ్యముగా ప్రేమింపబడుటం జేసి ఆత్మయే పరమానందమును కలిగించువాడు. అట్లేలయన-ఆనందమ ఆత్మకు స్వరూపము అనగా ఆత్మ ఆనంద స్వరూపుడు "ఆనందో బ్రహ్మ" అనియే శ్రుతులు చెప్పుచున్నవి. మన అందరి అనుభవమునుబట్టి చూచినను, ఆయాత్మ సర్వమును చూచు సాక్షిగా వున్నందువలన ఆయన ఏ కార్యమును చేయుటకు అవకాశము లేదు. అట్టి తరి ఆ యాత్మ ఆనందకరుండు కానేరడు. మనయొక్క యదార్థమైన స్వరూపము ఆనంద స్వరూపమే అయివున్నది. అట్లయివున్నను అజ్ఞానము చేత తమకు సుఖములేదని జనులు దుఃఖించుచున్నారు. ఆ అజ్ఞాన జన్యమైన దుఃఖము నుండి రక్షింపబడవలయునన్న ఆశతో తమకంటె భిన్నులని తలంచబడుచున్న ఇం

ద్రాది దేవతలున్నారనియు, వారిని పూజించిన వారు దయామయులై తమ దుఃఖము లను తొలగించుదురని జనులు యజ్ఞాదుల ద్వారా వారిని కొలుచుచున్నారు.

"యోన్యాం దేవతాముపాస్తే అనోఽవన్యోఽహమస్మీతి నస వేద"

అనగా "ఏ పురుషుడు తాను వేఱు దేవతలు వేఱు" అని తలంచి ఇతర దేవతో పాసన చేయునో వానికేమియును తెలియదు "అని శ్రుతి చెప్పుచున్నది. తత్వదర్శి యగు వేమన కూడ—

"వెన్న చేత బట్టి వివరంబు తెలియక
ఘృతము నడిగినట్టికూళభంగి
తాను దైవమయ్యు దైవాల గొలుచుటా!............అని వాపోయాడు

లోకమున ఎంత దుఃఖము వచ్చినను అది కొంతకాలము మాత్రమే వుండి పోవు చున్నది. కాని సుఖముమాత్రము అట్లుగాక సర్వకాలములయందును అనగా దుఃఖము కలుగక పూర్వము అది తొలగిపోయిన తరువాత గూడా నిత్యమై వుంటున్నది. అందరూ అట్టి సుఖమును అనుభవించుచునేయున్నారు. స్వస్వరూపము ఆనందమయ మని తెలియజాలకున్నారు.

ఆత్మ స్వతః సిద్ధము, స్వప్రకాశుడు. ఆయన కంటె ఇతరమగు పదార్థ మేదియు లేదు. సర్వదేవతలు ఆయనయే. ఇట్టి స్థితిని అనగా "తానే దేవుడు" అను యదార్థస్థితిని ఎఱుంగలేక శిలాదులచే నిర్మింపబడిన ప్రతిమలను అజ్ఞానులు పూజిం చుచున్నారు. ఆ ప్రతిమకు దేవత్వము ఎచటనుండి వచ్చెనో యెఱుంగ నేరరు. దేవత స్వతః సిద్ధరూపముతో వుండవలయునుగాని పరులచే ఉలి, సుత్తి, బాడిసె మొదలగు సాధనముల సహాయముచే నిర్మింపబడకూడదు గదా! అట్లు నిర్మింపబడి నవి సామాన్య ప్రతిమలు అగునుగాని ఇష్టార్థములను కలిగించు దైవములు ఎట్లగును? కావున అట్టి ప్రతిమలయందు దైవభావమును కలిగియుండి స్వతః సిద్ధుడగు ఆత్మను స్వస్వరూపమును మరచుట ఎంతటి అజ్ఞానము? ఆత్మ సర్వసాక్షియగుటచే మాయా కార్యములతోగాని, మాయతోగాని సంబంధపడువాడు కాడు. సాక్షికిన్ని వానిచే ప్రకాశింప జేయబడు పదార్థములకును ఎటువంటి సంబంధము కలుగనేరదు. చూచు వానికి చూడబడువానితో ఏ విధమగు సంబంధము వుండదనుట అందరికి అనుభవ సిద్ధమే. "నేను వానిని చూచుచున్నాను." అను మొదలగు వ్యవహారములందు భేద వ్యవహారమే స్పష్టముగా కానవచ్చుచున్నది గదా! ఆత్మ సర్వసాక్షియై "నేను" అని ప్రత్యక్షముగ ప్రకాశించుచున్నను. ఆయనను మరచి "ఆత్మయెచటనోవున్నాడు"

అను తలంపుతో గుహలందు తీర్థయాత్రా స్థలములయందు తిరుగాడుచూ వృథాశ్రమను పొందుచున్నారు. శాస్త్ర జ్ఞానముద్వారా ఆయనను ఎఱుంగవలయునని బహు శ్రమతో తర్క- వేదాంత శాస్త్రములను అభ్యసించుచున్నారు. స్వస్వరూపమును ఎఱుంగలేక గ్రంథములలో వెదకుట వివేకముతో కూడిన ప్రయత్నము కానేరదు.

కలయందు స్థూల దేహము వుండుటలేదను విషయము అందరి అనుభవము నందు వున్న విషయమే. ఇట్లగుటచే "ఆత్మ స్థూలమైనవాడు కాడు" అను విషయము స్పష్టమగుచునే యున్నది. కలలో ఆత్మమాత్రము వున్నాడుగాని స్థూలదేహము వుండుటలేదు. స్థూలదేహములేని కాలమునందున్న ఆత్మ స్థూలుడు ఎట్లగును? ఈ విధముగా ఆత్మకు స్వస్వరూపమునకు స్థూలత్వము లేదనుట సర్వానుభవసిద్ధమై యున్నను అజ్ఞానులు దేహాదులయందు ఆత్మాభిమానమును వదలలేకున్నారు. అటుపై "నేను స్థూలుడను" అని వ్యవహరించుచున్నారు. ఆత్మవివేకము అనగా ఆత్మకలదు అను జ్ఞానము సామాన్యముగ దొరకునదికాదు. అనేక కోట్ల జన్మల నుండియు పుణ్యకర్మలను ఆచరించుచూ వచ్చినవానికి ఒక జన్మమున చిత్తము పరి శుద్ధమగును. అట్లు పరిశుద్ధమైన అనంతరము ఆ మనస్సునకు "ఆత్మఎట్టివాడో"అని తెలుసుకొనవలయునను జిజ్ఞాస ఉదయించును. కావున ఇట్టి జ్ఞానమును ఆర్జించుట మహాత్ములకు మాత్రమే శక్యముగాని సామాన్యులకు కానేరదు" నా శరీరము, నా ఇంద్రియములును, నా బుద్ధియును, నా మనస్సును, ఇపుడు పనిచేయుచున్నవి. వీటి నన్నింటిని నేను ఇప్పుడు అనగా ఈ జాగ్రదవస్థయందు తెలుసుకొనుచున్నాను" అను మొదలగు వ్యవహారములు సర్వలోకసిద్ధములై యున్నవి. దీనిని అనుసరించి చూచిన "తాను వేఱు, ఆ మనోబుద్ధ్యాదులన్నియువేఱు" అని తెలియుచున్నది. సాక్షికిని, సాక్ష్యమునకును ఐక్యము కుదరదని అందరికీ తెలిసిన విషయమే. కావున మనస్సాక్షియై ఘటాకాశమువలె శరీరావచ్ఛిన్నుడై శరీరముచే ఆవరింపబడి వున్న చైతన్యమే, బ్రహ్మమే,ఈతడే; కూటస్థుడే, "నేను" అను పదమునకు అర్థము కాని దేహాదులు కానేరవు. కావున అదియే స్వస్వరూపము. ఇది సర్వానుభవమునందున్న విషయమేగాని క్రొత్తదేమీకాదు. స్థూలదేహాభిమానమును వదలి వివేకవంతుడైన పురుషుడు "సత్యమగు పదార్థము ఎద్ది?" అని విచారించి చూచిన వానికి "బ్రహ్మమే సత్యము, దానికంటె ఇతరమగు పదార్థమేదియునులేదు" అను నిశ్చయము కలుగును. ఇట్లు బ్రహ్మభిన్నమగు పదార్థమేదియులేకపోవుటచే అదివరకు అనగా ఇంతకు

పూర్వము అనగా అజ్ఞానదశయందు నున్నప్పుడు "నేను వేఱు, బ్రహ్మమువేఱు" అని తలంచుచున్న తలంపు భ్రాంతిజన్యమేనని వానికితోచును. ఆత్మజ్ఞానములేక అనగా స్వస్వరూపజ్ఞానములేక సంసారదుఃఖము నశింపదు. కావున బుద్ధిమంతు డగు ప్రతి పురుషుడును ఆత్మస్వరూపమును గురించి విచారించుట ఆవశ్యకము. అట్లువిచారించిచూచిన ఎడల "జీవుడు ఆ పరబ్రహ్మమునకంటె వేఱుకాదు" అను వివేకము కలుగును. దీనిచే జీవునకు "సంసారములేదు. ఇదికేవలము అజ్ఞానముచే ఏర్పడిన అసత్య పదార్థమేకాని సత్యపదార్థముకాదు" అని వివేకము కలుగును. అప్పుడు ఇట్టియథార్థజ్ఞానముచే భ్రాంతికల్పితమగు సంసారము నశించును. సంసారము నశించిన వెంటనే స్వస్వరూప సాక్షాత్కారము కలుగును.

"నేను, నీవు"అను పదములకు యథార్థమైన అర్థము ఆజీవుడే అనగా శరీరాచ్ఛాదము కలిగి బ్రహ్మచైతన్యరూపుడైన ప్రత్యగాత్మయే. జీవబ్రహ్మలు ఒకటియే గావున ప్రత్యగాత్మస్వరూపుడైన జీవుని యథార్థస్వరూపమును ఎఱింగిన సర్వమును ఎఱింగినట్లేయగును. ఈ ప్రత్యగాత్మ క్రొత్తవాడుకాదు. "నేను, నేను" అను వ్యవహారమునకు ఆధారమెవ్వడో అతడే ప్రత్యగాత్మ. సామాన్యముగా "నేను" అను పదమునకు దేహమే అర్థమని జనులు భ్రాంతినొంచున్నారు. కాని విచారించి చూచిన ఆ అర్థము సరికాదు. నాదేహము, నాఇంద్రియములు,నా బుద్ధి అను మొదలగు వ్యవహారములు తనకును దేహాదులకును భేదము కలదనుటను స్పష్టము చేయుచునే యున్నవిగదా! కావున ఈ దేహాది సర్వపదార్థములను ఎఱుంగువాడే "నేను" అను పదమునకు నిజమైన అర్థము. "విజ్ఞాన మానందం బ్రహ్మ" "బ్రహ్మము జ్ఞాన స్వరూపుడు, ఆనందరూపుడు" అను మొదలగు శ్రుతులననుసరించి బ్రహ్మమునకు జ్ఞానమేస్వరూపము అగుటచేతను, జీవబ్రహ్మలకు అనగా ప్రత్యగాత్మబ్రహ్మలకు భేదములేకపోవుటచేతను, ఆ ప్రత్యగాత్మకు జ్ఞానమేరూపమని నిర్ణయింపబడు చున్నది. మరియు జ్ఞానేంద్రియములుకాని, అంతఃకరణముగాని, వాని సహాయముచే తమ తమ వ్యాపారములను నడుపు కర్మేంద్రియములుకాని జ్ఞాన సహాయము లేక స్వకార్యములయందు ప్రవర్తింపజాలవు. జ్ఞాన సహాయములేక చెవి విననేరదు. కన్ను చూడనేరదు. మనస్సు సంకల్పింపనేరదు. బుద్ధినిశ్చయింపనేరదు. నోరు మాటలాడనేరదు. ఇట్లే యే ఇంద్రియమైనను తన కార్యమును చేయనేరదు. ప్రత్యేకముగా ఒక్కొక్క ఇంద్రియమునకు ఒక్కొక్కజ్ఞానము కలదనుటయు సరికానేరదు. అది యుక్తివిరుద్ధముగూడాను. జ్ఞానేంద్రియములు మనస్సునకును,

మనస్సు బుద్ధికిని, కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములకును, లోబడియున్నట్లు సర్వానుభవసిద్ధమే. కావున జ్ఞానము ఒకటియే అనియు ఇదియే సర్వేంద్రియముల యందును వ్యాపించి వాని వానిచే ఆయాకార్యములను చేయించుచున్నది అనియు తెలుసుకొనుట వివేకముతో కూడిన పని.

ఇట్లు సర్వేంద్రియచేష్టలకు ఆధారభూతమగు జ్ఞానము ఏదికలదో అదియే "నేను" అనుపదమునకు అర్థము. అదియే ప్రత్యగాత్మ. ఇదియునుగాక. "నాబుద్ధి నేడు జడముగనున్నది" నాచెవికి సుఖమగుగానము వినవచ్చుచున్నది" నా నేత్రమునకు చక్కనిరూపముకాన వచ్చుచున్నది. నా మనస్సునందు ఇప్పుడు బహువిధములగు సంకల్పములు కలుగుచున్నవి, ఇప్పుడు కలుగుటలేదు" అను మొదలగు వ్యవహారమువలన జ్ఞానేంద్రియములయొక్కయు, మనస్సు మొదలగు అంతఃకరణములయొక్కయు చేష్టలన్నియును తనకు—అనగా స్వస్వరూపమునకు, అనగా "నేను" అనబడు పదమునకు అర్థమగు పదార్థమునకు తెలియవచ్చుచున్నట్లు స్పష్టమగుచున్నది. కర్మేంద్రియములు స్వవ్యాపారములు జరుపుటకు ప్రాణములే ముఖ్యాధారములు అగుచున్నవి. కావున "నేను నడచుచున్నాను"నా పాదములు నొప్పిచెందుచున్నవి. నేను తాకుచున్నాను. నాచేతులు ఎదుటనున్న పదార్థమును తాకుచున్నవి" అను మొదలగు వ్యవహారములవలన ప్రాణకర్మేంద్రియ చేష్టలుగూడ స్వస్వరూపమునకు తెలియుచున్నవని స్పష్టమగుచున్నది. అందుచే వీటినన్నింటిని యే జ్ఞానము రెండవ పదార్థముయొక్క ఎటువంటిసహాయములేకయే తెలిసికొనుచున్నదో ఆజ్ఞానమే ప్రత్యగాత్మ. జ్ఞానమునకు ఇతరవిషయములను గ్రహించుటలో సాధనాంతర సహాయము అక్కరలేదనుట నిర్వివాదాంశమే. జ్ఞానమునకు గూడ సాధనాంతర సహాయము వలయునన్నచో బహుదోషములు వచ్చును. అదెట్లనిన-"సాధనాంతరమును అంగీకరించుట" అనునది ఒక పనియేకదా! కావున దానిని గ్రహించుటకై మరియొక జ్ఞానము కావలసివచ్చును. దానికిని సాధనాంతర సహాయము అవుసరమగునుగాన దానిని గ్రహించుటకు మరియొక జ్ఞానము, దానిని గ్రహించుటకు మరియొక జ్ఞానము, ఈ విధముగా లెక్కకు అందని జ్ఞానములను అంగీకరింపవలసియుండును. దీనిని అనవస్థా దోషము అందురు. అంతియేగాక "ఇతర పదార్థములను తెలిసికొనుట" అనుకార్యమును సాధించుటకై జ్ఞానమునకు ఇతర సాధనములు కావలసివచ్చును." ఇతర సాధనములను అంగీకరించుట" అనునదియు జ్ఞానమును గూర్చియేగావున ఆజ్ఞానములరాశిని సాధించుటకు గూడ మరికొన్ని

సాధనములు కావలసియుండును" అని అనవలసివచ్చును. ఇట్లు చూచిన మరియొక అనవస్థవచ్చితీరును. "సాక్షి అక్కరలేదు" అనుటకు ఒక కార్యమునకు సాధనము కావలయునేగాని రెండవదానికి అక్కరలేదు; అనుటకును కుదరదుగదా! కావున జ్ఞాన స్వరూపుడైన ఈ ప్రత్యగాత్మ సర్వవిషయములను సాధనాంతర సహాయము లేకుండగనే స్వయముగానే తెలుసుకొనుచున్నాడు. ఈ వ్యవహారమంతయు సామాన్యులకు సహితము తెలిసినదే. అందువలన "నేను" అనుపదమువకు అర్థమగు పదార్థమే స్వస్వరూపమని ఊహింపనివారలు లేక తదనుగుణముగా వ్యవహరింపని వారలు వుండరు. కావున ప్రత్యగాత్మ అనగా స్వస్వరూపమేగాని వేఱుగాదు "నేను" అనబడే జ్ఞానమే ప్రత్యగాత్మ.

విచారించి చూచిన ఈదృశ్యమానమగు ప్రపంచమంతయు లేనిదే; అసత్యమే. సుషుప్తి అవస్థయందు మనస్సు మొదలగు సర్వ పదార్థములును, ప్రాణములందు లయమై పోయినపుడు, ఈ ప్రపంచముకానవచ్చుటలేదు. జాగ్రదవస్థయందు మాత్రము అనగా మనస్సు మొదలగునవి తమ ఇంద్రియములతో కూడి పనిచేయు కాలము నందు మాత్రము ఈ ప్రపంచము నానావిధ రూపములతో ప్రత్యక్షమగుచున్నది. అందుచే ఈ ప్రపంచము మనో బుధ్యాదులను ఆశ్రయించి ఉన్నదియే. అనగా ఆ మనోబుధ్యాదులే చైతన్య రూపమున తమయందు వ్యాపించియున్న బ్రహ్మప్రకాశము నందే బహువిధ భావముల-వృక్షభావము, పశుభావము, మనుష్యభావము, మొదలగు వానిని ఆరోపించుచున్నవి. ఈ కారణము వలననే మనోబుధ్యాదుల లయకాలమగు సుషుప్తి అవస్థయందు ప్రపంచము ఎవ్వరికినీ తోచుటలేదు. ఇది సర్వానుభవసిద్ధమగు విషయమే. ఇట్లగుటచేత ప్రపంచమునకు జ్ఞానభిన్నమగు స్వరూపమే లేదు. కావున ఈ ప్రపంచము యొక్క ఉనికి జ్ఞానముయొక్క ఉనికిని ఆశ్రయించివున్నదియే. కావున జ్ఞానరూపుడని చెప్పబడుచున్న ప్రత్యగాత్మయే ప్రపంచమునకు సత్తను, ఉనికిని, కలిగించుచున్నాడు. ఈ విధముగా స్వభావముచే అసత్యమే అయినను ఈ ప్రపంచము ఎవ్వని అనుగ్రహమువలన సత్యముగా తోచుచున్నదో అతడే ప్రత్యగాత్మ. ఇట్లగుటచేతనే ప్రపంచమునకు "భ్రాంతికల్పితము" అనియు "అజ్ఞాన జన్యము" అనియు పేర్లు కలుగుచున్నవి. ఇదియునుగాక ఎవ్వని ప్రకాశమును ఆశ్రయించి సూర్య చంద్రాగ్నులు ప్రకాశించుచున్నారో అతడే ప్రత్యగాత్మ.

ఈ సూర్య చంద్రాగ్నులు సర్వప్రపంచమును ప్రకాశింపజేయుచున్నను ఆత్మ సర్వమునకు సాక్షిరూపమున వెలుగుచునే యున్నాడుగదా! అందుచే బాగుగా విచా

రించిన ఏ జ్ఞానము సర్వేంద్రియముల మూలమున వ్యాపించి సర్వపదార్థములను ప్రకాశింప జేయుచున్నదో ఆ జ్ఞానమే సూర్యాది రూపముగ గూడ నిలిచి అనగా సూర్యాదుల రూపమున గూడ వ్యాపించి సర్వప్రపంచమును ప్రకాశింపజేయు చున్నది. ఈ విషయముగూడా అందరి అనుభవమునందు వున్నదియే. సూర్యాదుల యందున్న తేజస్సు జ్ఞానప్రకాశముకంటె భిన్నముగకానవచ్చుచున్నను ఈసందర్భమునజూపిన యుక్తిననుసరించి "మనోబుధ్యాదులు తమయందు వ్యాపించి యున్నఆత్మ ప్రకాశము నందే-జ్ఞాన చైతన్యమునందే-సర్వభావములను ఆరోపించుచున్నవి." అనుయుక్తిని అను సరించి సర్వ పదార్థములును బ్రహ్మమే కావున అదియు — ఆ సూర్యాదుల యందు భాసించుచున్నతేజస్సును ఆ బ్రహ్మమునకంటె భిన్నము కానేరదుగదా!

లోకమున యథార్ద విషయములను చెప్పునవి ప్రమాణములనియు, అట్లు చేయజాలనివి అప్రమాణములనియు చెప్పబడుచున్నవి. ఇట్లే యథార్ద విషయములను ఉన్నవి ఉన్నట్లుగ్రహించునవి ప్రమాణములనియు, అట్లుగాక విపరీతముగా గ్రహించునవి అప్రమాణములనియు తెలియబడుచున్నవి. ఈ రెండు వ్యవహారములును యథార్ధ, అయదార్థ వస్తువిశ్లేషణాజ్ఞానములేకుండిన అనగా, "ఇవి యదార్థములు ఇవి యథార్థములు కావు.'' అని ఆత్మకు తెలియకుండిన సంభవింపనేరవు. "ఇవి యదార్థములు''అను జ్ఞానములేక ఈ విషయములను గురించి చెప్పు గ్రంథములు, ఈ విషయములను గ్రహించు ఇంద్రియములు ప్రమాణములు" అను వ్యవహారము జరుగనేరదుగదా! "ఇది యదార్థముకాదు." అను జ్ఞానము లేకుండిన ఈవిషయమును చెప్పుగ్రంథము దీనిని గ్రహించు ఇంద్రియములు లేక చూపు-దృష్టి-ప్రమాణముగాదు.'' అను వ్యవహారముకూడా కలుగనేరదు. ఈకారణము వలన సర్వజ్ఞుడగు జ్ఞానరూపుడే వేదశాస్త్రాదులకును, జ్ఞానేంద్రియములకును ప్రామాణ్యమును కలిగించువాడగుచున్నాడు. ఆయన జ్ఞానస్వరూపుడై సర్వమునుఎఱుంగువాడుగావున ప్రామాణ్యసాధకములగు యథార్థ విషయములను, వాటికి విరుద్ధమగు అయదార్ధవిషయములును గూడ మొదట ఆయనకు గోచరములై యే యుండవలయును. కావు ఏ జ్ఞాన స్వరూపుని వలన ఈవిధముగా యథార్థవస్తువులను గ్రహించగల్గు ప్రకటించగల్గు వేదశాస్త్రాదులకు ప్రామాణ్యము కలుగుచున్నదో అతడే ప్రత్యగాత్మ. చైతన్యవంతమైన ప్రతిపురుషునకును జ్ఞానేంద్రియములకు శబ్దాది విషయములు గోచరమైనప్పుడు బుద్ధియందు జనించు సంకల్పములు గోచరములు అగుచునే యున్నవి. ఆహ్లాదకరము అగు గానము వినవచ్చినప్పుడు "నాకు చక్కని గానమ

వినవచ్చుచున్నది. నా బుద్ధియందు గానమును వినుటయందు ఉత్సాహము కలుగు చున్నది." అని తెలియుచునేయున్నది. ఈవిధముగానే ఏవస్తువులు, వాటి రూపములు ఇంద్రియములకు గోచరములైనను అప్పుడు జనించు చిత్తవృత్తులు ఆత్మకు; అజ్ఞానరూపునకు గోచరములగుచునేయున్నవి. అందుచే ఈవిధముగా ఎవడు సర్వమునకు సాక్షియై, సర్వమును గ్రహించుచున్నాడో అతడే ప్రత్యగాత్మ. ఇట్లు అతడు సర్వమును తెలుసుకొని సాక్షిరూపుడగుట చేతనే అతనికి దృశ్యములగు ఇంద్రియములకు సంబంధించిన ఎటువంటి వికారములు కలుగ నేరవు. ఆకారణముచేత దేహేంద్రియాదులకు గల బాధలు ఆయనకు లేవు. మనో బుద్ధులయందు గానవచ్చు ప్రకాశప్రవృత్తి, మోహాదులు ఆతనికి కలుగనేరవు. ఈ కారణమువలననే ఆ సర్వసాక్షిని ఈ దృశ్యపదార్థములు ప్రకాశింపజేయనేరకున్నవి. కావున ఆయన వున్నాడని కాని లేడనికాని చెప్పుటకు వీలులేదు. ఇంద్రియగోచరములగు పదార్థములను గురించియేకదా మనము "కలవు, లేవు" అని వ్యవహరించ కలుగుట. అందుచేత అట్టివాడు అనగా ఇంద్రియములద్వారా తెలియబడని ప్రత్యగాత్మను గురించి ఏమి చెప్పుటకును వీలులేదు. "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ" అనగా వాక్కులు సర్వేంద్రియములను గ్రహింపవలయును. కాని వాక్కు మనస్సుతో కూడ ఏ పదార్థమును పొందలేక తిరిగి వచ్చునో ఆపదార్థమే పరబ్రహ్మము అని పై శ్రుతి ఈ విషయమును స్పష్టముచేయుచున్నది.

పురుషుల యొక్క బుధ్యాదులు అచేతనములు అనగా జడపదార్థములు, అనగా స్వయం ప్రకాశము లేనివి. అందుచే జ్ఞాన ప్రకాశములేక స్వయముగా ప్రకాశింపజాలవు. వీనికి గూడ జ్ఞానశక్తి - స్వయం ప్రకాశకశక్తి - కలదనిని అనేక జ్ఞానములను అంగీకరింప వలసి వచ్చును. అప్పుడు అనవస్థా దోషము కలుగును. కావున ఆ విధముగా అంగీకరించుట సాధ్యము కాదను విషయము ఇంతకు పూర్వము ›లుపబడియే యున్నది. అందుచే ఆ బుధ్యాదులు ఎవని అనుగ్రహము వలన అనగా ›వ్వని జ్ఞాన ప్రకాశము వలన అనగా యే జ్ఞానరూపుడగు మహాత్ముడు తమయందు వ్యాపించి యుండుట వలన చేతన పదార్థములవలె వ్యవహరించ కలుగుచున్నవో ఆ జ్ఞాన పురుషుడే ప్రత్యగాత్మ, అతడు సర్వమునకు సాక్షి యగుటచేత పంచకోశముల కంటె లోపల అనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ మరియు ఆనందమయ కోశములకంటె లోపల అనగా "నేతినేతి, నఇతి, నఇతి" ఇది బ్రహ్మముకాదు, ఇదిబ్రహ్మముకాదు "అని కోశములన్నింటిని విశేష

ముగా నిషేధింపగా మిగులువాడై యున్నాడు. సర్వమునకంటె వేఱై యున్నాడు. సర్వముతానై యున్నవాడు. అతడే నీవు. ఆ నీవే ప్రత్యగాత్మవు.

అదెట్లన-బుద్ధియు, మనస్సును ఇంద్రియములును ఇవి అన్నియు సుషుప్తియందు తమ తమ కారణముల యందు లయమునొందుటయు, జాగ్రదవస్థయందు మరల ప్రకటితమగుటయు అందరికీ అనుభవ సిద్ధమే. అంతేగాక జాగ్రదవస్థయందు గూడ రజోగుణము ప్రకోపించి యున్నప్పుడు ఆ ఇంద్రియములు విశేషముగా ప్రవర్తించుటయు, అనగా వృత్తి రూపములుగ వ్యాపించుటయు, అట్లే సత్వగుణము వ్యాప్తియందున్నప్పుడు విమర్శనా పూర్వకముగా అనగా తెలివిగా ప్రవర్తించుటయు, తమోగుణము సత్వ, రజములకంటె ఎక్కువగా వ్యాపించి యున్నప్పుడు ఆ ఇంద్రియయములన్నియు ఏమియు చేయక శిలాప్రాయముగ అణగియుండుటయు అందరి అనుభవమునందున్న విషయమే. ఇట్టి స్థితులే అవిర్భావ తిరోభావము లనబడుచున్నవి. ఆవిర్భావమనగా ఉత్పత్తి లేక ప్రకాశము, తిరోభావమనగా నాశము, లయము లేక అప్రకాశము. ఈ ఆవిర్భావ తిరోభావములు ఆత్మకు గోచరమగుచున్నట్లు తెలియుట అందరికి తెలిసిన విషయమే. సుషుప్తి అవస్థయందు సహితము మనో బుద్ధ్యాదులు లయము నొందినను, "ఇప్పుడేమియు లేదు, అనగా నాకు ఇప్పుడు ఏమియు తెలియుటలేదు." అను జ్ఞానము అనగా సర్వ శూన్య ప్రత్యయము కలదు. ఆత్మ అప్పుడు లేకుండిన ఇట్టి జ్ఞానము అనగా "ఏమియు లేదు"అను జ్ఞానము కలుగుటకే వీలులేదు గదా! "నేను సుఖముగ నిద్రించితిని, ఆనిద్రయందు నాకేమియు తెలియలేదు" అను వ్యవహారము అనగా అజ్ఞానమే అనగా 'ఏమియులేదు" అని ఆలేమిని తెలుసు కొన్న జ్ఞానము వున్నదనుటను, సుషుప్తియందు అట్టి జ్ఞానము కలదనుటను స్పష్టముగా చెప్పుచున్నది. కావున ఎన్ని విధములుగా చూచినను ఆత్మ చైతన్యము సుషుప్తియందు గూడ "కలదు" అనుట ఒప్పుకొనక తప్పదు.

పై వ్యవహారము ననుసరించి చూచిన "సుషుప్తి అవస్థయందు ఏమియు లేదు" అనియే కదా అర్థమగుచున్నది. అప్పుడు ఆత్మ మాత్రము వున్నదనుట ధ్రువ పడుట లేదు కదా! "యని సంశయము తొలగకున్నదన్నచో–" ఆ సుషుప్తి అవస్థయందు "ఏమియులేదు" అనిన సుషుప్తి అవస్థయందు సర్వ పదార్థములును శూన్యములగుట అనగా లేకుండ వుండుట నాకు తెలియును" అనియే కదా అర్థము. అట్లు ఆ వ్యవహారమునందలి అర్థమును బాగుగా విమర్శించిన "అచ్చట దృశ్యములగు కల్పిత పదార్థములులేవు" అని నిషేధము ఏర్పడుచున్నదియేగాని "ద్రష్ట

లేదు'' అను నిషేధము ఏర్పడుట లేదు. కావున సుషుప్తి అవస్థయందు "ఆత్మ చైతన్యము వున్నది'' అనుటలో సంశయమించుకంతయైననులేదు. ఇట్లు మనో బుధ్యాదుల విలయ స్థానమగు సుషుప్తి అవస్థయందు ఆత్మ వుండుటయు స్వతంత్రముగనే సర్వాభావమును ప్రకాశింప జేయుచుండుటయు సిద్ధాంతమైన ఎడల ఆ ఆత్మయే సర్వావస్థలయందును సాధనాంతర సహాయముతో పనిలేక స్వతంత్రముగనే సర్వపదార్థములను రజస్సత్వ తమోగుణ వికారములను ప్రకాశింప జేయుచు ఉన్నాడని నిర్వివాదముగా సిద్ధాంతము చేయవచ్చును.

ఈ విధముగా సర్వసాక్షియై, సర్వానుభవసిద్ధుడైవున్న తత్వమే ప్రత్యగాత్మ; మరియు పైసిద్ధాంతమును అనుసరించి చూచిన ఒక దినమున మూడు అవస్థలయందును సాక్షియైయున్నవాడు, సర్వదినములయందును, పక్షములయందును, మాసములయందును, సంవత్సరములయందును, అవస్థాత్రయసాక్షియై వుండునని సిద్ధాంతము చేయవచ్చును. మరియు వర్తమాన మాసాదులయందువలెనే భవిష్యన్మాసాదులయందును, భూత మాసాదులయందుగూడ ఒక్కడే సర్వసాక్షియైయున్నాడని అనవచ్చును. ఇందు సంశమేమియులేదు. కావున ఈ విధముగా ఈ మహాత్ముడు సర్వకాలములయందును ఎకరూపుడై, సర్వసాక్షియైయున్నాడు. అతడే ప్రత్యగాత్మ. అతడే నీవు.

ఈ సిద్ధాంతమును అనుసరించి చూచిన ఆత్మనిర్వికారుడనియు. నిత్య, శుద్ధ, ముక్త స్వభావుడనియు తెలియుచున్నది. ఇట్టివాడు "నేను'' అను పదమునకు అర్థమగుటకు వీలులేదు—ఏలయన శబ్దముచే చెప్పదగినవాడు "వాగగోచరుడు'' ఎట్లగును? అప్పుడు అనగా వాక్కునకు గోచరుడయ్యేనేని ఆయన సవికారుడు కావలసివచ్చును. ఒకదానికి లోబడుట అనునదియు వికారమేగదా! కావున "ఇది ఎట్లు కుదురును ?'' అన్నచో "నేను'' అను పదమునకు 'బహ్మము' అర్థము. ఆ మాట లోకమును అనుసరించి బాగుగా పరిశీలించి చూచిన "నేను'' వ్యవహారముచే ఏ తత్వమును గుర్తింపవలయునో అతడే బ్రహ్మము''అని చెప్పుటయేగాని "బ్రహ్మమును 'అహం' శబ్దముచే చెప్పవచ్చునా?'' అని కాని 'అహం' అనునది బ్రహ్మమునకు 'పేరు'' అనికాని చెప్పుటలేదు. వాస్తవస్థితి ఎట్లున్నదన -పంచభూతమువలన జనించునదియే అగుటచేత ఈ అహంకారముగూడ జడమే. స్వయముగా ప్రకాశించు సామర్థ్యమే లేనిదగుటచే ఇతర పదార్థములను ప్రకాశింపజేయునదికాదు. ఈ కారణము వలననే ఆ యహంకారము స్వయముగా దేనిని తెలుసుకొనజాలదు. భ్రాంతి

కము అగుటచేత అది సత్యంబునుకాదు. అయినను సర్వేంద్రియములకంటె ఆత్మకు సమీపమున వుండునదగుటచే ఆ యాత్మధర్మములనన్నింటిని అనగా చేతనత్వము. పరులను ప్రకాశింపజేయుట, నిత్యత్వము, మొదలగువానిని తనయందు ఆరోపించుకొనుచున్నది. అనగా భ్రాంతిచే జనులు "అహంకారమే ఆత్మ"యని భ్రాంతిజెందుచున్నారు. ఈ కారణమువలననే ఆ యహంకారము నిత్యశుద్ధుడగు ఆత్మను ఆవరించుచున్నది. అనగా జనులు దూరదృష్టిలేక అహంకారమునేగాని ఆత్మను ఎఱుంగలేకున్నారు. ఇంతియేగాని "బ్రహ్మము అహంశబ్దవాచ్యుండు"అనుటయు "సవికారుడు" అనుటయు సరికానేరదు.

ఈ విధముగా వర్ణింపబడిన అహంకారముచే ఆవరింపబడి ఎవ్వడు పామరులచే ఎఱుంగబడకున్నాడో అతడే ప్రత్యగాత్మ. అదియే స్వస్వరూపము. సూర్యుడు మేఘములచే కప్పబడినప్పుడు జనులు ఆ మేఘావరణమువలన తమ కన్నులు ఆ సూర్యుని చూడలేకున్నవని తలంచుటకు బదులుగా సూర్యునికే ప్రకాశములేదని భ్రాంతిజెందుచున్నారు. అట్లే భ్రాంతులు అహంకారము ఆత్మను ఆవరించి యున్నప్పుడు అహంకారమువలన తమదృష్టి ఆత్మను ఎఱుంగలేకున్నదని తలంచుటకు బదులుగా ఆత్మకే ప్రకాశము లేదని, పున్న ప్రకాశమంతయు అహంకారముదేనని తప్పుగా భావించుచున్నారు. ఈ విధముగా అహంకారావరణమువలన ఎవ్వనిని అజ్ఞులు ఎఱుంగలేకున్నారో అనగా అహంకారమునే ఆత్మగా భావించుచూ ఎవ్వనిని మరచియున్నారో అతడే ఆత్మ ఆతడే ప్రత్యగాత్మ.

ఈ ప్రత్యగాత్మయొక్క స్వరూపస్వభావములను తెలుసుకొనుట అంతకష్టమైనపని ఏమీకాదు. లోకమున ప్రకాశమనునది అంతయు ఆత్మప్రకాశమే. అదెట్లన కలయందు అనేక వస్తువులను ప్రతి పురుషుడునూ చూచుచునే యున్నాడు. వానిని ఏ ప్రకాశముయొక్క సహాయముతో చూచుచున్నాడో కొంత విచారింతము. జాగ్రదవస్థయందు మనము చూచు సర్వపదార్థములను సూర్యప్రకాశ సహాయముచేగాని, చంద్రప్రకాశ సహాయముచేగాని, నక్షత్ర ప్రకాశసహాయముచేగాని, లేక దీప ప్రకాశసహాయముచేగాని చూచుచున్నామనికదా మన అందరి అభిప్రాయము. కలయందలి పదార్థములను దేని సహాయముతో చూచుచున్నాము? అప్పుడు అనగా ఆ స్వప్న ప్రపంచమునందు సూర్యాదులుగాని, వాని సహాయముచే పదార్థములను ప్రకాశింపజేయగల నేత్రాదులుగాని లేవుకదా? ఇంద్రియములన్నియు స్వప్నావస్థయందు

తమకు కారణమైన అజ్ఞానమునందు లీనమగుచుండును. కావున అప్పటి స్థితిని గురించి విచారించిన అప్పుడు ఆత్మప్రకాశమునకంటె ఇతరమగు ప్రకాశమే కాన రాదు. కావున అప్పటి వస్తువులను ప్రకాశింపజేయునది ఆత్మప్రకాశమే అనకతప్పదు. ఈ విధముగా స్వప్నప్రపంచమును ప్రకాశింపజేయునది ఆత్మప్రకాశమే అయివుండ జాగ్రద్ ప్రపంచమును ప్రకాశింపజేయునది మాత్రము సూర్యాగ్న్యాది ప్రకాశము ఏల కావలయును ? అందుచే సర్వప్రపంచమును ప్రకాశింపజేయునది ఈ ఆత్మ ప్రకాశమే. సుషుప్తి అవస్థయందలి సర్వాభావమును, స్వప్నావస్థయందలి సర్వప్రపంచమును ప్రకాశింపజేయునది ఆత్మప్రకాశమే అగుచుండ ఒక్క జాగ్రద ప్రపంచమును మాత్రము అది ప్రకాశింప జేయలేదనుట యుక్తివిరుద్ధము అగుచున్నది. కావున ఆ ప్రత్యగాత్మయే సర్వమును ప్రకాశింపజేయుచున్నాడు. రెండవదాని సహాయముతో నిమిత్తములేకుండ స్వతంత్రముగా ప్రకాశించుచున్నాడు. జ్ఞానస్వరూపుని ప్రకాశింప జేయు మరియొక జ్ఞానముండుటకు వీలులేదని ఇంతకు పూర్వమేచెప్పబడియున్నది. ఈ అనుభవమును అనగా స్వప్నావస్థయందలి అనుభవమునుబట్టి ప్రత్యగాత్మను జ్ఞానరూపునిగా, సర్వప్రకాశరూపునిగా, జ్యోతి స్వరూపునిగా గుర్తించుట చాలా సులభము.

బాగుగా విచారించి చూచిన ఉపాధులు వున్నను, లేకున్నను ప్రత్యగాత్మ స్వయంప్రకాశకుడే. స్వప్నావస్థయందలి అనుభవమును దృష్టియందుంచుకొని ఆత్మను గ్రహించుట యెట్లనిన—స్వప్నావస్థయందు సర్వేంద్రియములును బుద్ధియందు లీనములగుచుండును. ఆ బుద్ధిమాత్రము తనయందు వ్యాపించియున్న బ్రహ్మప్రకాశ సహాయముచే ఆ అవస్థయందలి కల్పిత పదార్థములను చూచుచుండును. కావున అప్పుడు ఆత్మకు జాగ్రదవస్థయందువలె అనేక ఉపాధులు అనగా ఇంద్రియములు, స్థూలశరీరాదులు, నేత్రములు మొదలగునవి వుండవు. బుద్ధి ఉపాధి ఒక్కటిమాత్రమే వుండును. కావున అధికారులగు ముముక్షువులకు కొంత వివేకముతో విమర్శించి చూచిన ఆ అవస్థయందు ఆత్మను గుర్తించుట సులభసాధ్యము. సుషుప్తి అవస్థయందు ఆత్మకు ఈ బుద్ధి ఉపాధిగూడ వుండదు. కాని విషయ గ్రహణము లేక తదభావగ్రహణము మాత్రము వుండుటవలన అప్పటి స్థితిని అనుభవమునకు తెచ్చుకొనుట మిగుల కష్టసాధ్యము.

స్వప్నావస్థయందు ఆత్మకు బుద్ధి ఒక్కటియే ఉపాధి. ఆ బుద్ధికి స్వయముగా జ్ఞానశక్తి లేదు. ఆత్మయొక్క జ్ఞానశక్తి తనయందు వ్యాపించి వుండుటచే ఆ

బుద్ధి సర్వవిషయములను ప్రకాశింపజేయుచున్నది. ఈ కారణమువలన ఆ బుద్ధిని వివేకముచే వేరుచేసి చూచిన ఆత్మఒక్కటే మిగులును. ఎప్పటికిని ఆయన ఏకరూపుడు నిర్వికారుడు అగుటచే పరిశుద్ధుడు, జ్ఞానమాత్ర స్వరూపుడు అయివున్నాడు. ఉపాధియగు ఈ బుద్ధియు ఆయన ప్రకాశమునందు ప్రకాశింపబడుచున్నదియేగాని స్వతంత్రముగా ప్రకాశించునది మాత్రముకాదు. ఉదాహరణమునకు-లోకమున ఒక పురుషుడు ఏదియో పదార్థమును ఒకదానిని భక్షించుచుండిన అ పదార్థమునుండి అందు మిశ్రితమైయున్న తీపిని వేఱుచేయుటకు, అనగా పదార్థమును వేఱుగాను, తీపిని వేఱుగాను హస్తాదులచే వేఱుచేయుటకు వీలుకాదు. అయినను వివేకదృష్టిచే ఆ భక్ష్య పదార్థమునందలి తీపి మాత్రమే చక్కెర అనియు, మిగిలినది అనగా ఇతరమైనదంతయు పిండిపదార్థమనియు తెలియనివారుండరు.

పైదృష్టాంతమునందలి అనుభవముచే కార్యముచే గాకపోయినను వివేకదృష్టిచే ప్రత్యగాత్మను బుద్ధినుండి విభాగింపవచ్చును. ఆత్మయొక్క స్వరూపము జ్ఞానమే అగుటచేత ఆ స్వప్నావస్థయందలి పదార్థములను గ్రహించుట లేక పదార్థస్ఫురణము మాత్రము ఆత్మదేఅనియు, దానిచే ప్రకాశింపచేయబడుచూ వ్యక్తిరూపమున సంచరించునది బుద్ధియనియు సులభముగా నిర్ణయింపవచ్చును. ఈ విధముగా స్వప్నావస్థయందు విషయగ్రహణమువుండియు, ఇంద్రియాది సంక్షోభములేక కేవలము బుద్ధి ఒక్కటియే ఆత్మకు ఉపాధిగావుండుటవలన సులభముగా ఆత్మను వివేకబలంతో వేఱుగా గుర్తించవచ్చును. జ్ఞానమాత్ర స్వరూపుడే ఆత్మ.

మరియొక అనుభవముద్వారాగూడ ఈ ప్రత్యగాత్మను గుర్తించుట సులభమే. ఈ బుద్ధి ఉపాధికిని, అందుగానవచ్చు స్ఫురణమునకును సంబంధము కొంచముగూడ లేదనుట నిర్వివాదాంశము. స్వప్నావస్థయందుగూడ విషయములున్నవి. ఆ విషయములన్నియు శుద్ధకల్పితములేకావచ్చును. కావున వానిని ఆ కల్పితవిషయములను గ్రహించుటకై బుద్ధి వుండవలయునుగదా! ఈ కారణమువలన ఆ యవస్థను మాత్రము ఆధారముగ జేసుకొని చూచిన బుద్ధ్యాత్మలకు భేదము కలదని ఎఱుంగుట కొంత అసాధ్యమేఅయినను, సుషుప్తి అవస్థ ఈ విషయమున మిక్కిలి సహాయకారిగా తోచుచున్నది. ఈ అవస్థయందు సర్వేంద్రియములును, బుద్ధియుగూడ ప్రాణములందు లయమునొందుచున్నవి. అప్పడు విషయములను కల్పించు బుద్ధిలేక సర్వవిషయాభావము ఒక్కటియే మిగిలియుండును. విషయములు మాత్రము ఏమియూలేవు. అయినను నిద్రనుండి మేల్కాంచిన పిదప "నేను సుఖముగ నిద్రిం

చితిని, అప్పుడు ఇతరములు ఏవియు నాకు తెలియలేదు" అను వ్యవహారమును అనుసరించిచూచిన "ఆ అవస్థయందలి విషయాభావము నాకు తెలియును" అని అర్థము ఏర్పడుచున్నది. కావున అప్పుడు ఆత్మమాత్రమువుండి అప్పటి విషయాభావమును గ్రహించుచునేయున్నదని చెప్పవీలగుచున్నది. అనుభవములేక స్మృతి అనగా "నేను అప్పుడు ఏ విధముగ వుంటిని" అనుజ్ఞానముయొక్క అనుభవము లేకుండ ఇట్టి స్థితి కలుగనేరదుగదా! ఈ కారణమువలన అప్పుడు జ్ఞానమాత్రరూపుడగు ఆత్మ ఆ సుషుప్తికి సాక్షియైవున్నాడనియు, ఆయనకు ఆ స్థితియందు ఉపాధి యేదియులేదనియు, తెలియవచ్చుచున్నది. బుద్ధి జాగ్రదవస్థయందు అనగా మెలకువ వచ్చునప్పుడు మాత్రమే వృత్తిరూపముతో వెలుపలకు వచ్చునుగాని, గాఢనిద్రయందు అట్లురాకుండుట అందరకూ తెలిసిన విషయమే. అంతేగాక ఆ అవస్థయందు ఇంద్రియాదులు కలవనుటకు కూడ అవకాశములేదు. ఈ విధముగా ఉపాధికంటె భిన్నుడై జ్ఞానాందరూపముతో ఆత్మ సుషుప్తియందు ప్రకాశించుచున్నాడు. "నేను సుఖముగ నిద్రించితిని" అను వ్యవహారముచే ఎఱుంగబడిన సుషుప్తి అవస్థయందలి సుఖము ఆత్మకు స్వస్వరూపభూతమైన ఆనందమేగాని అన్యముకాదు. అనగా విషయ సంబంధమైన ఆనందముకాదు. విషయములులేన్ని ఆనందము. ఏ విషయమైనను స్వరూపభూతానందము తనయందు ప్రతిబింబించి యుండుటచేతనే మనకు సుఖదాయకము అగుచున్నది. ఈ అవస్థయందు విషయములు బొత్తుగాలేవు. విషయములు వుండివుండినచో ఆయానందము విషయముల వలనకలిగెనా లేక అది ఆత్మస్వరూపమా? అను సంశయమునకు అవకాశము వుండెడిదిగాని ఇప్పుడు అట్టి సంశయమునకుగూడ అవకాశములేదు. కావున ఆత్మ సుషుప్తియందు స్వస్వరూపభూతమగు ఆనందముతోడను, జ్ఞానముతోడను అనగా జ్ఞానానందరూపుడై, ఉపాధి శూన్యస్థితితో ప్రకాశించుచున్నాడు. ఈ అనుభవమువలన ఉపాధికిని, ఆత్మకును సంబంధము ఏదియులేదని రుజువగుచున్నది. ఒకప్పుడు లేని సంబంధము మరియొకప్పుడు కలుగనేరదుగదా! కావున ఆత్మను బుద్ధి ఉపాధినుండి వేఱుచేసి చూచుట అసాధ్యముకాదు.

అందుచేత ప్రత్యగాత్మను సర్వోపాధివినిర్ముక్తుడగు పరబ్రహ్మముగా ఎఱుంగుము. పైన చెప్పబడిన విధముగా ప్రత్మగాత్మ జ్ఞానమాత్రరూపుడై, సుషుప్తి అవస్థకు సాక్షియై సర్వమునకును ద్రష్టయే కావున దేని వికారముతోను సంబంధములేనివాడై ఒకదినము నందువలెనే భూత భవిష్యత్‌వర్తమాన దివసమాస సంవత్సరాదులయందు అనగా సర్వకాలములయందును. ఎఱుంగువాడు కావున

నిత్యుడై గుణాదులులేనివాడగుటచే నిర్విశేషుడై—గుణము, పని రూపము, అను మూడింటిలో ఏదియైన ఒకటి వున్నచో దానిని బట్టి ఒక వస్తువునకు మరియొక వస్తువుతో భేధము చెప్పవచ్చును. "ఇది ఇట్టిది" అని నిర్ణయింపవచ్చును. ఇదియే విశేషము అనబడును. ఆ విధముగా ఏ విశేషము లేనివాడు నిర్విశేషుడు అనగా "ఈతడు ఇట్టివాడు" అని నిర్ణయించుటకు శక్యముకానివాడుగా ఉన్నాడో ఆతనినే స్వస్వరూపముగా నిర్ణయించుకొనుము. "ఆ ప్రత్యగాత్మయే నేను" అని నీ అభిప్రాయమును దృఢముగావించుకొనుము. అప్పుడు నీకు "ఈదేహమే నేను" అను భావము కూడ తొలగిపోవును.

అందుచేత ఏ పురుషుడు ఆ ప్రత్యగాత్మను స్వస్వరూపముగా ఎఱుంగలేక దేహాత్మాభిమానమును—అనగా దేహామేనేను అనుభావమును కలిగియుండునో ఆతడు పశువుతో సమానుడు. "దేహం పశ్యతీతి పశుః" అనగా ఎవ్వడు "దేహమే నేను" అని తలంచుచున్నాడో వాడు పశువుకాని మానవుడు పశువుకాదు. ఆతనికి బుద్ధియున్నది; సత్యాసత్యములను తెలుసుకొనగల అనగా నిత్యానిత్యవస్తు వివేకము ఉన్నది. అట్టి వివేకముతో విచారించి చూచిన మాంసము, ఎముకలు, క్రొవ్వు, మలమూత్రములు, మొదలగు కశ్మలమునకు నిలయమగు ఈదేహము తానుకాదు. అనగా ఈ దేహము ఆత్మకాదు అని బోధపడును. ఏలయిన—ఆత్మనిర్మలుడు. ఈ దేహము మాయావికారము, జడము అగుటచే ఇతర పదార్థముచే ప్రకాశింపబడునది అనగా స్వయంప్రకాశంకాదు. ఆత్మయోనిర్వికారుడు. స్వయంప్రకాశకుడు, సర్వమునకును సాక్షి యగుటచే సర్వమునకంటె భిన్నుడు, అధికుడు, మహిమాన్వితుడు మరియు మనోవికారములకు ఆశ్రయమగుటచే ఈదేహము సంక్షోభయుక్తము అనగా సుఖ దుఃఖములకు నిలయము. కాని ఆత్మయో పరమశాంత స్వభావుడు. ఈదేహము జ్ఞానశూన్యమైనది. ఆత్మ జ్ఞానమే రూపముగా గలవాడు, జ్ఞానరూపుడు, దేహము దుఃఖస్వరూపము, ఆత్మ ఆనందస్వరూపుడు. ఈ విధముగా సంపూర్ణములగు విరుద్ధ లక్షణములు కలిగి యున్నను దేహమును ఆత్మగా భావించుటకు, మూలకారణము అజ్ఞానమే. ఆఅజ్ఞానమే మొదట మాయాకార్యములగుదేహో పాధులను ఆశ్రయించి ఆత్మకు భేదమును కలిగించుచున్నది. దానివలన పురుషుడు ముందుగా భేదదృష్టికి వశుడై క్రమక్రమముగా ఉపాధినుండి ఆత్మను వేఱుచేయలేక ఆదేహమునే ఆత్మగా అభిమానించుచున్నాడు. ఈ విధముగా ఈ అవివేకము వలననే ప్రతివాడును ఏకస్వరూపుడగు ఆత్మను అనేకముగాను, దేహభిన్నుడగువానిని, దేహమాత్రుని

గాను, తలంచుచున్నాడు. అదెట్లన-పది ఘటములయందు వ్యాపించియున్న గాలిని ఏకస్వరూపము గలదానినిగా ఎఱుంగలేక "ఈ కుండయందలిగాలి కంటె ఆకుండ యందలిగాలి వేరు "అని వ్యవహరించిన అది ప్రమాణ సిద్ధమగునా? అట్లే సర్వ వ్యాపకుడగు ఆత్మ అన్ని దేహములయందును ఏకరూపమున వ్యాపించియుండగా "ఈదేహమునందలి ఆత్మకంటె ఆదేహమునందున్న ఆత్మవేరు" అని వ్యవహరించుట ఏ విధముగాను ప్రామాణికము కానేరదు.

"అస్తి, భాతి, ప్రియం, రూపం, నామచేత్యంశ పంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం, జగద్రూపంతతో ద్వయం" మ.వా.ద.

అనగా లోకమున కలిమి, ప్రకాశము, ఆనందము, రూపము, నామము అను ఐదు పదార్థములు మాత్రమే అందరి అనుభవమునందు వున్నవి. ఇందు మొదటి మూడును, పరబ్రహ్మముయొక్క రూపములు. అందుచే అనగా బ్రహ్మసంబంధముచే ప్రపంచమునకు ఆ మొదటి మూడు రూపములుగూడ స్వాభావికములు అయినట్లుగా తోచుచున్నవి. ఈ ప్రమాణమును అనుసరించి నామరూపాత్మకమగు ప్రపంచము భ్రాంతిచే యే అధిష్ఠానమునందు ఆరోపించబడుచున్నదో అదియే, ఆ అధిష్ఠానమే, పరబ్రహ్మము.

ఆకాశమునందు కల్పింపబడు నగరముతో ఆ యాకాశమునకు ఎటువంటి సంబంధము కలుగనట్లు భ్రాంతి కల్పితము అగుటచే ఈ ప్రపంచముతో ఆత్మకు ఎటువంటి సంబంధంబును కలుగనేరదు. మరియు సర్వాధిష్ఠానము అగుటచేతను, సర్వసాక్షియగుట చేతను ఆయన, ఆయాత్మ, అతి ప్రసిద్ధుడై యున్నాడు. సర్వ వ్యాపకుడును అయివున్నాడు. దృశ్యమానమంతయు భ్రాంతికల్పితమేగాన ఆ బ్రహ్మమునకును, నీకును అనగా ప్రత్యగాత్మకును భేదము కొంచమైనను లేదు. ఇదియే సత్యము.

"అంతఃపూర్ణం బహిఃపూర్ణం స్వయ మద్వయ మక్రియం, యదనంతం పరంజ్యోతి బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్" అనగా ఏ బ్రహ్మము లోపల వెలుపల అను భేదములేక అంతటను నిండి, స్వతంత్రముగా, అద్వితీయమై, సాధ్యసాధనాది భేదములు అసత్యములు, కల్పితములు గావున, ఎటువంటి కర్మలు చేయక, నిర్వికారమై సర్వోత్తమమగు జ్ఞానమే స్వరూపముగా గలదియై, శాశ్వతమై యున్నదో అట్టి బ్రహ్మమే నీవు. అట్లే-

"యద్గ్రాహ్యగ్రాహకాధీనాం, భాసకం, తద్విలక్షణం, భామాత్రం, పరితంః

పూర్ణం బ్రహ్మ, తత్త్వమసి ధ్రువమ్" అనగా ఏ పరబ్రహ్మము ప్రకాశమే స్వరూపముగా గలదియో, "వీడు గ్రహించువాడు, ఇది గ్రహించబడునది" అను మొదలగు భేదములతోవున్న సర్వ పదార్థములను ప్రత్యేకముగా ప్రకాశింపజేయుచు ద్రష్ట యగుటచే వానికంటె వేరై, ఎటువంటి సాధన సముచ్చయముతో పనిలేక, జ్ఞాన మాత్ర రూపుడై సర్వ వ్యాపకుడై యున్నాడో ఆ బ్రహ్మమే నీవు. ఆ బ్రహ్మ స్వరూపమే నీ స్వరూపము". ఆ సర్వ వ్యాపకుడై యున్న బ్రహ్మ స్వరూపమే, అనగా నీయొక్క స్వరూపమే సర్వ ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నది.

"సకృద్విభాతం పురతస్సర్వస్మాత్తు విభాతియత్, యద్భావమనుభాతీతం బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్" అనగా ఏ పదార్థము సర్వసాక్షి యగుటచే సర్వమున కంటె మిన్నయై జాగ్రద్ స్వప్న సుషుప్తి అవస్థలయందు ఏకరూపముతో ప్రకాశించుచున్నాడో, ఒక్కొక్క అవస్థయందు మాత్రమే తనకంటె అన్యముగా వున్నట్లు తోచు ఈ ప్రపంచమంతయు సర్వవ్యాపకమగు దేని ప్రకాశమును ఆశ్రయించి ప్రకాశించుచున్నదో అదియే పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమే నీవు. అనగా ప్రత్యగాత్మ-జీవుడు. ఇందు సందేహమేమియు లేదు. "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం, నిరంజనం, శుద్ధం, విజ్ఞానమానందం, బ్రహ్మ, తత్త్వమసి ధ్రువమ్" అనగా-ఆ పరబ్రహ్మము సర్వసాక్షి యగుటచే "ఇది ప్రకాశము" అను జ్ఞానమునకు గూడ సాక్షియే. అందుచే బాగుగా విచారించి చూచిన ప్రకాశ ధర్మముగూడ ఆయనయందు లేదు. అద్వితీయు డగుటచే ఆ బ్రహ్మము ఏమియు అనగా ఎటువంటి కర్మలు చేయువాడు కాడు. ఒక కర్మను ఆచరింపవలయునన్నచో, తనకంటె భిన్నమగు ఒక కర్మయు, దానిని చేయుటకు; ఉపయోగపడు ఒక సాధనంబును, ఆ కర్మచే లభించు ఫలంబును, వుండవలయును. అద్వితీయు డగువానికి ఇట్టి భేదములు కలుగనేరవుగదా! అంతేగాక అద్వితీయుడు దేనితోను సంబంధించువాడు కాదు. అందుచే ఎటువంటి సుఖ దుఃఖములను పొందజాలడు. "ఇది నాది" అను మొదలగు అభిమానము వలననేగదా బహు విధములగు సుఖ దుఃఖములు కలుగుచుండుట. ఇదియునుగాక ఆ బ్రహ్మమునందు ఎటువంటి వికారములు కలుగనేరవు. ఏలయన-సాక్షికి సాక్ష్యముతో ఎటువంటి సంబంధము వుండనేరదుకదా! స్వయముగనే విజ్ఞానరూపుడు అగుటచే ఆయనకు ప్రపంచ ప్రకాశనార్థమై ఎటువంటి సాధనములు అక్కరలేదు. ఈ విధముగా సర్వ స్వతంత్రుడై, నిర్వికారుడై, పరమానంద రూపుడై యున్న ఆ పరబ్రహ్మమే ప్రత్యగాత్మ. ఆ ప్రత్యగాత్మయే నీవు.

ఆ బ్రహ్మము ప్రకాశరూపుడై యున్నందువలన జాగ్రత్ స్వప్నముల యందలి కార్యరూప ప్రపంచమును, అనగా అజ్ఞాన కల్పితములై బహు విధము లుగా కానవచ్చు సర్వ పదార్థములను, సుషుప్తి అవస్థయందలి కారణ అనగా సూక్ష్మ అనగా ఆ అవస్థయందు సర్వేంద్రియములును లయింపగా సర్వకారణమై మిగిలి యున్న అజ్ఞానమును లేక జాగ్రదాది సర్వ ప్రపంచమును స్వతంత్రమై ఎయ్యది ప్రకాశింప జేయుచున్నదో అదియే బ్రహ్మము. మనమందరమూ "నేను నేను" అని వ్యవహరించునది ఆ పదార్థమునే, కావున ఆ పదార్థమే ఆత్మ.

కలగాంచువాడు ఆ సమయమున అతనికి తోచు శరీరమునందు ఆత్మబుద్ధి కలవాడై వుండుననుట సర్వానుభవ సిద్ధమైన విషయము. ఆ కల యందలి శరీరము ను - వాస్తవమున ఆ శరీరము శుద్ధ కల్పితమై, అసత్యమైయున్నను, నిద్రా దోషము వలన అది సత్యమే అను భ్రాంతి కలుగుచున్నది. ఆ విధముగనే జాగ్రద వస్థయందును, వాస్తవమున ఈ స్థూల దేహము సత్యము, నిత్యము కాకపోయినను దీనిని చూచువాడు అగుటచే ఆత్మ ఈ దేహములకంటె భిన్నుడు కావలయుననుట స్పష్టమగుచున్నను, మాయా ప్రభావముచే అనగా అజ్ఞాన దోషముచే దేహాత్మ భ్రాంతి కలుగుచున్నది. వాస్తవ స్థితిని విచారించి చూచిన పంచభూతాత్మకమైన ఈ స్థూలదేహము నీ యొక్క స్వస్వరూపము కానేరదు. ఏకాగ్రచిత్తముతో స్వస్వరూప మును గూర్చి విచారించి చూడుము. అప్పుడు నిర్వికారుడును, సర్వమయుడును, నాశ రహితుడును, ఆనంద రూపుడును అగు ఆ పరబ్రహ్మమే నీకు స్వరూప భూతుడు అగును. సర్వావస్థలయందును, నీవు ఆయనకంటె భిన్నుడవు కానేరవు.

అందుచే కనబడినట్లుగా కనబడి తొలగిపోవు దేహము కంటెను, ఆత్మ ప్రతి బింబము అగుటచే నాశ శూన్యుడగు జీవునికంటెను, ఈ ప్రత్యగాత్మ భిన్నుడు; జ్ఞాన రూపుడు అగుటచేతను ఎండమావుల యందలి నీటివలే భ్రాంతి కల్పిత మగు ప్రపంచమునకు జ్ఞానాతిరిక్తమగు స్వరూపము లేక పోవుటచేతను, సర్వ పదార్థములు ఈ కూటస్థునియందే - ప్రత్యగాత్మయందే - ఆరోపింపబడుచున్నవ నుట సత్యమని ఇంతకు పూర్వమే చెప్పబడియున్నది. అందుచే ఎవ్వడు క్షరాక్షర రూపమగు ఈ సర్వ ప్రపంచము తోచుటకు కారణభూతుడయ్యెను, సర్వవికార సాక్షియై, నిర్వికారుడై యున్నాడో అట్టి ప్రత్యగాత్మయే నీవు. అతనికిని బ్రహ్మ మునకును ఇంచుకయైనను భేదము లేదు. కావున ఆ బ్రహ్మమే నీవు.

"అంతర్బహిశ్చైకరసో, నిరంతో, వ్యోమేవ పూర్ణం నిరుపాధిరేకః
నిరంతరానంద ఘనోఽద్వితీయం త్వం ప్రత్యగాత్మాసి సదాశివోసి" మ.వా.ద.

అనగా సర్వవ్యాపకమయ్యును ఆకాశము ఎట్లు తనయందు వ్యాపించి యున్న పదార్థములతో సంబంధములేక, ఏకరూపమై, సర్వభేదరహితమై వున్నదో అంత టను అనగా లోపల వెలుపల అనుభేదములేక, దేశకాల భేదము లేక వ్యాపించి ఆద్యంతములు లేనిదై యున్నదో, అట్లే ఈ ప్రత్యగాత్మయు, అన్నింట వ్యాపించి, వానితో సంబంధింపక వాని వికారములచే తాను వికారములు చెందక ఏకరసమై యున్నాడు. సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనివాడై, ఆనంద రూపుడై యున్నాడు. అట్టి ప్రత్యగాత్మయే నీవు, ఆతనికిని బ్రహ్మమునకును ఎటువంటి భేద ములేక పోవుటచే ఆ పరబ్రహ్మమే నీవు.

"త్వందృశ్యభిన్నోపి, దృశిస్వరూప శ్శశ్వత్ప్రతీతో అప్యవబోధమాత్రః, సదేకరూపో అప్యహమాది ముక్తి స్త్వం ప్రత్యగాత్మాసి సదాశివోసి" అనగా నీవు ప్రత్యగాత్మవు, సర్వసాక్షివి అగుటచే దృశ్యములగు సర్వపదార్థములకంటె వేరై యున్నావు, ఇట్లుండియును, "ఇతడు సర్వసాక్షి" అను వ్యవహారమునకు లక్ష్య భూతుడవై దృక్ రూపముతో వున్నావు. "ఇది దృశ్యము" అనునప్పుడు దృశ్య మునకంటె ఇతరమగు పదార్థము ఒకటున్నది" అని నిర్ణయింపబడుచున్నట్లుగా "ఇతడు సాక్షి" అనునప్పుడు గూడ "ఈ సాక్షికంటె భిన్నమగు పదార్థము ఒకటి కలదు" అని నిర్ణయింపవలసివచ్చునుగదా! అప్పుడు సాక్షియు దృశ్యమే కావలసి వచ్చును. అయినను నీవు సాక్షిరూపుడవు అగుటచే జ్ఞానమాత్ర స్వరూపుడవు. ఇట్లయ్యును బాగుగా అఖండముగా ప్రకాశించుచున్నావు. ఇదియును అసంభవమే. జ్ఞానమును ఎఱుంగగల మరియొక జ్ఞానము ఎట్లును వీలులేదు. కావున జ్ఞాన స్వరూపుడగువాడు ఎట్లును తెలియరాకూడదు. అజ్ఞానము వానిని ఎఱుంగ జాలదు. రెండవ జ్ఞానమేదియు వుండుటకు వీలులేదు. కావున ఆతనిని ఎఱుంగ గలవారలే వుండజాలరుగదా! ఇదియునుంగాక ఉనికియే స్వరూపముగా గలవాడవగుటచే నీ కంటె భిన్నమగు పదార్థమే వుండుటకు వీలులేకపోయినను, నీవు మాత్రము అహం కారాది సంబంధ వర్జితుడవై వున్నావు. ఇది మాత్రము ఎట్లుచెల్లును? రెండవ పదార్థ మువుండినగదా "సంబంధము కలదు, లేదు" అను వ్యవహారముకలుగనేర్చును? కావున అవి అన్నియుగూడ ప్రపంచాదులవలె అజ్ఞాన కల్పితములే. నీవు మాత్రము ఎప్పటికిని స్వప్రకాశుడవే. ఆ మాయ భేదమును నీయందే కల్పించి "ఇదిదృశ్యము" అని తలచునట్లుగా చేసిన విధముననే "ఇతడుసాక్షి" అని తలంచునట్లుగా చేయు,

చున్నది. వాస్తవస్థితిలో దృశ్యముకూడ నీకంటె అన్యముకాదుగావున "ఇది దృశ్యము" అను తలంపు గూడ సరియైనది, సత్యమైనది కానేరదు.

ఏకరూపుడవు అగుటచే పైన చెప్పబడిన రెండు విషయములందును అనగా దృశ్యమునుగాని దృక్కునుగాని చూచుసందర్భమునందు ద్రష్టవునీవే. మరియొక విశేషమేమన- భేదముండిననేగాని సాక్షిత్వము సంభవింపనేరదు. కావున భేదము వలె ఆ సాక్షిత్వముగూడ కల్పితమే; అసత్యమే. ఈ కారణము వలన "దృశ్యభిన్నత్వము, దృగ్రూపత్వము" అని రెండునూ కలిగియున్నను విరోధమేమియులేదు. మరియు నీకంటె భిన్నుడగు దృష్టలేడు. కావున స్వయముగనే ప్రకాశించుచుందువు. అందుచే "నేను బ్రహ్మను తెలుసుకొంటిని" అను అనుభవముగూడ సత్యము కానేరదు. బుద్ధికి సాక్షియగువాడు ఆ బుద్ధికేగోచరుడగుననుట అసంభావ్యము, సత్యవిరుద్ధము. నేత్రముచేచూడబడునది ఆ నేత్రమును చూడ జాలదుగదా! "యది మన్యసే సువేదేతిదభ్రమేవాపిసూనం." "నేను పరబ్రహ్మమును బాగుగా తెలుసు కొంటిని అనితలంచితివేని నీవెఱింగినది అత్యల్పమగును" అను ప్రమాణ వాక్యముచే శ్రుతి ఈ విషయమునే స్పష్టముచేసియున్నది. కావున నీవు ఎంతబాగుగా ప్రకాశించినను, బ్రహ్మము ప్రకాశించుచున్నది. నేను దానిని తెలుసుకొనుచున్నాను." అని తలంచుట భ్రాంతి మాత్రమే.

ఈ కారణము వలన పలుమార్లు ప్రకాశించుటకును, జ్ఞాన రూపుడగుటకును, విరోధమేమియులేదు. ఇదియునుంగాక సత్తాస్వరూపుడవు అగుటచే నీవు అద్వితీయుడవు. నీవు తప్ప రెండవ పదార్థమేలేదు. కావున అహంకారాదులుగాని, వానిచే కలుగు బంధమోక్షములుగాని చూచుట అనగా "వున్నవి"అని తలంచుట భ్రాంతియే. అందుచేత సద్రూపత్వము వున్నను, అహంకారాది బంధరాహిత్యము కలుగవచ్చును. కావున సర్వధర్మములును మాయా కల్పితములే అగుటచే నీ స్వరూపము అజ్ఞానులచే ఏ విధముగా అనుభవింపబడు చున్నను ఎటువంటి విరోధము కలుగ నేరదు.

కావున ఇట్టి నిర్వికారుడవగునీవే ప్రత్యగాత్మవు. ఆ ప్రత్యగాత్మకును బ్రహ్మమునకును ఎటువంటి భేదమూలేదు. కావుననీవే బ్రహ్మవు. ఇది సత్యము. ఇంచుకయైనను సంశయములేదు. సర్వమునందును వ్యాపించియున్న చైతన్యమే, జ్ఞానమే, ప్రకాశమే బ్రహ్మము. సర్వప్రాణులయందును వ్యాపించియున్న చైతన్యమే, జ్ఞానమే, ప్రకాశమే, ప్రత్యగాత్మ. అట్లే, ఒక్కొక్క ప్రాణియందు వ్యాపించియున్న చైతన్యమే, జ్ఞానమే, ప్రకాశమే జీవుడు. కావున ఆ మహాచైతన్యమే నీవు. అదియే నీ స్వరూపము. అదియే బ్రహ్మము.

—o—

# ఆత్మ, పరమాత్మల స్వరూప స్వభావములు

"ఆత్మ, ప్రత్యగాత్మ, పరమాత్మ," అనుమూడు శబ్దములు కలవు. విచారించి చూచిన ఈ మూడు శబ్దములకు అర్థము ఒక్కటియే. ఆత్మయనగా ఒక పురుషుని యందున్న బ్రహ్మచైతన్యము, అనగా బ్రహ్మప్రకాశము. "ప్రత్యగాత్మ" అనగా అన్ని ప్రాణులయందు వ్యాపించి వాటినన్నింటిని చైతన్యవంతము చేయుచున్న బ్రహ్మచైతన్యము. పరమాత్మ అనగా శుద్ధ బ్రహ్మచైతన్యమే. బ్రహ్మప్రకాశమే. సర్వమునందును వ్యాపించియున్న అనగా వెలుపల లోపల అను భేదములేకయున్న పరమచైతన్యము, సర్వమును ప్రకాశింపజేయుచున్న పరంజ్యోతి. ఇలా ఆ పరమ తత్త్వమును తెలుపు శబ్దములు అనేకములున్నను దానిని తెలుసుకొనుట అనగా అను భవమునందు కలిగియుండుట కొంచము కష్టసాధ్యమే. కారణమేమన ఇది అనగా ఈ బ్రహ్మపదార్థము స్థూలమైనదికాదు. సూక్ష్మాతిసూక్ష్మమైనది. ఆకాశము వంటిది. వాక్కునకుగాని, నేత్రములకుగాని తెలియబడునదికాదు. అయినను నిర్మలమగు బుద్ధిచే, మనస్సుచే అనగా అంతఃకరణముయొక్క సహాయముతో అనుభవింపబడు చున్నది. ఇచ్చట నిర్మలమగుబుద్ధి అనగా ప్రాపంచిక వాసనలులేని అంతఃకరణము అని అర్థము. మన అంతఃకరణములన్నియు యుగయుగాలుగా, జన్మజన్మలుగా ప్రాపంచిక వాసనలతో మలినమైయుండును. అనగా ఈ దృశ్యమానమగుచున్న కల్పిత ప్రపంచమే సత్యము అను భావముతో కూడియుండును. శాస్త్రాధ్యయనము, గురూపదేశము, నిరంతర మననదిధ్యాసములచే ప్రయత్నశీలురగు మహాత్ములు తమతమ చిత్తములను వాసనారహితముగ అనగా నిర్మలముచేసుకొనిన పిదప ఈ ఆత్మను, పరమాత్మను తమ బుద్ధియందు పొందుచున్నారు.

ఈ పరమాత్మ "అహం" అను మానసికవృత్తికి ఆశ్రయభూతుడు అనగా "అహం" అను వృత్తిద్వారా, అనగా అహంకారము అనుకార్యముద్వారా "నేను, నేను" అని అనబడుచూ తెలియబడుచున్నాడు. ప్రతిపురుషుడును నిత్యము. "నేను" అను పదమును తనకొఱకు వాడుచునేయున్నాడు. ఆ "నేను" అను శబ్దరూపముః ఎవ్వడు, ఏ పదార్థము, ప్రకటింపబడుచున్నదో ఆ పదార్థమే ఆత్మ. అదియే ప్రత్య గాత్మ, అదియే పరమాత్మ.

మనస్సు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, ప్రాణాదులయందును, స్థూలశరీరము నందును, తనయందు ఆ బ్రహ్మచైతన్యము ప్రతి బింబించగా ఏర్పడిన ప్రకాశ

ముతో చైతన్యవంతమైన జీవునితోగూడ తాదాత్మ్యమును జెంది "నేను, నేను" అని అంటున్నది. అనగా ఆత్మానాత్మ పదార్థములయొక్క వివేకములేని అంతఃకరణము- (అంతఃకరణము అనగా మనస్సు, బుద్ధి చిత్తము, అహంకారము) ఆత్మయొక్క ప్రతిబింబమును గ్రహించి దానిద్వారా ఆబ్రహ్మచైతన్యమును పొంది బ్రహ్మమువలె చైతన్యవంతమై సర్వేంద్రియములతో కూడియున్న స్థూలశరీరముతో తాదాత్మ్యమును జెంది "నేను" అని అంటున్నది. ఈ విధముగా ఈ "నేను" శబ్దముద్వారా ప్రకటితమగుచున్నది ఆ ఆత్మయే, అనగా ఆ పరమాత్మయే. ఆ విధముగా ఆ ఆత్మ చైతన్యము అంతఃకరణమునకు వశమైయుండుటజేసి "నేనునేను" అనుచున్న ఆ అంతఃకరణ ధర్మములను తనపై ఆరోపించుకొని "నేను అంధుడను" "నేను పుట్టుచున్నాను నేను మరణించుచున్నాను" మొదలగు విధముగా వ్యవహరించుచుండును. సుషుప్తి కాలమునందు ఆత్మప్రకాశము అంతఃకరణమునందు ప్రతిబింబించ నందున మనస్సు చైతన్యవంతమై విషయములను కల్పించుటలేదు. అందుచే ఆ సుషుప్తి యందు "నేను" అను చైతన్యమునకు స్థూలశరీరముతో సంబంధములేకపోవుటచే ఆ నేనుకు అంతకు పూర్వము జాగ్రదవస్థలో కలిగిన "నేను అంధుడను" అను మొదలగు అనుభవము వుండుటలేదు. అట్లే స్వప్నకాలమునందుగూడ అంతఃకరణమునందు ఆత్మచైతన్యము ప్రతిబింబించినను, ఆయవస్థయందు బాహ్యేంద్రియములు మరియు స్థూలశరీరమునందుగూడ ఆ అంతఃకరణము అనగా "నేను" వుండుటలేదు. అందుచేవాటి జ్ఞానము అనగా ఆ బాహ్యేంద్రియముల మరియు స్థూలశరీరము యొక్క జ్ఞానము అప్పుడు "నేను" కు వుండుటలేదు. అందువలన అంధత్వాది వ్యవహారము ఈ స్వప్నావస్థయందు గూడ ఆ "నేను"కు వుండుటలేదు. అందుచే తేలిన సారాంశమేమన ఆత్మయొక్క బాహ్య వ్యాపారమంతయు అంతఃకరణముపై ఆధారపడి కలుగుచున్నదియే. అందువలన అంతఃకరణమే అహంకారమనియు, అదియే సర్వమునకు కర్తయనియు బోధపడుచున్నది. కర్తయగుట వలన ఆ అంతఃకరణమే తాను చేయు కర్మలయొక్క ఫలములకు భోక్తయగుచున్నది. ఆ విధముగా కర్తృత్వ భోక్తృత్వాది అభిమానముకలదియై ఎడతెగని సుఖదుఃఖములను అనుభవించు చున్నది. ఈ విధముగా నేత్రములు మొదలగు ఇంద్రియముల యందును ఆ ఇంద్రియములతో కూడియున్న శరీరమునందును తాదాత్మ్యమును బొంది అభిమానముతో ప్రవర్తించుచున్న చిత్ ప్రతిబింబ విశిష్టమైన అంతఃకరణమే అనగా అహంకారమే "నేను" అను పదమునకు అర్థమగుచున్నది. ఇదియే అనగా ఈ

స్థూలదేహాభిమానము కలిగియున్న అంతఃకరణమే కర్తృత్వ భోక్తృత్వాభిమానము కలదిగా అగుచున్నది.

ఈ అంతఃకరణము సత్వరజస్తమో గుణరూపమగు ప్రకృతి యొక్క కార్యము అగుటచే ఆ గుణ సంబంధముచే జాగ్రద్ స్వప్న సుషుప్తి రూపములగు మూడు అవస్థలను పొందుచున్నది. రజోగుణ సంబంధముచే జాగ్రదవస్థను, సత్వ గుణసంబంధముచే స్వప్నావస్థను, తమోగుణ సంబంధముచే సుషుప్తి అవస్థను పొందుచున్నది. అవస్థా భేదముచేత ఈ అంతఃకరణమునకు కార్యభేదము గూడ కలుగుచున్నది. స్థూలదేహాభిమానము కారణముగ సుఖ దుఃఖములు గూడ ఈ అంతఃకరణమునకే కలుగుచున్నవి.

అవస్థాభేదమును అనుసరించి విషయములు అనుకూలముగ ఉన్నప్పుడు సుఖ వంతుడనని, ప్రతి కూలముగ వున్నప్పుడు దుఃఖవంతుడననియు, ఈ అంతఃకరణ రూపుడగు అహంకారి తలంచుచున్నాడు. ఈ విధముగా విచారించి చూచిన సుఖ దుఃఖములు రెండును అంతఃకరణ ధర్మములగుటంజేసి "ఆనందో బ్రహ్మ" "విజ్ఞాన మానందం బ్రహ్మ" మొదలగు శ్రుతుల వలన ఆత్మ ఆనంద స్వరూపు డనియు ఈ అంతఃకరణ ధర్మములగు సుఖదుఃఖములు ఆ ఆత్మకు సంబంధించినవి కావనియు స్పష్టమగుచున్నది.

అంతేగాక గుణత్రయ సంబంధముచే జాగ్రద్ స్వప్న సుషుప్త్యాది అంతః కరణ అవస్థలకు ఈ ఆత్మ సాక్షాత్ ద్రష్టయై వుంటున్నాడు. * ఇదే ప్రకారముగ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, మరియు ఆనందమయ మన ఐదు పంచకోశముల కంటె వేఱుగ నున్నవాడు, ఎల్లప్పుడును ఎట్టి వికారములును లేక భూత భవిష్యత్ వర్తమానములందు ఒకే రూపమున వుండువాడు, అతడే ఆత్మ.

ఆత్మ అవస్థాత్రయసాక్షి, జ్ఞాన స్వరూపుడు. అట్టి జ్ఞాన స్వరూపుడగు ఆత్మ "నేను దానిని చూచుచున్నాను". శబ్దము ద్వారా తెలుసుకొనుచున్నాను. స్మరించుచున్నాను"మొదలగు విధమున జాగ్రద్ [స్వప్నావస్థలయందు బుద్ధియొక్కయు, మరియు దానికి సంబంధించిన వృత్తుల యొక్కయు, ఉనికిని తెలుసుకొనుచున్నాడు. ఆ జాగ్రదవస్థయందలి సర్వకార్యములను తెలుసుకొనుచున్న ఆత్మ చైతన్యమును స్థూల శరీరముతో అతనికి గల తాదాత్మ్యాధ్యాసముచేత వైశ్వానరుడు అని పిలువ బడుచున్నాడు. అట్లే స్వప్నావస్థయందు కేవలము మనస్సు మాత్రమే తాదాత్మ్య

* చూడుము స్వరూపసాక్షాత్కారము అనువ్యాసము.

మును పొంది అనగా కేవలము మనస్సు యొక్క ఉపాధితోచేరి ఆ మనస్సునందు అనాదిగా దాగియున్న సర్వవిధములైన వాసనలను వెలిగించి సూక్ష్మ విషయములను అనగా సూక్ష్మజగత్తును సృష్టించి దానికి కర్తగా భోక్తగా వుంటూ, అటుపైన గుణ దోషముచేత కలుగుచున్న సుషుప్తియందు కారణ రూపమున తాను ఒక్కడేవుండి, ఆ సుషుప్తి అవస్థయందు బుద్ధి యొక్కయు మరియు దాని వృత్తుల యొక్కయు అభావమును "నేను దీనిని తెలుసుకొనుచున్నాను" "దీనిని తెలుసుకొంటిని" "దీనిని తెలుసుకొనగలను" అను అనుభవము వలన సకలములగు జాగ్రదవస్థలోని పదార్థ ములను, స్వప్నకాలపు సూక్ష్మపదార్థములను, మరియు సుషుప్తి యందుగల అజ్ఞాన మును అనగా ఏమియు తెలియని తనమును, అభావమును, తెలుసుకొనుచున్నాడో అతడే ఆత్మయని గుర్తించ వలయును.

జ్ఞాన స్వరూపుడగు ఆత్మ ఈ విధముగా సర్వమునుతెలుసుకొనువాడగుటచే ఈతనిని తెలుసుకొనునది మరియొకటి ఏదియు లేనందువలన ఈతడు, ఈ ఆత్మ, జ్ఞాన స్వరూపుడుగా తెలియబడుచున్నాడు. "యః పశ్యతి స్వయం సర్వం యః నపశ్యతి కించన, యశ్చేత యతి బుధ్యాధి నతద్ యంచేత యత్యయమ్" అనగా ఏది స్వయముగా తాను మాత్రమే సమస్తమును చూచునో, కాని దేనిని ఏదియు కొంచెము గూడా చూడజాలదో అనగా "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఈ ఆత్మకంటె భిన్నమై చూచునది, సర్వమును తెలుసుకొనునది మరియొకటి అనగా రెండవది ఏదియు లేదు. ఏది సర్వమును చూచునో, దేనిని మరియొకటి ఏదియు చూడజాలదో "నతత్ర చక్షు ర్గచ్ఛతి, వావాగ్గచ్ఛతి, నోమనః" అనగా అచటికి నేత్రము, వాక్కు మనస్సుగూడా వెళ్ళజాలవో "నచక్షుషా గృహ్యతే, నాపివాచా, న్యాన్యైర్దేవైః" అనగా నేత్రముచేతగాని, వాక్కుచేతగాని, ఇతరములగు యే ఇంద్రియముల చేత గాని ఆ యాత్మ గ్రహింపబడదు."నైవ వాచా న మనసాప్రాప్తుం శక్యోన చక్షుషా" అనగా వాక్కుచేగాని, మనస్సుచే గాని, నేత్రములచే గాని ఆయాత్మ పొందుటకు శక్యముకానిది." అని పలుమార్లుగా శ్రుతి చెప్పుచున్నది. ఏ ఆత్మజములైన సమస్త అంతఃకరణ వృత్తులను తనప్రతిబింబముచే చైతన్యముకలవానినిగా చేయుచున్నదో ఆ అంతఃకరణము స్వతః చైతన్యముతో కూడియున్న అనగా స్వభావము చేతనే చైతన్య వంతమైయున్న దేనినికూడా-అనగా ఆత్మను చైతన్యవంతము చేయుజాలదో అనగా జడపదార్థము ఏదైన కార్యమును చేయవలయునన్నచో దానికి చైతన్యము అవసరము. ఏలయన-ఆ చైతన్యము లేకుండ జడపదార్థము యే కార్యమును చేయ

జాలదు. కాని స్వభావముచే చైతన్యమే స్వరూపముగాగల పదార్థమునకు ఎటువంటి కార్యములు చేయవలయునన్నను పరాపేక్షఅనగాపరులనుండి చైతన్యమునుగ్రహించ వలసిన అవసరము వుండదు. ఆత్మజ్ఞానస్వరూపుడు, అనగా చైతన్య స్వరూపుడు కావున అతడు పరాపేక్ష లేని సిద్ధుడు.

ఆత్మ సర్వప్రకాశకుడు. తాను ప్రకాశరూపుడై సర్వమును బాగుగా ప్రకాశింప జేయుచున్నాడు. అందుచే ఆయన ఇతరులతో ప్రకాశింపబడడు. "యేన విశ్వమిదం వ్యాప్తం యం నవ్యాప్నోతి కించన, అభారూపమిదం సర్వం యంభాన్తమను భాత్య యమ్" ఈ ఆత్మ సర్వోపాదాన కారణముఅగుటచే సర్వమునందును అవ్యక్త రూప మున వ్యాపించియున్నది. సర్వమునందును అంతర్నిహితముగా ఈ ఆత్మ తత్వ ము వ్యాపించి యున్నందువలన మరియే ఇతర పదార్థముగూడా ఈ ఆత్మయందు వ్యాపించజాలదు. సర్వాంతరముగ వ్యాపించియున్నదగుటచే బాహ్యములగు ఈ వస్తు వులు దానియందు వ్యాపించజాలవు. ఈ ఆత్మ సర్వవస్తువులకు ఆధారభూతమయ్యును తాను మాత్రము ఎటువంటి వికారమును పొందుటలేదు. "వికార వర్తిచ తథాహిస్థితి మాహ"అందుచే తాను ఎటువంటి వికారమును పొందకయే సర్వమును కలిగించుటకు తాను ఉపాదానకారణమగుచున్నది."పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యా మృతందివి" అనగా భూతములన్నియు ఈ ఆత్మయందు నాల్గవవంతు మాత్రమే అనగా ఈ ఆత్మ విశ్వాకారమై వున్నది అనిశ్రుతులు, స్మృతులు చెప్పుచున్నవి. "జ్యాయాన పృధివ్యాః జ్యాయా నన్తరిక్షాత్ జ్యాయానేభ్యో లోకేభ్యః" అనగా ఈఆత్మ ఈ భూమి కంటెను, ఆకాశము కంటెను అన్ని లోకములకంటెను పెద్దది అని శ్రుతులు చెప్పుచున్నవి. ఈ ఆత్మ స్వయం ప్రకాశరూపుడు అగుటచే జడమగు సమస్తములను తానే ప్రకాశింప జేయుచున్నాడు. ఈ విధముగా సర్వమును ప్రకాశింపజేయు ఆ ప్రకాశరూపుడే ఆత్మ. అనగా పరమాత్మ.

ఈ ఆత్మ సర్వోపాదానకారకుడు అగుటచే సత్వమును చైతన్యవంతము జేయు ప్రేరకుడు అనగా సర్వమునుచైతన్యవంతముజేయు చైతన్యమూర్తిఈతడు. "యస్యసన్నిధి మాత్రేణ దేహేంద్రియ మనోధియః విషయేషు స్వకీయేషు వర్తంతే ప్రేరితా ఇవ" అనగా దీనియొక్క సాన్నిధ్య మాత్రముచేతనే దేహము ఇంద్రియ ములు మనస్సు బుద్ధి మొదలగునవన్నియు ప్రేరింపబడినవానివలె చైతన్యవంతములై తమకు సంబంధించిన విషయములందు ప్రవర్తించుచున్నవో అట్టి చైతన్య మూర్తియే ఈఆత్మ. "కేనేషితం పతిత ప్రేషితం మనః కేనప్రాణం ప్రథమః ప్రైతి

యుక్తః కేనేషితం వాచమిమాంవదన్తి, చక్షుః శ్రోత్రం క ఉదేవో యునక్తి" అనగా మనస్సు ఎవనిచే ప్రేరేపింపబడినదై సర్వమును కల్పించుచున్నదో, ప్రాణము ఎవ్వనిచే ప్రేరేపింపబడి సర్వమును పోషించుచున్నదో, ఎవ్వనిచే ప్రేరేపింపబడి ఈ వాక్కు సర్వమును వర్ణించుచున్నదో ఏ మహాశక్తిచే నేత్రములు, శ్రోత్రములు, సర్వమును చూచుచు వినుచున్నవో, ఆ పరమార్థమే, ఆ సర్వోపాదాన రూపుడే ఆత్మ. ఆ ఆత్మయొక్క సన్నిధి మాత్రముచేతనే అనగా అభిమానరూప సంబంధముచేతనే దేహము సర్వకార్యములు చేయగలుగుచున్నదో, ఆఆత్మ బలంతోడనే వాక్,పాణి, పాయు మొదలగు కర్మేంద్రియములు తమ తమ కార్యములను నిరాటంకముగా నిర్వహించకలుగుచున్నవి. ఆ యాత్మసాన్నిధ్యముచేతనే చెవి, చర్మము, నేత్రములు, నాలుక నాశిక మొదలగు జ్ఞానేంద్రియములన్నియుచైతన్యవంతములై వినుట, స్పృశించుట చూచుట, రుచిచూచుట, వాసన చూచుట మొదలగు సర్వకార్యములను నిర్వహించుచున్నవి. అంతేగాక అంతః కరణరూపములగు బుద్ధి, అహంకారము మొదలగునవన్నియు ప్రేరేపింపబడిన వానివలె తమకు సంబంధించిన విషయములందు ప్రవర్తించుచున్నవో అనగా జడపదార్థములకు స్వతః వ్యాపారముండదుకదా! అట్లు ప్రవర్తింపజేయువాడే ఆత్మ, అతడే పరమాత్మ.

ఈఆత్మ జ్ఞానరూపుడు. అందుచేతనే అహంకారముమొదలుదేహమువరకును గల పంచకోశములును, అనగా ఆనందమయ, విజ్ఞానమయ,మనోమయప్రాణమయ అన్నమయ కోశములును, శబ్దాది విషయములును, వాటివలన కలుగు సుఖాదులును, స్వతః సిద్ధమగు జ్ఞానమే స్వరూపముగా గల ఏ తత్వముచే తెలియబడుచున్నవో, అనగా వాటినన్నింటిని దృశ్యములుగా చూచుచున్నాడో అతడే ఆత్మ. ఈ ఆత్మకు పంచకోశములతోగాని, వాని ధర్మములతోగాని, ఎటువంటి సంబంధము కలుగ నేరదు. ఏలయన అతడు కూటస్థుడు. సర్వమునుతెలుసుకొను జ్ఞానస్వరూపుడు.

ఈ పరమాత్మ సర్వాంతర్యామి. అనగా అందరి ఆత్మలయందును నిండియుండువాడు. అఖండమైన ఆనందస్వరూపుడు. ఈ సర్వాంతర్యామియగు చైతన్యస్వరూపుని యొక్క సాన్నిధ్యము మాత్రముచేతనే తాము జడములయ్యు, చైతన్యవంతములై వాక్కును, ప్రాణములును శబ్దోచ్చారణము, ఉచ్ఛ్వాస విశ్వాసములును మొదలగు తమతమ కార్యములను చేయగలుగుచున్నవి. ఈ అంతరాత్మయందే అన్నమయాది పంచకోశములును రజ్జువునందు సర్పము, దండము జలాధారాదులవలె కల్పింపబడి భాసించుచున్నవి. అందుచే ఈతడు పూర్ణుడు అనగా పురమునందు నివ

సించువాడు అనగా పంచకోశములకును ఆంతరముగా నిండియుండి పంచకోశములను చైతన్యవంతము గావించుచున్నాడు. ఆతడే, ఆ ఆనందస్వరూపుడే బ్రహ్మ.

"యద్‌సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ" ఏది సాక్షాత్తుగా అపరోక్షమైనదో, అది ఆ స్వస్వరూపమే; ఆత్మ. ఈ ఆత్మ స్వరూపము ఎప్పుడును, ఎటువంటి వికారమును చెందునది కాదు. ఏలయన ఈతడు జ్ఞానస్వరూపుడు, నిరాకారుడు, నిర్గుణుడు, నిర్వికారుడు. అంతేగాక కాష్టాదులయందు అంతర్వాహినిగా నిండియుండు అగ్నివలె సకలబుద్ధి వృత్తులయందును అనుగత రూపమున అనగా ప్రతి బోధరూపమున తెలియబడు జ్ఞానరూపుడు. అనగా ప్రతి జ్ఞానమునందును తద్రూపముగా తెలియబడువాడు. ఈ సందర్భమున ఓ కవిగారి నిర్గుణబ్రహ్మకు సంబంధించిన కల్పనా చిత్రము చూడనగును—

"విద్యుచ్ఛక్తి సమస్త తంతువుల వ్యాప్తింజెందియున్నన్
విద్యుజ్యోతికి గాజుగోళములనే విస్ఫూర్తి గన్పించెడిన్
విద్యారూప! స్వసత్తచేత సర్వంబునన్ నిండియున్
విద్యోతింతువు శుద్ధబుద్ధిగుహలన్ విశ్వాత్మ భీమేశ్వరా!

"భీమేశ్వర శతకమునుండి"

ఈ పరమాత్మ సర్వప్రకాశకుడు. అందుచే అధిక ప్రకాశముగల ఈ పరమాత్మ సర్వశరీరముల యందును సత్వగుణ ప్రధానమగు బుద్ధియనెడు గుహ యందు ప్రతిబింబించి, తన స్వాభావికమగు తేజస్సుచే అనగా ప్రకాశముచే సర్వ ప్రపంచమును సూర్యుడు ప్రకాశింపజేయుచున్నట్లుగా ప్రకాశింపజేయుచున్నాడు. బుద్ధియే విజ్ఞానమయకోశముగా చెప్పబడుచున్నది. "శబ్దాది విషయ పంచక సమన్విత బుద్ధి విజ్ఞానమయమన వెలయుచుండు" (శ్రీ సీతారామాంజనేయ సంవాదము నుండి) ఈ కోశము ఆ సర్వప్రకాశకుడగు పరమాత్మనుండి చైతన్యప్రకాశమును పొంది, తాను చైతన్యవంతమై శరీరమంతటిని ఆ చైతన్యముతో చైతన్యవంతము చేయుచు ఆత్మను కప్పివేయుచున్నది. అందుచే ఈ బుద్ధి ఇచ్చట "ధీగుహాయాం" అని అనగా "బుద్ధియనెడు గుహ" అని చెప్పబడినది. ఆ బుద్ధియనెడు గుహ యందు ఉపాదాన కారణమగుటచే అనుస్యూతముగానున్న ఏ అవ్యాకృతాకాశము కలదో దానియందు అనగా అజ్ఞానమునందు అనగా మాయయందు అధిక ప్రకాశ రూపుడై ప్రకాశించుచున్నాడు. జ్ఞానరూపమై, సర్వమును ప్రకాశింపజేయునదగుటచే ఆ పరమాత్మ సూర్యాది సకల జ్యోతిస్సులను ప్రకాశింపజేయుచున్నాడు.

25)

జ్ఞానరూపుడగుటచే అనగా జ్యోతిస్స్వరూపుడు అగుటచే తన తేజస్సుచే సూర్యాదులనుగూడ వెలిగించుచున్నాడు. "యేనసూర్య స్తపతి తేజసేద్ధః" అని శ్రుతి వాక్యము. ఆ విధముగా దృశ్యమగు సకల ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నాడు. అనగా సూర్యునికంటె మిక్కిలి సర్వోత్కర్షముతో "ఆకాశ ఉచ్చైరవివత్ప్రకాశతే" ప్రకాశించుచున్నాడని తాత్పర్యము. ఈ విధముగా ఆ పరమాత్మ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకుగూడ అంతరాత్మయని చెప్పబడుచున్నాడు. ఏ విధముగా సకల దిక్కులయందును వున్న సమస్త వస్తువులను ఎట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే సర్వాంతర్యామియగు ఈ తేజస్వరూపుడు సకలమును ప్రకాశింపజేయుచున్నాడు.

ఈ పరమాత్మ సర్వమును తెలుసుకొనువాడు. అనగా సర్వజ్ఞుడు. అనగా సర్వమునకు సాక్షి. "జ్ఞాతా మనోహంకృతి విక్రియాణాం, దేహేంద్రియ ప్రాణ కృత క్రియాణామ్, అయోఽగ్ని వత్తానమవర్తమానో నచేష్టతే నవికరోతికించన"

అనగా మనస్సు, అహంకారము మొదలగు వాని వికారములకును, దేహము; ఇంద్రియములచే చేయబడు సర్వవిధ క్రియలకును, జ్ఞాత, అనగా తెలుసుకొనువాడుగా వున్న ఈ ఆత్మ; ఇనుమునందు వ్యాపించియున్న అగ్నివలె, వాటినంతటిని వ్యాపించి వుండికూడ తాను మాత్రము ఏమియుచేయక, దేనికిని ఎటువంటి వికారము కలుగజేయక, తానుగూడా ఎటువంటి వికారమును చెందక కూటస్థుడై యున్నాడు. అంతఃకరణమునకు సంబంధించిన మనస్సునకు; కామము సంకల్పము మొదలగు అనేక వికారములు కలుగుచున్నందున అనగా గర్వము, దర్పము మొదలగు అనేక వికారములు అహంకారమునందు కలుగు చుండగా, వాటినన్నింటిని తాను సాక్షి వలె వుండి తెలుసుకొను వాడు ఆత్మ. అట్లే దేహమునకు మరియు ఇంద్రియములకు సంబంధించిన వికారములను అనగా నోరు మాటలాడుట, నేత్రములు చూచుట శ్రవణములు వినుట, ప్రాణము నాశిక ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుపుచుండుట మొదలగు సర్వ బాహ్య వ్యవహారములను సాక్షి వలె వుండి ఎవ్వడు తెలుసుకొనుచున్నాడో అతడే ఆత్మ. ఈ విధముగాసకలమైన అంతరబాహ్య వికారములకు సాక్షిమైన ఈ ఆత్మ తానుమాత్రము ఎటువంటి వికారములను చెందకుండ నిర్వికారుడై వుంటున్నాడు. ఈ క్రింది దృష్టాంతము ద్వారా ఈ విషయమును బాగుగా తెలుసుకొనవచ్చును. అదెట్లన—గుండ్రముగాగాని, పొడవుగాగాని వున్న ఇనుప ముక్కను ఆశ్రయించివున్న అగ్ని ఏవిధముగా గుండ్రముగాను, పొడవుగానుఉన్నట్లుగాతోచునో

కాని అగ్నిమాత్రము యథార్థముగ గుండ్రముగాను పొడవుగానువుండుట లేదో అట్లే మనస్సును, అహంకారమును, స్థూలదేహమును, ప్రాణములును, వీటిఅన్నింటి యందును పూల దండలో దారమువలె, ఇనుమునందు వ్యాపించియున్న అగ్నివలె: అను స్యూతముగా అనగా ఆంతరముగా నిండియున్ననూ, సర్వప్రకాశకుడు, నిర్మలుడు, నిర్వికారుడు అగు ఆత్మ అంతటను ప్రతిబింబించుచున్నను; అంతటను ఏక విధముగా ప్రకాశించుచున్నను, మనస్సు, అహంకారము, ప్రాణము మొదలగునవి చేయు వ్యాపారములయందు తదాకారము జెందియున్నదిగా భ్రాంతిచే తోచుచున్నను, వాస్తవముగాతానుమాత్రము ఎటువంటి వికారముచెందుటలేదు. సూర్యునిప్రకాశమాత్రముచే ప్రపంచమంతయు చైతన్యవంతమై ఎట్లు తనవ్యాపారమున చరించుచున్నదో, సర్వ జడ పదార్థములును చైతన్యవంతములై ప్రవర్తించునట్లుగాతోచుచున్నవో అట్లే ఈ సర్వ ప్రకాశకుడగు ఆత్మప్రకాశముచే మనోహంకార దేహేంద్రియప్రాణాదులు జడములే అయినను చైతన్యవంతములై తమ తమ వ్యాపారములందు ప్రవర్తించుచున్నవి, కాని ఈ ఆత్మ మాత్రము ఆ సూర్యునివలె ఎటువంటి వికారములను పొందక అంతటను నిర్వికారముగ ప్రకాశించుచున్నాడు. తానుమాత్రము ఎటువంటివ్యాపారములు చేయక సాక్షివలె కూటస్థుడైయున్నాడు అతడే ఆత్మ, అతడే పరమాత్మ.

ఈ పరమాత్మ నిత్యుడు, నిర్వికారుడు, అజన్మ, అమరుడు, అవినాశి.

"నజాయతే, నోమ్రియతే, నవర్ధతే, నక్షియతే, నోవికరోతి సత్యః
విలీయ మానేపి, వపుష్యముష్మిన్ న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్"

అనగా పరమాత్మ నిత్యుడు అనగా ఎల్లప్పుడూ వుండువాడు. ఈ రోజు వుండి రేపు లేకుండు వాడు కాడు. సర్వవేళల, సర్వావస్థలయందును అనగా జాగ్రస్వప్నసుషుప్తులయందును, విద్యమానమై యుండువాడు, జన్మ మరణములు లేనివాడు. నిత్యుడు గనుక ఒక పర్యాయము పుట్టిమరియొక పర్యాయము నశించువాడు అనగా మరణించువాడుకాడు. నిత్యుడైన వాడు ఏట్లు జన్మించును? ఎట్లుమరణించును? నిత్యుడైనవానికి జన్మమరణములు, రాకపోకలు, ఉనికిలేములు, సంభవములు కానేరవు. అట్లే ఆత్మ వృద్ధిక్షిణములు లేని వాడు. నిత్యుడు, నికారుడు, అనగా ఎటువంటి ఆకార ప్రకారములులేక సూక్ష్మరూపుడై సర్వమునందు వ్యాపించియున్న వానికి వృద్ధి క్షిణములు, జన్మమరణములు కుదరవుగదా! అటుపైన ఈ ఆత్మ, అవికారుడు; అనగా తాను ఎటువంటి వికారమును అనగా మార్పును అనగా పరిణామమును పొందువాడు కాడు. ఏలయన ఆయన సూక్ష్ముడు, సర్వవ్యాపి, ప్రకాశరూపుడు, జ్ఞానరూపుడు,

అందుచే ఆయనయందు ఎటువంటి వికారములు సంభవము కానేరవు. అంతేగాక ఆయన వలనకూడా ఎటువంటి వికారముదేనియందును కలుగనేరదు. అదెట్లనగా? ఈ దృశ్యమానమగు ప్రపంచము ఆయనయొక్క అధిష్ఠానమునందే కల్పించబడి నానా విధరూపములు ధరించుతూ, నిత్యము పుట్టుచూ, చచ్చుచూ, అనేక పరిణామములు చెందుచున్న దానివలె తోచుచున్నను యథార్థమున కల్పితవస్తువునకు ఎటువంటి పుని క్రియు సంభవము కానందున, దానియందు కలుగుచున్నట్లుగా తోచుచున్న వికారములు గూడ శుద్ధకల్పితములే. కావున ఆ వికారములు యథార్థమున లేనివే,కావున ఆ ఆత్మ; ఆ పరమాత్మ తాను ఎటువంటి వికారము చెందక, మరొకదాని యందు ఎటువంటి వికారమునుకలిగించుటలేదు. కారణమేమన ఆయన అద్వితీయుడు. ఆయనతప్ప మరే దియు అస్తిత్వము కలిగిలేదు. ఈ ప్రపంచమంతయు ఆయనయందు భ్రాంతిచే ఉన్న ట్లుగాతోచుచుండునది మాత్రమే. ఇదియేసత్యము. అందుచే ఆకాశమునందు నిత్యమూ అనేక శరీరములు పుట్టుచున్నను, తిరిగినశించుచున్నను, అదేవిధముగా అనేక ఆకార ప్రకారములు కలిగిన కుండలు, ముంతలు, కడవలు, మూతలు మట్టితో రూపములు దాల్చి తుదకు ఆ మట్టియందే లీనమగుచున్నను వాటియందు వ్యాపించియున్న ఆ ఆకాశమునందు ఏటువంటి వికారము ఎట్లుకలుగుటలేదో అట్లే ఈ ప్రపంచము ఎట్లు వ్యవహరించినట్లుగా తోచుచున్నను ఆ పరమాత్మయందు ఎటువంటివికారము కలు గుటలేదు. అట్టినిర్వికారుడే, అద్వితీయుడే ఆ పరమాత్మ. ఆ విధముగా ఆ పర మాత్మ ఉత్పత్తి వినాశాది శూన్యుడు, వృద్ధిక్షయములులేనివాడు. అవయవ రహి తుడు అగుటచే నిర్వికారుడు. అనగా సర్వవిధ వికార శూన్యుడు,

పరమాత్మ కార్యకారణ వ్యతిరిక్తుడు. ప్రకృతి వికృతిరహితుడు. సర్వమునకు సాక్షి. "నేను, నేను" అని ప్రత్యక్షముగ ప్రకాశించువాడు. విషయశూన్యమైన జ్ఞాన రూపుడు. ఎటువంటి ధర్మములులేని ధర్మశూన్యుడు.

"ప్రకృతివికృతిభిన్నః శుద్ధబోధస్వభావః
సదసదిద మశేషం భాసయన్నిర్విశేషః,
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్సాక్షిరూపేణబుద్ధే"

అనగా ఎవ్వడు ప్రకృతివికృతులకంటె భిన్నుడై అనగా ఎవ్వడు అజ్ఞా నము మరియు దాని కార్యములగు ఆకాశాది అనగా గాలి, నీరు, మట్టి, గగనము, మొదలగు పేర్లుగల పంచభూతములకంటె వేఱుగావుండి, వాటితో ఎటువంటి సంబం

ధములేక విషయశూన్యమగు అనగా శుద్ధమైన ఏ జ్ఞానముకలదో అజ్ఞానమే స్వభావస్వరూపములుగాగలవాడై అనగా కేవలము దృక్ స్వరూపుడు అనగా సాక్షి మాత్రముగా వుండువాడై ప్రత్యక్షగోచరమగు సర్వప్రపంచంబును మరియు ఆకాశాది అమూర్త పదార్థములనుగూడ భాసింపజేయుచున్నాడో అనగా ప్రకాశింపజేయు చున్నాడో అతడే ఆ పరమాత్మ. అతనికి మూర్తపదార్థములైన ప్రపంచ ధర్మములు గాని అమూర్త పదార్థములైన ఆకాశాదికముయొక్క ధర్మములు గాని లేవు. అతడు ఎటువంటి ధర్మములు లేని ధర్మశూన్యుడు. ధర్మములు దృశ్యమానమగు మూర్త పదార్థములకేయుండునుగాని అవ్యక్త పదార్థములకు ఎటువంటి ధర్మములు వుండ జాలవుగదా! కావున పరమాత్మ ధర్మశూన్యుడు. ఆ విధముగా ధర్మశూన్యుడు అయి వుండియు ఆయన జాగ్రస్వప్న సుషుప్త్యాది అవస్థలయందు బుద్ధికిసాక్షిగా వుండి "నేను నేను" అని ప్రత్యక్షముగ ప్రకాశించుచున్నాడు. ఆ విధముగా ప్రకాశించువాడే పరమాత్మ.

"తత్వమసి" అనగా అట్టి ఏపరమాత్మకలదో అతడేనీవు అని తెలిసికొనుము. అట్లు తెలుసుకొనుటకు మనస్సే ముఖ్యసాధనము. అయితే ఆ మనస్సు అనగా బుద్ధి, శాస్త్రజ్ఞానము గురూపదేశము, అటుపైన శ్రవణ మనన నిధిధ్యాసములద్వారా శుద్ధమై, అనగా పంచకోశములనబడు అన్నివిధములగు అనాత్మ పదార్థములను కూలంకషంగా పరిశీలించి, అవన్నియు భ్రాంతిజన్యములు, కల్పితములు, మరియు అసత్యములని గుర్తించి, వాటినుండి వివేకముతో మనస్సును మరల్చి, దానిని ఆ పరమాత్మ భావముతో నింపినప్పుడు మాత్రమే ఆ మనస్సు పరమాత్మగా ప్రత్యక్ష మగును. "మనసైదమాప్తవ్యమ్" అనుశ్రుతి ఈ రహస్యమునే తెలుపుచున్నది. ఎప్పుడైతే మనస్సు సర్వవిధ సంశయములనుండి అనగా అసంభావన, సంశయ భావన, విపరీతభావన, అనబడు ఈ మూడు దోషములనుండి విడువడి ఆ మూడు దోషములు తొలగిపోవుటచే విశుద్ధమైన మనస్సు విషయములనుండి వెనుకకు తిరిగి తనయందు వ్యాపించియున్న జ్ఞానబలంతో విషయములు తొలగిపోయినందున విశుద్ధమైనదై ఆ జ్ఞానరూపుడగు ఆ పరమాత్మను సాక్షాత్కరించుకొనును అని శ్రుతి చెప్పుచున్నది. "స ఆత్మా; తత్వమసి" అదియే ఆత్మ. ఆ ఆత్మయేనీవు. అలా స్వస్వరూప సాక్షాత్కారమును పొందిన మహనీయుడు "పునరపిజననం, పునరపి మరణం" అని చెప్పబడుచున్న జన్మమరణ మనబడు సంసారసాగరమునుండి సునాయాసముగ దాటి మోక్షమును అనగా జన్మమరణములులేని స్థితినిపొందును.

ఆత్మఅనగా పరమాత్మ, అనగా సర్వాంతర్యామియగు ఈ బ్రహ్మపదార్థము జగత్తంతటను వ్యాపించియున్నది. "ఇందుగలడందు లేడను సందేహాము వలదు; బ్రహ్మసర్వోపగతుండు" ఆ విధముగా ఆ పరమాత్మ జగత్తునకు మూలకారణమై యున్నది. అయినను ఆబ్రహ్మము అద్వితీయముగనేయున్నది. ఏలయన జగత్తునకు వేరుగా సత్యములేదు. ఈ జగత్తంతయు అజ్ఞానముచే బ్రహ్మమునందే ఆరోపించబడి కేవలము నామమాత్రముగ తోచుచున్నది. "వాచారంభణం వికారోనామధేయం, మృత్తికేత్యేవ సత్యం" అనగా ఈ నామములు వ్యవహారమునకు మాత్రమే వుపయోగించునుగాని వస్తువునకు భేదమును కల్పించునవికావు. వివర్తముచే జన్మించిన వస్తువు తన వుపాదానకారణమునకు ఏ విధమగుమార్పును కలిగింపలేకపోవుటచేత యధార్థస్థితిలో కారణముకంటె భిన్నమగు కార్యము జనించుననుటయే అసత్యమగుటచే కార్యపదార్థము బొత్తుగనే లేనిదగుచున్నది. అనగా ఆరోపించబడినవస్తువు అధిష్ఠానమును ఎఱుంగకుండుటచే వేఱుగ తోచుటయేగాని అందుయధార్థమేమియును లేదు. కావున ఎండమావులను ఎఱుంగని వారలకు అదినీరుగతోచినట్లు బ్రహ్మమును ఎఱుంగనివారికి ఆబ్రహ్మమే ప్రపంచముగా, సత్యముగా బ్రహ్మభిన్నముగా తోచుచున్నది. "అపశ్యతామధిష్ఠానం విశ్వంభాతి యధార్థవత్, అదృష్టమరుదేశానాం మరీచి సలిలం యధా"

ఆత్మస్థూలమై నేత్రములకు దృశ్యమానమగు పదార్థముకాదు. అణువు వంటి అతిసూక్ష్మపదార్థముకాదు, హ్రస్వమైనదికాదు. దీర్ఘమైనదికూడకాదు. "అస్థూలమనణ్వ హ్రస్వమదీర్ఘమ్" ఈ వాక్యమువలన తెలియబడునదేమన, స్థూలములగు శరీరాదులయందు తాదాత్మ్యభిమానముచే "ఈశరీరాదులేనేను" అని అజ్ఞానముచే భావించువానికి "నీవు శరీరాది రూపుడవుకాదు. బ్రహ్మరూపుడవు" అని చెప్పినట్లయినది. ఆ బ్రహ్మము అఖండ జ్ఞానస్వరూపమైనది. ఆ కారణమువలన ఈ స్థూలశరీరాదికము అంతయు అజ్ఞానకారణముగా భాసించుచున్నదేగాని యధార్థముకాదు. "అతః పరంబ్రహ్మసదద్వితీయం, విశుద్ధవిజ్ఞానఘనం, నిరంజనమ్, ప్రశాన్తమాద్యన్తవిహీన మక్రియం నిరన్తరానన్దరసస్వరూపమ్" అనగా ఈ స్థూలజగత్తునకు వేఱుగ సత్వము అనగా ఉనికియనునది లేనందువలన, అది అంతయు బ్రహ్మముపై ఆరోపితమై నామమాత్రమేయగుటచేతను, పరమాత్మ అబాధ్యము అనగా ఎల్లప్పుడునూ వుండునది; అద్వితీయము విజాతీయరహితము, విశుద్ధ విజ్ఞానఘనము అనగా నిర్విషయకమై విజ్ఞానమే రూపముగాగలది. "ప్రజ్ఞానంబ్రహ్మ",

ఆ పరమాత్మనిరంజనము. అనగా అజ్ఞానము మరియు దాని కార్యములతో ఎటువంటి సంబంధములేనిది. ప్రశాంతం అనగా ఎటువంటి పరిణామము, అనగా మార్పు లేనిది. ఆద్యంతవిహీనం అనగా ఆది అంతములులేనిది. అనగా జన్మమరణములు లేనిది. అక్రియం అనగా అవయవములు లేనిదగుటచే క్రియాశూన్యమైనది. నిరంతరానంద స్వరూపం అనగా అవిచ్ఛిన్నమైన ఆనందరసమే రూపముగాగలది.

"నిరస్తమాయా కృత సర్వభేదం, నిత్యం ధ్రువం నిష్కలమప్రమేయం
అరూప మవ్యక్త మనాఖ్య మవ్యయం జ్యోతిః స్వయం కించిదిదం చకాస్తి"

అనగా పరమాత్మ మాయచే కల్పించబడిన సమస్తభేదములకు అతీతమైనది. అనగా సజాతీయ భేదముగాని, స్వగత భేదముగాని లేనిది. ఆది అంతములు అనగా ఒకప్పుడు వుండుట, మరియొకప్పుడు లేకుండుట అనగా జన్మ మరణములు లేనిది. సదావుండునదగుటచే నిత్యమైనది. అవయవ రహితమై ఎటువంటి క్రియలు చేయనది అగుటచే కూటస్థమైనది అనగా స్వర్ణకారుని కూటమువలె, దాగలివలె సువర్ణమునకు మార్పులు కలిగించునదైనను తాను మాత్రము ఎటువంటి మార్పులు లేక కూటమువలె స్థిరముగ వుండునది. నేత్రములచేగాని, మనస్సుచేగాని చూడబడనిది. అనగా మనోవృత్తికి గోచరముకానిది. "అశబ్దమస్పర్శ, మరూప మవ్యయం" ఇత్యాదిశ్రుతులననుసరించి నేత్రములకు గోచరముకానిది. నేత్రములకు గోచరముకానిదనగా ఎటువంటి చక్షుగ్రాహ్యమగు రూపము కలదికాదని తాత్పర్యము. అందువలన అవ్యక్తం అనగా వ్యక్తము కానిది, అనగా వాక్కుచేకూడ తెలుపబడనిది. అనాఖ్యం అనగా నామరహితమైనది, అనగా ఏవిధమైన పేరుపెట్టి పిలుచుటకుసాధ్యముకానిది. ఒక పదము ఒక అర్థమును బోధింపవలెనన్నచో అట్లు బోధింపబడుదానికి జాతిగాని, గుణముగాని, క్రియగాని, సంకేతసాధ్యమగు సంబంధముకాని ఉండి ఉండవలయును. కాని అట్టివి ఏవయు లేకపోవుటచే నామరహితమైనది. పేరు పెట్టిపిలుచుటకు సాధ్యపడనిది. అవ్యయం అనగా క్షయములేనిది అనగా ఎటువంటి మార్పులు చేర్పులు లేక ఎన్నడును నశించనిది అనగా ఎల్లప్పుడునూ ఒకే విధముగా వుండునది. స్వయం జ్యోతిః అనగా స్వయముగానే ప్రకాశించునది. అట్లగుటచే ఇతర పదార్థములచే ప్రకాశింపబడనిది. అనగా సర్వమును ప్రకాశింపజేయునదియేగాని తాను ఇతరములచే ప్రకాశింపబడనిది. అట్లేలయన—అది స్వయం ప్రకాశము. తనంతట తానుగా ప్రకాశించునది.

ఆ పరమాత్మ "జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ శూన్యమనన్తం నిర్వికల్పం, కేవలాఖండ చిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః" అనగా ఆ పరమాత్మ జ్ఞాతృ, జ్ఞాన

జ్ఞేయశూన్యమైనది. అనగా జ్ఞాతః తెలుసుకొనువాడు; జ్ఞానము తెలుసుకొను క్రియ; జ్ఞేయము, తెలియబడునది అను మూడు విధములైన త్రిపుటి, అనగా అటు వంటి విభాగములులేనిది. కావుననే అనన్తం అనగా దేశకాల వస్తు పరిచ్ఛేదములేనిది. అందుచేతనే నిర్వికల్పకం అనగా వికల్పశూన్యమైనది. అనగా ఏ విధముగాను పరిచ్ఛిన్నత్వములేనిది. భేదము లేనిది. కేవలాఖండచిన్మాత్రం అనగా ఎటువంటి సం బంధము కలిగిలేనిది. అనగా అపరిచ్ఛిన్నమై జ్ఞానమే రూపముగా గలది. అనగా జ్ఞానరూపమైనది. అందుచే అది పరతత్వం అనగా విజ్ఞులచే తెలుసుకొనబడు నదియేగాని, నేత్రములచే చూడబడనిది. లేక వాక్కులచే వర్ణించబడునదికాదు అంతే గాక "అహేయ మను పాదేయం మనోవాచామగోచరమ్, అప్రమేయ మనాద్యన్తం బ్రహ్మ పూర్ణమహోమన్మహః" అనగా ఈబ్రహ్మపదార్థము అనగా సర్వాంతర్యామి యగు పరమాత్మ, అందరికి స్వస్వరూపము అనగా స్వాత్మయగుటచే విడచుటకు శక్యముకానిది అనగా ఆ బ్రహ్మరూపమునగాక మరియొకటిగా వుండుటకు ఎవ్వరికిని శక్యముగానిది. అట్లని "ఇది" అని గ్రహించుటకుగూడ శక్యముకానిది."మనోవాచామ గోచరం" యతోవాచః "ఇత్యాది శ్రుతులను అనుసరించి ఆబ్రహ్మ పదార్థము మనస్సుచేగాని, వాక్కులచేగాని, తెలియబడనిది. అప్రమేయం అనగా తెలుసుకొను టకు అలవిగానిది. అట్లయ్యును విద్వాంసులచే, శ్రవణ మననని ధ్యాసనములచే! సంస్కరింపబడిన అనగా ప్రాపంచిక మలినములు లేకుండగ నిర్మలముగావించ బడిన బుద్ధిగలవారిచే, అనుభవింపదగియున్నది. అనగా వారి మనోవృత్తికి గోచర మగునది. అనాద్యన్తం అనగా కాలముచేగాని దేశముచేగాని కొలవబడి "ఇది" ఇంత వరకు వున్నది. అని చెప్పుటకు వీలుకానిది. ఈవిధముగా ఆ పరమాత్మ, ఆబ్రహ్మత త్వము, పరిపూర్ణమై సర్వమునకంటె మించినదై, సూర్యచంద్రాదులను గూడ భాసింపజేయునదైన జ్యోతిస్వరూపము; జ్ఞానరూపము అయివెలుంగు చున్నది.

ఆ బ్రహ్మము, ఆ పరమాత్మ, "పరిపూర్ణ మనాద్యన్తమప్రమేయమవిక్రియం, ఏకమే వాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన" అనగా ఆ పరమాత్మ పరిపూర్ణ మైనది. అనగా ఇచ్చట అచ్చట అను భేదములేక అంతటను నిండియున్నది. అనగా దేశపరిచ్ఛేదము లేనిది. అనాద్యమనంతం-అనగా వుత్పత్తి వినాశములు లేనిది. అది జన్మించునదికాదు. అందుచే మరణించునదికాదు. అనగా జన్మమరణములులేనిది. అప్రమేయ మవిక్రియం. అనగా మనోబుధ్యాదులచే గ్రహింపశక్యముకానిది. ఎటు వంటి మార్పులు లేనిది. ఎటువంటి పరిణామములేనిది. అనగా సర్వకాల సర్వావస్థల

యందును ఒక్కరీతిగా ప్రకాశించునది. ఏకం అనగా ఏ విధముగాను, ఏ శక్తిచేతను విభజింప శక్యముకానిది. అంతేకాదు తనంతటతానుగాకూడ స్వగతభేదము లేనిది. అట్లే సజాతీయ విజాతీయభేదములులేనిది. ఈ విధముగా ఆ పరమాత్మ ఏ విధమైన నానాత్వములేనివాడు. ఆతడు సకల విధభేదరహితుడని శ్రుతిచెప్పుచున్నది. "మనసైవాను ద్రష్టవ్యం నేహనానాస్తికించన, మృత్యోః సమృత్యుమాప్నోతి యఇహ నానేవపశ్యతి" అనగా బ్రహ్మమును తెలుసుకొనుటకు మనస్సు ఒక్కటియే సాధనము. ఈ బ్రహ్మపదార్థమునందు ఎట్టి భేదమునులేదు. ఈ బ్రహ్మపదార్థము నందు భేదమును చూచెడివాడు మృత్యువునుండి మరియొక మృత్యువును పొందు చున్నాడు. మరియు సంసారబంధముచే బంధింపబడుచున్నాడు అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. అట్లేలయన ఎవ్వడు బ్రహ్మమునందు భేదమును చూచునో వానికి ఈ మాయాకల్పిత ప్రపంచము ప్రత్యక్షమగును. అప్పుడు ఆతడు ఈ ప్రపంచమునే సత్యము, నిత్యము అని నమ్మి, అందునిమగ్నుడై జన్మమరణ బంధములయందు ఆధ్యాసచే తగుల్కొని దుఃఖమునుపొందును అని తాత్పర్యము.

వాస్తవమున విచారించిచూచిన ఆ పరమాత్మ అద్వితీయుడు. ఆనందఘన మూర్తి. ఎటువంటి విభేదములు లేనివాడు. "సద్ఘనంచిద్ఘనం నిత్యమానన్దఘనమవిక్రియమ్, ఏకమేవాద్వయం బ్రహ్మనేహనానాస్తికించన" అనగా ఆ పరమాత్మ, ఆ బ్రహ్మము సత్తుయే శరీరముగా గలవాడు. అందుచే నిత్యమైనవాడు. అట్లేలయన? సత్తునకు పరిణామ వినాశములు సంభవముకాదుగదా! ఆనందమే శరీరముగా గల వాడు. అనగా సచ్చిదానందస్వరూపమని తాత్పర్యము. సత్తుయే శరీరముగా, స్వరూపముగా గలవాడు గనుక సర్వవ్యాపకుడు. సర్వమునందు వ్యాపించియున్నవాడు గావున అంతటను అనగా సర్వభూతములందును వ్యాపించియున్నవాడు ఆ పరమాత్మయే. "ప్రత్యగేకరసం పూర్ణ మనన్తం సర్వతోముఖం, ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తికించన" అనగా ఈ పరమాత్మ పరమాత్మగావున సర్వాత్మభూతమైనవాడు. అనగా సర్వభూతములయందు తానై నిండియున్నవాడు. పూర్ణం అనగా సర్వమునందును వ్యాపించి సర్వమూ తానే అయివున్నవాడు. అనన్తం= అనగా అనంతుడు అనగా అంతము - జన్మనాశములులేనివాడు. సర్వతోముఖః= అనగా సర్వాత్మ భూతుడగుటంజేసి అంతటను ముఖములుగలవాడు. "త్వం జాతో భవసి విశ్వతో ముఖః" అనగా నీవు జన్మించినవాడవై అనగా సకల భూతముల రూప

మున ఆవిర్భవించినవాడవై అన్నివైపుల ముఖములు కలవాడవు అగుచున్నావు అని శ్రుతి చెప్పుచున్నది. పై విధముగా ఆ పరమాత్మ సర్వభూతరూపుడు. సర్వ రూపముల, సర్వమునందును వ్యాపించియున్నవాడు అనగా సర్వము తానే అయి వున్నవాడు. "బ్రహ్మమువేఱు, భూతములువేఱు" అనుభేదమునకు అవకాశము లేదు. ఏలయన సర్వభూతముల రూపమున ఆయనయే- వ్యాపించి యున్నాడు. శ్రీమద్భగవద్గీతయందుగూడ ఇట్లే చెప్పబడియున్నది- "యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం నప్రణశ్యామి నచమేన ప్రణశ్యతి" అనగా "ఎవడు సమస్త భూతములందును నన్ను చూచుచున్నాడో, మరియు నాయందు సమస్తభూతములను గాంచుచున్నాడో, అట్టివానికి నేను కనబడకపోను, నాకతడు కనబడకపోడు". అందుచే అనగా పై విధముగా సర్వభూతముల రూపమున ఆ పరమాత్మయే వ్యాపించియున్నందున "అహేయ మనుపాదేయ మనాధేయ మనాశ్రయమ్, ఏకమేవాద్వయం బ్రహ్మనేహ నానాస్తికించన" అనగా ఈ బ్రహ్మము ప్రతియొక్కరికిని ఆత్మస్వరూపమేగాక ఎవ్వరిచేతను త్యజించుటకు అనగా దాని నుండి వేఱుగా వుండుటకు వీలుగానిది అగుచున్నది. "అనగా" ఆ బ్రహ్మము నేనుకాదు. "అనుటకు వీలులేదు. అందుచే ప్రతివాడును "అహంబ్రహ్మాస్మి" "నేను బ్రహ్మమునే" అని చెప్పుకొని తీరవలసినదే. ఏలయన -సర్వభూతములరూపమున ఆ బ్రహ్మపదార్థమే వ్యాపించియున్నందున, ఆ భూతములకు వేఱుగా ఏప్రాణి; ఏ జడ పదార్థముగాని వుండుటకు వీలులేనందున, అందరూ, అంతయు బ్రహ్మమే. అందుచేత అనగా ప్రతివాడును తాను బ్రహ్మమే అయివున్నందున ఆ బ్రహ్మమును, తన కంటే వేఱుగా గ్రహించుటకు శక్యముగాదు. అటుపైన అనాధేయం అనగా ఆ బ్రహ్మము దేనిపైనను, అనగా దేనియందును ఆధారపడిలేదు. అనగా అది వుండుటకు మరియొక ఆధారమేదియు లేదని తాత్పర్యము. మరియు అనాశ్రయం అనగా ఆశ్రయరహితమైనది. అనగా ఆ బ్రహ్మము దేనిని ఆశ్రయించిలేదు. సర్వమునకు తానే ఆధారమైయున్నది అని తాత్పర్యము.

భేద శూన్యమైనది గావున గుణ రహితమైనది ఆ పరమాత్మ- "నిర్గుణం, నిష్కలం, సూక్ష్మం, నిర్వికల్పం, నిరంజనమ్,ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన." అనగా బ్రహ్మము నిర్గుణుడు—అనగా సత్వ, రజస్తమోగుణములతో శూన్యుడు. గుణములు వస్తువునకు అవస్థాభేదములు కలిగించును. కాని బ్రహ్మము నిష్కలం అనగా భేద శూన్యము అయినవాడు. కావున గుణ రహితుడు, సూక్ష్మ

మైనవాడు. ఏలయన - అను సూత్రముగా, అంతరముగ అనగా పూలదండయందు దారమువలె అన్నింటను నిండియుండువాడు గావున,సూక్ష్మమైనవాడు. నిర్వికల్పం= అనగా ఎటువంటి వికల్పములు — మార్పులు పరిణామములు, జన్మ-మరణములు, స్వగత భేదములు లేనివాడు. ఏలయన—సర్వమునందును తానే నిండియుండ మరి ఇతర మెచట వుండును? ఇతరము లేక పోవుటయనగా సర్వము తానే అయినవాడు అగును. ఆతడు ఆ విధముగా సర్వాంతర్యామి అట్లు ఇతరమైన స్వగత భేదములు లేనివాడగుటచే ఆ పరమాత్మ— "అనిరూప్య స్వరూపం యన్మనో వాచామగోచరమ్. ఏకమేవా ద్వయం బ్రహ్మనేహ నానాస్తికించన" అనగా సర్వవ్యాపకుడై, సర్వ రూపుడై, నిర్గుణుడై, సూక్ష్మమై అంతటను వ్యాపించియున్న ఆ పరమాత్మ; మన స్సునకును, వాక్కునకును, గోచరించనివాడై యున్నాడు. ఆ కారణము వలన "ఇది ఇట్లు" అనగా ఆతడు ఈ రూపమున వున్నవాడు అని నిరూపింప శక్యము గాని స్వరూపము గలవాడుగా వున్నాడు. సర్వము ఆ బ్రహ్మమే అయివున్నందున తెలుసుకొనువాడు, తెలియువాడు, తెలివి అనగా జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయములు వేఱు వేఱుగా లేనందున అనగా బ్రహ్మము జీవుడు వేఱుగా లేనందున, అనగా తానే బ్రహ్మముగా అయినవాడు తనకు తాను ఎట్లు తెలుసుకొనగలడు? అట్లు తెలుసుకొన వలయునన్నచో జీవుడు బ్రహ్మము కంటె వేఱుగా వుండి, మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారము కలిగిన వాడై యున్నప్పుడే సాధ్యపడును. కాని బ్రహ్మము జీవుడు ఇరువురు వేఱువేఱుగా లేరని రుజువైన పిమ్మట ఆ జీవుడు బ్రహ్మము కంటె వేఱుగాలేడు అని అర్థమగుచున్నది.

ఈ విధముగా ఆ పరమాత్మ - "సత్ సమృద్ధం స్వతః సిద్ధం శుద్ధం బుద్ధ మనీ దృశమ్. ఏకమేవాద్వయంబ్రహ్మ నేహ నానాస్తికించన." అనగా ఆ పర మాత్మ ఎల్లప్పుడును వుండువాడు. అందుచే ఆతడు సత్యము, నిత్యము. అందుచే ఆ పరమాత్మ దేనిచేతను బాధింపబడడు. అది అబాధ్యమైనది. సమృద్ధం=అనగా అన్ని విధముల పూర్ణమైనది. అఖండానంద రూపమైనది. స్వతంఃసిద్ధం అనగా తనంతట తానుగా ప్రామాణికమైనది. అట్లేలయన అన్నియు ఈ బ్రహ్మతత్వము మూలముననే ప్రామాణికములు అగుచున్నవి. అందు వలన దీని విషయమున ఏ ప్రమాణములు పనికిరావు. అందుచే ఈ బ్రహ్మము స్వసంవేద్యము శుద్ధం అనగా దోషరహితమైనది. ఎటువంటి కల్మషము లేనిది. బుద్ధం అనగా బోధ రూప మైనది. జ్ఞానమే రూపముగా గలది. అనీదృశం =అనగా తత్సమానమైనది మరియొకటి లేనిది. దాని లాంటిది మరియొకటి లేదు అని తాత్పర్యము.

ఆ పరమాత్మ పుణ్యపాపములతో నిమిత్తములేనివాడు. "పుణ్యాని పాపాని నిరింద్రియస్య, నిశ్చేతసో,నిర్వికృతేర్నిరాకృతేః"ఆ పరమాత్మ ఇంద్రియరహితుడు. మనస్సు లేనివాడు, నిర్వికృతేః=అనగా ఎటువంటి వికారములు లేనివాడు. నిరాకృతేః=అనగా ఆకారశూన్యుడు. అఖండమైన అనుభవస్వరూపుడు. పుణ్యములుగాని పాపములుగాని అంటనివాడు."న త స్యకార్యం, కరణంచ విద్యతే" అనగా ఆ పరమాత్మకు కార్యముగాని, శరీరాదిసాధనములుగాని లేవు అని శ్రుతి వాక్యము. "స చక్షురచక్షురివ సకర్ణోఽ కర్ణోఇవ సమనా అమనా ఇవ సప్రాణోఽప్రాణోఇవ" అని మరియొకశ్రుతి. అనగా ఆ పరమాత్మ, ఆధ్యాసిక సంబంధముచే వాస్తవమున నేత్రేంద్రియములు లేనివాడైనను, వున్నవానివలె, కర్ణములు లేనివాడైనను వున్నవానివలె మనస్సులేనివాడైనను, ఆ మనస్సు వున్నవానివలె, ప్రాణములేనివాడైనను ప్రాణములున్నవానివలె భ్రాంతునకు తోచుచుండును. నిత్యమగు ఆత్మకు వికారరూపములగు ఈ అనిత్య పుణ్యపాపములతో సంబంధమున్నదని చెప్పినచో ఆ ఆత్మకూడ అనిత్యమైనదని చెప్పవలసి యుండును. అందుచే "నిర్వికృతేః" అను పదముచే ఆత్మ వికారశూన్యమని చెప్పబడినది. మహామహిమాన్యులు తోటకాచార్యులు వారుగూడ తనశ్రుతిసార సముద్ధరణమను గ్రంధమున "నహినిత్యమనిత్యగుణేనగుణే "అనగా నిత్యమైన దానికి అనిత్యములైన గుణములు వుండవుకదా!" అని చెప్పియున్నారు. కావున స్వభావముచేత నిర్వికారుడగుటచే శరీరఇంద్రియ మనోరూపాదులతో యధార్థమైన సంబంధములేకపోవుటచే అనాకృతము, అపరిచ్ఛిన్నము, స్వయం ప్రకాశము అగు ఆనందమే స్వరూపముగాగల ఆ పరమాత్మకు పుణ్యపాపములు ఎట్లుండును? "అనన్వాగతం పుణ్యేన అనన్వాగతంపాపేన తీర్ణోహితదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి" అనగా ఆత్మపుణ్యముచేతగాని, పాపము చేతగాని సంబంధింపదు. దేహాదులకు సంబంధించిన ఆ అజ్ఞాన కార్యముల అధ్యాసము తొలగిపోగా ఆత్మకు పుణ్యపాపముల స్పర్శ లేదనియు హృదయగతములగు శోకముల స్పర్శ లేదనియు బోధించుచున్నది. పుణ్య పాపములు ఆత్మ ధర్మములుకావు. అట్లయినచో సుషుప్తి అవస్థయందుగూడ అవి వుండవలెను. కాని అట్లు వుండుటలేదు. కావున సుఖదుఃఖములు ఆత్మధర్మములు కానేరవు.

అట్లే "నసాక్షిణం సాక్ష్యధర్మాః స స్పృశన్తి విలక్షణమ్. అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్, దేహేంద్రియ మనోధర్మా నైవాత్మానం స్పృశన్త్యహో" అనగా గృహము యొక్క ధర్మములు గృహమును ప్రకాశింపజేయు దీపమునకు

ఏ విధముగా సంబంధింపవో అట్లేసాక్షి ధర్మములుకాని, దృశ్యములైన బుద్ధీంద్రియ శరీరధర్మములు. దృగ్రూపుడును, స్వయంప్రకాశుడును, అవికారియు, ఉదాసీను డును అగు సాక్షిస్వరూపుని ఎన్నడును స్పృశింప నేరవు. దేహేంద్రియ మనోధర్మ ములు, అవికారియు, ఉదాసీనుడును అగు ఆ పరమాత్మను ఏ విధముగాను స్పృశింప జాలవు.

ఆ పరమాత్మ ఎటువంటి కార్యమ్ములు చేయువాడుకాడు. ఏలయన-ఆయన నిరవయవుడు. ఎటువంటి కార్యములు చేయించువాడుకూడ కాడు. ఏలయన కార్య ములు చేయించువానికి మనస్సు వుండవలె. ఆ పరమాత్మ మనస్సులేనివాడు. ఆ పర మాత్మకు కర్తృత్వము భోక్తృత్వము మొదలగు ధర్మములు లేవు. ఏలయన ఆయన మనో దేహేంద్రియాదులు లేనివాడు. ఆయన స్వయం ప్రకాశరూపుడు మాత్రమే. స్థూలదేహధర్మములు ఆత్మకు ఏ విధముగాను సంబంధింపవు. "జలేవాపి, స్థలేవాపి లుఠత్వేష జడాత్మకః నాహం విలప్యే తద్ధర్మైర్ఘట ధర్మైర్నభోయధా" అనగా జడ మైన ఈ శరీరము జలము నందైనను, స్థలమునందైనను మునిగియున్నను, పడియు న్నను పడియుండుగాక ఆకాశము ఏవిధముగా ఘటముయొక్క ధర్మములచేత అనగా అనిత్యత్వము మొదలగు ధర్మములచేతను, దానియొక్క ఆకార వికారములచేతను లిప్తముకాదో అట్లే స్థూలదేహముయొక్క ధర్మములచేత అనగా దానియొక్క జరా మరణాదులచేత ఆ పరమాత్మ లిప్తముకాదు.

కేవలము అద్వయుడైన పరమాత్మయందు—"కర్తృత్వ భోక్తృత్వె ఖలత్వ మత్తతా జడత్వ బద్ధత్వ విముక్తతాదయః,బుద్ధేర్వి కల్పానతు సన్తివస్తుతః స్వస్మిన్ పరబ్రహ్మణి కేవలేஉద్వయే" అనగా కర్తృత్వము, భోక్తృత్వము, దుష్టత్వము, మత్తత్వము, జడత్వము, బద్ధత్వము, ముక్తత్వము మొదలైన బుద్ధియొక్క అధ్యాసము వలన ఏర్పడిన వివిధ కల్పనలు వాస్తవముగ ఉండజాలవు. ఏ పర మాత్మయందు అవ్యక్తము మొదలు స్థూలము వరకునుగల ఈ ప్రపంచమంతయు కేవలము ఆభాసరూపమున తోచుచున్నదో, ఏది ఆకాశముతో సమానమైనదో, సూక్ష్మ మైనదో, ఆద్యంతములు లేనిదో అట్టి అద్వైతరూపమగు బ్రహ్మమే ఆ పరమాత్మ. "అవ్యక్తాది స్థూల పర్యంతమేత దృశ్యం యత్రాభాసమాత్రం ప్రతీతమ్, వ్యోమ ప్రఖ్యం సూక్ష్మమాద్యన్తహీనం బ్రహ్మాద్వైతం"

ఆ పరమాత్మ "సర్వాధారం, సర్వవస్తుప్రకాశం,సర్వాకారం, సర్వగం, సర్వ శూన్యం నిత్యం, శుద్ధం నిష్కలం, నిర్వికల్పం, బ్రహ్మాద్వైతం...." అనగా ఆ

బ్రహ్మము, సర్వమునకును ఆధారమైయున్నది. సర్వవస్తుప్రకాశం అనగా "తస్య భాసా సర్వమిదం" "విభాతి ఆత్మయొక్క కాంతిచేతనే ఇదంతయు భాసించుచున్నది." అని శ్రుతిచెప్పుచున్నది. అందువలన సకల పదార్థములకు ప్రకాశము దేనివలన లభించుచున్నదో అదియే పరమాత్మ. సర్వాకారం, అనగా "ఇదం సర్వం యదయమాత్మా" అనగా "ఇది అంతయు ఆత్మయే" అను శ్రుతిననుసరించి ఈ ఆత్మ సర్వవస్తు స్వరూపమైనది. సర్వగం. అంతటను వ్యాపించి యున్నదగుటచే అపరిచ్ఛిన్నమైనది. సర్వశూన్యం, అనగా తనకంటె భిన్నమైనది మరియొకటి ఏదియు లేకపోవుటచే సర్వశూన్యమైనది. నిత్యమైనది, శుద్ధమైనది, నిరవయము, అద్వితీయమైనది, ఈ పరమాత్మ "యస్మిన్నస్తాశేషమాయావిశేషం, ప్రత్యగ్రూపం ప్రత్యయాగమ్యమానం, సత్యజ్ఞానానన్తమానందరూపం బ్రహ్మాద్వైతం...." అనగా ఆ పరమాత్మ సమస్త విధములగు మాయావిశేషములు లేనివాడు అనగా సమస్తమైన అనాత్మ పదార్థములను తొలగించిచూడగా తానై భాసించువాడు. ప్రత్యయాగమ్యమానం అనగా బుద్ధియొక్క అఖండాకార వృత్తిమాత్రముచేతనే తెలియబడువాడు. సత్యజ్ఞానానన్తం-సత్యమే రూపముగా గలవాడు. జ్ఞానమే రూపముగా గలవాడు. అంతము అనునది లేనివాడు. ఆనందమే రూపముగా గలవాడు. ఆతడే అద్వితీయుడగు పరమాత్మ. "సర్వోపాధివినిర్ముక్తం చైతన్యంచ నిరంతరం, తద్బ్రహ్మ" అనగా ఆ పరమాత్మ సర్వోపాధివినిర్ముక్తం అనగా శరీరము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగు ఉపాధులు లేనివాడు. చైతన్యంచ నిరంతరం-సర్వదా చైతన్యమే రూపముగా గలవాడు. తద్బ్రహ్మ, ఆతడే సర్వవ్యాపియగు బ్రహ్మము. మరి ఇటువంటి పరమాత్మ, యొక్క ఉనికి యెక్కడ? ఎలా పొందబడతాడు? అంటే "హృదయ కమల మధ్యేదీపవత్ వేదసారం ప్రణవమయమతర్క్యం, యోగిభిర్ధ్యాన గమ్యం, హరిగురుశివయోగం, సర్వభూతస్థమేకం, సకృదపి, మనసావై చింతయేదయః సముక్తః" అనగా ఆ పరమాత్మ ఎచ్చటనో దూరమునలేడు. ప్రతి ప్రాణియొక్క హృదయకమల మధ్యమున దీపకళికవలె వెలుంగు చున్నాడు. అందుకలననే "అడుగడుగున గుడివుంది, అందరిలో గుడివుంది, ఆ గుడిలో దీపముంది దియే దైవం" అన్నాడు ఓ మహాకవి. సమస్త వేదములయొక్క సారరూపమున పరమాత్మ జ్ఞానరూపుడై వెలుంగుచున్నాడు. ఆయన ప్రణవస్వరూపుడు. ఓంకార స్వరూపుడు. అతర్క్యం తర్కబుద్ధిచే పొందశక్యముకానివాడు. కాని యోగిభిర్ధ్యాన గమ్యం అనగా ధ్యానబలము కలిగిన యోగులచే సునాయాసముగా పొందబడువాడు. హరిగురుశివయోగం- హరి, గురువు మరియు శివునియొక్క శుభసమ్మేళనమే స్వరూపముగా కలిగినవాడు. సర్వభూతస్తమేకం అనగా సర్వభూతములయందును స్వరూపుడై వెలుగుచున్న అద్వైత మూర్తియే ఆ పరమాత్మ, ఏమహాపురుషుడు ఆ

అద్వైతతత్వమును తన హృదయమునందు సాక్షాత్కరించుకొనునో ఆతడు ముక్తుడు. ఆనందస్వరూపుడు. ఏ మహాపురుషుడు ఆ ఆత్మస్వరూపమునుపొందునో ఆతడే ముక్తుడు.

ఆ ఆత్మ సర్వంతర్యామి. "ఏదిజలము, అగ్ని, వాయువు, పృథివి, ఆకాశము మొదలగు పంచభూతముల యందు నిండి వుండియు, ఆ పంచభూతములకంటె, భిన్నమై, ఆ పంచభూతములచే ఎఱుంగబడక, పంచభూతములే తనకు శరీరముగా గలిగి, పంచభూతములను లోపలనుండి నియమించుచున్నదో అదియే అంతర్యామి యైన ఆత్మ. అదియే అమృతము. అట్లే ఏది సూర్యుడు, చంద్రుడు, తేజస్సు, ప్రాణము, వాక్కు, నేత్రము, శ్రోత్రము, మనస్సు, విజ్ఞానము మొదలగు సర్వేంద్రియములయందు వ్యాపించి యుండియు, వాటికంటె భిన్నమై వాటిచే ఎఱుంగబడక, అవియే తనకు శరీరముగాగలిగి, వాటినన్నింటినీ నియమించుచున్నదో అదియేఆత్మ, అదియే అమృతము.

ఆ అంతర్యామియే ద్రష్ట, కాని అది దృష్టము కాదు. చూడబడదు. శ్రోత-కాని శ్రుతముకాదు. విజ్ఞాత-కాని జ్ఞాతము కాదు. దానిని మించిన విశ్వద్రష్ట మరియొకడు లేడు. అట్లే శ్రోతగాని, విజ్ఞాతగాని లేడు. అదియే నీ యాత్మ. అదియే అమృతము.

ఆత్మయే అక్షరము-

దేని యందు ఆకాశము వోతప్రోతమైయున్నదో, బ్రహ్మవిదులు దానిని అక్షరమందురు. అది అవినాశితత్వము. అది స్థూలముకాదు. అణువుకాదు. హ్రస్వము కాదు. దీర్ఘ ముకాదు. నిప్పుకణమువలె ఎఱుపుకాదు. ఘృతమువలె స్నిగ్ధముకాదు.అది ఛాయకాదు; తపస్సుకాదు, వాయువుకాదు, ఆకాశముకాదు, అతత్వము, అసంగము; అరసము, అగంధము, అచక్షువు, అశ్రోతము, వాక్‌రహితము, మనోరహితము, తేజోరహితము. ప్రాణరహితము, పరిమాణ రహితము. ఈ అవినాశితత్వమునకు లోపల వెలుపల అనునదేమియులేదు. ఆత్మ స్వయముగా చూచునది. దానిని చూచుట కుదరదు. ఆత్మస్వయముగా వినునది. అందుచే దానిని వినుటకుదరదు. అది స్వయముగా మననముచేయునది. కావున దానిని గురించి మనము చేయుట కుదరదు. అది స్వయముగా సర్వమును ఎఱుంగునది,తెలిసికొనునది. కావునదానిని ఎఱుగుట, తెలిసికొనుట అనునది కుదరదు. అట్టి జ్ఞానరూపమైన ఆత్మనాయందే వున్నది. ఎల్లరియందును వున్నది. అందుచేతనే అది సర్వాత్మ. సర్వాంతర్యామి. బృ 3.4

ఆ ఆత్మ పుట్టినది కాదు. ఎల్లప్పుడును వుండునది. అదిఎన్నడు ఉత్పన్నము కాదు. అది మరల పుట్టుట అను ప్రశ్న ఉదయించదు. ఆ ఆత్మ విజ్ఞానమయము. ఆనందమయము, అదియేబ్రహ్మము. అదియే నీవు. చూ. బృహ 3.8.11

---o---

# మనోవిజయమే మోక్షము

"మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

"అమృత బిందోపనిషత్తు"

ఈ సంసారమునకంతయు మనస్సే మూలకారణము. ఏలనన, ఈ మనస్సు బాహ్యేం ద్రియములద్వారా అనగా కన్ను, చెవి మొదలగు యింద్రియములద్వారా బయటకు వ్యాపించి తన యందు దాగియున్న పూర్వవాసనల బలంతో నానా విధములగు విష యములను, అనగా వస్తువులను సృష్టించుచుండును. వాస్తవముగా ప్రపంచమునందు ఎటువంటి వస్తువులులేవు. ఉన్న వస్తువులన్నియు మనస్సు సృష్టించినవే. ఇళ్ళు, వా కిళ్ళు, రైళ్ళు, కార్లు, రోడ్లు, భవనములు, అన్నీ మనస్సుయొక్క సృష్టియే. విచా రించి చూచిన ఈ విషయము సులువుగా బోధపడును. మనము మెలకువతో వున్న ప్పుడు అనగా జాగ్రిదావస్థయందు ఈ మనస్సుఇంద్రియములద్వారా అనగా కన్నులు, చెవులు, ముక్కు, మొదలగు ఇంద్రియముల మార్గమున బయటకు వెడలి అనేక రకములైన వస్తువులను, విషయములను సృష్టించి వాటియందువ్యాపించి తదాకృతిని జెంది వాటి యందలి తన అభిరుచికి అనుకూలమైన వాటి ప్రతిబింబములను తెచ్చి తనయందు చిత్రరూపమున భద్రపరచుకొంటుంది. వాటినే అనగా ఆ చిత్రములనే తనకు అనుకూలమైన సమయములందు తలంచుకొంటూ, లేక చూచుకొంటూ సుఖ దుఃఖములను అనుభవిస్తూ వుంటుంది.

అట్లుగాక స్వప్నావస్థయందు అనగా బాహ్యేంద్రియములన్నియు జాగృదావస్థ యందు చేసిన కర్మలచే ఆయాసమునొంది విశ్రాంతిపొందుచున్న సమయములందు ఆ బాహ్యేంద్రియముల సహాయములేకయే- తనే అనగా ఆ మనస్సే తనయందు విండియున్న సర్వప్రకాశకుని యొక్క ప్రకాశబలముచే సర్వమును వెలిగించి తన అభిరుచికి అనుకూలమైన నానా విధములగు వస్తువులను విషయములను; సృష్టించి, అనుభవించి, వాటితోకూడిన సుఖదుఃఖములను తానే కర్తగా భోక్తగా అయి అను భవించుచుండును.

ఈ విధముగా మనస్సు స్వప్నకాలమునందు తనకు అనుకూలమైన ఒక ప్రపంచాన్ని సృష్టించుకొని, దానిని అనుభవిస్తూ సుఖదుఃఖములను పొందుచుండును.

ఈ స్వప్నావస్థయందలి ప్రపంచము జాగృతదృష్టితో చూచినప్పుడు అసత్యముగా అనగా లేనిదిగా, కేవలము కల్పిత వస్తువుగాతోచును, కాని ఆ స్వప్నావస్థయందు మాత్రము అది సత్యముగనే తోచును.

కాని సుషుప్తి కాలమునందు అనగా గాఢనిద్రావస్థయందు ఈ మనస్సు ప్రాణమునందులయమై, ఎటువంటి వ్యవహారములేక ముడుచుకొనియుండును. అప్పుడు అనగా ఆ గాఢనిద్రతోకూడిన సుషుప్తి అవస్థయందు ఎటువంటి ప్రపంచము వుండదు. ఎటువంటి వస్తువులుగాని విషయములుగాని తోచవు, కనుపించవు. ఏలనన అచ్చట మనస్సులేదుగనుక. ఈమూడు అవస్థలు అందరి అనుభవమునందు నిత్యమూ కలుగుచుండునవియే. ఇట్లు విచారించగా తేలిన సత్యమేమన—"ఎచ్చట మనస్సు వుండునో అచ్చట ప్రపంచము వుండును. ఎచ్చట మనస్సులేదో అచ్చట ప్రపంచము లేదు. అందువల్లనే బృహదారణ్యకోపనిషత్తునందు—

"యత్ర యత్ర మనఃస్ఫూర్తి తత్రతత్ర జగత్రయం.
యత్రయత్ర మనోనాస్తి తత్రతత్ర నకించన" అని చెప్పబడినది.

ఈ మనస్సు చాలా విచిత్రమైన స్వభావముకలది. దీనికి ఇంద్రియముల సహాయముతో లేక అట్టి సహాయములేకపోయినను తనకు ఏయే వస్తువులు ప్రీతి కరములో వాటియందు వ్యాపించి ఆయా వస్తువుల ఆకారముతోనిలిచి వుండును. ప్రేమ అను సంబంధముచే యేయే వస్తువు లేక విషయము తనను ఆశ్రయించి నిల చునో ఆయా వస్తువు లేక విషయముయొక్క స్వరూపముతో స్వయముగా పరిణ మించి నిలచుటయే ఈ మనస్సుయొక్క స్వభావము—

"యత్రానసక్తిర్మన స్తత్ర తదాకారేణ తిష్ఠతి.
స యేష మనసోధర్మః స్వానుషక్తాత్మనా స్థితిః" మ. వా. ద. 246

మనస్సు యిట్టి స్వభావము కలదగుటచే—

మామూలు మానవుడు ఎప్పుడు భ్రాంతిచే ఈ శబ్దాదివిషయములను అనగా ప్రపంచమును సత్యమని తలంచి దానియందు ఆసక్తి మమకారములు కలిగియుండునో అప్పుడు ఆతని మనోవృత్తిగూడ ఆ విషయముల అనగా ప్రపంచరూపమునే దాల్చి, ఆయా ఆకారములతో, అనగా రూపములతో పరిణమించి, నిలిచియుండును. అందుచే ఆతనికి సత్యరూపము-అనగా బ్రహ్మరూపము, అనగా తనయొక్క నిజస్వరూపము బోధపడకుండును. అట్లుగాక ఎప్పుడు మానవుడు తనకు సంక్రమించియున్న

భ్రాంతిని తొలగించుకొని, విచారణద్వారా సత్యాన్ని దర్శించలుగునో అప్పుడు ఆ మనస్సుగూడ సర్వమును సత్యరూపముతోనే అనగా నిత్య, సత్య, బుద్ధ, శుద్ధరూపమైన బ్రహ్మరూపముతోనే పరిణమించి బ్రహ్మస్వరూపముతో నిలచును.

కావున ఏ పురుషుడు విషయాకారములతో పరిణమించుచున్న చిత్తవృత్తిని జ్ఞానబలంతో నిగ్రహించి, అనగా సర్వవిషయములను ఆ పరమార్థమగు బ్రహ్మ రూపముగానే గుర్తించి తనచిత్తమును విషయాకారములతోగాక బ్రహ్మరూపముననే పరిణమించి నిలిచి వుండునట్లు చేయునో ఆ పురుషుడు మనోవిజయము చేసినవాడే. ఈమనోవిజయము అంతకష్టమైన పని ఏమియుకాదు. సామాన్యమానవుడు కూడ నిత్యము ఇలాంటి కార్యవ్యాపారము చేయుచనేయున్నాడు. అది ఎట్లన-సామాన్యుడుగూడ ఒక స్త్రీని జూచి "ఈమె నా భార్య" అని అంటాడు. కాని నిజముగా ఆమె అతని భార్యకాదు· మరొకని కుమార్తె. మరొకని సోదరి. అతడు ఆమెను తన భార్యగా తలంచుతాడు. అంతే. వాస్తవముగా ఆమె, ఆమెను చూచువారందరికీ భార్యకాదు. అతనికి మాత్రమే భార్యగా తోచుచున్నది. ఎందువల్లనంటే అతడు ఆమను-ఆస్త్రీని-తనభార్యగా తలంచుచున్నాడు గనుక. అలాగే ప్రకృతవిషయమునందుగూడ వివేకియైన పురుషుడు ఈ విషయాలను, ఈ ప్రపంచాన్ని, బ్రహ్మపదార్థముగా మాత్రమే చూస్తాడు. ఇతరులకు అది ప్రపంచంగా కనుపించిన కనుపించుగాక.

ఈవిషయమే ఛాందోగ్యోపనిషత్తునందు యిలా చెప్పబడింది—

"యధా యధా స్వభావేన, యద్యద్భాతి సురర్షభాః,
తధా తధా శివోభాతి, స్వయమేవ నచాపరః
యధా యధా ప్రధా సాక్షచ్ఛాంభవీసానచాపరా,
ఇతి నిశ్చయ విజ్ఞానం పరమాద్వైత వేదనం" 113. 114.

5వ అధ్యాయం.

అనగా— "ఏయే పదార్థము ఏయే స్వభావతో చూడబడునో అది అంతయు అనగా ఆయా స్వభావములతో, ఆయా పదార్థరూపములతో గూడ పరమ శివుడే ప్రకాశించుచున్నాడు. కాని అంతకంటె భిన్నమైనదేదియులేదు."

"కావున ఎదుట కానవచ్చు సర్వమును, వినబడు సమస్తంబును, ఆ పరమేశ్వరుడేయని తెలిసి కొనుటయే తత్వజ్ఞానము."

ఈ మనోజయము అంతకష్టమైన పనికాదని తెలిసికొనుటకు మరో దృష్టాంతము—

కన్నుమూయుట, తెరచుట అనునవి మూర్ఛా నిద్రాదులలో చిక్కిన వానికి మిగుల కష్టము. కాని దేహమును ఎఱింగి జాగ్రదవస్థయందు వున్నవానికి అతి సులభము. అట్లే ఈ మనోజయము గూడ భ్రాంతి పరవశుడై ప్రపంచమును బ్రహ్మమునకంటె వేఱుగా చూచువానికి మిగుల కష్టము. కాని తత్వమును ఎఱింగి అంతటను ఆ పరబ్రహ్మ పదార్థమును చూచువానికి అతి సులభము.

విచారించి చూచిన "నేను దేహాదులనుకాను ఆ పరబ్రహ్మమును" అను నిశ్చయముతో ఎవడు జ్ఞానమయుడై, సర్వవ్యాపకమైయున్న తన యథార్థ స్వరూపమును గుర్తించి చూచుచుండునో అట్టి మహాత్ముని మనస్సు వేరెచ్చటకు పోవగలదు? తన రూపమే సర్వవ్యాపకమైయుండుటచే ఆ మనస్సు ఎప్పటికిని తనయందే నిలిచి వుండవలయును గదా! అప్పుడు అట్టి పురుషునకు విషయములుగాక సర్వత్రా ఆ పరమార్థమే కానవచ్చుచుండును. అంతే ఒక్కసారిగా విషయములన్నియు అనగా ప్రపంచమంతయు కానరాకుండా ఎచ్చటికోపోవునని అర్థముకాదు. ప్రపంచము ప్రపంచరూపమునగాక సత్యపదార్థ రూపమున దర్శనమిచ్చును, అని తాత్పర్యము. అనగా ఒకస్త్రీ భార్యగా గాక స్త్రీగానే దర్శనమిచ్చునట్లు. ఏలనన వాస్తవ స్థితిలో ఈప్రపంచమునకు—విషయములకు-నాశనము అనునది లేదు. నాశనము పుట్టిన అనగా నిత్యమైన, యథార్థముగావున్న పదార్థమునకే కలుగునుగాని భ్రాంతిచే మరొక దానియందు పూరకతోచు కల్పిత పదార్థమునకు కలుగుట అసంభవము గదా!

కావున ఈ ప్రపంచము భ్రాంతిచే ఎన్ని విధములుగా కానవచ్చుచున్నను దానియందు భ్రాంతి రహితమైన దృష్టిని కలిగియుండి "అది బ్రహ్మముకంటె వేఱుకాదు, దానిక బ్రహ్మమునకంటె వేఱు వునికియేలేదు" అని దృఢ చిత్తముతో సర్వమును బ్రహ్మరూపముననే చూచుచుండుట తత్వవేత్తయొక్క లక్షణము. తత్వజ్ఞాన ఫలముగూడ ఇదియే.

"ఇది ఘటము, ఇది పటము ఇదిబ్రహ్మముకంటె వేఱు" అను భ్రాంతిజన్యమైన అభిప్రాయమును వదలి "ఈ పదార్థములందు - అనగా ఈ ఘటము, పటము, మొదలగు పదార్థములందు కేవలము నామ రూపములు మాత్రమే క్రొత్తవి, వాస్తవ స్థితిలో ఇవి అన్నియు సర్వకారణమగు ఆ బ్రహ్మమునకంటె భిన్నము కానేరవు" అను చిత్తమును – మనస్సును – దృఢము చేసికొని, వ్యవహార కాలమందు "ఇది

ఘటము, ఇదిపటము" అని వ్యవహరించుచున్నను చిత్తమున అట్టి భేదభావన లేకుండా "ఇది అంతయూ బ్రహ్మమే" అని సర్వమును బ్రహ్మరూపమున మనస్సున నింపుకొని వుండుటయే తత్వజ్ఞాన ఫలము. కావున విద్వాంసుడగు పురుషుడు అనాది నుండి వచ్చుచున్న విషయ భావనను వదలి, అంతటను బ్రహ్మ భావనను కలిగియుండునేని అప్పుడు వాని మనస్సుగూడ పదార్థాకారమున అనగా విషయాకారమున పరిణమించుట మాని సత్యము, నిత్యమూ అయిన బ్రహ్మాకారముతో పరిణమించి నిలచును. ఈ విధముగా మనస్సును బ్రహ్మాకారముతో నిలిపి వుంచుటయే మనోజయము. విచారించి చూచిన పదార్థములన్నియూ ఆ బ్రహ్మముపై కల్పింపబడినవే కదా!.

వాస్తవ స్థితిలో ఈ శబ్దాదులకు అనగా పదార్థములకు జ్ఞాన భిన్నమగు రూపములేదు. మరొక దానిపై ఆరోపింపబడు పదార్థము లన్నియు నామ రూపములు తప్ప యథార్థమైన వునికిలేనివే. కావున ఆత్మయందే ఆరోపింపబడినవగుటచే ఈ శబ్దాది విషయములకు ఆత్మకంటె భిన్నమగు వునికియేలేదు. ఆ విధముగా ఆ శబ్దాది విషయములకును ఆత్మకును భేదమే కలుగనేరదు. ఈ ఆత్మ ప్రపంచమునకు అధిష్టానమగుటయేగాక స్వయముగా జ్ఞాన రూపుడై గూడా యున్నాడు. ఈ కారణము వలన ప్రపంచము పై రెండువిధములుగా చూచినను బ్రహ్మముకంటె భిన్నము కానేరదు. ఆరోపిత పదార్థమునకు అధిష్ఠాన భిన్నమగు అనగా జ్ఞాన భిన్నమగు రూపము లేకపోవుట చేతను, జ్ఞానమనగా పరబ్రహ్మమే అగుటచేతను బ్రహ్మ—ప్రపంచములకు ఎటువంటి భేదము వుండుటకు వీలు కలుగదు.

భ్రాంతిచే శుక్తియందు తోచిన రజతము ఆశుక్తికంటెవేఱుకానట్లు ఈ ప్రపంచము రెండవవిధముగా జూచినను తన అధిష్ఠానమగు బ్రహ్మమునకంటె వేఱు కానేరదు. ఈ విధముగా ఎట్లు విచారించి చూచినను బ్రహ్మప్రపంచములకు భేదము లేదు. కావున విద్వాంసుడగు ముముక్షువు తాను ఏయే పదార్థములను జూచినను వానియందు "ఇది పదార్థము, బ్రహ్మముకంటెవేఱు" అనుభ్రాంతిసిద్ధ పూర్వభావనను విడచును. ఇది అనగా ఈ ప్రపంచము తోచుట మాత్రమేగాని దీనికి బ్రహ్మభిన్నమగు స్వరూపములేదు అను యథార్థజ్ఞానబలముచే సదా సర్వదా బ్రహ్మభావన కలిగి యుండును.

ఇట్లు సర్వమును బ్రహ్మముగా చూచుచూ ఆ బలము వలన తనచిత్తవృత్తిని బ్రహ్మాకారముగా పరిణమింపజేయుచు, విషయాకారపరిణామమును అనగా

పూర్వమువలె "ఇది శబ్దము" అనుమొదలగు భ్రాంతి సంకల్పములతో విషయాకారముగా పరిణమించు స్వభావమును పూర్ణముగా తొలగించుకొను సామర్థ్యముగల పురుషుని చిత్తము మరేరూపమును కలిగియుండక ఆ బ్రహ్మాకారముననే నిలిచి యుండును.

పైన వర్ణించిన విధముగా మనస్సునకు కలుగు విషయాకారపరిణామమును అదుపునందుంచి, తాను దేనిని వినునో, దేనిని తలచునో, ప్రశ్నించునో దానినెల్ల బ్రహ్మాభిన్నముగా విచారదృష్టిచే ఎఱింగినవాని చిత్తము ఆ బ్రహ్మమును విడిచి ఎటకు పోవగలదు? ఎల్లప్పుడూ బ్రహ్మభావన కలిగి యుండుటయే నిజమైన జ్ఞానము, నిజమైన మోక్షము.

"నేను, ఇది" అని భేదము కల్పించుటకు కొంచమైనను అవకాశము వుండు నేని అప్పుడు మనస్సు వెలుపలి విషయములపై సంచరించును. కాని బాహ్యాభ్యంతర ములులేక సర్వమయుడైయున్న పరబ్రహ్మమునందు లోపల వెలుపల అను యే భేదకల్పన లేనినాడు "నేను, ఇది" అను వికల్పము సంభవింపదుకదా! జ్ఞానమయుడగు విద్వాంసుడు తన చిత్తమునకు అట్టి అవకాశమును కలిగింపడు. నిర్మలమై, సర్వోత్తమమై, వున్న బ్రహ్మము ఏదికలదో అదియేనేను, అదియే సర్వ పదార్థములును, అను యథార్థజ్ఞానము ఆతనికి ఇంతకు పూర్వమే కలిగియున్నది కదా! ఈ కారణము వలన వాని మనస్సు ఏ విధముగానూ చలించుటకువీలులేదు.

హేతువాదమును అనుసరించి ఇచ్చట ఒక శంకకలుగుచున్నది. అది ఎట్లన- "తనకంటె భిన్నమగు పదార్థమే లేకున్నఎడల గురుశిష్య పరంపర అనగా ఉపదేశించువాడు ఉపదేశింపబడువాడు" అను వ్యవహారము ఎట్లు కలుగును? అట్టి భేదవ్యవహారమే లేకుండిన చిత్తనిరోధము ఎట్లు సంభవించును?

అందులకు సమాధానముగా—రెండవపదార్థమే లేకపోయినంత మాత్రాన గురు–శిష్య న్యాయాదులు సిద్ధింపవని సంశయింపనక్కరలేదు. రెండవ పదార్థమునకు— అనగా ఒక అధిష్ఠానముపై కల్పింపబడిన పదార్థమునకు నాశముగాని, లయముగాని వున్నట్లుగా చెప్పుటకు వీలులేదుగదా! ఈ ప్రపంచము ఎప్పటికి, వున్నట్లే వుండుననియు, దీనియందు ప్రపంచ భావనను—బ్రహ్మాభిన్నత్వభావనను- మాత్రమే విడువవలయుననియు మాత్రమే చెప్పబడుచున్నది. ఇది బాధయేకావు వస్తుస్వరూపమునకు హాని లేదు.

స్వభావముగా ప్రశ్నోత్తరములు భేదాభిప్రాయము వుండినగాని కలుగవు—
"చోద్యం వా పరిహారోవా క్రియతాం ద్వైతభాషయా"

అను విద్యారణ్యుని వాక్యమును అనుసరించి చూచిన మొట్టమొదట అనగా అభేదజ్ఞానము కలుగనంతవరకు భేదబుద్ధివుండియే తీరునుగావున అప్పుడు గురు శిష్యన్యాయములు వుండుటకు ఎట్టి ఆక్షేపమును వుండజాలదు. భేదాభిప్రాయములేని తత్వజ్ఞాని మోక్షమునకై ప్రయత్నించుటగాని, గురువును ఆశ్రయించుటగాని కలుగనేరదు. కావున ఎట్లు చూచినను గురుశిష్యన్యాయాదులకు భంగములేదు. ఇట్లగుటచేత విచారశీలుడగు పురుషుడు సద్గురువుల అనుగ్రహమును సంపాదించి- "సర్వం ఖల్విదం బ్రహ్మ" "అంతయు బ్రహ్మమే" అనుజ్ఞానమును సంపాదించి దానిని చిరకాలము అభ్యసించుట వలన తనంతతానే అద్వైత భావస్థితికి వచ్చును. వాస్తవస్థితిలో తనకంటె అన్యమగు పదార్థమే లేదుకావున ఉపదేశికుడు వేఱొకడు వుండుటకు వీలులేదుకదా! ఇట్లు సిద్ధినిజెంది బ్రహానంద సుఖమునందలి ఆశచే సర్వమును మరచి సర్వకాలముల యందును ఆ పరబ్రహ్మమునందే ఆ పురుషుడు నిలిచి యుండును. దీనినే "ముక్తి, మోక్షము" అని విద్వాంసులు తలంచుచున్నారు.

విచారించి చూచిన భేదసంకల్పమే మనస్సు. "వీడు, నేను, ఇది" అనుభేద జ్ఞానమే లేక భేదసంకల్పమే మనస్సు అనబడుచున్నది. అది లేకుండిన అనగా భేదజ్ఞానము లేకుండుటయే అమనస్కస్థితి- అదియే ఏక స్వరూపంబును, అద్వితీయంబును అగు బ్రహ్మము. భేదసంకల్పమును తొలగించుకొనుటకు మాత్రమే గాని, బ్రహ్మమును సాధించుటకు పురుష ప్రయత్నమేదియు అక్కరలేదని ఉపనిషత్తులయందు సదృష్టాంతముగా వివరించబడియున్నది. కావున అభేదజ్ఞానము కలిగియుండుటయే మనోజయము...."జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము" అనుమొదలగు భేదములన్నియు ఆ మనస్సునందే యున్నవి. బహువిధరూపములతో అది ఒక్కటి యే సర్వమును సృజించుచున్నది. కావున అది నశించెనేని అనగా విషయాకారమును పొందక బ్రహ్మాకారమును పొందెనేని భేదము అనుమాటయే వుండదు. ఇది అందరకూ అనుభవసిద్ధమైన విషయమే.

సుషుప్తి అవస్థయందు మనస్సు ప్రాణములందు లీనమై వున్నప్పుడు స్వస్వ

రూపమున కంటె అన్యమగు పదార్థము ఏదియు అనుభవమున లేదు కదా! ఇట్లే సమాధియందును స్వస్వరూపముకంటె వేఱు పదార్థము వుండుటలేదు. సమాధియనగా యెప్పుడో ఒకప్పుడు ఆత్మఅనగా మనస్సుధ్యానమును ఆచరించుచుండుటయే అనియు అప్పుడు మాత్రమే భేదములేదనియు, అప్పుడుమాత్రమే పరమాత్మ ఏకరూపముతో ప్రకాశించుచుండుననియు, తలంచకూడదు. దేహాభిమానము తొలగి ఆత్మ స్వరూపము తెలియబడగానే మనస్సు ఎటకుబోయినను అదిఅంతయు సమాధియే.

"దేహాభిమానే గళితే, విజ్ఞాతేచ చిదాత్మని,
యత్రయత్ర మనోయాతి తత్ర తత్ర సమాధియః"

అను వాక్యమును అనుసరించి ఆత్మవేత్తయగువాడు ఎట్లు వ్యవహరించుచున్నను సమాధియందు వున్నవాడే యగును. వాస్తవస్థితిలో ఆత్మ-వేత్తకు ఆత్మ భిన్నమైనది ఏదియు తోచదు కదా!

ఈ జీవుడు, ఈశ్వరుడు మరియు ప్రపంచములును వానికి కారణమగు మాయయును; సంసారబంధంబును అన్నియు మనస్సే. అందుచే అది నాశము చెందుటయే అనగా విషయాకారముగా పరిణమించుట మాని బ్రహ్మాకార పరిణామమును పొందుటయే మోక్షము. ఇది సత్యము. అమృత బిందూపనిషత్తునందు ఈ విషయము ఇట్లు చెప్పబడినది—

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం, ముక్త్యైనిర్విషయం స్మృతమ్"

"బంధ మోక్షములకు మనస్సేకారణము" అది విషయాకారములతో పరిణమించునేని బంధమును కలిగించును. అట్లు కాదని అనగా విషయాకారములతో పరిణమించక స్వస్వ రూపముతో నిలచివుండునేని మోక్షమును సంపాదించును.

పైన చెప్పబడిన విధముగా జ్ఞాత, జ్ఞేయ, జ్ఞానాది భేదములను కల్పించుటకు మూలకారణమైన మనస్సు అభేద జ్ఞానముచే అనగా స్వస్వరూపముతో లయమునొందిన యెడల ఆ బ్రహ్మజ్ఞాని పరమానందమయమగు అద్వితీయ రూపముతో నిలచి యుండును. అప్పుడు లోపల వెలుపల అనుభేదములు అతనికి వుండవు.

బ్రహ్మము సర్వపరిపూర్ణుడు కదా! ఈ కారణమువలన అతడును "లోపల వెలుపల" అను భేద వ్యవహారమును కలిగియుండడు.

ఈ విధముగా అద్వితీయ స్వరూపముతో నిలచి యుండుట అనునదియే అన్నిటికంటె గొప్ప విజయము. అదియే సర్వోన్నతమైన పదవి. సర్వోత్తమగు ఆనందము.

ఇట్లు వివరించగా అనాత్మపదార్థములగు దేహాదులతోగల భ్రాంతి కల్పిత సంబంధమును జ్ఞానబలంతో తొలగించి యే పురుష బ్రహ్మరూపముతో నిలిచియుండునో అతడే జీవన్ముక్తుడు. అనగా శరీరము కలిగి యుండియే లోక వ్యవహారములను ఆచరించుచుండియే ముక్తిని పొందినవాడు. అట్టి జ్ఞానికి సామాన్య మానవునికి వలె సంసారము బంధమును కలిగింపజాలదు. స్థూల,సూక్ష్మ,కారణ శరీరములును సామాన్యునివలె ఆతనిని బంధింపనేరవు. అట్టి జ్ఞాని ప్రపంచబ్రహ్మభేదమును దృఢముగ ఎఱింగి ఆ జ్ఞాన ప్రతాపముచే భేదమును సంపూర్ణముగ బాధించి మనో విజయుడై, తద్వారా విశ్వవిజయుడై అద్వితీయుడై నిలిచియుండును.

ఈ విధముగా మనోవిజయముద్వారా దేహాభిమానమును తొలగించుకొనుటయే మోక్షము. అనగా "ఈ దేహమును నేను గాదు" అని నిశ్చయించుకొనుటయే మోక్షము. దేహమునుండి "నేను"ను వేఱుచేసి అద్వితీయముగా నిలచి వుండుటయే నిజమైన మోక్షము.



మోక్షము—

చేతనా చేతనాత్మకమగు ప్రపంచమంతయును పరబ్రహ్మమే యని,
నిశ్చయించి, భ్రాంతిచే గాన వచ్చు భేదము మనస్సుచే కల్పించ
బడినదేగాని యధార్థముగాదని ఆ భేద భ్రాంతిని
ధ్వంసము గావించుము, అదియే మోక్షము. భా. త. శా 54.

సర్వ కాలములయందు నిర్వికారమైయున్న స్థితియొక్క ప్రత్యక్షానుభవమే మోక్షము. తైత్త. 44

# జీవబ్రహ్మల ఐక్యానుసంధానమే మోక్షము

సత్యమును, నిత్యమును అగు పరమార్థమును తెలుసుకొనగోరు వివేకముగల మానవునికి భారతీయ ఉపనిషత్ గ్రంధములు మంచి సాధనములు. ఉపనిషత్తులన్నియు తలయొక కోణమునుండి అద్వితీయమగు పరమార్థతత్వమునే బోధించుచున్నవి. లోకమున యదార్థవిషయములను బోధించు గ్రంధములు ప్రమాణములనియు, తక్కిన వన్నియు అప్రమాణములనియు చెప్పబడుచున్నవి. అంటే యదార్థ విషయములను అనగా సర్వవిషయములను ఉన్నవి ఉన్నట్లుగా గ్రహించునవి ప్రమాణములనియు, విపరీతముగా గ్రహించునవి అప్రమాణములనియు పండితుల తీర్మానము. ఈవిధమగు యదార్థవిషయములను బోధించు గ్రంధములే ఉపనిషద్గ్రంధములు. అందు "ఛాందోగ్యోపనిషత్తు" అను ఒక ముఖ్యగ్రంధము కలదు. ఆగ్రంధము ఎనిమిది అధ్యాయములుగా విభజింపబడియున్నది. మరల ప్రతి అధ్యాయము ఖండములుగా వేఱుచేయబడియున్నది. ఆ బృహాత్ గ్రంధమునందలి ఆరవ అధ్యాయమునందలి పదునారవ ఖండమునందు "తత్వమసి" అను ఒక శబ్దము కలదు. దానినే మహావాక్యమందురు. ఆ మహావాక్యము అచ్చోట "శ్వేతకేతు" అను సాధకునకు ఆయన గురువగు ఆరుణి తొమ్మిది పర్యాయములుగా బోధించియున్నాడు. ఆ మహావాక్యమును అనగా దాని అర్థమును బాగుగా విమర్శించిన ఆత్మజ్ఞానము అనగా జీవబ్రహ్మైక్యజ్ఞానము అనగా జీవుడు బ్రహ్మము వేఱుకాదు; ఇద్దరూ ఒక్కటే అను జ్ఞానము బాగుగా కలుగును.

"తత్వమసి" అను వాక్యమునందు మూడు పదములు కలవు. "తత్; త్వం, అసి" 'తత్'. అనగా అది, అనగా సర్వవ్యాప్తమైయున్న బ్రహ్మతత్వము, 'త్వం' అనగా నీవు, అనగా మానవ ఉపాధి(శరీరము)యందున్న జీవుడు. 'అసి' అనగా ఐవున్నావు. ఆ బ్రహ్మము నీవు అయివున్నావు. "త్వం" అనగా నీవు. ప్రతివాడును "నేను, నేను" అని ఏ పదార్థమును వ్యవహరించుచున్నాడో ఆ పదార్థమునే ఇతరుడు "నీవు, నీవు" అని వ్యవహరించుచున్నాడు. ఈవ్యవహారము అందరకూ తెలిసినదే. ఒక పురుషుడు అనగా రాముడు మరియొకనిని అనగా భీముని జూచి "నీవు ఎప్పుడు వచ్చితివి" అని అడిగిన; వాడు అనగా ఆ భీముడు మొదటివానిని అనగా రామునిజూచి "నేను ఈ దినముననే వచ్చితిని" అని చెప్పును. ఈ వ్యవహారమును బట్టి చూచిన

"నేను" మరియు "నీవు" అను పదములకు అర్థము ఒక్కటియే అని స్పష్టమగు చున్నదిగదా! కావున సర్వజనులును నిత్యము వాడుకచేయుచున్న "నేను" అను శబ్దము నేను నీవు అను భేదములేక అందరి కొఱకు సమానముగా వాడబడుచున్నది. అనగా అందరియందు వున్నవాడు "నేను" అనువాడు ఒక్కడే.

ఈ "నేను, అనువాడు" నా బుద్ధి, నా శరీరము, నా చెయ్యి, నా కాలు, నా హృదయము, నా ఇంద్రియములు ఇప్పుడు పనిచేయుచున్నవి." అని తన జాగ్రద వస్థయందు తెలుసుకొనుచున్నాడు. ఈ తెలుసుకొనుటను బట్టి చూచిన నేను వేఱు ఆ మనోబుధ్యాదులన్నియు ఆతని ఎఱుకయందు వుండి నానావిధములగు కర్మలు చేయు చున్నవి అని తెలియుచున్నది. అందుచే ఆ విధముగా సాక్షివలె శరీరమంతయు వ్యాపించియుండియు ఆ శరీరమునకు అతీతముగా వున్న శుద్ధచైతన్యము ఏదికలదో అదియే "నేను, నేను" అను సర్వవ్యాపకమైయున్న బ్రహ్మపదార్థము. ఆ బ్రహ్మ పదార్థమునే కూటస్థుడనియు, ప్రత్యగాత్మయనియు చెప్పుట వాడుక, ఈ కూటస్థుడే ఆ "నేను, నీవు" అను పదములకు యదార్థమైన అర్థము అయివున్నాడు. కావున పై వాక్యమునందలి "త్వం" పదమునకు అర్థము ఆ కూటస్థుడనబడు బ్రహ్మమే.

అటు తరువాత ఆ వాక్యమునందున్న "తత్" అను పదమునకు ఈ సందర్భ మున "అది" అని అర్థము. అది అనగా అస్తిసర్వవ్యాపకమగు బ్రహ్మపదార్థము. ఛాందోగ్యోప నిషత్తునందు "సదేవశోం యేదమగ్ర ఆసీత్" అనగా ఓ శాంతుడా మొదట ఈప్రపంచమంతయు బ్రహ్మరూపముగనే వుండియుండెను. "సేయందేవ తైక్షితా" అనగా "ఆ దేవతయే అనగా బ్రహ్మపదార్ధమే సృష్టిచేయనారంభించెను" అని చెప్పుచూ తుదకు "స ఆత్మా" అతడే ప్రత్యగాత్మ, కూటస్థుడు, తత్వమసి, అతడే నీవు"అని చెప్పబడియున్నది. కావున స్వతఃసిద్ధమై,సర్వాధికమై;ఏకరూపమై; సర్వకారణమై, సత్యజ్ఞానానందరూపుడై "పరమాత్మ" అని ఏ పదార్థతత్వము వ్యవహరింపబడుచున్నదో అదియే ఈ వాక్యమునందలి "తత్" పదమునకు అర్థము

"సహజం తు పరం బ్రహ్మకేవలానంద లక్షణమ్
తత్వదస్యభవేదర్థో యః పరాత్మేతి గీయతే" మ. ద. 16

ఆ వాక్యమునందలి "అసి" పదమునకు ఆ కూటస్థబ్రహ్మల ఐక్యమే" అర్థము. కావున "తత్, త్వం, అసి," అనగా "ఆ బ్రహ్మము నీవే అయివున్నావు" అను వాక్యమునకు "కూటస్థబ్రహ్మలకు భేదములేదు." అను అర్థము ఏర్పడుచున్నది ఈ అభేదము స్వభావసిద్ధమైనదేగాని ఏ విధముగాను ఏర్పడినది కాదు, ఘటముచే

చుట్టబడిన ఆకాశము మహాకాశముకంటె భిన్నముకానట్లు ఈ కూటస్థుడును ఆ పర బ్రహ్మముకంటె ఎన్నడును వేఱుకాదు.—

"ఏకస్య బ్రహ్మణః శుద్ధ సత్వోపాధి సమన్వయాత్.

ఈశతా జీవతా వ్యస్య మలినోపాధి యోగతః మ. ద. 22.

అనగా సత్వ రజ స్తమో గుణములలోని భేదముచే అమలసత్వప్రధానావరణమం దున్నవాడు ఈశ్వరుడనియు, మలినసత్వ ప్రధానావరణమునందున్న వాడు జీవుడని యు, అనగా అవిద్యావరణమునందున్నవాడు జీవుడనియు చెప్పబడుచున్నాడు.

అంతేకాని ఆజీవేశ్వరులు పరస్పరము భిన్నులుకారు. ఆ పరబ్రహ్మము సత్య స్వరూపుడు. సర్వమునకు ఉపాదాన కారణము. అనగా మూలాధారము ఆయనయే అయి వున్నాడు. ఆయనగాక వేఱొక పదార్థము ఇచ్చట మరేదియునులేదు. "భూమి వున్నది. ఆకాశము వున్నది" అను సర్వ పదార్థములతోగూడ వ్యవహరింప బడు "వునికి"యే స్వరూపముగా గలవాడు ఆయనయే అగుటచే ఆయనయందు భేధముండుటకు వీలులేదు. ఆయన రూపమున ఉన్న ఈ వునికికంటె వేఱొక వునికిలేదు. ఏలయన ? రెండు వునుకులు అనగా సత్తలు; అనగా సర్వసత్తాకమైన శక్తులు వుండుటకు వీలులేదుకదా ! ఆ విధముగా రెండు సర్వసత్తాక శక్తులు-వునుకులు - గలవని విరూపించుట సంభవముకాదు, జ్ఞాన— స్వరూపుడు అగుటచే ఆ బ్రహ్మమునందు భేదముండుటకు కుదరదు-ఒక జ్ఞానము నకుసాక్షియై మరియొకజ్ఞానము కలదనిన మరలదానికిగూడ మరియొక సాక్షికావలసి వచ్చును. అట్లన్నచో అనవస్థాదోషము అనగా ఎప్పటికిని నిలుపులేని లెక్కకు మిం చిన సాక్షులు అనగా జ్ఞానములను అంగీకరింపవలసి వచ్చును, అందుచేత జ్ఞాన రూపుడగు బ్రహ్మముఒక్కడే. ఈ విధముగా జ్ఞానరూపుడు అగుటచేత ఆ బ్రహ్మ మునకు వేఱుగా జీవుడు అనబడువాడులేడు. కావున జీవేశ్వరులు పరస్పరముభిన్నులు కానేరరు.

అట్లయినను ఈశ్వరుడు "పరాత్మ" జీవుడు "అపరాత్మ" అనుభేదము ఎట్లు కలుగుచున్నది? ఈ వ్యవహారము వలన వారిరువురికి భేదమున్నట్లుగా స్పష్టమగు చున్నది కదా! ఆ జీవేశ్వరులు పరస్పరము భిన్నులుకాని యెడల ఈవిధమగు వ్యవ హారమునకు అవకాశము వుండెడిదికాదు! అను సందేహము కలుగుచుండుట స్వాభా వికమే. అయిననువారి ఆ భిన్నత్వము స్వాభావికముకాదు. కేవలము కల్పితము.అదె ట్లనగా?—చక్రవర్తియు, ఆయన సేవకుడగు సైనికుడు ఇరువురు మనుష్యులే. అయి

నను రాజ్యము కలదనినంత మాత్రముచేత చక్రవర్తి ఆసైనికుని కంటె అధికుడుగా తలంచబడుచున్నాడు! అట్లే ఈశ్వరుడు జీవుడు ఇరువురును యధార్థమున ఆ పర బ్రహ్మ స్వరూపులే అయివున్ననూ; శుద్ధసత్వోపాదికలవాడగుటచే ఈశ్వరుడు జీవుని కంటె అధికుడుగా తలంచబడుచున్నాడు. సైనికుడును మనుష్యుడేయైనను రాజ్యము లేనందువలన ఏవిధముగా చక్రవర్తికంటె హీనుడుగా తలంపబడుచున్నాడో ఆవిధము గానే జీవుడు శుద్ధి సత్వోపాధి యందున్న వాడుగాక మలిన సత్వోపాధి యందున్న వాడగుటచే ఆ ఈశ్వరుని కంటె హీనుడుగా తలంచబడుచున్నాడు. అట్లయిననూ మనుష్యత్వమును బట్టి చూచిన సైనిక చక్రవర్తులిరువురును ఎట్లుఏకస్వరూపులే అగు చున్నారో అట్లేవారివారి ఉపాధులను తొలగించి వారికున్న బ్రహ్మత్వమును బట్టి చూచిన ఆ జీవేశ్వరులిరువురూ కూడా ఏక స్వరూపులే అగుచున్నారు.

వారిరువురకు భేదము ఉపాధిచే కల్పింపబడినదేగాని తత్వతః వచ్చినది కాదు.

"ఉపాధేరేవ మహాత్మ్య జీవాచ్ఛేష్టత్వ మీశితుః
యథా సామ్రాజ్య మహాత్మ్య త్సేవకా చక్రవర్తినః" మ.ద. 23.

ఇట్లు జీవేశ్వరులిరువురకును ఎటువంటి భేదములేక ఇరువురు అభిన్నులై ఒక్కటియే అయినచో మరి ఈ సంసారము ఎటనుండి వచ్చినది? ఈ సంసారము జీవునకా లేక ఈశ్వరునకా? ఇరువురూ ఒక్కటే అయినచో ఈ సంసారము ఇరు వురకు సమానముగా వుండవలయును కదా! అప్పుడు మోక్షము ఎవ్వరికి కలుగును? జీవునకా, ఈశ్వరునకా? లేక ఇరువురకు కల్గునా? అన్నచో ఈ సంసారము అజ్ఞాని యగు జీవునకే కలుగుచున్నది. ఈశ్వరుడు మయోపాధియందున్న వాడగుటచే, సూక్ష్మరూపముకలవాడై జీవరూపధారులైన అందరియందు సమముగావ్యాపించియున్న వాడై ఉన్నందున ఆయనకు ఈ సంసారము లేదు.

వాస్తవస్థితిలో ఆత్మకు కర్తృత్వముతోగాని, సంసారముతోగాని ఎటువంటి సంబంధములేదు. సంసారమనునది సంపూర్ణముగా శూన్యమైనదియే. కేవలము మనో విచారరూపమైనదియేగాని అందు సత్యమేమియునులేదు. స్వప్నావస్థ అందరకు అను భవమునందు వున్నదియేకదా! ఆ అవస్థయందు శబ్దాదివిషయములేవియు లేకున్నను ప్రతివాడును కలగాంచుచున్నాడు. మరియు ఆ కలయందు బహువిధ సాంసారిక సుఖ దుఃఖములను అనుభవించుచున్నాడు. మరి ఆ సంసారము ఎటనుండి వచ్చినది? ఎట్లు విచారించి చూచినను ఆ అవస్థయందు కేవలము బుద్ధిమాత్రమే కలదు. కావున అదియే ఆ సంసారమును కల్పించినదనవచ్చును. అదియే యధార్థముగూడ. జాగ్రదవస్థ

యందుగాని, పూర్వజన్మమునందుగాని సంపాదించిన వాసనలను అనుసరించి ఆ బుద్ధియే—ఆ మనస్సే—అప్పటి సంసారమును కల్పించుచున్నది. జాగ్రదవస్థయందు అనుభవించిన సంసారమునే స్వప్నావస్థయందు చూచు స్వభావముకలదు. యథార్థముగ స్వప్నమునందు విషయములేవియు లేకున్నను, వాసనాబలము వలన మనస్సు సర్వవిషయములను కల్పించుచున్నట్లే ఆ మనస్సు జన్మాంతరవాసనాబలము వలన జాగ్రదవస్థయందును సంసారమును కల్పించుచున్నది. ఇదియే సంసార స్వరూపము. కావున ఈ సంసారము కల్పనామాత్రమే. వాస్తవముకానేరదు. స్వప్నమునందలి స్థితిని అనుభవించుచుండియు, దానిని అసత్యమని నిశ్చయించియుండియు జాగ్రదవస్థయందలి సంసారమును గూర్చి సంశయమేల? దానిని సత్యమని భావింపనేటికి? కావున జనులందరునూ అజ్ఞానమువలన లేనిసంసారమును కల్పించుకొని దుఃఖించుటయేగాని మరేమియులేదు—

"స్వప్నేయథా నిర్విషయేపి సంసృతిం, సూతేమనః స్వస్థితవాసనాబలాత్,
తథైవ జాగ్రత్యపి పూరుషస్య సర్వమనః కల్పయతే స్వశక్త్యా."మ.ద.59.

"త్వం"పదమునకు అర్థమగు ప్రత్యగాత్మ సామాన్యముగా జీవుడని తలంపబడువాడు కాదు. వాస్తవమున జీవత్వమనునదియే లేదుకదా. కావున ఈ ప్రత్యగాత్మకు అజ్ఞానముతోగాని, దానిచే కల్పింపబడిన సంసారముతోగాని ఎటువంటి సంబంధములేదు. "వీడు, వాడు" అను విభేదము ఎప్పటికిని కలుగదు. ఎల్లప్పుడు ఆయన ఎట్టి కార్యమునుచేయడు. ఈ ప్రత్యగాత్మ ఎప్పటికిని ఆత్మస్వరూపుడే. నిర్మలుడే. ఒకప్పుడు బంధమును చెందుటయు, మరియొకప్పుడా బంధమునుండి ముక్తుడగుటయు అనునది లేనేలేదు. "తత్" పదమునకు అర్థమని చెప్పబడు శుద్ధ పరబ్రహ్మమువలెనే ఈ ప్రత్యగాత్మయు నిత్యముక్తుడే. ఈ సిద్ధాంతమునకు వ్యతిరేకముగా ఏమేమి గ్రహింపబడునో అదియంతయు భ్రాంతిసిద్ధమే.

"తస్మాదవిద్యా తత్కార్య సంబంధరహితః సదా
శుద్ధ ఏవ భవత్యాత్మా నిష్కళో నిష్క్రియః స్వయం" మ. ద. 86.

పైన జూపిన కారణమువలననే అనగా ప్రత్యగాత్మయును సంసారాదులతో సంబంధములేని సిద్ధుడేగావున "తత్" శబ్దముచే చెప్పబడు బ్రహ్మమునకు ఈయనకును ఎట్టి భేదములేకపోవుటవలననే వేదము "తత్త్వమసి" "ఆ బ్రహ్మమే నీవైయున్నావు" అని పలుమార్లు చెప్పుచున్నది. ప్రకరణ సందర్భమును బట్టి చూచిన ఆ మహావాక్యమునకు మరియొకతీరుగా అర్థముచెప్పుటకు వీలులేదు. అభేదమునందే వేదము

నకు అభిప్రాయముకలదుగాని భేదమునందులేదు. కావున వేదముయొక్క ముఖ్యాభిప్రాయము జీవబ్రహ్మైక్యమే. కావున "తత్త్వమసి" అనువాక్యమునకు అర్థము జీవబ్రహ్మైక్యమే. ఇందు సంశయమేమియునులేదు. ఈ అభిప్రాయమును దృఢపరచుటకై ఛాందోగ్యోపనిషత్తునందు తొమ్మిదిమారులు చెప్పబడియున్నది. "సా ఆత్మా" ప్రపంచమునకు ఉపాదాన, నిమిత్తకారణములైన ఈ బ్రహ్మమే ప్రత్యగాత్మ : "తత్త్వమసి" "ఆబ్రహ్మమేనీవు" అని ఆ ఉపనిషత్తునందు దృష్టాంతపూర్వకముగా నొక్కిచెప్పబడియున్నది. ఉపాదాన, నిమిత్తకారణములనగా—

కుండకు మట్టివలె, ఏ కారణము కార్యరూపముగా పరిణమించునో, లేక వివర్తమునొందునో అది ఉపాదానకారణమనబడును. ఆ కుండకు యేకుమ్మరివానివలె ఈ కారణము కార్యమునుచేయునో అది నిమిత్తకారణము అనబడును. ఈబ్రహ్మము ప్రపంచమునకు వివర్తాధిష్ఠానమగుటచేతను, అనగా ప్రపంచభ్రాంతికి ఆధారమగుటచేతను,-బ్రహ్మమునే ప్రపంచమని అజ్ఞానముచే తలంచుచున్నారనుట. భ్రాంతిరూపిణియగు మాయకు ప్రేరకుడై యుండుటచేతను, ఆయనయే దీనికి ఉపాదానకారణమును, నిమిత్తకారణమును అయివున్నాడని తెలియనగును-

అతఏవ శ్రుతిర్వ్యక్తి బ్రహ్మభిన్నత్వమాత్మనః,
సాక్షాతత్త్వమసీత్యేవ భూయోభూయః పునః పునః." మ. ద. 87.

ఈ విధముగా చేతనాచేతనాత్మకమగు ప్రపంచమంతయు పరబ్రహ్మమే కావున ఆ బ్రహ్మమే ప్రత్యగాత్మ అనగా జీవుడు. ఈ ప్రత్యగాత్మయే ఆబ్రహ్మము. వేదము వీరిరువురి భేదమును ఇంచుకయైనను అంగీకరింపదు. కావున జీవబ్రహ్మైక్యానుసంధానమే వేదమునకు తాత్పర్యము.

లోకమున ప్రత్యగాత్మరూపుడగు జీవునకు ఏ గుణముతోను సంబంధము లేకున్నను."జీవుడు కించిదజ్ఞుడు, సుఖి,దుఖి"అను వ్యవహారములు భ్రాంతిదోషము వలన కలుగుచున్నవే. వాస్తవస్థితిలో సర్వసాక్షియగు ఆ ప్రత్యగాత్మకు కించిదజ్ఞత్వము ఎట్లు కలుగును? సుఖదుఃఖములను చూచువారితో ఆ సుఖదుఃఖములు ఎట్లు సంబంధపడును? ఇది అంతయు అజ్ఞానముచే కల్పింపబడినదియే. అసత్యమైనదియే. ఇట్లే ఈశ్వరునియందు ఆరోపింపబడుచున్న సర్వజ్ఞత్వాది గుణములు కూడ ఆత్మయందు అజ్ఞానముచేకల్పింపబడినవే. వ్యష్టి వుపాధి అనగా ఏకదేహోపాధి-ని ఆశ్రయించినవాడగుటచే జీవుని కించిదజ్ఞునిగాను సమిష్ట్యుపాధి అనగా

సర్వదేహోపాధిని, ఆశ్రయించినవాడగుటచే ఈశ్వరుని సర్వజ్ఞునిగాను లోకులు భ్రాంతిచే తలంచుచున్నారు.

ఈ అజ్ఞానము ఎవ్వనికి కలుగుచున్నది? నిత్యశుద్ధుడగు పరమాత్మను జీవేశ్వరులుగా తలంచువాడెవ్వడు? బ్రహ్మమునకంటె ఇతరుడగు సాక్షియేలేదుకదా! అనగా వేఱు పదార్థమును చూచువాడు లేడుకదా! అని తలంచినచో—ఆయజ్ఞానమునకును బ్రహ్మభిన్నమగు ఆశ్రయములేదు. విషయమును లేదు. ఆయజ్ఞానము బ్రహ్మమునే ఆశ్రయించి ఆ బ్రహ్మమునందే బహువిధ విరుద్ధరూపములను కల్పించి ఆ బ్రహ్మమునే మరియొక అనగా బ్రహ్మమున కంటె వేఱగు రూపమున తోపింప జేయుచున్నది. అట్లయినను ఆ బ్రహ్మమునకు ఎటువంటి వికారముగాని, పరిచ్ఛిన్నత్వముగాని అనగా విభాగములుగాని కలుగుటలేదు. శిష్యులను ఉద్ధరింపుటకు బ్రహ్మవేత్త భేదబుద్ధిని అంగీకరించినట్లుగా "బ్రహ్మభిన్నముగ అజ్ఞానమనునది ఒకటి కలదు. అదియూ బ్రహ్మమునే ఆశ్రయించి యున్నది. ఈ ప్రపంచమంతయూ ఆ అజ్ఞానముచే బ్రహ్మమునందే కల్పింపబడియున్నది." అని అంగీకరింపుట మాత్రమేగాని వాస్తవస్థితిలో బ్రహ్మభిన్నమగు పదార్థము ఒక్కటియు వుండుటకు వీలులేదు. ఈ కారణమువలన అజ్ఞానము ఎట్టిదియైనను, తనయందే యున్నను, ఆ బ్రహ్మమునకు మాత్రము హాని ఏమియులేదు. బ్రహ్మమునకంటే భిన్నముగ గానవచ్చు ప్రపంచమెట్లు ఆ బ్రహ్మమునకంటె ఏ మాత్రము భిన్నముగలేదో అట్లే ఈ అజ్ఞానముకూడ విచారించిచూచిన ఆ బ్రహ్మమునకంటె భిన్నముకానేరదు. కావున ఎట్లు విచారించినను ఈదృశ్యమానమగు ప్రపంచమునకు కారణమగు అజ్ఞానము బ్రహ్మభిన్నమగుస్థలమున వున్నది అని అనుటకు వీలులేదు. బ్రహ్మమునందు వున్నది అని అనుటకుగూడవీలులేదు. అయినను ప్రపంచమువలెనే ప్రపంచ కారణమగు అజ్ఞానముకూడ బ్రహ్మయందే అనగా బ్రహ్మయొక్క ప్రతిబింబ రూపుడగు జీవునియందు వున్నదని చెప్పబడుచున్నది. ఈ విధముగా జీవునివలె జీవునియందున్న ఈ అజ్ఞానముకూడ కల్పితమగుటచే అసత్యమే. ఉన్నట్లుగా తోచినను సంపూర్ణముగ త్రికాలములయందును లేనిదియే కావలసివచ్చును. కారణము ఒక విధముగాను, కార్యము మరొకవిధముగాను వుండుటకు వీలులేదుకదా! ఈ కారణము వలన ప్రపంచమువలె దానికి కారణమగు అజ్ఞానముకూడ అసత్యమే కావలయును. ఉన్నట్లుగా తోచుచున్నను లేనిదియే కావలయును. ఇట్టి అజ్ఞానము ఆత్మను ఒకప్పుడు బంధించెననియు, ఇంక విడువదనియు తలంచుట వివేకముకానే

రదు. మరియు "ఈ అజ్ఞానము నిత్యము" అని భేదదృష్టిగల శిష్యులను ఉద్ధరించుటకై అంగీకరించినప్పుడు సహితము సర్వసాక్షియగుటచే ఆత్మకు దాని వలన హాని యేమియుకలుగనేరదు. కావున ఎట్లుచూచినను అజ్ఞానమునకు ఆత్మయే ఆశ్రయము. అది అభావరూపమగుటచే తదాశ్రయత్వమువలన ఆయనకు హాని యేమియుకలుగనేరదు. భావనామాత్రమేగాని వాస్తవస్థితిలో ప్రపంచము, మరియు దానికి కారణమగు అజ్ఞానముకాని, దానివలన కలుగు బంధముకాని, దానినాశముచే కలుగు మోక్షముకాని సర్వమును అసత్యమే. త్రికాలములయందును లేనిదే కదా! కావున "స్వాజ్ఞానకల్పితాః సర్వే స్వస్మిన్ కించితజ్ఞతాదివత్" అనువాక్యము సత్యమగుచున్నది.

"మాయామాత్రమిదం ద్వైతం" అను మొదలగు వాక్యములచే వేదముపై సిద్ధాంతమునే దృఢము చేయుచు "బ్రహ్మభిన్నముగగానవచ్చునదంతయు అసత్యమే" అని స్పష్టము చేయుచున్నది. దీనిని బట్టి చూచిన భేదమంతయును అజ్ఞాన కల్పితమే అగుచున్నది. "ఇతడు, జీవుడు,ఇది ఈతని ఉపాధి అవిద్య, ఇతడు ఈశ్వరుడు ఇది ఈతని ఉపాధిమాయ" అనుటయుభేదమే. కావున భేదమంతయు అసత్యమైన, ఈ ఉపాధులు *గూడ* అసత్యములే కావలసివచ్చును— ఇట్లు ఉపాధులు అసత్యములైన వానియందున్న "కించిత జ్ఞత్వ, సర్వజ్ఞత్వాది" గుణములు మాత్రము సత్యములగునా? కావున జీవేశ్వరులకు ఉపాధులగు అవిద్యా మాయలును, వానినాశ్రయించియున్న సర్వజ్ఞత్వ, కించిదజ్ఞత్వాది గుణములును మాయయేగాని వేతేమియుకాదు. "యామా సామాయ" "ఏదిలేదో అదిమాయ" అను వ్యుత్పత్తిని అనుసరించి చూచిన ఇవియన్నియు త్రికాలముల యందును శూన్యములే, లేనివే. కావున ఈశ్వరునకు గల సర్వజ్ఞత్వాది గుణములు అసత్యములే యనిన ఏల సంశయింపవలయును ? —

"మాయామాత్రమిదం ద్వైతం ఇతిశ్రుతి వచో బలాత్,
ద్వైతస్య భ్రమ కార్యత్వాత్తదంతఃపాతినోరపి" మ.ద. 156.
"ద్వయోర్జీవేశ్వరోపాధ్య స్తద్వైవో భయగామినాం,
సర్వజ్ఞత్వాది ధర్మాణాం మృషాత్వేకో ఒ త్రసంశయం" మ.ధ. 157

కావున జీవేశ్వరులు లేక జీవబ్రహ్మలు ఒక్కటియే అనుటయే వివేకముతో కూడిన విషయము. ఉపాధులును, వాని నాశ్రయించియున్న కించిదజ్ఞత్వ, సర్వజ్ఞ

జ్ఞాత్వాది గుణములును అసత్యములే. కావున విచారించి చూచిన వారిరువురకును శుద్ధజ్ఞాన మొక్కటియే స్వరూపమగును. ఈ విధముగా ఉపాధి రహితత్వంబును, నిర్వికార జ్ఞానరూపత్వంబును, ఒక్కటియే అయియుండ ఇంక వారిరువురకును భేద మెట్లుకలుగును? కావున వారిరువురును ఒక్కటియే "తత్వమసి" అని వేదము చెప్పిన వాక్యము ఎన్నటికిని అసత్యము కానేరదు.

"యత ఏకమతః శుద్ధచిన్మాత్రైకస్వరూపిణోః
యుక్తం బ్రహ్మాత్మనో రైక్యం శ్రుత్యుక్తం న విరుధ్యతే" మ.ద. 158.

ఈ విధముగా జీవబ్రహ్మైక్యమే సత్యమైన మరిసాధకుడెవ్వడు ? అనిన భేదదృష్టి యున్నంతకాలము జీవుడే సాధకుడు. కల్పనా మాత్రమయ్యు అనాదియగు అజ్ఞానము వలన కలిగిన భేదదృష్టి ఎంతకాలముండునో అంతకాలము వరకును ఆ జీవేశ్వరులకు ఉపాధి సంబంధముండును. అప్పుడు జీవుడు "నేను మోక్షమును సాధించెదను" అని సంకల్పించు చుండును. కావున ఆ జీవుడే సాధకుడు. ఉపాధి సంబంధమును బట్టియేకాని లేకున్న మోక్షము సాధ్యంబునుగాదు. జీవుడు సాధకుడునుకాడు గదా! భేదదృష్టి నశించిననాడు ఉపాధులుగూడ ఆత్మరూపు లేయగుటచే అప్పుడు జీవత్వాదులుగూడ కలుగనేరవు. కావున భేదదృష్టియున్నంతకాలమే జీవుడే సంసారి, జీవుడే సాధకుడు. భేదదృష్టి యున్నంతకాలము సంసారము నశింపదుగదా!—

"తావద్యుపాధి సంబంధో యావత్స్యాద్భేద దర్శనః,
న భేదదర్శనో జంతోస్సంసారో ననివర్తతే" మ.ద. 160

"బ్రహ్మమువేఱు, తానువేఱు" అని తలంచువానికి భయముకలుగునను చున్నది.

"యదాహ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే అధ తస్య భయంభవతి"

ఏలయన రెండవది యున్నప్పుడేగాని భయము కలుగదు. భయహేతువు భేదదృష్టియే కావున భేదదృష్టి కలవానికి సంసారము కలుగుచున్నది. అజ్ఞానము నశించునంత వరకు భేదదృష్టి నశింపదు. ఆ భేదదృష్టి నశింపనంతవరకు సంసారము నశింపదు. కావున భేదదృష్టి వలననే అనగా అజ్ఞానము వలననే సంసారము కలుగుచున్నది.

ఈ విధముగా బహువిధ దుఃఖములకు కారణమగు సంసారము కేవలము అజ్ఞాన కల్పితమే యగుటచేతను, ఆ సంసారము నాశము నొందక బ్రహ్మానంద

రూపమగు మోక్షము కలుగక పోవుటచేతను ప్రతి పురుషుడును సంసార నాశము నకై ప్రయత్నింప వలయును. ఆ సంసారమునకు భేదదృష్టియే కారణము కావున దాని వినాశమునకై అభేదదృష్టిని సంపాదింపవలయును. జీవునకును బ్రహ్మమున కును భేదము లేదనుటను అనగా జీవబ్రహ్మైక్య భావమును చక్కగ తెలుసుకొన వలయును. అట్లు తెలుసుకొనినవాడు మాత్రమే ముక్తుడు.—

"తతోనిశ్శేష సంసారోచ్ఛిత్త్యైనిత్యసుఖాప్తయే
జ్ఞాతవ్యం విదుషా సమ్యగ్బ్రహ్మ భిన్నత్వ మాత్మనః" మ.ద.162

బ్రహ్మముకంటె భిన్నమగు పదార్థము ఒక్కటియును లేదు. బాహ్యదృష్టికి ఉన్నట్లుగా తోచినను కొంచము విచారించి చూచిన వాస్తవ స్థితిలో ఏదియు బ్రహ్మ భిన్నము కానేరదు. ఈ విధముగ జడచేతనాత్మకమగు ప్రపంచమంతయు ఆ పర బ్రహ్మమే కావున ఆ బ్రహ్మమే ప్రత్యగాత్మ, జీవుడు-ఈప్రత్మగాత్మయే బ్రహ్మము. వేదము వీరి భేధమును కొంచము గూడ అంగీకరించుటలేదు. కావున జీవబ్రహ్మల అభేదమే వేదమునకు ముఖ్య అభిప్రాయము—

"ప్రత్యగేషపరంబ్రహ్మ బ్రహ్మైవ ప్రత్యగేషకః
నోభయోరంతరం కించిత్య హంతే శ్రుతయః, క్వచిత్‌ః" మ. ద. 167

అందుచేత శ్రుతి, స్మృతి తాత్పర్యముల బాగుగ విమర్శించి యదార్థతత్త్వ మును స్వానుభవ పూర్వకములగు యుక్తులచే నిర్ణయించిన మహాత్ములు జీవబ్రహ్మ భేదమును కొంచమైనను భావించుటలేదు.జీవునికంటె"బ్రహ్మభిన్నుడు బ్రహ్మమున కంటె జీవుడు భిన్నుడు" అని ఎన్నడును తలంపరు. కావున విద్వాంసులగువారి అను భవమును బట్టి చూచినను జీవబ్రహ్మైక్యమే యదార్థము.

"శ్రుతేః స్మృతేశ్చాపి తత్వం పర్యాలోచ్య స్వయుక్తిభిః
బ్రహ్మాత్మనోర్నైవ భేదమీషత్పశ్యంతి సూరయః" మ. ద. 168

కార్య కారణములకు ఎచ్చటనైనను నామరూపాతిరిక్తమగు భేదములేద వియు, వ్యవహారమాత్ర సాధనములగు ఆ నామరూపములను అనుసరించి వస్తుభేద మును కల్పించుట కంటె అజ్ఞానము మరియొకటిలేదని శాస్త్రము వేయినోళ్ళతో ఘోషించుచున్నది. కావున జీవబ్రహ్మభేదముకాని, మరి యేభేదముకాని అజ్ఞానము చేతనే కల్పింపబడుచున్నదనుట సిద్ధాంతమగుచున్నది. అజ్ఞానముచే కల్పింపబడి నవి యథార్థములు కానేరవనుటయు సర్వానుభవ సిద్ధమే. కావున ఆ యజ్ఞానము విచారజన్య జ్ఞానముచే నశించిన పిదప జీవబ్రహ్మభేదము ఎటనుండి వచ్చును? అ

జీవబ్రహ్మభేదము అజ్ఞానకల్పితము అగుటచే సత్యము కానేరదు. త్రికాలముల యందును లేనిదియే అగును. లేనిదానిని వున్నట్లుగా భావించుటయే అజ్ఞానము అని అందరకు తెలిసిన విషయమే. ఈ అజ్ఞానము ఒక మాఱు నశించిన పిదప తిరిగి మరల జనించునదికాదు. కావున ఈ భేదభ్రాంతి మరియొకమారు కలుగునేమో యను సంశయముగూడ వుండ నేరదు. జ్ఞానము కలుగగానే ఆయజ్ఞానము సమూలముగ తొలగిపోవును. జీవబ్రహ్మములకు భేదమువున్నట్లు తోచునప్పుడుగూడ అది అసత్యమే కావున ఎప్పటికిని జీవబ్రహ్మైక్యానుసంధానమునకు భంగముకలుగదు.

"విభేద జనకాజ్ఞానే నాశ మాత్యంతికం గతే
ఆత్మణో బ్రహ్మణో భేదమసంతం కః కరిష్యతి" మ. ద. 169

ఈ కారణమువలన—"అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం"

"అనగా లోకమున కలిమి, ప్రకాశము, ఆనందము, రూపము, పేరు అను ఐదు పదార్థములు మాత్రమే మన అనుభవములో వున్నవి. ఇందు మొదటి మూడును పరబ్రహ్మము యొక్క రూపములు. తరువాత వున్న రెండును అనగా రూపము, నామము ప్రపంచము యొక్క రూపములు. కావున బ్రహ్మసంబంధముచే ప్రపంచమునకు ఆమొదటి మూడు రూపములుగూడ స్వాభావికములు అయినట్లే తోచుచున్నది." అను ప్రమాణమును అనుసరించి నామరూపాత్మకమగు ప్రపంచము భ్రాంతిచే యేయధిష్ఠానమందు ఆరోపింపబడియున్నదో అదియే పరబ్రహ్మము. గారడీవానిచే ఆకాశమునందు కల్పింపబడు నగరముతో ఆయాకాశమునకు ఎటువంటి సంబంధములేనట్లుగా భ్రాంతికల్పితమగుటచే ఈ ప్రపంచముతో ఆత్మకు ఎటువంటి సంబంధము కలుగనేరదు, మరియు సర్వాధిష్ఠానము అగుటచేతను, సర్వసాక్షి యగుటచేతను, ఆయన, ఆ పరమార్థము, అతిప్రసిద్ధుడైయున్నాడు. సర్వవ్యాపకుడును అయివున్నాడు. సర్వమును భ్రాంతికల్పితమే కావున ఆ బ్రహ్మమునకును, సీకును, అనగా ప్రత్యగాత్మకును భేదము కొంచమైనను లేదు. ఇదియే సత్యము, ఇది ధృవము, నిశ్చయము.

"నామ రూపాదయో యత్ర కల్పితా శ్చిత్త విభ్రమాత్
వ్యోమ్నీవ నగరం యత్తద్బ్రహ్మ"తత్వమసి"ధ్రువమ్" మ. ద. 170

ఏ స్థలమున, "చూచువాడు, చూపు, చూడబడునది" అను భేదములులేవో, పరిశుద్ధమై అద్వితీయమై, ఏ పదార్థము సర్వప్రకాశకరూపమున ప్రకాశించుచున్నదో అట్టి బ్రహ్మమే నీవు. ఇందు సంశయములేదు.

"ద్రిష్ట దర్శన, దృశ్యానా మభావో యత్రదృశ్యతే,
యదేవ కేవలం శుద్ధం, బ్రహ్మ "తత్వమసి"ధృవమ్" మ.ద. 171.

ఏ బ్రహ్మము సర్వత్రనిండి వెలుపల లోపల అనుభేదములేక స్వతంత్రముగా అద్వితీయమై, సాధ్యసాధనాది భేదములు అసత్యములు గావున, ఏ కార్యమును ఆచరింపక నిర్వికారమై సర్వోత్తమమగు జ్ఞానమే స్వరూపముగా గలదియై,శాశ్వతమై యున్నదో, అట్టి బ్రహ్మమే నీవు-తత్వమసి-ఇది నిశ్చయము—

"అంతఃపూర్ణం, బహిః పూర్ణం, స్వయమద్వయమక్రియం,
యదనంతం పరంజ్యోతి, బ్రహ్మ"తత్వమసి" ధృవమ్" మ.ద. 172-

ఏ పరబ్రహ్మము "వీడు గ్రహించువాడు, ఇది గ్రహింపబడునది" అను మొదలగు బేదములతోనున్న సర్వపదార్థములను, ప్రత్యేకముగ ప్రకాశింపజేయుచు, తాను ద్రష్టయగుటచే వానికంటెవేరైన, సాధనాంతరములతో పనిలేక, జ్ఞానమాత్ర రూపుడై, సర్వవ్యాపకుడై యున్నాడో, ఆబ్రహ్మమేనీవు. ఇది నిశ్చయము.

"యద్గ్రాహ్య గ్రాహకాదీనాం భాసకం తద్విలక్షణం,
భామాత్రం పరితః పూర్ణం బ్రహ్మ "తత్వమసి" ధ్రువమ్" మ.ద. 173.

లోకమున సూర్యప్రకాశముచే ప్రకాశింపజేయబడిన రూపములను నేత్రములు గ్రహించుచున్నవి. సూర్యప్రకాశములేనపుడు "ఇది ఫలానా వస్తువు" అని తెలిసికొనలేకుండుటయే దీనికి ప్రబలనిదర్శనము. ఇట్లే మనస్సుగ్రహించు పదార్థములనుగూడ ప్రకాశింపజేయు పదార్థము ఒకటి వుండి తీరవలయునుగదా! స్వతంత్రముగ ప్రకాశింపజేయుటకు అదియూ-అనగా మనస్సుగూడ-నేత్రములవలెనే జడపదార్థమేకదా! పంచభూతములవలన జనించినవి అగుటచేతను, అజ్ఞానకల్పితములు అగుటచేతను, సర్వేంద్రియములును జడములేకదా! కావున మనస్సుచే ఎఱుంగబడు పదార్థములను ఏదిప్రకాశింపజేయుచున్నదో అదియే-ఆ తేజోవంతుడే పరబ్రహ్మము, అదియే నీవు. ఈ విషయమున సంశయమేమియులేదు.

"భానునా భాసితం రూపం యథాచక్షు స్తథామనః,
యేన భాతమిదం వేత్తి బ్రహ్మ"తత్వమసి" ధ్రువమ్" మ.ద. 174.

మరియు యే పదార్థము సర్వసాక్షియై, సర్వమునకంటె భిన్నమై, జాగ్రద్, స్వప్న సుషుప్తి అవస్థలయందు ఏకరూపముతో ప్రకాశించుచున్నదో, ఒక్కొక్క అవస్థయందు మాత్రమే తనకంటె అన్యముగానున్నట్లు తోచు ఈ ప్రపంచమంతయు సర్వవ్యాపక మగు దేనిప్రకాశమును ఆశ్రయించి ప్రకాశించుచున్నదో అదియే బ్రహ్మము, ఆ బ్రహ్మమే నీవు—ప్రత్యగాత్మ, జీవుడు—ఇందు సందేహములేదు.

"సకృద్విభాతం పురతస్సర్వ స్మాత్తు విభాతియత్

యద్భానమను భాతీదం బ్రహ్మ "తత్వమసి" ధ్రువమ్" మ. ద. 175.

ఏ పదార్థమును యెఱింగిన, రెండవ పదార్థము లేకపోవుటచే "ఒకదానిని వినుట, చూచుట, తెలిసికొనుట" అనునవిలేకుండునో, ఏది మిగుల సూక్ష్మమయ్యును వేదాంత వాక్య శ్రవణ మననాదులచే నిర్ణయింపబడుచున్నదో అట్టి వస్తువే పరబ్రహ్మము, అదియే నీవు. ఇదియే నిశ్చయము—

"దర్శనం, శ్రవణం, జ్ఞానం యత్రనాన్యస్య విద్యతే.

సూక్ష్మ మవ్యప దేశ్యం యద్బ్రహ్మ, 'తత్వమసి' ధ్రువమ్" మ. ద. 176.

ఆ పరబ్రహ్మము సర్వసాక్షియగుటచే "ఇది ప్రకాశము" అను జ్ఞానమునకు గూడ ఆయనయే సాక్షి. అందుచే బాగుగా విచారించిన ఆ ప్రకాశధర్మము గూడ ఆయన యందు లేదు. అద్వితీయుడు అగుటచే ఆ బ్రహ్మము ఏమియు ఆచరించువాడుకాదు. ఆయనకు ఎటువంటి ధర్మములులేవు. ఒక కర్మను ఆచరించవలసి వచ్చినప్పుడుతన కంటె భిన్నముగ ఒక కర్మయు, దానిని చేయు సాధనంబును, అట్లు ఆకర్మచేయగా లభించు ఫలంబును వుండవలయును. అద్వితీయుడగు వానికి ఇట్టి భేదములు కాన రావుగదా! అద్వితీయుడు అగుటచే ఆయనతో సంబంధముకలిగియుండుటకు మరొక వస్తువు లేదుగదా! అందుచేత ఆయనకు ఎటువంటి వికారములుగాని, సంక్షోభములు గాని కలుగనేరవు. "ఇదినాది" మొదలగు అభిమానము వలననేగదా జీవుడు బహు విధములగు క్లేశములను అనుభవించుచున్నాడు. అదియునుగాక ఈ బ్రహ్మమునకు ఎటువంటి వికారములు కలుగనేరవు. సాక్షిరూపమున వుండువానికి సాక్ష్యములతో ఎటువంటి సంబంధము వుండదు గదా! స్వయముగనే విజ్ఞాన స్వరూపుడు అగుటచే ఆయనకు ప్రపంచప్రకాశనార్థమై ఎటువంటి రెండవ సాధనముతోనూ పనిలేదు. ఈ విధముగా సర్వస్వతంత్రుడై పరమానందరూపుడై యున్న ఆ పరబ్రహ్మమేనీవు. ఈ విషయమున సంశయమేమియు లేదు.—

"నిష్కళం, నిష్క్రియం, శాంతం, నిరవద్యం, నిరంజనం.

శుద్ధం, విజ్ఞానమానందం బ్రహ్మ "తత్వమసి" ధ్రువమ్" మ. ద. 177.

మూడు అవస్థలను ప్రకాశింపజేయువాడు—

పైన చెప్పబడిన వివరణననుసరించి జాగ్రత్స్వప్నములయందలి కార్యరూప ప్రపంచమును, అనగా అజ్ఞానకల్పితములై, బహువిధములుగా గానవచ్చు పదార్థములను విషయములను, సుషుప్తి అవస్థయందలి కారణప్రపంచంబును, అనగా ఆ అవస్థయందు సర్వేంద్రియములను అనగా పంచ బాహ్యేంద్రియములు, (వాక్కు, హస్తములు, పాదములు, వాయువు, ఉపస్థము) పంచ జ్ఞానేంద్రియములు, (చెవి, చర్మము, నేత్రములు, నాలుక, నాశిక) మనోబుద్ధి చిత్తహంకారములు మొదలగునవన్నియు ప్రాణములందు లయింపగా సర్వాకారమై మిగిలియున్న అజ్ఞానమును, లేక జాగ్రదాది సర్వ ప్రపంచమును, స్వతంత్రమై, ఏ పరమార్థము ప్రకాశింపజేయుచున్నదో అదియే "నేను" అను శబ్దమునకు అర్థము. మనమందరమూ "నేను, నేను" అని వ్యవహరించునది ఈ పదార్థమునే. కావున ఆ పదార్థమే ఆత్మ. ఈవిధముగా జ్ఞానస్వరూపమగు ఆ బ్రహ్మపదార్థమునందు ఆత్మాభిమానమును కలిగియుండుము. ఇతరములగు అనగా స్థూల, సూక్ష్మ, కారణదేహములయందు ఆత్మబుద్ధిని వదలుము—

"జాగ్రద్ స్వప్నసుషుప్త్యాది ప్రపంచో యేన భాస్వతే.
తదేవాహమితి జ్ఞాత్వా త్వస్యత్రాత్మమతిం త్యజ" మ. ద. 178.

కలగాంచువాడు ఆ సమయమునతోచు శరీరమునందు ఆత్మబుద్ధికలవాడై అనగా ఆ శరీరమే నేను అనుబుద్ధికలవాడై వుండుననుట అందరకు తెలిసిన విషయమే.ఆ కలయందలి శరీరమును అసత్యమని ఎఱింగినను, నిద్రాదోషము వలన ఆ శరీరమే నేను అను భ్రాంతికలుగుచున్నది. ఆ విధముగనే జాగ్రదవస్థయందును ఈ స్థూలదేహము యధార్థము కాకపోయినను నిత్యమూ దీనిని చూచుచుండుటచే ఆత్మ ఈ దేహాదులకంటె భిన్నుడు కావలయుననుట స్పష్టమగు చున్నను, మాయాప్రభావముచే దేహాత్మభ్రాంతి కలుగుచున్నది. వాస్తవస్థితిని విచారించి చూచిన ఈ దేహము నీ స్వరూపము కానేరదు. ఏకాగ్రమగు బుద్ధితో స్వస్వరూపమును గురించి విచారింపుము. అప్పుడు నిర్వికారుడును సర్వమయుడును, నాశరహితుడును, ఆనందరూపుడును అగు ఆ పరబ్రహ్మమే నీకు స్వరూపభూతుడుగా తెలియును. ఆ బ్రహ్మమునకును, నీకును, ఎప్పటికిని ఎట్టి భేదము వుండనేరదు. భూతవర్తమాన భవిష్యత్కాలముల యందును నీవు ఆయన కంటె భిన్నుడవుకానేరవు.—

"యద్వత్ స్వప్న శరీరకే అహమితి ధీ స్యంభావితా నిద్రయా,
తద్వత్ జాగ్రతి మాయయా త్రవపుషి స్వాత్మత్వధీః కల్పితా,
సత్యం నైతదసి త్వమాత్మని ధియా పశ్య స్వమేకాగ్రయా
నిత్యం శుద్ధ మనంత మవ్యయసుఖం బ్రహ్మాసి సాక్షాత్పరం" మ.ద. 179

ఆకాశము మేఘములతో నిండియున్నను దానికి ఆ మేఘములతో ఎట్లుసంబంధము లేదో అట్లే ఈ కూటస్థునకును అనగా ప్రత్యగాత్మకును దేహేంద్రియ ప్రాణ మనోహాంకారాదులతో కూడియున్నను, వానితో ఎటువంటి సంబంధమును వుండుట లేదు. ఆట్లు ఈ దేహేంద్రియాదులతో ఆవరించబడియున్నను ఆయన నిర్మలుడే, నిర్వికారుడే, సాక్షిరూపమునవున్నవానికి సాక్ష్యముతో అనగా తనచే చూడబడు విషయములతో సంబంధము ఎట్లు వుండుటలేదో అట్లే సాక్షిరూపుడైన ఆప్రత్యగాత్మకు గూడ దేహేంద్రియాదులతో ఎట్టి సంబంధమునులేదు. ఆకాశ దృష్టాంతముచే "స్వభావముచే నిర్మలమగు పదార్థములకు ఆగంతుకములగు వస్తువుల మాలిన్యముతో సంబంధము వుండనేరదు. ఆ మాలిన్యము ఆ నిర్మలమగు పధార్థమును మలినముచేయ జాలదు" అనువిషయము అందరికీ అనుభవమునందున్న విషయమే.

అందుచేతనే కూటస్థుడు అనగా ఆ ప్రత్యగాత్మ నిర్వికారుడై సర్వపదార్థములతో కూడియున్నను, వాటితో సంసర్గములేకయున్నాడో అట్టి కూటస్థుడవునీవే. పరబ్రహ్మమునకును, ఆ ప్రత్యగాత్మకును, ఎట్టి భేదము నిరూపించుటకు వీలు లేనందున ఆ పరబ్రహ్మమేనీవు.—

"దేహేంద్రియ ప్రాణమనో అహోమాద్యైః సహోస్థితం సన్నపిసంగహీనః,
వ్యోమేవ మేఘైరమలస్వరూప స్త్వంప్రత్యగాత్మాసి సదాశివోసి"

మ.ద. 180

బాగుగా విచారించిచూచిన నీవు స్థూల, సూక్ష్మ, కారణశరీరములలో ఏదియును కావు. ఆ శరీరములన్నింటికి నీవుసాక్షివి అగుటచే అన్నమయాది పంచకోశములచే దట్టముగా కప్పబడియున్నను, సర్వాంతరుడై కూటస్థుడు అని చెప్పబడుచున్న జ్ఞానస్వరూపుడవు నీవే. ఆ బ్రహ్మమునకు గూడ అదియే-అజ్ఞానమే స్వరూపముగావున ఆ పరబ్రహ్మమేనీవు. ఈ విషయమున సంశయము ఇంచుకయైనను లేదు—

"నస్థూలోసి నసూక్ష్మోఽసి నాపికారణ విగ్రహః,
బ్రహ్మైవాసి న సందేహః ప్రత్యగ్యేకలక్షణః" మ.ద. 185

అనగా బాగుగా విచారించినచో నీవు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములందు ఏదియునుకావు. వాటి కన్నింటికి సాక్షివగుటచే, అన్నమయాది పంచకోశావృతుడై, సర్వాంతరుడై, కూటస్థుడని చెప్పబడుచున్న జ్ఞాన స్వరూపుడవేనీవు. బ్రహ్మమునకుకూడ అదియే అజ్ఞానమే స్వరూపము. కావున ఆ పరబ్రహ్మవునీవే. ఈ విషయమున సంశయములేదు.

—o—

# ప్రపంచ బ్రహ్మైక్యజ్ఞానముచే మోక్షము

జ్ఞానవంతులగువారు విచారశూన్యులుగాక ప్రయత్నపూర్వకముగా ఆత్మవిచారము చేయవలయును. ఈ ప్రపంచముయొక్క యథార్థస్వరూపమును తెలుసుకొనవలయును. వాస్తవస్థితిలో ఈ ప్రపంచమునందు నామ రూపములకంటె ఇతరమగు పదార్థము ఏదియులేదు. కావున వాస్తవముగా ఈ ప్రపంచము సత్యము కానేరదు. ఉన్నట్లుగా తోచుటయేగాని దీనియందు వాస్తవమగు పదార్థము ఏదియునులేదు. కావున ఇది కలవంటిది. ఆత్మయొక్క అనగా బ్రహ్మపదార్థముయొక్క యథార్థ రూపమును తెలుసుకొనలేకపోవుటచే ఇది అనగా ఈ ప్రపంచము ఉన్నట్లుగా తోచుచున్నది. అంతేగాని మరేమియులేదు. ఇదియే తెలియదగిన సత్యము.

"అసత్కల్పం మృషాప్రాయం స్వప్నతుల్యంప్రమోదితం, జగత్సర్వమితి జ్ఞేయం పండితై స్తత్త్వదర్శిభిః" మ. ద. 12. ఆత్మవివేకము సామాన్యముగ దొరుకునదికాదు. అనేక కోట్లజన్మలనుండియు పుణ్యకర్మలను ఆచరించుచూ రాగా ఒక జన్మమున చిత్తము పరిశుద్ధమైన పిదప ఆ చిత్తమునకు "ఈ ప్రపంచము సత్యముగావున్నట్లుతోచదు. ఆత్మయు ఎట్టివాడో తెలియకున్నది" అను విచారము ఉదయించును. కావున ఇట్టి జ్ఞానమును ఆర్జించుట అనేక జన్మసంసిద్ధులగు మహాత్ములకుగాని శక్యముగాదు.

వాస్తవస్థితిలో ఈ ప్రపంచము అసత్యమే. సుషుప్తి అవస్థయందు మనస్సు మొదలగు సర్వేంద్రియములును ప్రాణములందు లయమైనప్పుడు ఈ ప్రపంచము కానవచ్చుటలేదు. జాగ్రదవస్థయందు మాత్రము అనగా మనస్సు మొదలగు ఇంద్రియములన్నియు పనిచేయుచుండుసమయమునందు మాత్రము కాన వచ్చుచున్నది. కావున ఈ ప్రపంచము మనోబుధ్యాదులను ఆశ్రయించి వున్నదియే అనగా ఆ మనోబుధ్యాదులే తమయందు వ్యాపించియున్నబ్రహ్మప్రకాశమునందే బహువిధ భావముల —వృక్షభావము. పశుభావము, మనుష్యభావము, మొదలగు వానిని ఆరోపించుచున్నవి. ఈ కారణమువలననే మనోబుధ్యాదుల లయకాలమగు సుషుప్తి అవస్థయందు ప్రపంచము కానవచ్చుటలేదు. ఇది సర్వానుభవ సిద్ధమగు విషయమే. ఇట్లగుటచేత ప్రపంచమునకు జ్ఞానభిన్నమగు స్వరూపమేలేదు. కావున ఈ ప్రపంచముయొక్క వునికి జ్ఞానముయొక్క వునికిని ఆశ్రయించి వున్నదియేకావున జ్ఞానస్వరూపుడని చెప్పబడుచున్న ప్రత్యగాత్మయే ఈ ప్రపంచమునకు సత్తను, ఉనికిని (EXISTENCE) కలిగించుచున్నాడు.

ఈ విధముగా స్వభావముగా అసత్యమేయైనను ఈ ప్రపంచము ఎవ్వని అను గ్రహమువలన సత్యమగుచున్నదో అతడే ప్రత్యగాత్మ. ఇట్లగుటచేతనే ప్రపంచము నకు "భ్రాంతికల్పితము" అనియు; మిథ్య, అనియు పేర్లు. ఇదియునుగాక ఎవ్వని ప్రకాశమును ఆశ్రయించి సూర్యచంద్రాగ్నులు ప్రకాశించుచున్నారో అతడే ప్రత్య గాత్మ.

ఈ సూర్యచంద్రాగ్నులు సర్వప్రపంచమును ప్రకాశింపజేయుచున్నను ఆత్మ అనగా ఆబ్రహ్మపదార్థము సర్వసాక్షియైయున్నాడుగదా! బాగుగావిచారించిన ఏ జ్ఞానము సర్వేంద్రియ మూలమునను వ్యాపించి సర్వపదార్థములను ప్రకాశింపజేయు చున్నదో ఆ జ్ఞానమే సూర్యాది రూపముగ గూడనిలిచి అనగా సూర్యాదుల రూప మునకూడ వ్యాపించి సర్వప్రపంచమును ప్రకాశింపజేయుచున్నది. సూర్యాదుల యందున్న తేజస్సు జ్ఞానప్రకాశముకంటె భిన్నముగా కానవచ్చుచున్నను మనో బుధ్యాదులు తమయందున్న ఆత్మప్రకాశమునందే అనగా జ్ఞానమునందే సర్వభావ ములను ఆరోపించుచున్నవి. కారణమేమన సర్వపదార్థములును బ్రహ్మమే. కావున అదియు ఆ సూర్యచంద్రాదులయందున్న తేజస్సును ఆబ్రహ్మమునకంటె భిన్నము కానేరదు.

లోకమున ప్రకాశమనునది అంతయును ఆత్మప్రకాశమే. అది ఎట్లనిన— స్వప్నావస్థయందు అనేక వస్తువులను ప్రతి పురుషుడును చూచుచునేయున్నాడు.వానిని ఏ ప్రకాశముయొక్క సహాయముతో చూచుచున్నాడో కొంత విచారించి చూచిన జాగ్రదవస్థయందు మనము చూచు సర్వ పదార్థములను సూర్యప్రకాశ సహాయ ముచేగాని దీప ప్రకాశ సహాయముచే గాని నక్షత్ర ప్రకాశముచేగాని చూచు చున్నామని గదా తలంచుచున్నాము. స్వప్నావస్థ యందలి పదార్థము లను దేని సహాయముతో చూచుచున్నాము? అప్పుడు సూర్య చంద్ర నక్షత్రములుగాని, వాని సహాయముచే పదార్థములను ప్రకాశింపజేయ గల నేత్రాదులుగాని లేవుకదా! ఇంద్రియములన్నియు స్వప్నావస్థయందు తమకు కారణ మైన అజ్ఞానమునందు లీనమగు చుండును. కావున అప్పటి స్థితిని సూక్ష్మ విచారిం చిన అప్పుడాత్మ ప్రకాశమునకంటె ఇతరమగు ప్రకాశమేలేదు. కావున అప్పటి వస్తు వులను ప్రకాశింపజేయునది ఆత్మ ప్రకాశమే అనక తప్పదు. ఈ విధముగా సర్వ ప్రపంచమును ప్రకాశింప జేయునది ఆత్మ ప్రకాశమే అయివుండ జాగ్రత ప్రపంచ

మును ప్రకాశింపజేయునది మాత్రము సూర్యాగ్న్యాది ప్రకాశమని ఏల అనవలయును? కావున సర్వ ప్రపంచమును ప్రకాశింపజేయునది ఈ ఆత్మ ప్రకాశమే. సుషుప్తి అవస్థ యందలి సర్వాభావమును, స్వప్నావస్థయందలి సర్వ ప్రపంచమును ప్రకాశింపజేయు నది ఆత్మ ప్రకాశమే అగుచుండ ఒక్క జాగ్రత్ ప్రపంచమును మాత్రము అది ప్రకా శింపజేయలేదనుట యుక్తి విరుద్ధముగదా!, కావున ఆప్రత్యగాత్మయే సర్వమును ప్రకాశింపజేయుచున్నాడు. రెండవదాని సహాయము లేకుండ స్వతంత్రముగా ప్రకా శించుచున్నాడు— "స్వప్న ప్రపంచో రవిణా నభాస్యతే, నైవానలాద్యైర్నచ చక్షు రాదిభిః, ప్రత్యక్ప్రకాశేన విభాతి సర్వం తస్మాత్స్వయం జ్యోతి రయం చిదాత్మా"
మ.ద. 43.

ప్రపంచమనునది సంపూర్ణముగా శూన్యమైనదియే. కేవలము మనో విచార రూపమైనదియేగాని అందు సత్యమేదియునులేదు. స్వప్నావస్థ అందరకు అనుభవ సిద్ధమైనదియే. ఆ అవస్థయందు శబ్దాది విశేషములేవియు లేవనుటయు అందరకు తెలిసిన విషయమే. అట్లయినను ప్రతివాడును కలగాంచుచున్నాడు. అందు బహు విధ సాంసారిక సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. అప్పుడు ఆ సంసారము ఎటనుండి వచ్చినది? ఎట్లు విచారించి చూచినను ఆ అవస్థయందు బుద్ధి మాత్రమే కలదు. కావున అదియే ఆ సంసారమును కల్పించినదనవచ్చును. ఇదియే యథా ర్థము. జాగ్రదవస్థయందుగాని, పూర్వ జన్మమునందుగాని సంపాదించిన వాసనలను అనుసరించి ఆ మనస్సే అప్పటి సంసారమును కల్పించుచున్నది. జాగ్రదవస్థయందు అనుభవించిన వ్యవహారములనే స్వప్నావస్థయందు గాంచుచున్నాము. ఇదియు పై సిద్ధాంతమునకు ఆధారమగుచున్నది. ఇట్లు స్వప్నమునందు విషయములు లేకున్నను వాసనాబలము వలన సర్వ విషయములను కల్పించునట్లే ఆ మనస్సు జన్మాంతర సంస్కార బలము వలన జాగ్రదవస్థయందును సంసారమును కల్పించుచున్నది. ఇదియే సంసార స్వరూపము. కావున ఈ సంసారము కల్పనా మాత్రమే, వాస్త వము కాదు. స్వప్నము నందలి స్థితిని అనుభవించుచుండియు దానిని అసత్యమని నిశ్చయించి యుండియు జాగ్రదవస్థయందలి విషయములను గూర్చి అసత్యములని నిశ్చయించుటకు సంశయింపనేల? దానిని సత్యమని భావింపనేటికి? ఇంతకంటె అవివేకము కలదా? కావున జనులు అందరు అజ్ఞానము వలన లేని సంసారమును మీద వైచుకొని దుఃఖించుటయేగాని వేరేమియుకాదు.

జాగ్రత్ సంసారముగూడ మనఃకల్పితమే అనుటచే ప్రపంచ మంతయుగూడ మనఃకల్పితమేయని చెప్పినట్లయినది. ఇదియే యథార్థము. ప్రపంచమును సృజించుటకు వేఱొక బ్రహ్మలేడు. మనస్సే సృష్టికర్త. స్వప్నావస్థయందు పదార్థములు బ్రహ్మదేవునిచే సృజించబడలేదనుటయు, వానికి సృష్టికర్త మనస్సే అనుటయు అందరకును తెలిసిన విషయమే.

సర్వ పదార్థములకును గూడ మనస్సే సృష్టికర్త. ఈ విధముగా ప్రపంచము కల్పనా మాత్రము అగుటచేతనే "అసత్యము" అనగా "లేనిది"అనియు చెప్పబడుచున్నది. జ్ఞానముచే నివర్తింపబడుననియు చెప్పబడుచున్నది. అట్లుగాక ఈ ప్రపంచముగూడ యథార్థవస్తువే అయినచో జ్ఞానముచే నివర్తింపబడుట అసంభవము అగును కదా!.

లోకమున వినాశమనునది రెండు విధములు— బాధయు,ధ్వంసంబును. అందు యథార్థమగు వస్తువులు దండ, తాడనము మొదలగు వానిచే నశించుట ధ్వంసము. భ్రాంతి సిద్ధములగు వస్తువులు జ్ఞానముచే తొలగిపోవుట బాధ. ఈ రెంటిలోను ఏ వస్తువులు బాధింపబడునో అనగా జ్ఞానముచే తొలగిపోవునో అవి వాస్తవముగ అసత్యములై, భ్రాంతి సిద్ధములై వుండి తీరవలయును. "జ్ఞానాదేవతుకైవల్యం" "జ్ఞానము వలననే ఏకత్వము" "తనకంటె ఇతరమగు పదార్థములేదు అను విశ్చయము వలన మోక్షము కలుగును " అను శ్రుతి "ఈ భేదభావమునకు జ్ఞానమే నాశకము" అని చెప్పుచున్నది. ఈ ప్రమాణము వలన భేద దృష్టికి ఆధారమగు ప్రపంచము భ్రాంతి సిద్ధమే, అసత్యమే అని నిర్ణయింపవలయును. ఈ సిద్ధాంతము కూడ "మాయా మాత్రమిదం ద్వైతం అద్వైతం పరమార్థతః" అనగా ఈ భేదమంతయూ మాయ. "యామా సామాయ" అను వ్యుత్పత్తిచే సంపూర్ణముగ అసత్యమైనదియే. వాస్తవ స్థితిలో "భేదమేలేదు." అను మొదలగు స్మృతులు అనేకము నిర్ధారణము చేయుచున్నవి—

మన ఏవాఖిలం విశ్వం సృజత్య శ్రతునోవిధః
స్వప్నవన్నహి స్వప్నార్థో బ్రహ్మణా సృష్ట ఈక్ష్యతే. మ.ద. 60.

ఈ విధముగా ఆ మనస్సే నామరూపముల నన్నింటిని అనగా ప్రపంచమంతటిని కల్పించుచున్నది. వాస్తవ స్థితిలో ఆ పరబ్రహ్మమునందు లేని నామరూపములు మనస్సుచే సంస్కారానుసారముగా కల్పింపబడి "ఇది ప్రపంచము" అని వ్యవహరింపబడుచున్నది. ఇట్లు ఆ మనస్సే ప్రపంచమును సృజించి బ్రహ్మరూపుడగు పురు

షునకు గూడ సంసార బంధమును కలిగించుచున్నది. అనగా "సంసారము వాస్తవము" అను భ్రాంతిని కలిగించుచున్నది. కావున బంధమోక్షములకు మనస్సే మూలకారణము.

"మన ఏవ మనుష్యాణాం కారణం బుధమోక్షయోః" అనగా "బంధమోక్షములకు మనస్సే కారణము" అను స్మృతి ఈ విషయమునే నిరూపించుచున్నది.

ఈ మనస్సే ప్రపంచమునకు సృష్టికర్త. ఈ సంసారము మరియు ప్రపంచములు మనస్సుచేతనే కల్పింపబడినవి అనుటలో సంశయమింతయైనను లేదు. మనస్సు ఏ జాగ్రత్ స్వప్నావస్థలయందు సంచరించుచుండునో అప్పుడే ఈ సంసారము కానవచ్చుచున్నది. ఏ సుషుప్తి మూర్ఛలయందు ఆ మనస్సులేదో అప్పుడు ఈ ప్రపంచముగూడ కానవచ్చుటలేదు. కావున ఈ ప్రపంచము మనస్సుతోకూడియే యున్నది. దాని లయముతో లయమగుచున్నది. ఈ కారణమువలన, లోకానుభవమును బట్టిచూచినను, అన్వయవ్యతిరేకన్యాయములు—అనగా మనస్సు వుండిన జాగ్రదాదులయందు ప్రపంచమువున్నది. అనుట అన్వయము. మనస్సులేని సుషుప్తి అవస్థయందు ప్రపంచములేదు అనుటవ్యతిరేకము. ఈన్యాయమును అనుసరించి విమర్శించిచూచినను సంసారము మనఃకల్పితమే అని సిద్ధాంతమగుచున్నది.

"యత్రయత్ర మనఃస్ఫూర్తి తత్రతత్ర జగత్రయం,
యత్రయత్రమనోనాస్తి తత్ర తత్ర నకించన" మ. ద. 63.

సంసారము మనఃకల్పితమే. ఈ కారణమువలన మనస్సుకలిగిన ప్రపంచము కలుగును. అదిలేకున్న ప్రపంచంబునులేదు. సంసారంబునులేదు. కావున ఈ మర్మమును ఎఱింగినవానికి అనగా ఆత్మకును ప్రపంచమునకును ఎట్టి సంబంధములేదనియూ, సర్వంబును బ్రహ్మమే, వాస్తవస్థితిలో ఈ ప్రపంచముగూడ బ్రహ్మమునందే కల్పింపబడినదనియు, ఎఱింగినవానికి ఎప్పటికిని దుఃఖమేలేదు. ఇదియే యథార్థము. ఈ కారణమువలన ప్రపంచము బ్రహ్మమునకంటె భిన్నమను భ్రాంతిని వదలి "సర్వమును బ్రహ్మమే, ప్రపంచమనునది వేఱుగలేదు." అని గ్రహింపవలయును. ఇట్లు గ్రహించుటయే సమ్యగ్ దృష్టి. ఈ విధముగా చూచినచో భేదభ్రాంతికిని, దానివలన కలుగు వివిధ దుఃఖములకును మనస్సే మూలకారణము. కావున మోక్షేచ్ఛగల ప్రతి పురుషుడును అన్నిటికంటె ముందుగా మనోనిగ్రహమును అనగా మనస్సునందలి వికారములతో సంబంధింపకుండుటను చేయవలయును. దానివలన ఆ మనస్సు వానికి విరుద్ధముగా అజ్ఞప్రపంచమును కల్పింపదు. అనాది వాసనాబలమువలన ఒకవేళ ఆ

ప్రపంచము కానవచ్చినను దానియందు భేదదృష్టిని కలిగింపదు. దుఃఖమును కలిగించదు.—

"సర్వానర్థనిదానం మన ఏవ భవత్య ముష్యపురుషస్య,
తన్మనసో నిగ్రహణం కర్తవ్యంబంధముక్తయే పుంసా" మ. ద. 65.

సుషుప్తి అవస్థయందు బుద్ధి తనకు కారణమగు అజ్ఞానమునందు లయమైనప్పుడు బాహ్యాంతర పదార్థము లెవ్వియును తోచుటలేదు. ఇట్టి అనుభవము అందరియందును కలదు. కావున ఈ సర్వప్రపంచంబును ప్రత్యగాత్మయందు అజ్ఞానముచే ఆరోపింపబడినదియే. ఏక స్వరూపుడగు ఆత్మను భిన్నరూపునిగా భావించుటకంటె అవివేకము ఏమియున్నది? సర్వసాక్షియగుటచే దేనితోను సంబంధింపక ఏ వికారంబునులేక వుండువానిని కర్తృత్వ భోక్తృత్వాది వికారయుక్తునిగాను, సర్వవిషయములతోను సంబంధము కలవానినిగాను భావించుటకంటె మూఢత్వము వేఱేమివుండును? ఏ కార్యములను చేయక శాంతుడై వుండువానిని కర్తగా తలంచుటకంటె వెఱ్ఱితనము మరేదికలదు? ఆత్మయందు ఆరోపింపబడినవేకావున ఈ ప్రపంచము, సర్వధర్మములు, సర్వవ్యవస్థలు, వర్ణాశ్రమాదులు, స్వామి భృత్యభావములు, దేవత్వ ఉపాసకత్వములు, మొదలగునవన్నియును అసత్యములే. సత్యములుగా గానవచ్చుటయే గాని అందు యథార్థము కొంచమైననులేదు. బుద్ధిచే ఆత్మయందు కల్పింపబడిన స్వప్నప్రపంచము లేనిదగుచుండగా అట్టి ధర్మమేగల జాగ్రత్ ప్రపంచము మాత్రము ఎట్లు సత్యము కాగలదు? సుషుప్తి అవస్థయందు కానరాకుండుట రెంటికిని సమానమే గదా! కావున ఇందు యథార్థమేమియునులేదు. "నవిరోధో నచోత్పత్తి ర్నవంద్యో నచశాసనం. నముముక్షు నముక్తిశ్చ ఇత్యేషా పరమార్థతా" అనగా ఆటంకము లేక వినాశము అనునదిలేదు. ఉత్పత్తియులేదు. నమస్కరింపదగువాడును, నమస్కరించువాడునులేడు. ఆజ్ఞ అనునదియులేదు, మోక్షేచ్ఛయు, ముక్తియునులేదు. ఇదియే పరమార్థము." ఉత్పత్తి వినాశాదులు కలవనుట భ్రాంతియేగాని యథార్థముకాదు.

విచారించి చూచిన ఈ ప్రపంచము స్వప్నమువంటిది. లోకములో ప్రతివాడును స్వప్నమును అనుభవించుచునే యున్నాడు. జాగ్రదవస్థయందువలనే స్వప్నావస్థయందును కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మములను సాక్షియందే ఆరోపించుచు "నేను కర్తను, నేను భోక్తను"అని తలంచుచునేయున్నాడు. అయినను మేల్కొనిన పిదప కొన్ని కొన్ని సమయములయందును,' స్వప్నమును గాంచుచున్న సమయమునందును, ఆ స్వప్నసంసారమును సత్యముగా మాత్రము భావించుటలేదు. వాస్త

వమును విచారించిన జాగ్రదవస్థ యందలి సంసారముగూడ అట్టిదియేగదా! దీనిని మాత్రము ఏల సత్యముగా భావింపవలయును? కావున సంసారమంతయు యదార్థముగా లేనిదే. "నహిస్వాప్నిక సంసారః కర్తృ భోక్తృత్వ లక్షణః. సత్యం సమీక్ష్యతే తద్వ జ్జాగ్రత్కాలేపి సాక్షిణః" ఒక కారణము నుండి ఒక వస్తువు జనించిన అది ఆ కారణముకంటె వేఱుకానేరదు. మట్టి నుండి జనించిన కుండ ఆ మట్టికంటె వేరుకానేరదు. నామరూపములు తప్ప అంత కంటె ఆ మట్టికిని ఆ కుండకును భేదము ఏమియులేదనుట సర్వానుభవ సిద్ధము. ఇట్లే ప్రతి స్థలమునందును చూడవచ్చును. సువర్ణభూషణములు ఆ సువర్ణ మునకంటెను, లోహపాత్రములు ఆ లోహముకంటెను, దారుమయ పదార్థములు ఆ దారువునకంటెను, తరంగ బుద్బుదాదులు ఆ జలమునకంటెను ఇట్లే ప్రతి పదార్థం బును దాని ఉపాదాన కారణముకంటె వేఱుకాజాలదని ఎల్లప్పుడూ స్పష్టముగా తెలియు చునే యున్నది.

వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం" అనగా—

ఈ నామములు వ్యవహారమునకు మాత్రమే ఉపయోగించునవి కాని వస్తువునకు అనగా పదార్థమునకు భేదమును కల్పించునవి కావు. రూపములు గూడా అట్టివే. కావున బాగుగా విచారించి చూచిన కుండ మట్టికంటెను, లోహపాత్రములు ఆ లోహ మున కంటెను వేఱుకానేరవు." అని శ్రుతి ఈ విషయమునే బ్రహ్మ ప్రపంచముల అభేదమునకు దృష్టాంతముగా చెప్పుచున్నది. ఈ కారణమువలన ఈ ప్రపంచమం. తయును అనగా చేతనాచేతన రూపమగు ఈ ప్రపంచమంతయు అ బ్రహ్మముల కంటె వేఱు కానేరదు. దీనికి అనగా ఈసర్వప్రపంచమునకు ఉపాదాన కారణము ఆ బ్రహ్మమే. యత్కార్యం యస్తుతన్మాత్రమేవ విద్ధి విలోకితం, మృద్ఘటాదౌ తతః సర్వం బ్రహ్మమాత్రమిదం జగత్" ఈ విధముగా ఉపాదానకారణమగు బ్రహ్మము నకు, కార్యమగు ప్రపంచమునకును భేదము లేకుండుట శ్రుతియుక్త్యనుభవపూర్వ కముగా సిద్ధాంతమగుచున్నది. కావున బ్రహ్మమునకంటె భిన్నమగు పదార్థము ఒక్కటియైనను వుండుటకు వీలులేదు.

జీవులు చేతన ప్రపంచము. తక్కిన పదార్థజాలమంతయు అచేతన ప్రపం చము. ఈ రెంటికంటె బ్రహ్మము వేఱుగా వున్నాడని మనము ఇదివరకు భావించు చుంటిమి. బాగుగా విచారింపగా ఇప్పుడు అచేతనా చేతన ప్రపంచములు రెండును బ్రహ్మమున కంటె వేఱుకావని తెలియచున్నది. ఈ కారణము వలన "భేదము

కలదు'' అనుటకే అవకాశములేదు. కావున బ్రహ్మము ఎప్పటికీ అద్వితీయుడే. బ్రహ్మమునకంటె భిన్నమగు పదార్థము త్రికాలములయందును లేదు.

"కారణము లేక కార్యముపుండదు.'' పై యుక్తిచే భేదకారణములేదు. కావున భేదంబునులేదు. కాని ఇచ్చట ఒక ఆశంకకలుగుటకు అవకాశము ఏర్పడుచున్నది. అది ఏదన? కుండపుట్టుటకు మట్టివలెనే కుమ్మరికూడా కారణమగుచున్నాడు. మరియు పుత్రునకు తండ్రికారణమగుచున్నాడు- ఈ ఇరువురికిని అనగా ఇట్టి కార్యకారణము లకు అభేదము చెప్పుటకు వీలులేదుకదా!'' అని అన్నచో జగత్తుయొక్క- ఉత్పత్తి విషయమున సంశయము ఇసుమంతయైననులేదు. ఏలయన-శాస్త్రజ్ఞులచే అంగీక రింపబడిన జగదుత్పత్తికి కారణములు రెండు——

1. ఆరంభము

2. పరిణామము

(1) తంతువులు పటమును – బట్టను-ఏర్పరచినట్లు కారణపదార్థములు కార్యమును ఏర్పరచుట ఆరంభమనబడును.

(2) పాలు పెరుగు అయినట్లు కారణము కార్యరూపముగా పరిణమించుట పరిణామము అనబడును.

మూడవ కారణమేదియు శాస్త్రసమ్మతముగాలేదు. కావున ప్రపంచమునందును లేదనియే చెప్పవలయును. పైనజూపిన రెండు సందర్భములయందును అనగా కారణము కార్యరూపమును ఆరంభించినను, తద్రూపతో పరిణమించినను, ఉపాదాన కారణకార్యములకు భేదములేకపోవుట ఒక విధముగా జూచిన యధార్థమే అయినను, పరస్పర విరుద్ధలక్షణములను బట్టి అనగా కారణమగు పాలకంటె కార్యమగు పెఱుగు అనేక లక్షణములయందు విరుద్ధమైయున్నది, అను మొదలగు కారణము లను బట్టి భేదముగూడ యధార్థమేయని చెప్పవలసివచ్చుచున్నది. "పాలు పెరుగు కాదు. పెరుగుపాలుకాదు. గుడ్డ నూలుకాదు.'' అనుమొదలగు వ్యవహారములు ఇందులకుసాక్షులు. కావున "భేదమనునది బొత్తుగనేలేదు'' అనుసిద్ధాంతము సరికా నేరదు. నిమిత్తకారణ కార్యములకు భేదము ఎప్పటికిని ఒప్పుకొనక తప్పదు. ఇదియునుంగాక'' బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదాననిమిత్తకారణములగుటచే ఒక అంశమున అభేదమును సాధించినను, రెండవ అంశమున భేదమును అంగీక రించియే తీరవలయునుగదా! కావున అభేదమే వేదాభిప్రాయమగుట యుక్తి యుక్తముకాదు. అని అన్నచో——

(3) వివర్తవాదము—ఆరంభ పరిణామములవలెనే "వివర్తము" అనుమరి యొక ఉత్పత్తికారణము గూడకలదు. భ్రాంతిచే ఒక వస్తువును మరియొక దానినిగా గ్రహించుట దాని స్వరూపము. ఇది అందరి అనుభవమునందువున్న విషయమే. క్రొత్తదేమీకాదు. అందుచే ఇదిఅప్రామాణికముకానేరదు. అభేదవాదమునుప్రతిపాదించు అద్వైతులు "బ్రహ్మము ప్రపంచమును ఆరంభించెను" అనికాని, బ్రహ్మము ప్రపంచరూపముగా పరిణమించెను" అనికాని చెప్పుటలేదు. విత్తనమునుండి వృక్షము జనించినట్లుగాని, తండ్రినుండి పుత్రుడు కలిగినట్లుగాగాని, బ్రహ్మమునుండి ప్రపంచము ఉత్పత్తి అయ్యెననికాని చెప్పుటలేదు. మరియేమనిన, మూడవదియగు వివర్తమునే ప్రపంచోత్పత్తికి కారణముగ నిర్ణయించు చున్నారు. బ్రహ్మమే జగద్రూపముగ కానవచ్చుచున్నదియేగాని వేఱేమికాదని వారిఅభిప్రాయము. జగదుత్పత్తి విషయమున రూపసిద్ధాంతముఇది- ఈ సిద్ధాంతమును ఆధారముగ జేసుకొని విచారించిన బ్రహ్మనకును, అనగా వివర్తాధిష్ఠానమైన బ్రహ్మమునకును, ప్రపంచమునకును, భేదము ఎన్నటికిని కలుగనేరదు. ఇప్పుడైనను "బ్రహ్మమువేఱు, ప్రపంచము వేఱు" అను వ్యవహారముకలదు. కావున జగద్బ్రహ్మలకు భేదముకూడ యథార్థమయ్యే యుండవలయును అను సంశయముకలిగెనేని, దానికి సమాధానముగ ఈ క్రిందివిధముగా విచారించ వలసియుండును—

రెండు పదార్థములను అనగా ఉపాదానకారణంబును, మరియు దాని కార్యమును సత్యములై యుండినచో, అట్టి భేదము ఒకవేళ వాస్తవమైనను కావచ్చునుకాని ఇచట అట్లులేదు. భ్రాంతిచే కల్పింపబడిన పదార్థమునకు వాస్తవమగు స్వరూపమే వుండదు కదా! భ్రాంతియున్నంతసేపే ఆ కల్పిత వస్తువు కానుపించును. ఆ భ్రాంతి తొలగిన తోడనే ఆ వస్తువు కానరాదు. కావున దానికి అనగా ఆ కల్పిత పదార్థమునకు భ్రాంతి కంటె అతిరిక్తమగు రూపమే లేదు. భ్రాంతియే జ్ఞానము కావున ఆ కల్పితవస్తువునకు జ్ఞానము కంటె అతిరిక్తమగు రూపములేదు. బ్రహ్మమన్ననో జ్ఞానమే ఆయన స్వరూపము. ఈ విధముగా అధిష్ఠానమగు బ్రహ్మమునకును, దానిపై ఆరోపితమగు ప్రపంచమునకును జ్ఞానమే రూపమైన ఈ రెంటికిని ఎటువంటి భేదము కానరాదు. కావున అభేద సిద్ధాంతమునకు ఎటువంటి భంగము కలుగనేరదు. "నేదం జాతమితిబ్రూమోవయ మద్వైతవాదినః కింతుబ్రూమోజగత్సర్వం వివర్తంబ్రహ్మణస్త్వితి"

వివర్తకారణము వలన జనించిన-వస్తువు అధిష్ఠానమునకు ఎటువంటి వికారమును కలిగింపజాలదు. ఆరంభ పరిణామమువలన జనించినవి మాత్రము కారణ

మునకు వికారము కలిగించును. వివర్తమునందు అధిష్ఠానమగు పదార్థమే ఉపాదాన కారణము. ముఖ్యమగు అజ్ఞానమే ఆకల్పిత పదార్థమునకు ఉపాదానమైనను, ఆధారములేక కేవలము అజ్ఞానము మాత్రమే ఎటువంటి నూతన పదార్థమును కల్పింపజాలదు.

కావున ఆ యధిష్ఠాన అజ్ఞానములకు సంబంధము ఏమియులేకున్నను, ఏదో యొకవిధముగ దానికి సంబంధము కల్పించి" అధిష్ఠానమే ఆరోపితమునకు ఉపాదాన కారణము అని వ్యవహరింపబడుచున్నది.

బాగుగా విచారించి చూచిన ఆ కల్పితపదార్థము అధిష్ఠానమునుండి జనించెనను టయే అసత్యము మగును. కావున వివర్తమునందు కారణమునకు ఎట్టి వికారమును కలుగనేరదు. ఇట్లగుటచేతనే ఆరంభ పరిణామముల యందువలె వివర్తమునందును "కారణమునకంటె కార్యమువేఱు" అని తలంచుటకైనను వీలులేదు. వాస్తవమున ఆరంభ పరిణామములయందు గూడ కార్య కారణములకు నామరూప భేదములకంటె ఇతర మగు భేదమేమియు లేకపోవుటచే అచ్చట కూడ ఉపాదాన కారణముకంటె కార్యము వేఱనుట కుదరదు. అదియునుగాక అసలు "భేదము" అనగా ఏమి అని విచారించి దానికి లక్షణము చెప్పవలయునన్న "అన్యోన్యాశ్రయ దోషము అనగా ఒకదానిని మరియొకటి ఆశ్రయించి యుండుట అను దోషము వచ్చును. అది ఎట్లనిన—భేదమునకు లక్షణము చెప్పవలెనన్న మొదట "రెండు పదార్థములు కలవు" అను విషయమును తెలుసుకొనవలసి యుండును. పరస్పరము ప్రత్యేకముగ నుండు రెండు వస్తువులను ఆశ్రయించి వాని విభాగమును తెలియజేయు గుణమునకు "భేదము" అని పేరు. ఇదియేకదా భేదమునకు లక్షణము, అయితే అవి రెండు వస్తువులు కావు అని తెలిసికొనుటకంటె ముందుగా "భేద" మనగా ఏదిమో తెలిసికొనవలసియుండును. భేదమును తెలియనివాడు "ఇవి రెండు వస్తువులు" అని ఎట్లుభావింప నేర్చును? ఏలయన ఎవ్వనికిని రెండు వస్తువులు ఒకే సారి కనుపించవు. ఉదాహరణమునకు రజ్జువును చూచువానికి సర్పము కనుపించదు. సర్పమును చూచువానికి రజ్జువు కనుపించదు. అట్లే అబ్రహ్మవిద్యాపారంగతునకు బ్రహ్మమే కనుపించును. ప్రపంచము కనుపించదు. విద్యావిహీనునకు ప్రపంచమే కనుపించును. బ్రహ్మము కనుపించదు. కావున జ్ఞానికి ప్రపంచములేదు అజ్ఞానికి బ్రహ్మము లేదు. ఉన్నది ప్రపంచమొక్కటియే. అట్లే జ్ఞానికి ప్రపంచము లేదు,

ఉన్నది బ్రహ్మయొక్కటియే, కావున ఎవ్వనికీ రెండు పదార్థములు అనగా బ్రహ్మము ప్రపంచము ఒక్కసారిగా కనుపించవు. అప్పుడు నిర్ణయమేమన ఉన్నది ఒక్కటియే పదార్థము; రెండు పదార్థములు లేవు. కావున భేదమునుగూర్చి తెలియక పూర్వము రెండు వస్తువులను గురించి తెనుసుకొనుటకును; రెండు వస్తువులను తెలుసుకొనక పూర్వము భేదమును గూర్చి తెలుసుకొనుటకును సాధ్యముకాదు, ఇట్లగుట చేత భేదమునకు లక్షణము చెప్పుటకే అనగా "భేదముకలదు" అని, నిరూపించుటకే సాధ్యము కాదు.

ఇది ఇట్లుండగా— ప్రస్తుతము పైన చెప్పబడిన వివర్తవాదమును గురించి విచారించి చూచిన బ్రహ్మమున కంటె ఇతరమగు రెండవ పదార్థమే లేదనుటకు ఈ వాదము- వివర్తవాదము-ఒక్కటియే చాలును. ఈ వాదమును గ్రహించుట కూడ సులభమే. లోకమున ఎండమావులయందు భ్రాంతిచే నీరు తోచినప్పుడు ఆ ఎండ మావులకు ఎటువంటి మార్పును కలుగుటలేదు. త్రాటి యందు సర్పము తోచినప్పుడును ఆ త్రాటియందు ఎట్టి మార్పును కలుగుటలేదు. రెండవ పదార్థము ఆ త్రాటి నుండి జన్మించలేదు. అట్లే ఇచ్చటను బ్రహ్మమునందు అజ్ఞానము వలన ప్రపంచ భ్రాంతి కలిగినను, ఆ బ్రహ్మమునకు ఎట్టి మార్పును కలుగదు. ఆయన నుండి రెండవ పదార్థమును జనింపదు. ఎండమావులే అజ్ఞానమువలన నీరుగా తోచినట్లు ఆ బ్రహ్మము అజ్ఞానమువలన ప్రపంచరూపమున తోచుచున్నాడు. వాస్తవమగు స్థితికి ఎప్పటికిని భేదము కలుగనేరదు. ఇది అంతయు అనుభవ సిద్ధమగు విషయమే. — "మరుదేవాంబు రూపేణ యద్వైవాభాత్య విక్రియః, రజ్జురేవాహి రూపేణ యథాభాత్య వికారిణీ, తద్వైవ జగదాకృత్యా బ్రహ్మైవాభాత్య విక్రియః" ఈ విధముగా వివర్తముచే జనించిన వస్తువు ఉపాదాన కారణమునకు ఏ విధమగు మార్పును కలిగింప లేక పోవుటచేతను, యథార్థస్థితిలో కారణముకంటె భిన్నముగ కార్యము జనించుననుటయే అసత్యము అగుటచేతను కార్య పదార్థము బొత్తుగ లేనిదగుచున్నది. అనుభమునుబట్టి బాగుగా విచారించి చూచిన ఆరోపింపబడిన వస్తువు అధిష్ఠానమును ఎరుంగకుండుటచే తోచుటయేగాని మరియేమియు అనగా అందు యథార్థమేమియు కానరాదు. కావున ఎండమావులను ఎఱుంగని వారలకు అవి నీరుగా తోచినట్లు బ్రహ్మము యొక్క స్వరూప స్వభావములు ఎఱుంగని వాడికి ప్రపంచము సత్యముగా అనగా బ్రహ్మభిన్నముగా తోచుచున్నది "అపశ్యతామధిష్ఠానం పశ్వం భాతియథార్థవత్, అదృష్ట మరుదేశానాం మరీచి సలిలం యథా."

కావున ఈ ప్రపంచమును ఆరోపించుటకు ఆధారమగు అద్వితీయ పరబ్రహ్మమును ఎఱింగినచో ఈ ప్రపంచమంతయును బ్రహ్మరూపమే అగును. "ఇవి ఎండమావులు" అని ఎఱింగిన వెంటనే అంతకుపూర్వముతోచుచున్న నీరు ఆ ఎండమావులకంటె వేరుగా తోపక ఎండమావులే అయినట్లు ఈ ప్రపంచంబును ఆ బ్రహ్మమునకంటె భిన్నముగ తోపదు. ఈ సిద్ధాంతమును అనుసరించి ప్రపంచము భ్రాంతి కల్పితమే అగుటచే, భ్రాంతి కల్పితములగు జలములు "ఇవి ఎండమావులు" అను జ్ఞానము కలుగగానే అవి ఎండమావులే అయినట్లు "ఇది బ్రహ్మము" అని అధిష్ఠానమును తెలుసుకొనగానే అది; ఆ ప్రపంచము కేవలము బ్రహ్మరూపముగానే మిగిలిపోవును. ఆ బ్రహమునకంటె వేరుగా ఏ పదార్థమును కానరాదు. లోకమున భ్రాంతి కల్పితములన్నియును అధిష్ఠానజ్ఞానము కలుగకుండునంతవరకే, ప్రత్యేకముగాను, సత్యముగాను వున్నట్లు తోచును గాని అధిష్ఠానజ్ఞానము కలిగినపిమ్మట దానికంటె అనగా ఆ అధిష్ఠానమునకంటె వేరుగా కానరావనుట సర్వానుభవ సిద్ధమగు విషయమే. "మరౌ దృష్టస్య తోయస్య మరుజ్ఞానే నముత్థితే. యధాస్యాన్మరు మాత్రత్వం తద్వైవ జగతోఽన్యచ" కావున ఈ ప్రపంచము ఎప్పటికిని బ్రహ్మరూపముతోనేయుండును. అధిష్ఠానజ్ఞానము కలుగగానే ఆరోపిత పదార్థములన్నియు ఇట్లే తమతమ అధిష్ఠాన స్వరూపములతో నిలిచియుండును. కాని ఎందును లయము నందవు. ఎప్పటికిని తొలగిపోపు. ఆ వివర్తముచే జనించు పదార్థములు కేవలము అజ్ఞానముచే మాత్రమే కల్పింపబడినవి. కావున జ్ఞానముచే బాధింపబడును. కాని కాష్టాదులచే ధ్వంసముచేయబడవు. ధ్వంసమునొందు పదార్థములు తమ తమ కారణములయందు లీనములగును. ఒక కుండను కాష్టాదులచే పగులగొట్టిన అది తనకు కారణమగు మట్టియందు కలిసిపోవును. కాని త్రాటియందు అజ్ఞానముచే కల్పింపబడిన సర్పము అట్లు కలిసిపోవదు. వాస్తవముగా వున్నదియైనచో లయమగుట, ఉత్పత్తియగుట అను స్థితులు కలుగును. కాని త్రికాలములయందును అసత్యమేయై, అధిష్ఠానమాత్రమే అయినదానికి అట్టి విశేషములుండుట అసంభవము కదా! కావున యెట్లు చూచినను, ఆరోపిత పదార్థము అజ్ఞానముచే అధిష్ఠానమునకు భిన్నముగా తోచినప్పుడుగాని, అధిష్ఠానముచే బాధింపబడునప్పుడుగాని తమ యధిష్ఠానములకంటె భిన్నము కానేరదు. కావున ఈ ప్రపంచము బ్రహ్మరూపమే అనుటలో విరోధమేమియును లేదు.

ఆరోపిత పదార్థములన్నియు ఎట్లు తమ అధిష్ఠానభూతములగు పదార్థములను మరియొక విధముగా భావించుటయే స్వరూపముగా గలవియై యున్నవో అట్లే ఈ ప్రపంచముగూడా బ్రహ్మమును వేరొకవిధముగా భావించుటయే స్వస్వరూపముగా కలిగియున్నది. ఎండమావులు మొదలగు వానిని మరియొక విధముగా "ఇవి నీరు మొదలగు విధములతో" భావించుటయే, అందు అనగా ఎండమావుల యందు తోచు నీటికి స్వరూపమనుటలో సంశయము ఏమియులేదు. అట్లే బ్రహ్మ మును వేరొక విధముగా అనగా "ఇది ప్రపంచము" అని తలంచుటయే ప్రపంచ మునకు స్వరూపమని చెప్పిన ఏల సంశయింపవలె? కావున ఎట్లుచూచినను ఈ ప్రపం చము బ్రహ్మమునకంటె భిన్నమైనది కాదు. బ్రహ్మము ఎప్పటికి అద్వితీయుడే. వేదము ఈ అభేదమునే తెలుపుచున్నది.

ఈ విధముగా బ్రహ్మప్రపంచములకు భేదము లేదని చెప్పినచో అనేక విరో ధములు వచ్చును. ప్రపంచము జ్ఞాన శూన్యము. మరియొక జ్ఞాతచే ప్రకాశింపబడు చున్నది. అనిత్యమైనది. బహువిధవిభాగములతో కూడినది. అనగా అనేక వస్తువుల సంఘాతము. బ్రహ్మమన్ననో జ్ఞానరూపుడు. సర్వపదార్థములను స్వతంత్రముగా ప్రకాశింపజేయువాడు, శాశ్వతుడు. అవయవములు లేనివాడు. ఇట్టి పరస్పర విరుద్ధ లక్షణముగల జగద్బ్రహ్మలకు ఐక్యము ఎట్లుకుదురును? ఒక వేళ కుదురునందురేని అప్పుడు ప్రపంచలక్షణములగు జడత్వాదులన్నియు, ఆ బ్రహ్మమునకు గూడ కలుగ వలసి వచ్చును. ఇట్టిస్థితి అద్వైతత్వమునందు కుదరదుగదా యన్నచో సమాధాన మేమన—

విరుద్ధ ధర్మములు గల కల్పితవస్తువునకు అధిష్ఠానము అయినంత మాత్రము ననే అనగా విరుద్ధ ధర్మములు గల వస్తువు అజ్ఞానముచే తన యందు ఆరోపింప బడినంత మాత్రముననే ఆ అధిష్ఠానమునకు ఆరోపితవస్తు ధర్మములు కలుగనేరవు. ఆ ఆరోపిత వస్తువులు కేవలము అజ్ఞాన కల్పితములే అగుట ఇందులకు ముఖ్య కారణము. "నైతావన్మాత్రతో బ్రహ్మ జడంభవితు మర్హతి, న దృశ్యం నాప్య నిత్యంచ నచ సావయవం తథా" ఈ విషయమున విరోధమేమియులేదు. ఎండమావుల యందు జలము ఆరోపింపబడుచున్నది. అనగా అజ్ఞానముచే ఎండమావులయందు జలమును చూచుచున్నారు. వివేకముతో విచారించిన ఆరోపిత వస్తువులు ఎప్పటికిని అధిష్ఠాన మాత్రములే కావున ఆ జలములు ఆ ఎండమావులకంటె భిన్నములు కానే రవు. ఆ విధముగా ఎండమావులయందు జలములు చూడబడినను ఆ జలమునకుగల

తెల్లదనము, ద్రవత్యము మొదలగు ధర్మములలో ఒక్కటియైనను ఆ ఎండ మావుల యందు కాన వచ్చుటలేదు. ఇట్లే జడత్వాది లక్షణములుగల ప్రపంచము బ్రహ్మము నందు ఆరోపింపబడి యుండుటచే వాస్తవస్థితిలో ఆ బ్రహ్మమునకంటె వేఱుకాక పోయినను అధిష్ఠానమగు ఆ బ్రహ్మమునకు మాత్రము ఈ జడత్వాదులతో ఎట్టి వంటి సంబంధము కలుగజాలదు. కావున బ్రహ్మము ఎల్లప్పుడును శుద్ధుడే. ప్రపంచము ఆయనకంటె వేఱుకానిదే.

ఈ ప్రపంచము అజ్ఞానకల్పితము అగుటచే స్వాభావికముగా అసత్యము. కావున దీనియందున్న దోషములు బ్రహ్మమును బాధింపజాలవు. ఈ ప్రపంచమునకు బ్రహ్మమునకంటె ప్రత్యేక స్వరూపముండి, ఆ బ్రహ్మముతో సంబంధము కలిగి యుండునేని అప్పుడు ఈ ప్రపంచ గుణములతో ఆ బ్రహ్మమునకు వికారము కలుగ వలసి వచ్చెడిది. తనకంటె భిన్నమై, సత్యమై, విరుద్ధ లక్షణములు కలదై యున్న రెండవ వస్తువుతో సంబంధముకల వానికి ఆ వస్తువుయొక్క ధర్మములతో సంబంధము వుండక తప్పదుగదా! ప్రస్తుతస్థితి మాత్రము అట్టిదికాదు. కావున బ్రహ్మము ఎల్లప్పుడునూ శుద్ధుడే. "అట్టిసందర్భము అనగా ప్రపంచమునకు స్వయముగా రూప ముండుటయు, బ్రహ్మమునకంటె వేఱై యుండి, ఈ ప్రపంచము బ్రహ్మముతో సంబంధపడుటయు" అను సందర్భము ఇచ్చటలేదు.

ఈ ప్రపంచము అజ్ఞాన బలమువలన నిర్వికారుడగు బ్రహ్మమునందు తోచు నది మాత్రమే యగుటచేత దీనికిప్రత్యేకముగా స్వరూపముండుటకు వీలులేదు. ఎండ మావులయందలి నీటివలె ఒక అధిష్ఠానముపై అజ్ఞానమువలన తోచునట్టి రెండవ పదార్థమునకు ప్రత్యేక స్వరూపమే వుండదు. అది ఆయధిష్ఠానము మాత్రమే అయి వుండును. లోకమున ఎండమావుల నీటికి ప్రత్యేక స్వరూపము వుండుట ఎవ్వరును చూచి వుండలేదుకదా! అట్లే ప్రపంచమునకు ప్రత్యేకస్వరూపము లేదు. అట్లు గాక దానికి ప్రత్యేక స్వరూపము వుండి వుండినచో పూర్వపు సంశయమును అనుసరించి "బ్రహ్మప్రపంచములు ఒక్కటియైనచో ప్రపంచధర్మములు బ్రహ్మమునకు కలుగవల యును" అను అవకాశముండును. కాని ఇప్పుడు అట్టి సంబంధము బొత్తుగనేలేదు. పూర్వపక్షమునకే అవకాశము లేదని మరిదానికి సమాధానమును వెదకుట వ్యర్థము కదా!

వాస్తవస్థితిలో సర్వవ్యాపకుడు, సూక్ష్మరూపియు అగు ఆ బ్రహ్మమే అజ్ఞానము వలన ప్రపంచముగా తోచుటయేగాని వేఱొక పదార్థమేదియును లేదు.

వస్తువునందు ఏమియు మార్పులేకున్నను ప్రమాదవశమున, లేక భ్రాంతి వశమున త్రాడు పామైకానవచ్చినట్లు, స్వయముగ నిర్వికారుడయ్యు, ఈ బ్రహ్మము భ్రాంతిచే జగద్రూపముగా కానవచ్చుచున్నాడు. ఇది అంతయును చూచువాని దోషమే గాని ద్వితీయ వస్తుసద్భావము అనగా బ్రహ్మమున కంటె భిన్నమగు రెండవ వస్తువు వుండుటచే మాత్రముకాదు. "గ్రహీతుర్గ్రహదోషేణ బ్రహ్మైవ జగదాత్మనా, ఆభాతం సర్వవద్రజ్జుర్యథా తద్వద విక్రియం" బాగుగా విచారించి చూచిన ఆరోపిత పదార్థము ఏదియు అధిష్టానమున కంటె భిన్నముగ వుండదు. త్రాటియందు భ్రాంతిచే సర్పము తోచుట అందరకు తెలిసిన విషయమే. ఆ సర్పమునకు అధిష్టానమైన ఆ త్రాటికంటె భిన్నమగు రూపము లేక భిన్నమగు వునికి అనగా ప్రత్యేక పదార్థముగా వుండ గలుగుట కలదని ఎన్నియుక్తులచే నైనను సాధించుట సాధ్యముకాదు. ప్రపంచాను భవమునకును అట్టి సిద్ధాంతము—త్రాటియందు తోచుచున్న సర్పము ఆ త్రాటి కంటె భిన్నముగ వున్నదను సిద్ధాంతము విరుద్ధమగును. ఎవ్వరును త్రాటికంటె భిన్నముగ అందలి పామును చూచిఎరుగరు. ఇదియే సత్యము. ఈ కారణము వలన ఎప్పటికి భ్రాంతి కల్పితములైన పదార్థములు తన అధిష్ఠానము కంటె భిన్నములు కానేరవు. ఈ సిద్ధాంతము లోకానుభవ విరుద్ధము కాదని పండితులకు తెలిసిన విష యమే.

కొయ్యతో చేయబడిన ఏనుగు ఆ కొయ్య కంటె ఎప్పటికిని వేఱుకానట్లు ఈ ప్రపంచము గూడ దానికి ఉపాదాన కారణమగు బ్రహ్మమున కంటె వేఱుకానేరదు. "కొయ్యతో చెయ్యబడిన ఏనుగు భ్రాంతి కల్పితము కాదుగదా!" ఈ దృష్టాంతము భ్రాంతి కల్పితమగు ప్రపంచ విషయమునకు ఎట్లు సంబంధించును? అన్నచో— వివర్తము వలన జనించునవన్నియు భ్రాంతి కల్పితములే కానక్కరలేదు. ఒక వస్తువునందు భ్రాంతిచే ఆరోపింపబడిన పదార్థమునకు వివర్తము ఎట్లు కారణము అగుచున్నదో ఆ వస్తువును మరియొక విధముగా ఏర్పరుచుటచే కలిగిన వస్తువునకు గూడ ఆ వివర్తమే కారణమగును. భ్రాంతిచే ఒక స్తంభమునందు ఆరోపింపబడిన పురుషునకు వివర్తము ఎట్లు కారణమగుచున్నదో అట్లే ఉలి, బాడిసె, మొదలగు సాధనముల సహాయము వలన ఆ స్తంభమునందే ఏర్పరచబడిన పురుషునకు అనగా పురుష ప్రతిమకు గూడ వివర్తమే కారణమగును. "వివర్త" పదమునకు "మార్పు" అనియే అర్థము. అందుచే పై దృష్టాంతము అయుక్తము కానేరదు. "నభిద్యతే యథాదంతి స్వస్వరూపేణ దారుణః, స్వరూపేణ తథావిశ్వం బ్రహ్మణో నైవ భిద్యతే"అనగా కొయ్యతో చేయబడిన ఏనుగు ఆ కొయ్యకంటె ఎప్పటికిని

వేఱుకానట్లు ఈ ప్రపంచము గూడ తనకు ఉపాదాన కారణమగు బ్రహ్మమున కంటె వేరుకానేరదు. ఈ విధముగా ప్రపంచము బ్రహ్మమున కంటె వేఱై వుండుటకే వీలులేదు. కావున శ్రుతి, స్మృతియుక్తులననుసరించియు, స్వానుభవమును బట్టియు విచారించి చూచిన ఈ ప్రపంచమంతయు బ్రహ్మమే యగును. "మాయా మాత్ర మిదంద్వైతం" అను మొదలగు శ్రుతులును "ద్వైతమంతయునులేనిదే, మాయమాత్రమే"అని చెప్పుచున్నవి. "అహం సర్వస్య ప్రభవః" నేనే ఈ సమస్త ప్రపంచమును కలిగించుచున్నాను" "విష్టాభ్యాహమిదం కృత్స్నమేకాంశేన" "అనగా ఈ సర్వము ఒక అంశచే ఆవరించి యున్నాను" అనియు వాస్తవమున పరబ్రహ్మమునకు అంశములు అంటూ ఎటువంటి పరిచ్ఛేదత్వము లేకున్నను, ముముక్షువులకు "బ్రహ్మము ప్రపంచాతీతుడు" అని వివరముగా తెలియుటకై ఇట్లు చెప్పబడినది." "అను మొదలగు స్మృతుల చేతను, ఈ విషయమే స్పష్టము చేయబడి యున్నది. కావున బ్రహ్మమునకంటె భిన్నమగు వస్తువు లేనేలేదు.

జగద్బ్రహ్మలకు ఏ విధమైన భిన్నత్వము లేకపోవుటకు ముఖ్యకారణము ప్రపంచము బ్రహ్మ వివర్తమగుటచే అధిష్ఠానమునకంటె వేఱుగా స్వస్వరూపమును కలిగియుండుటకు అవకాశము లేకపోవుటయే. త్రాటియందు ఆరోపింపబడిన పాము వలె ఏ పదార్థము దేని వివర్తమైయుండి దేనికంటె భిన్నరూపము కలది కాకుండునో అది దానికంటె అనగా ఆ అధిష్ఠానముకంటె వేఱుకానేరదు. ప్రస్తుతము ఈ ప్రపంచము గూడ బ్రహ్మవివర్తమగుటచే ఆ బ్రహ్మము కంటె వేఱు కానేరదు. కావున సర్పము దాని అధిష్ఠానమగు రజ్జువున కంటె వేఱుకానట్లు ఈ ప్రపంచము గూడ స్వాధిష్ఠానమగు బ్రహ్మమునకంటె వేఱుకాదు. అందువలన పైన చెప్పబడిన సిద్ధాంతము దృఢమగుచున్నది. "విశ్వం బ్రహ్మభిన్నం అధిష్ఠానా నతిరిక్త స్వరూపత్వాత్ రజ్జుసర్పవత్" అను వాక్యము ఇందులకు ప్రమాణము.

ఈ ప్రపంచము త్రికాలములయందును పరబ్రహ్మమున కంటె వేఱుగా వుండలేదు. దీనికి కారణము అది బ్రహ్మ వివర్తమగుటయే. అనగా "ఇది బ్రహ్మము" అని గుర్తింపలేక ఆయనను ప్రపంచరూపముతో భావించుటయే స్వరూపముగా గలది యగుటయే. మట్టియొక్క మార్పుచే అనగా"ఇదిమట్టి"అని యధార్థ స్థితిని గ్రహింపజాలక ఆ మట్టిని కుండ రూపముతో అన్యథా భావించుటచే జనించిన కుండ ఆ మట్టికంటె వేఱుకానట్లు, ఏయే పదార్థము యేయే పదార్ధము యొక్క మార్పుచే కలుగునో ఆయా పదార్థము అనగా ఆ రూపము దాల్చిన పదార్థము, దానికంటె ఆ స్వాధిష్టానమున కంటె వేఱు కానేరదు. ఈ ప్రపంచము గూడ అట్టిదియే - అనగా పరబ్రహ్మము యొక్క అన్యథా భావముచే కలిగినదియే. కావున దీనికిని బ్రహ్మమునకును భేదము వుండుటకు వీలులేదు, అనుయుక్తి పై సిద్ధాంతమునే దృఢము

చేయుచున్నది. "ఇదం బ్రహ్మాభిన్నం బ్రహ్మ వివర్తత్వాత్ మృద్వివర్త ఘటవత్" అను వాక్యము పై సిద్ధాంతమునకు ప్రమాణము.

ఈ ప్రపంచము పరబ్రహ్మమునకంటె భిన్నముకాదు. దీనికి పరబ్రహ్మము యొక్క ఉనికి కంటె వేఱగు వునికి లేకపోవుటయే ఇందుకు ప్రబలమైన కారణము. ఏ పదార్థమునకు విచారించినచో ఏ పదార్థముయొక్క వునికికంటె ఇతరమగు వునికి సంభవము కాదో ఆ పదార్థము ముత్యపు చిప్పయందు ఆరోపించబడిన వెండివలె స్వాధిష్ఠానమునకంటె వేఱుకానేరదు. ఈ ప్రపంచముగూడ ఇట్టిదియే కావున ఈ ప్రపంచము తన స్వాధిష్ఠానమగు బ్రహ్మముకంటె వేఱుకానేరదు. "ఇదం బ్రహ్మాభిన్నం బ్రహ్మసత్తాతిరిక్త సత్వావత్వా భావాత్ శుక్తిరూప్యవత్" అని అనుమాన వాక్యప్రమాణము. అధిష్ఠానమునకంటె ఆరోపిత పదార్థము ప్రత్యేకముగా వుండుటకు వీలులేదని ఇంతకు పూర్వమే నిరూపింపబడియున్నది. ఈ యుక్తులేగాక మఱియు ఈ సిద్ధాంతమును దృఢముచేయు యుక్తులు అనేకములున్నవి. పై విషయమును సిద్ధాంతము చేయుటకై అనేక శ్రుతులు ప్రమాణములుగ లభించుచున్నవి. "ఐత దాత్మ్యమిదం సర్వం స ఇదం సర్వం" అనియు, "విద్ధీదం సర్వంబ్రహ్మ, సర్వం ఖల్విదంబ్రహ్మ, బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం. "అనుమొదలగు శ్రుతులు పై సిద్ధాంతమును ప్రమాణబద్ధము చేయుచున్నవి. ప్రపంచమునకును, బ్రహ్మమునకును, భేదము లేదను విషయమును ధృవీకరించుటయే వానికి ముఖ్యప్రయోజనముగా తెలియుచున్నది. అంతేకాదు అనేకమైన స్మతులుగూడ పై సిద్ధాంతమును దృఢము చేయుచున్నవి—" వాసుదేవసర్వమిదం సర్వంవిష్ణుమయం జగత్ "బ్రహ్మమాత్ర మిదం సర్వం బ్రహ్మైవ సకలంజగత్" అను మొదలగు నూర్లకొలది స్మృతులు పై సిద్ధాంతమును దృఢముచేయుచున్నవి.

బ్రహ్మయు, చేతనా చేతనాత్మకమగు ఈ ప్రపంచమును ఒక్కటియేయైన ప్రత్యక్ష సిద్ధంబును అగుభేదంబును; "బ్రహ్మ, ప్రపంచము" అను భేదవ్యవహారం బును ఏమగునని ఆశంక కలుగుట సహజము. ఇచ్చట ప్రపంచమునకంటె బ్రహ్మముకాని, బ్రహ్మమునకంటె ప్రపంచముకాని వేఱుకాదు. ఇట్లు కాకున్నను అజ్ఞాన సిద్ధమగు ఈ వ్యవహారమునకు; భేదవ్యవహారమునకు—ఏమియు హాని లేదు. జ్ఞానియగువానికి అనగా సర్వమును విమర్శించి చూడగలవానికి—ఈ ప్రపంచము బ్రహ్మమాత్రముగా తోచును. అట్లు విమర్శించనేరని వానికి ఆ బ్రహ్మయే ప్రపంచరూపముగాతోచును. ఇట్లుతోచుటలో విరోధమేమియునులేదు. వస్తువు ఒక్కటియే యైనను దాని తత్వంబును ఎఱుంగజాలని వానికి మఱియొక తీరుగాను, తత్వమును ఎఱింగినవానికి స్వస్వరూపముతోను తోచుట విరుద్ధముకాదు. దృష్టిభిన్న

త్వమువలన బ్రహ్మము-జగత్తు వేఱు వేఱుగా తోచుచుండుట సహజమే. "బ్రహ్మాత్మనా జగద్భాతి శుద్ధబుద్ధేర్మహాత్మనః బ్రహ్మైవ జగదాకృత్యా భాత్యశుద్ధధియోఽసతః" వస్తువు ఒక్కటియేయైనను ఒక్కొక్కనికి ఒక్కొక్కరీతిగా-భిన్నరూపం గలదిగా—కనబడుతుంది-" విశ్వరూప మెంతో వింతగ నుండును, కంటికొక్కరీతి కానుపించు, రజ్జుసర్పభ్రాంతి రమణీయ మీమహి, గుణ్యరామరాయగురువిధేయ" అన్నారు ఒకకవిగారు. ఇదియేమాయ అంటే. సువర్ణంబు ఒక్కటయే అయినను, దానినుండి ఏర్పడిన కుండలాది ఆభూషణములును, వాస్తవస్థితిలో అన్నియు ఆ బంగారమునకంటె వేరుకాకపోయినను, సామాన్యుని దృష్టికి "ఈ ఆభూషణము లన్నియు సువర్ణమే" అని తోచదు. ఉపాదాన కారణమగు ఆసువర్ణమే ఆభూషణముల రూపముతో తోచుచుండును....కొంచము విచారించి చూచినచో ఆ ఆభూషణము లన్నియు సువర్ణరూపముగా అనగా ఆ సువర్ణముకంటె వేరుకానివిగా, ఒకే పదార్థముగా కానవచ్చును. ఇది అందరి అనుభవమందువున్న విషయమే. కావున వస్తువు ఒక్కటియేయైనను దృష్టిభేదమువలన వేరువేరు విధముగా తోచవచ్చుననుటలో సందేహమేమియులేదు.

కొంచము విచారించి చూచినగాని కుండలాది ఆభూషణములన్నియు సువర్ణమేయని గోచరమగుటలేదు. దానికి కారణము "ఇవి కుండలములు" అనునామరూపములే మూలము. ఇట్లుగాక సువర్ణముగూడ విచారణతో అపేక్షలేకయే తెలియవచ్చుచుండిన యెడల "ఇది సువర్ణము" అనువ్యవహారమే ప్రబలియుండి ఆ కుండలములు అను వేరు నామరూపములు ఉండిఉండెడివికాదు గదా! కావున సర్వజనులును కుండలములరూపతో గాన వచ్చు సువర్ణమును సువర్ణ మాత్రముగా ఎఱుంగుటకు కొంత విచారణ కావలసి వచ్చుచున్నది.

ఇట్టి స్వల్ప విషయమునందే కొంత వివేక విచారణము ఆవశ్యకమైయున్నప్పుడు, అనాదినుండియు వచ్చుచున్న ఈ ప్రపంచ భ్రాంతిని అనగా "ఈ ప్రపంచము దీనికి ఉపాదాన కారణమగు బ్రహ్మముకంటె వేఱుకాదు" అని తెలిసికొనుటకు ఎంతటి వివేక విచారణము అవసరమో చెప్పుట కష్టము. ఈ దృష్టాంతమునందు ఉపాదాన కారణమగు సువర్ణంబును, కార్యరూపమగు కుండలంబులును రెండును ప్రత్యక్షములుగాన కొంచము విచారణచేసిన పిదప ఆ కుండలాదులను సువర్ణరూపముగా ఎఱుంగుట సాధ్యమగుచున్నది. కాని అసలు విషయమునందు అనగా ప్రపంచ బ్రహ్మల ఐక్యతా విషయమునందు ప్రపంచము మాత్రమే కార్యరూపమున

కానవచ్చుచున్నదిగాని ఉపాదానకారణమగు బ్రహ్మము కానవచ్చుటలేదు. అందువలన విచారమెంతచేసినను "ఈ ప్రపంచము బ్రహ్మరూపముగా వున్నది" అను విషయము తెలియవచ్చుననుట సంశయాస్పదముగావున్నది. ఆ కనబడని ఉపాదానకారణమగు బ్రహ్మము అసలు ఉన్నదియో, లేదో అను సంశయముగూడ కలుగవచ్చునుగదాయని అన్నచో—ఈ ప్రపంచభ్రాంతి అనగా ప్రపంచమును బ్రహ్మరూపముగా తెలిసికొనలేకపోవుట నేడు వచ్చినదికాదు. ఇది అనాదినుండియు చిత్తమును ఆశ్రయించి ఉండియున్న అజ్ఞానము. స్వల్పవిషయమునకే కొంత విచారణ కావలసి వచ్చుచున్నపుడు ఇట్టి అనాది జనితమైన భ్రాంతిని తొలగించుకొనుటకు చాలా గొప్పవిచారణ ఆవశ్యకమనుటలో సందియమేమియులేదు. ఇందులకు అనగా బ్రహ్మమునందు కలుగుచున్న ప్రపంచభ్రాంతిని తొలగించుకొనుటకు ఎంతో చిత్తశుద్ధి ఆవశ్యకము. ఇట్టి దృఢమైన విచారణ లేకపోవుటచేతనే, ఆ భ్రాంతిజన్యమైన అజ్ఞానము గాఢాంధకారమువలె సామాన్యనిదృష్టిని ఆవరించియున్నది. కావుననే గ్రుడ్డివానికి పగటియందు తేజోమయుడగు భానుడు వెలుగుచున్నను ఎచ్చట చూచినను వెలుతురు కొంచమైనను కానరాక చీకటిమాత్రమే తోచునట్లు విచారశూన్యులకు ఎచ్చటచూచినను ఆ సర్వవ్యాపకుడు తేజోమయుడునుఅగు బ్రహ్మము కానరాక కేవలము ప్రపంచమే కానవచ్చుచుండును. అందువలన శ్రుతులు, గురూపదేశము, మరియు నిరంతర మనన నిధిధ్యాసనముల అభ్యాసముచే విచారించిచూచిన ఆ ప్రపంచమనే అంధకారము తొలగి తేజోమయుడగు బ్రహ్మముకానవచ్చును. అపుడు ఈ ప్రపంచమంతయు బ్రహ్మాభిన్నముగనే కానవచ్చును. బ్రహ్మభిన్నముగ కానరాదు. వివేకముతోకూడిన దృష్టిగలవారికి పగటికాలమునందు ఎటు చూచినను ప్రకాశమే కానవచ్చునట్లు, వివేకశాలికి అనగా సమ్యక్ దృష్టిగలవానికి ప్రతిపదార్థమునందును ఆ పరబ్రహ్మమే దర్శనమిచ్చును. కావున సమ్యక్ విచారణయే సర్వమునకును ఆవశ్యకము. బ్రహ్మము సర్వసాక్షియై సర్వమును ప్రకాశింప జేయుచున్నాడను విషయము బోధపడును.

కావున ఎవ్వడు విచారశూన్యుడై సర్వవ్యాపియై, సర్వప్రకాశకుడై యున్న బ్రహ్మరూపమును ఎఱుంగజాలడో వానికి ఆబ్రహ్మమే ప్రపంచరూపమున తోచుచుండును. అట్లుగాక ఎవ్వడు విచారణచేసి తన అజ్ఞానాంధకారమును వివేకముచే తొలగించుకొని ఆ బ్రహ్మస్వరూపమును గుర్తించగలడో వానికి ఈ ప్రపంచమంతయు బ్రహ్మరూపముగనే తోచుచుండును. ఈ విషయము అనుభవవిరుద్ధము కానేరదు. మణి స్వరూపమును ఎఱింగినవానికి అది రత్నముగా తోచుటయు, దాని స్వరూప స్వభావములతో పరిచయములేని వానికి ఆ మణియే రాయిగా తోచుటయు అందరికి అనుభవగమ్యమే. విచారణచే ప్రపంచభ్రాంతికి ఆధారభూతుడగు బ్రహ్మ

మును, సచ్చిదానందరూపుని వివేకముతో గుర్తించిననాడు ఈ ప్రపంచమంతయును బ్రహ్మరూపముననే ప్రత్యక్షమగును. అట్టి స్థితియందు అనగా ఆ విధముగా అఖండ రూపుడైన బ్రహ్మసాక్షాత్కారము కలిగినప్పుడు, "అనుభవించువాడు. అనుభవింప బడునది, అనుభవము." అను మొదలగు భేదములన్నియు తొలగిపోవును. సర్వము ఆబ్రహ్మరూపముననే తోచును. ఏలయన, వాస్తవముగా ప్రపంచము అంతయును అజ్ఞానజనితమగు మనోవికారరూపమేగదా! ఈ విధముగా పంచభూతములును, జీవచరరూపములతోనున్న మూడు లోకంబులును బ్రహ్మమే. జీవులమని తలంచు నేనును, మీరును, గురుశిష్యులును అందరూ బ్రహ్మమే.

కావున ఆది మధ్యాంతములు లేక "ఇంతవరకుకలదు" అను వ్యవధిని చెప్పుటకు శక్యముగాక, సర్వమయమై, అద్వితీయమై, స్వయముగనే జనించునదియై, వున్న ఆ పరబ్రహ్మమే భ్రాంతివలన రూపముగలవాడుగాను, పురుషుడుగాను, స్త్రీగాను, పశుపక్ష్యాదులుగాను, మరియు సర్వవిధ స్థావరజంగమ ప్రపంచముగాను, జీవుడుగాను, ఈశ్వరుడుగాను తోచుచున్నాడు. వాస్తవస్థితిని విచారించినచో ఆయనకు రూపమేలేదు. శ్రీమద్భగవద్గీత యందుగూడ ఈ విషయము ఇట్లే వర్ణించబడి యున్నది—"మయాతత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా,మత్స్థాని సర్వభూతాని నచాహంతేష్వవస్థితః" భ. గీ. 9. 4.

అనగా ఈసమస్తప్రపంచము అవ్యక్తరూపుడనగునాచే వ్యాపింపబడియున్నది. సమస్త ప్రాణికోట్లు నాయందున్నవి. నేను వానియందుండుటలేదు. అనగా ఈ ప్రపంచమునందు నాకంటెభిన్నమగు వస్తువు ఒక్కటియైననులేదు. నేను ఈ ప్రపంచమునకు ఆధారభూతుడనైయున్నాను. అనగా ఈ ప్రపంచమంతయు భ్రాంతిచే నాయందే కల్పింపబడుచున్నది. ఆ విధముగా ఈ ప్రపంచమంతయు భ్రాంతి సిద్ధమగుటచే అధిష్ఠానముఅగు బ్రహ్మముకంటె వేఱు కానేరదు. అధిష్ఠానభూతుండనగు నేను; బ్రహ్మము ఎప్పటికి అద్వితీయుడనే అని నిరూపించుటకై నేను ఈభూతముల యందుగాని, ఆ భూతములునాయందుగాని లేవు. అనగా నాకును ఆ భూతములకును భేదము లేకపోవుటచే "నేనువేరు. భూతములువేరు" అనియు, "నాయందు భూతములుకాని నేను భూతములయందుగాని వున్నాము అని వ్యవహరించుటకు వీలులేదు" అని చెప్పియున్నారు. పైన చెప్పబడిన సిద్ధాంతమును దృఢపరచుటకు ఇంతకంటె ప్రబలమైన ప్రమాణము మరేమి కావలయును.?

ఇట్లు శ్రుతులు మొదలగు, సర్వప్రమాణములచేతను విచారించిచూచినను అభేదమే నిశ్చయమగుచున్నది. కావున ఈ విషయమునందు ఏమియు సంశయింప నక్కరలేదు. బ్రహ్మమును ఎరుంగగోరు సాధకులు ఈ విషయమున నిస్సంశయమగు నమ్మకము కలిగి వ్యవహరించవచ్చును.

అనుభవమున ప్రత్యక్షముగ భేదము కానవచ్చుచుండ ఈ సిద్ధాంతమును సత్యమని విశ్వసించుట ఎట్లు?. అన్నచో—లోకానుభవమును బట్టి మాత్రమే "భేదము యధార్థము" అని నిర్ణయించుటకు వీలులేదు. అనుభవమంతయు యధార్థానుభవముగానే అనగా సత్యమగు అనుభవముగానే వుండుననుటకు వీలులేదు. భ్రాంతిసిద్ధములగు ఈ యధార్థానుభవములుగూడ కొన్ని వుండును గదా! కావున నిర్మలమగు మనస్సుతోనూ, శ్రుతులతోనూ, యుక్తులతోనూ, ఆ శ్రుతియుక్తులకు విరుద్ధముకాని అనుభవముతోనూ అనగా ఆశ్రుత్యాదులను ఆధారముగ జేసుకొని విమర్శింపగా ఏవిషయము సర్వప్రమాణసిద్ధమగుచు స్థిరమగునో ఆ విషయమే సత్యసిద్ధాంతసారమగును. దానిని దృఢముచేయు అనుభవమే యధార్థానుభవమగును. కావున కేవల అనుభవమును మాత్రమే ఆధారముగ జేసుకొని విచారశూన్యులై విషయమును నిర్ణయింప పూనుకొనరాదు. కావున విషయ నిర్ణయమునందు అభేదమును గూర్చినప్రమాణ మూలకమగు విచారము ఆవశ్యకము. ఇచ్చట,ఈ విషయమునందు అనగా బ్రహ్మ ప్రపంచముల అభేదమును గూర్చిన విషయమునందు విచారదృష్టిచే పరికించినచో సర్వంబును బ్రహ్మమేయగును. అంతయు పరబ్రహ్మముయొక్క వివర్తమే అనగా పరబ్రహ్మమునందు అజ్ఞానముచే ఆరోపింపబడినదియే. ఇదియే సత్యము.

కావున వివేకబుద్ధితో విచారించినచో సువర్ణపు మార్పువలన కలిగిన ఆభరణములన్నియు, అనగా గాజులు, పోగులు, వుంగరములు, ముక్కుపుడకలు మొదలగునవన్నియు ఆ సువర్ణమే అయినట్లు, శాతి మార్పువలనకలిగిన విష్ణ్వాది ప్రతిమలు శాయియే అయినట్లు ఈ ప్రపంచముగూడ అజ్ఞానవశమున, కలిగిన పరబ్రహ్మముయొక్క మార్పుచే అనగా ఒక విధముగానున్న బ్రహ్మము మరియొక విధముగా భావింపబడుటచే జనించినదియే. కావున త్రికాలములయందును ఆ బ్రహ్మముకంటె వేరుకానేరదు. ఇదియే సత్యప్రమాణమగు సిద్ధాంతము.

అయితే ఆ బ్రహ్మమునకు వినాశము ఎప్పటికివిలేదు. కావున ఈ ప్రపంచము గూడ ఎప్పటికిని నశించునది అనగా ఎందైనను లయమునొందునది, లేక ఎటకైనను తొలగిపోవునది కానేరదు. అజ్ఞానులదృష్టికి ఎల్లప్పుడును బహువిధ భేదములతో తోచుచునే యుండును. జ్ఞాని దృష్టికి అట్లుగాక బ్రహ్మమాత్రముగ అభేదముగా తోచుచుండును.

వాస్తవస్థితిలో భ్రాంతిసిద్ధములగు పదార్థములకు అధిష్ఠాన భిన్నమగు స్వరూపమే లేకపోవుటచేత వినాశమే కలుగుటకు వీలులేదు. ఒక వస్తువు ఒకప్పుడు వుండిన అనగా స్వస్వరూపముతో నిలిచి యుండిన దానికి మరియొకప్పుడు వినాశము కలుగ వచ్చునుగాని, త్రికాలములయందును అధిష్ఠానముకంటె వేఱుకాక, స్వస్వరూ

పముతో ప్రత్యేకముగా వుండక పూరకతోచుచుండు పదార్థమునకు ఉత్పత్తి వినా శములు ఎప్పటికిని సంభవముకాదు.

ఏ భేదము ఎట్లున్నను ఒక భేదమును మాత్రము పైసిద్ధాంతముచే ఖండించు టకు వీలులేదు. లోకమున "ఉనికి" "లేమి" అను రెండు వ్యవహారములు కలవు. కావున ఆ రెండు వ్యవహారములకు ఆధారములగు పదార్థములు గూడ వుండవల యునుకదా! ఈరెండు పదార్థములును ఒకదానికంటె మరొకటి భిన్నములు కావను టకు ఎట్లును వీలులేదుకదా! అన్నచో—మొట్టమొదట అభావము కలదు. అనుటకే వీలులేదు. ఏలయన అభావమనగా మూడుకాలములయందు లేకుండుట. ఇట్టి పదార్థము కలదనుట లోకవిరుద్ధము. లేమికిని, కలిమికిని ఒక్కపదార్థమే ఆశ్రయమగుటకు వీలుండదుకదా! కావున ఆ అభావ వ్యవహారము ఇంద్రియ గోచరములు కాని వానిని గూర్చి ప్రవర్తించుచున్నదియేగాని ప్రత్యేకముగ అభావము అను పదార్థము ఒకటి వుండనేరదుకదా! అట్లుకాక "అభావము" అను పదార్థము ఒకటి కలదు "అని సాధింపప్రయత్నించినచో అదియు పదార్థమే కావలసి వచ్చును.

"ఏయే పదార్థములను కలిమి ఆశ్రయించియుండునో ఆయా పదార్థములు భావ పదార్థములగును" అను న్యాయమును అనుసరించి చూచిన అది అనగా అభా వము అనబడు పదార్థము గూడ భావమే కావలయుననుటలో సందియము ఏమియును లేదు. అప్పుడు "అభావము" అనునది ఘటపటాధి శబ్దములువలె సామాన్యనామమే అగునుగాని వస్తుభేదమును తెలుపునది కానేరదు. రెండు వస్తువులును అనగా భావము అనబడునట్టియు, అభావము అనబడునట్టియు రెండు పదార్థములును కలిమికి ఆశ్రయములే అయివుండ వీనియందు అవస్థాభేదము ఎట్లు కలుగగలదు? న్యాయ పదముచే చేయబడు సిద్ధాంతమునకు కేవలము వ్యవహారార్థమై వున్న నామములు ఎట్టి విఘ్నములు కూడ కలిగింప లేవనుట నిర్వివాదమగు విషయమే, కావున మనము "భావము-అభావము" అని వ్యవహరించు పదార్థములన్నియు పరబ్రహ్మమే ఈ కారణము వలన అభేద సిద్ధాంతమునకు ఎప్పటికిని భంగముకలుగనేరదు.

"సచ్చత్వచ్చాభవత్ నిరుక్తంచా నిరుక్తంచ నిలయనంచా
నిలయనంచ, విజ్ఞానం చా విజ్ఞానం చ సత్యంచా నృతం చ సత్యమభవత్"

అనగా "ఆకారముగల పదార్థములును, ఆకారములులేని పదార్థములును, గుణాదులచే నిరూపింప దగిన పదార్థములును; అట్లు చేయుటకు శక్యముగాని పదా ర్థములును, అవయవములు కలిగిన ఇతర పదార్థములకు, చేతనములును జడము లును అగు అన్నియు పరమార్థ సత్యమగు పరబ్రహ్మమే "అను శ్రుతిగూడ పై సిద్ధాంతమునే అనగా "భావాభావ వ్యవహారములకు, యోగ్యములగు సర్వ విష

ములు బ్రహ్మ భిన్నములు కావు "అను విషయమునే స్పష్టముగా వివరించుచున్నవి. అందుచేత బ్రహ్మభిన్నమగు పదార్థము ఒక్కటియులేదు." కావున "అభావము అను పదార్థము ఒకటి కలదు." అని చెప్పువారు వేదవేత్తలు కానేరరు. శాస్త్రార్థమును విమర్శించి తత్వమును ఎఱింగిన వారలు కానేరరు.

పైన ఉదహరింపబడిన శ్రుతియందు "బ్రహ్మ" పదము ఉపయోగింపబడి యుండలేదు. "సత్యమభవత్" అని "సత్య" పదము మాత్రమే ఉపయోగింపబడి యున్నది. ఈ పదమునకు, "పరబ్రహ్మము" అనియే అర్థము అదెట్లన—"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"అను శ్రుతి ఈవిషయమును స్పష్టము చేయుచున్నది. అట్లయ్యును సత్యస్వరూపమగు ఆ బ్రహ్మము అనేక రూపములతో తోపనేటికి? ఒక రూపముతో వున్న వస్తువు మరియొక విధముగా తోచుననుట అసంభవము కదా యని అన్నచో దృష్టాంత పూర్వకమైన సమాధానము ఇట్లున్నది.

పరబ్రహ్మము ఏకరూపుడై యున్నను ఆబ్రహ్మమునకు మానవుని చక్షురేంద్రియములకు వశమగు రూపములేనందున-చూచువారి భ్రాంతివలన, బహు విధములుగా వున్నట్లుగా తోచుచున్నాడు. వస్తువునకు మాత్రము భేదము ఎప్పుడును లేదు. ఒక విధముగా నున్న వస్తువు అజ్ఞాన దోషము వలన మరియొక విధముగా తోచుననుట అనుభవ విరుద్ధము కాదు. లోకానుభవమువలన ప్రతి జ్ఞానియు ఈ విషయమును బాగుగా ఎఱుంగును. స్తంభము, త్రాడు మొదలగునవి స్వయముగా వికారశూన్యములు అయ్యును పురుష సర్పాద్యాకారములతో కానవచ్చుచుండుట సర్వానుభవ సిద్ధమేకదా! అట్లే ఈ బ్రహ్మమును స్వయముగా అవికారుడయ్యును భ్రాంతి వలన ప్రపంచ రూపముగా తోచుచున్నాడు.

ఒక దూలమునుచూచి అది పురుషుడని భ్రమించుట మన యందరి అనుభవము నందున్న సత్యమే. ఆభ్రాంతికి చూచువాని బుద్ధియందలి దోషమే కారణము అగునుగాని ఆ దూలమునకు మార్పేమియు వుండదు. ఈ పురుషుడు తనను, అనగా ఆమూలమును మరియొక విధముగా అనగా "వీడుదొంగ" అని భావించినప్పుడు గాని అట్లు భావింపకపూర్వముగాని, అట్టి భావనను విడిచిన తరువాతగాని, ఆ దూలము స్తంభాకారముతో అనగా ఎట్టి వికారము లేనిదై ఒక్క విధముగనే వుండును. స్వభావసిద్ధములగు వాని లక్షణములకు కొంచమైనను మార్పుకలుగదు. ఇదిఅంతయు అందరకు అనుభవమునందున్న విషయమే. ఇట్లే గ్రహించువారికిగల అజ్ఞాన దోషమువలన బ్రహ్మమునందు "ఇది ప్రపంచము" అను భ్రాంతి-జ్ఞానము ఉత్పన్నమగుచున్నది. యధార్థస్థితిలో ఆబ్రహ్మమునకు మాత్రము ఎట్టి వికారములును లేవు.

"అనాది కాలీన నిరంత వాసనా దోషేణ దుష్టా పురుషస్య బుద్ధిః
నానా విధం విశ్వమిహ ప్రసూతే స్వప్నాదివద్ర్బహ్మణి కేవలేఽ ద్వయే"
అనగా పురుషుని బుద్ధియందు అనాది కాలమునుండియు ప్రపంచ సంస్కారము దృఢమైయున్నది. ఆ దోషమువలన స్వప్నమునందు వలె జాగ్రదవస్థ యందును నానా విధ ప్రపంచమును ఏక స్వరూపుడగు ఆ పరబ్రహ్మమునందే కల్పించుచున్నది. ఆ దోషము జ్ఞానముచే నివర్తించెనేని ఇప్పుడు ఈ ప్రపంచమును కల్పించదు. కల్పించినను, ఇంద్రజాలముచే పట్టణమును కల్పించియు దానివలన కలుగు రాగద్వేషములతో సంబంధపడని ఐంద్రజాలకునివలె ఈ ప్రపంచమును సత్యముగా భావించి అందు చిక్కుపడడు. కావున ప్రపంచముకేవలము భ్రాంతి సిద్ధమే యగుటచే పరబ్రహ్మమునకంటె వేఱుకానేరదు.

ప్రపంచాధిష్ఠానమై ప్రత్యగాత్మరూపుడై యున్న పరబ్రహ్మమును ఎఱింగినచో భ్రాంతి దశయందు గానవచ్చిన స్థూల సూక్ష్మాదిప్రపంచమంతయును ఆ పరబ్రహ్మమే యగును. అధిష్ఠానమునకంటె వేఱుగా ఒక్కటియును కానరాదు. మరియొక విశేషమేమన వాస్తవస్థితిలో బ్రహ్మమునకంటె అన్యుడగు ద్రష్టలేడు. కావున ప్రపంచమును ఆరోపించినను, అధిష్ఠాన భిన్నముగా అవలోకించినను బ్రహ్మయే ఆ కార్యములను ఆచరించుచున్నాడు. ఆ జ్ఞానమునకు గూడా ఆ బ్రహ్మయే ఆశ్రయము. సర్వ ప్రపంచంబును బ్రహ్మభిన్నమై బ్రహ్మమునే ఆశ్రయించియుండ తదంతర్గత మగు అజ్ఞానము మాత్రము ఎందుబోవును? ఇట్లయినను ప్రపంచమువలెనే ఆ యజ్ఞానము గూడ త్రికాలములయందును అసత్యమేగాన ఆ బ్రహ్మమునకు మాత్రము ఏ వికారములును లేవు. భేదదృష్టియున్నప్పుడు సర్వ వ్యవహారములును ప్రవర్తించును గాని పరమార్థమును ఎఱింగిన పిదప అన్యమేదియు కానరాదు.

ఈ స్థూలదేహంబును పరబ్రహ్మమునందే ఆరోపించబడినదగుటచే నిశ్చయముగా జ్ఞానరూపుడగు పరబ్రహ్మమే. ప్రాణములు, మనస్సుకూడా,స్వకర్మలను ఆచరించు బుద్ధియు, చేయువాడును, అనుభవించువాడును, అనుభవింపబడు పదార్థంబును మరియు సర్వ పదార్థములును ఆ పరబ్రహ్మమే. సూక్ష్మాతి సూక్ష్మమైన ఆ పర బ్రహ్మమే మాయచే జగద్రూపమున భాసించుచున్నది.

ఆకాశాది పంచభూతములును, పరబ్రహ్మమునందు కల్పింపబడినవే అగుటచే ఆ పరబ్రహ్మము మాత్రమే. ముల్లోకములును, ఉపదేశించు గురువును, ఆ ఉపదేశ

మును విను శిష్యుడును, ఈ సమస్తంబును అనగా పరస్పర భిన్నముగా చూడబడు సమస్తంబును, జ్ఞాన రూపుడగు అద్వితీయ పరబ్రహ్మమే. భేదమనునది అజ్ఞానముచే కల్పింపబడినదియే గదా! ఇదియే సత్యము.

పరమ ప్రమాణభూతమగు శ్రుతికూడా "సదే వేదం సర్వం" అను మొదలగు వాక్యములచే జగద్బ్రహ్మభేదమునే నిరూపించుచున్నది. మహాత్ములు అట్లే భావించుచున్నారు. బ్రహ్మజ్ఞానులగు సత్పురుషుల దృష్టికి బ్రహ్మభిన్నమగు పదార్థము ఏదియును కానవచ్చుటలేదు. అజ్ఞానుల అనుభవము ఎట్లున్నను మనము ఆదరింపవలసినది జ్ఞానుల అనుభవమునే కదా! బుద్ధికి అగోచరములగు విషయములను బోధించు శ్రుతి ఎవ్వరి అనుభవమును దృఢముచేయునో వారేకదా ప్రమాణభూతులు. కావున ఆశ్రుతియందు చూపబడిన సిద్ధాంతమును అనుభవించువారే జ్ఞానులు, ఇతరులు అజ్ఞానులు. కావున అజ్ఞానులకు ప్రపంచము ఎంత సత్యముగ గానవచ్చినను, ఎంత బ్రహ్మభిన్నముగా గానవచ్చినను, అది యదార్థము కానేరదు. ప్రమాణభూతము కాదు. కావున శ్రుతియు, విద్వదనుభవము ఈవిధముగా జగద్బ్రహ్మ భేదమును తెలుపుచున్నవి. ఈ కారణమువలన చేతనాచేతనాత్మకమగు ప్రపంచమంతయును ఆ పరబ్రహ్మమే.

నీవు, మృత్తిక, ఘటము మొదలగు ప్రత్యక్షప్రమాణముల బలముచేతను "ఈ సర్వ ప్రపంచము బ్రహ్మమే" అని నిశ్చయించుకొనుము. భ్రాంతిచే కానవచ్చు బేదమును వివేకముచే తొలగించుకొనుము. ఈ బేదము మనస్సుచే కల్పింపబడినదియేగాని యథార్థముకాదు. ఇట్లు స్వస్వరూప జ్ఞానముకలిగి సర్వకాలములయందును బ్రహ్మానందమును అనుభవించుచు ఆత్మయందే నిలచి వుండుము. ఇదియే మోక్షము.



సృష్టి రహస్యము—

సూర్యుని ఎండకు మేఘములు తయారగుచున్నట్లుగా, పరమార్థము యొక్క ప్రకాశముచే సూక్ష్మ, స్థూలభూతములు, వాటి సంఘాతములచే ప్రాణులు తయారగుచున్నవి. అందులో శ్రేష్ఠమైన ప్రాణియగు మానవ దేహమునందలి బుద్ధియందు ఆ పరమార్థము ప్రతి ఫలించుటచే అది చైతన్యవంతమై "నేను నేను" అని అంటూ సర్వమును సృష్టించుచున్నది. —సదానంద భారతి.

# ఈ గ్రంథమును ఎందుకు చదవాలి ?

అందరికి తెలియకుండానే అందరియందు దాగియున్న అజ్ఞానాన్ని అనగా అధ్యాసను తొలగించుకొని, సత్యమైన పదార్థమును గుర్తించి, తదనుగుణంగా వ్యవహరించి నిత్యమైన ఆనందమును అనుభవించుటకొరకు ఈ గ్రంథాన్ని తప్పక చదవాలి. "జీవుడు బ్రహ్మము ఒక్కరే, వేఱుకాదు. ఇరువురకు ఎటువంటి భేదములేదు" అనే జ్ఞానాన్ని బోధించి తద్వారా జీవుని సాంసారిక బంధములనుండి విడిపించి అతనికి పూర్ణమైన శాంతిని కలిగించడమే ఈ గ్రంథము యొక్క లక్ష్యము. "జీవుడు బ్రహ్మము వేరుకాదని అందరికి ఎందుకు తెలియడం లేదు?" అని ప్రశ్నిస్తే- "అవిద్య అనగా అజ్ఞానమువల్ల అందరికీ అటువంటి జ్ఞానము కలుగుటలేదు" అని చెప్పవలసివస్తుంది. జీవుడు అనగా నిత్యమూ మన అందరిచేత "నేను-నేను" అని సంబోధించబడువాడు-బ్రహ్మమే. వాస్తవానికి ప్రపంచము—బ్రహ్మము ఒక్కడే అను జ్ఞానం కూడా కలగకుండా వుండడానికి అవిద్య ఒక్కటే కారణము. అవిద్య అంటే ఉన్న వస్తువు ఒకటి అయితే దానిని మరొకటిగా తలంచుట. అనగా ఉన్నది త్రాడు అయితే దానిని పాముగా తలంచుట, ఉన్నది మట్టి అయితే దానిని కుండగా, కడవగా, ఘుంతగా, మూకుడుగా చూచుట. ఉన్నది బ్రహ్మమైతే దానిని జీవుడుగా, జగత్తుగా తలంచుట, ఇదియే అవిద్య, ఇదియే అధ్యాస. కావున ఆ అవిద్యను తొలగించాలి. ఆ అజ్ఞానం, భ్రాంతిజన్యజ్ఞానము, మిద్యాజ్ఞానం అంటే ఏమిటో తెలిస్తే విద్వాంసుడగు పురుషుడు శాస్త్రపఠనము మరియు గురూపదేశబలముతో దానిని తొలగించుకొని సత్యమును, నిత్యమును, ఆనంద రూపుడును, సత్యజ్ఞానానంద రూపుడును అగు ఆ బ్రహ్మమును స్వస్వరూపముగా గుర్తించి మిధ్యారూపమైన సాంసారిక బంధము నుండి విడువడి శాశ్వతమైన ఆనందాన్ని పొందగలడు. అప్పుడు "జ్ఞానాదేవతు కైవల్యం" అనగా జ్ఞానముద్వారానే సర్వబంధములనుండి మోక్షము లభిస్తుంది. ఈ గ్రంథమునందు "ఆత్మానాత్మ వివేకము" ఈ ప్రపంచమంతయు బుద్ధి కల్పితమే, పంచకోశములు బంధ హేతువులే; మనోవిజయమే మోక్షము, జీవబ్రహ్మల ఐక్యానుసంధానమే మోక్షము, ప్రపంచ బ్రహ్మైక్య జ్ఞానముచే మోక్షము మొదలగు వ్యాసములు సాధకునకు ఆత్మానాత్మ వివేకము కలిగించి తద్వారా మోక్షమును కలిగించు స్వస్వరూప సాక్షాత్కారమును అనగా "నేనే బ్రహ్మను" అను భావమును కలుగజేయుటకు సర్వసమర్థములై యున్నవి. అందుచే ఈ గ్రంథమును చదివి, చక్కగా అర్థము చేసుకొని, తదనుగుణముగా వ్యవహరించిన ప్రతివారూ తప్పక ఆనందరూపమైన మోక్షమును పొందగలరు.

ప్రణవాశ్రమము, గుడివాడ. సదానంద భారతి.